# ముళ్ళపూడి వెంకటరమణ

## సాహితీ సర్వస్వం

మొదటి సంపుటం

# కథారమణీయం - 1

సంపాదకుడు : ఎమ్బీయస్ ప్రసాద్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్. 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్ - 500 001.

**Mullapudi Venkata Ramana Saahithee Sarvaswam-1**
**KATHARAMANEEYAM - 1 – *Editor: M.B.S. Prasad***

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ

| | |
|---|---|
| ప్రచురణ నెం. | 2350/2295 R |
| ప్రతులు | 1000 |
| ప్రథమ ముద్రణ | జనవరి, 2001 |
| ద్వితీయ ముద్రణ | నవంబర్, 2001 |
| తృతీయ ముద్రణ | : సెప్టెంబర్, 2003 |





ముఖపత్రం, లోపలి బొమ్మలు: బాపు

**వెల: రూ.150-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్), హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



అక్షరాలంకారం: **ట్వంటీఫస్ట్ సెంచరీ,** దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 24066986
ముద్రణ: **శ్రీకళాంజలి గ్రాఫిక్స్,** హిమాయత్‌నగర్, హైదరాబాదు.

# మధ్యతరగతి కథాకళి

ఆధునిక తెలుగు కథాసాహిత్యంలో ముళ్ళపూడి వెంకటరమణ గారిదొక ప్రత్యేక స్థానం. కథానిర్వహణలో వినూత్నమైన పంథాను ప్రవేశపెట్టారు. వ్యంగ్యం–పేరడీలన్న కాళ్ళతో అవి నడుస్తాయి. పదాల విరుపు, కొత్త కొత్త పదాల ప్రయోగాలన్న చేతులతో పాఠకులను అక్కున చేర్చుకొంటాయి వారి కథలు. రమణగారి చూపుకో ప్రత్యేకత ఉంది. ఆ కళ్ళతో వారి కథలు లోకాన్ని చూస్తాయి. టీన్‌ఏజ్ వాళ్ళ ఆలోచనలు గానీ, రాజకీయాల రణరంగంకానీ, అప్పులివ్వడం, తీసుకోడం అన్న అంశాలుకానీ వస్తువులుగా తీసుకొన్నప్పుడు వాటన్నిటికీ ఒక చక్కని దార్శనికతను తయారు చేసుకొంటారు. వాటి కనువైన పదజాలాన్ని సృష్టించుకొంటారు. వాటి ఆధారంగా అనుకూలమైన వాతావరణాన్ని తయారుచేసుకొంటారు.

సాధారణంగా రమణగారి కథల్లోని వస్తువులు సార్వకాలికాలుగా ఉంటాయి. అందుకే ఆ కథలు ఎప్పటికప్పుడు నిత్యనూతనం అనిపిస్తాయి. రచయితలు సామాజిక మార్పును ఆశిస్తారు. అందుకు తమ రచనల ద్వారా తమ పాఠకవర్గాన్ని మేల్కొల్పాలని కృషి చేస్తారు. అలాగే రమణగారి పాఠకులు మధ్య తరగతి వర్గం. రమణగారు ఆశించిన మార్పు – ఏయే సామాజిక తాత్వికతలలో, ఎక్కడ రావాలో పాఠకులకు – ఇదిగో ఇక్కడ... ఇక్కడ అంటూ పదేపదే చూపిస్తారు తమ కథల్లో. కింది తరగతుల వాళ్ళకు తెగింపుతో పనులు సాధించుకోగలమన్న ధైర్యం ఉంటుంది. ఉన్నత వర్గాలకు డబ్బే అన్నీ సాధించి పెడ్తుందన్న ధీమా ఉంటుంది. ఈ రెండూ లేక కలలు భోంచేస్తూ, ఎవరన్నా తప్పే తప్ప లేవలేనిది మధ్య తరగతి. ఆ మధ్య తరగతిలో సామాజిక చైతన్య స్ఫూర్తి కలిగిస్తే సామాజిక రుగ్మతలు కొంతవరకన్నా తగ్గవచ్చని రమణగారి రచనాధ్యేయం. వీరివి పెద్ద కథలు. రమణగారు దశాబ్దం నుండీ కథారచనవైపు దృష్టిమందగించారు. నాలుగు దశాబ్దాల వీరి రచనలను కొత్త తరంవారికి పరిచయం చెయ్యదలచిన ఓ పత్రిక వాటిలో కొన్నిటిని సీరియల్‌గా ప్రకటించింది. పాఠకుల స్పందన అనూహ్యంగా ఉంది. దీనివల్ల రమణగారి కథాసాహిత్యం అజరామర లక్షణం కల్గిందనిపిస్తుంది.

విశాలాంధ్ర ప్రచురణాలయం అత్యంతాధునిక రచయితల సాహిత్యాన్ని సంపుటాలుగా ప్రచురిస్తున్న విషయం పాఠకులకు తెలిసిందే. ఆ ఉద్దేశంతో రమణగారి సాహిత్యాన్ని ఏడు సంపుటాలుగా ప్రచురిద్దామని పథకం రూపొం దించాం. మిత్రులు ఎమ్బీయస్ ప్రసాద్‌గారు సంపాదక బాధ్యత స్వచ్ఛందంగా

నిర్వహించటానికి అంగీకరించారు. ఆ వరుసలో ఈ కథారమణీయం–1. ఇది ప్రథమ సంపుటం. ఇందులో 8 అధ్యాయాలూ, 41 కథలూ ఉన్నాయి. దీన్ని సంకలనం చేయడంలో పాటించిన సూత్రాలను వివరిస్తూ, కథలను విశ్లేషిస్తూ, వ్యాఖ్యానాన్ని జతపరుస్తూ ఒక విపులమైన ఎకడమిక్ పరిశోధనా పత్రాన్ని "కథకుడూ–కథన కౌశలమూ" అని ప్రసాద్‌గారు రాశారు. అందుకు సంపాదకులకు కృతజ్ఞులం.

తమ రచనలను సంపుటాలుగా వెలువరించటానికి ఆమోదిస్తూ ఈ అవకాశం మాకు కల్గించిన శ్రీ ముళ్లపూడి వెంకటరమణగారికి ధన్యవాదాలు. ముళ్లపూడి వెంకటరమణ గారి పేరు తలవగానే వెంటనే స్ఫురించేవారు ప్రఖ్యాత చిత్రకారులు బాపు. ఒకరు పదాలతో భావాలు పలికిస్తే, మరొకరు వాటిని చిత్రాలతో చిలకరిస్తారు. ఇద్దరూ "సాహిత్య కవలలు". ఇందులోని బొమ్మలన్నీ బాపూగారివే. వాటిని వినియోగించుకోడానికి అంగీకరించినందుకు బాపూ గారికీ మా ధన్యవాదాలు. మిగిలిన సంపుటాలను కూడా క్రమంగా ప్రచురిస్తాం.

తెలుగు పాఠకలోకం మా యీ పథకాన్ని ఆదరిస్తూ, మరిన్ని సరికొత్త పథకాల అమలులో మాకు చేయూతనివ్వగలరని మా నమ్మకం.

ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తూ తెలుగు పాఠకలోకానికి సేవ చెయ్యటం మా ప్రచురణాలయం ఆశయం.

ఏటుకూరి ప్రసాద్
సంపాదకుడు
విశాలాంధ్ర ప్రచురణాలయం

హైదరాబాదు–1.
తేది: 1–1–2001.

# కథకుడూ...
# కథన కౌశలమూ

రమణ గారి కథలకు వ్యాఖ్యానం అవసరమా అని అనుకునే వాళ్ళు ఈ భాగం చదవకపోయినా ఫర్వాలేదు. ఆయనను 'ఒట్టి ఆస్సెరచయిత'గానే లెక్కవేసేవాళ్ళని వాళ్ళ మానాన వాళ్ళని వదిలేసి తక్కిన వాళ్ళ కోసం రాసినదిది. అసలు హాస్యరచయితను సీరియస్‌గా తీసుకోవాలా వద్దా అనుకునే వాళ్ళు ప్రసిద్ధ విమర్శకుడు కె. వి. రమణారెడ్డి మే '62 విశాలాంధ్రలో "గిరీశం లెక్చర్లు"ను సమీక్షిస్తూ రాసిన వాక్యాలను పునశ్చరణ చేసుకోవడం మంచిది. "...నిజానికి అతన్ని ముళ్ళవాడి వ్యంగ్యటరమణ అని పిలవవచ్చు. అల్లాటప్పా హాస్యం అనిపిస్తూ, జీవితాన్ని ఘాటుగా పోట్లతో విమర్శించగలడు. హాస్యం ముళ్ళపూడి వాని వేడి తాకిడికి ఈడేరింది. దానికొక సాంఘిక ప్రయోజనం ఏర్పడింది.

"...దీనికి చమత్కారమొక్కటే చాలదు. సూక్ష్మగ్రహణ శక్తి కూడా కావాలి. హాస్యం ఒక్కటే చాలదు. అపహాస్యం కూడా కావాలి. నిందలు సరిపోవు. నిష్ఠురోక్తులు పనిచేయవు. విమర్శలు చర్మాల మందాన్ని దాటి లోపలికి పోలేవు. కాబట్టి వ్యంగ్యం ఒక్కటే విజయవంతం కాగలిగింది. వాడో వీడో ఈవిడో ఆవిడో అని కాకుండా సామూహికంగా ఒక వ్యవస్థను విమర్శించడం జరిగింది. అయినా ఓర్వలేని వాళ్ళెందరో! ఇలాంటి పుస్తకం రాసేందుకు ధైర్యం కావాలి. ఉద్యోగాల నిలకడ మీద, బతుకుతెరువు మీద చూపున్నవాడు ఇంత సాహసం చెయ్యలేడు. అందుకు కూడా ముళ్ళపూడి వెంకటరమణను మెచ్చుకోవాలి." నిజమే, రమణ సాహసి కాబట్టే చుట్టూ భవిష్యత్తు గురించి చింత లేకుండా అందర్నీ విమర్శించాడు. దానికి అతను ఎంచుకున్న ఆయుధం – సెటైర్, పేరడీ!

రమణ హాస్య రచయిత అనడం అబద్ధం అంటాడు అతని జీవితాన్ని, రచనలను సమీక్షిస్తూ 1973లో "కానుక" రాసిన ఎమ్వీయల్ ('ముళ్ళపూడి భాయీజాన్సన్‌కి, ఎమ్వీయల్ సెబాస్వెల్' – ఆరుద్ర) – "లోకం తన రచనల్లో ప్రతిఫలించేట్లు, తన రచనలు లోకంలో ఆదరణ పొందేట్లు సున్నితంగా సుతారంగా కారంగా కరుణాత్మకంగా గంభీరంగా రచనలు చేసిన రవణ కేవలం హాస్యరచయిత అన్నది అబద్ధం."

అందువల్లనే ముళ్ళపూడి సాహితీ సర్వస్వం సంపుటాలుగా తెచ్చేటప్పుడు ఆయన కథలు రూపుదిద్దుకున్న కాలాన్ని గురించి, వాటిల్లో ఉపయోగించిన భాషాచాతుర్యం గురించి ముందుతరాల వారికి అందించడానికే ఈ వ్యాసం ప్రయత్నిస్తోంది. తెలుగుకి క్రమంగా దూరమవుతున్న మనకు, మన బిడ్డలకు ఆయన 'తెలుగుతనం' అర్థం కాని పరిస్థితి కూడా రావచ్చనే భయంతో గ్రంథస్తం చేయడం జరుగుతోంది. కథలతోబాటు

కథల సృష్టికర్తను గురించి కూడా తెలుసుకోవడం సాహిత్య పరిశీలనకు అవసరమనేది అందరూ అంగీకరించిన విషయం. అందుకే సందర్భాన్ని ఉపయోగించుకుంటూ ఆయన జీవిత విశేషాలను కూడా ముచ్చటించడం జరుగుతోంది. రమణ అనగానే బాపు గురించి ప్రస్తావన కూడా రాకుండా ఉండదు – ఈ పుస్తకంలోని బొమ్మలన్నీ వివిధకాలాల్లో బాపు వేసినవి కాబట్టి... వారి స్నేహబాంధవ్యం అలాటిది కాబట్టి... ద్వంద్వ సమాసానికి అందమైన ఉదాహరణ బాపూ – రమణ కాబట్టి.



రసరమణీయంలో చోటు చేసుకున్న కథ "సీతాకల్యాణం" – అనేక మారు పేర్లతో రచనలు సాగించిన రమణ ఈ కథ రాయడానికి ఉపయోగించిన కలం పేరు – సి. వి. విజయలక్ష్మి! సి. వి. వి. లక్ష్మి, సి. వి. విజయలక్ష్మి అనే ఆడపేర్లతో 'జడలూ, వాటి తీరూ', 'నగలూ–నాణ్యాలూ', 'ఉల్లి చేసిన మేలు...' వంటి 'ఆడ వ్యాసాలు' రాసిన రమణ స్త్రీ పేరుతో రాసిన కథ ఇది ఒక్కటే.

కథతోబాటు కనబడే రెండు బొమ్మలు కథను ఒరిజినల్‌గా ప్రచురించినప్పుడు బాపు వేసినది. రమణకు, రామాయణానికి అవినాభావ సంబంధం ఉంది. బాపు, రమణలు కలిసి సంపూర్ణ రామాయణం, సీతాకల్యాణం, రామాయణం థీమ్‌ని సోషలైజ్ చేసి ముత్యాల ముగ్గు, కలియుగ రావణాసురుడు తీసారనే కాదు, రమణ కొంతకాలం (1952 ప్రాంతంలో) శ్రీనివాసశిరోమణి గారి వద్ద వ్రాయసకాడుగా పనిచేశాడు. (రమణ చేతిరాత అప్పట్లో బాగుండేదేమో!) ఆ సందర్భంలోనే 22 రామాయణాలు మథించడం జరిగింది. సంపూర్ణ రామాయణం హిట్ అయ్యేక 'సీతాకల్యాణా'న్ని చక్కటి బాలేగా తీశారు బాపు, రమణలు. రమణ దానికి స్క్రీన్ ప్లే రాశారు. రాశారనడం కంటే, రాయలేదనడం మేలు. అతి తక్కువ సంభాషణలు. టైముకి రమణ రాసి ఇవ్వకపోతే, దాన్నే ఒక virtue గా మలుచుకుని బాపు

సంగీతదృశ్యకావ్యంగా తీర్చిదిద్దారని ఒక జోక్. ఆ సినిమాను లండన్ ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో సినీకళా విద్యార్థులకు పాఠ్యాంశంగా బోధిస్తున్నారు కాబట్టి దాని విలువ గురించి వేరే చెప్పనవసరం లేదు.

తెలుగుభాషపై రమణకు గల పట్టుకు 'సీతాకల్యాణం' ఒక మచ్చుతునక. ఎమ్వీయల్ అన్నట్టు దృశ్యసాక్షాత్కారానికి తన రచనల్లో కవితాశైలిని ఉపయోగించుకున్నాడు రమణ. పదాలతో, వాక్యాలతో బొమ్మలు తయారుచేసి వాటిని పాఠకుని కళ్ల ఎదుట ఆడిస్తాడు. కవితాశైలితో రాయటంతో పాటు రమణ వచనరచనలో ఒక తూగు, గమకం గమనించవచ్చు. వాక్యాలు 'బాలెన్స్‌డ్'గా నడుస్తాయి.

వాల్మీకి ఇన్‌ఫ్లుయెన్స్ బాగా ఉన్న రమణ ఉపమానాలు అనేకంగా ఉపయోగిస్తాడు. ఈ చిన్న కథలో కూడా తలమానికాలైన ఉపమానాలు ఉదాహరించవచ్చు. పాండితీ ప్రకర్ష చూపడమే కాదు, సహజసిద్ధ చమత్కారం కూడా ప్రదర్శించేదు రమణ కొన్ని విరుపుల్లో – 'ప్ర–కృత యుగధర్మం', 'అవలీలామానుష విగ్రహుడు', 'రామకథలు చెప్పిన కొద్దీ ఊరేవి. ఊరిన కొద్దీ ఊరించేవి'. కథలో సామాన్య ప్రజల రియాక్షన్స్‌తో బాటు వంది మాగధుల అవస్థలూ (అతిశయోక్తులు దొరక్క, ప్రాస మాటలు కుదరక) రచయిత దృష్టిని దాటిపోలేదు. ఈ మకుటంతో వచ్చిన కథా సంకలానికి రమణకు రాష్ట్రసాహిత్య ఎకాడెమీ బహుమతి వచ్చింది 1975 లో. రమణ రచనల్లో చాలాభాగం ఆంధ్రపత్రిక వీక్లీలోనే వచ్చాయి. ఎక్కువభాగం 1954 – 61 మధ్యనే రాయడం జరిగింది.

సరసరమణీయంలో మొదటి కథ "ఇద్దరమ్మాయిలు, ముగ్గురబ్బాయిలు" 1955 ఆగస్టులో పెద్ద కథగా వచ్చింది. ఆ తర్వాత పుస్తకరూపంలో వచ్చి చాలా పునర్ముద్రణలు పొందింది. గోదావరి ప్రాంతంలోని పల్లెటూరులో నడిచే కథ. రమణకు గోదావరి అంటే ప్రాణం. బాపు, ఆయన తీసిన సినిమాల అవుట్‌డోర్ షూటింగులకు గోదావరి ప్రాంతాన్నే ఎన్నుకుంటూంటారు. రమణది తూర్పుగోదావరి జిల్లా, బాపుది పశ్చిమగోదావరి జిల్లా కావడం ఒక కారణం కావచ్చు. రమణ పుట్టినది గోదావరి ఒడ్డున ఉన్న ధవళేశ్వరంలో. అసలు వాళ్లు బరంపురానికి చెందినవారు. ఆయన తండ్రి ఉద్యోగరీత్యా ధవళేశ్వరంలో స్థిరపడ్డారు. రమణ బాల్యం అక్కడే గడిచింది. తండ్రి మరణంతో బ్రతికి చెడి, తన 9 వ ఏటనే మద్రాసుకి తరలి వచ్చేసినా, రమణకు గోదావరి భాష మీద, అక్కడి ప్రజల ఆచార వ్యవహారాలమీద పట్టు పోలేదు.

గ్రామీణ వాతావరణంలోని ఈ కథ ఇద్దరమ్మాయిలు, ముగ్గురబ్బాయిల మధ్య నడుస్తుంది. హీరోయిన్ సుబ్బలక్ష్మికి పెద్ద పాత్ర లేదనే చెప్పాలి. సైడు హీరోయిన్ సీతాలక్ష్మి 'విశాలభావాలు, ధైర్యం' కలది. సుందరం కేసి అదోలా చూడగలదు, వీర్రాజుతో పచ్చడితోబాటు హృదయాలు ఇచ్చిపుచ్చుకోగలదు, రామారావు కూడా తనను ప్రేమించాడని అపోహ పడగలదు. అబ్బాయిల మాటకొస్తే కథానాయకుడు రామారావు తను అందగాడన్న విషయం ఎన్నటికీ మర్చిపోడు. ('సుందరం ఇంచుమించు నా అంత అందంగా ఉంటాడు, ఎటొచ్చీ లోటొకటే – పూర్తిగా నా అంత అందంగా ఉండకపోవడం', 'దిలీప్‌కుమార్ అంతటి అందగాడు నన్ను

లవ్వు, వీధికో లవ్వు, రోజుకో లవ్వు', సెలవలకొచ్చి సుబ్బుల్ని చూసేదాకా. చూశాక కూడా రాత్రిసినిమాలో హీరోయిన్ ఇటూ, సుబ్బలక్ష్మి అటూ ఉండగా పండువెన్నెలలో విహరిస్తున్నట్టు కలగంటూంటాడు. ఎస్.హెచ్. (సైడుహీరో) వీర్రాజు కూడా తక్కువ తినలేదు. అతనికి సీత పదమూడో నెంబరు ప్రియురాలు. ఇక సుందరం మాటకొస్తే మేనేజరు గారమ్మాయి శాంతను ప్రేమించి కూడా సినిమాగోలలో ఈ ఊరొచ్చి సుబ్బులు సంబంధం కుదుర్చుకుని, మధ్య సీత అదోలా చూస్తే ఓ లవ్ లెటర్ రాసి పడేస్తాడు.

ఈ ముగ్గురబ్బాయిల తీరు ఇలా ఉన్నా ఒకరికోసం మరొకరు త్యాగానికి సిద్ధపడిపోతూంటారు. బెంగాలీ నవలల, సినిమాల ప్రభావంతో. (సీతపై కూడా ఈ ప్రభావం ఉంది. తెలికలవీరయ్య గానుగు దగ్గర వీర్రాజు మాట్లాడబోతూండగానే అతను స్నేహితుడికోసం త్యాగం చేయబోతున్నాడని అనుకుని డైలాగులు చెప్పేస్తుంది.) తేలిక సందర్భానికి భారీమాటలు వాడి నవ్వుపుట్టించడం (ఉదా॥ asassinating the aunt) ఉడ్‌హవుస్ స్టైలు అనిపిస్తుంది గుడిసీనులో. కానీ రమణ చేస్తున్నది పారడీ. శరత్‌బాబు నవలల పదజాలం (మానవాధమునిలా ప్రవర్తించడం, ప్రక్షాళితం, నిష్కృతి, శుభాక్షతలు, హృదయంలోంచి వచ్చే మాటలు, సుందరంబాబూ) ఉపయోగిస్తూనే విశ్వేశ్వర్రావు కవి అన్న విషయం గురించి దేవులపల్లి మెప్పు ('అతడు నిజంగా కవే... నేనీమాట గట్టిగా చెప్పగలను') పేరడీ చేశాడు. (జరుక్‌శాస్త్రి కూడా దీన్ని పారడీ చేశాడు, 'తలమాసినవాడు' అంటూ) అంతేకాదు పాంచకడీదేవ్ రాసిన బెంగాలీ డిటెక్టివ్ నవలలను వేంకటపార్వతీశకవులు అనువదించిన తీరుని పారడీ చేస్తూ 'చదువరీ, ఒకపరి ఇటురమ్ము. ఈ తెరువరు లిరువురి తెరగుల పరికింతము' (ఒకసారి పైకి చదివి చూడండి, నాలుక ఎన్ని మడతలు పడుతుందో చూద్దురు గాని) 'అపరాధపరిశోధకుడు అజయ్‌బాబు' అంటాడు. (జనతా ఎక్స్‌ప్రెస్‌లో హీరో గురించి రాస్తూ 'వీర్రాజుకి శరత్‌బాబు కథల్లో హీరో లక్షణాలు కొన్ని వున్నాయి. ముందూ వెనకా ఎవరూ లేరు' అంటూ శరత్ పాత్రలను ఆట పట్టించాడు)

వీళ్లనే కాదు మయసభానంతరం దుర్యోధనుడి మార్కు డైలాగులను కూడా పారడీ చేశాడు – వీర్రాజు స్వగతంలో ('నే నేల ఈ వేళ సినిమాకు రావలె? వస్తిబో...') పైగా ప్రబంధాలలో కనబడే పురవర్ణనను హేళన చేస్తూ ఈగలు డ్యూటీకి బయలుదేరేవేళ గురించి రాస్తాడు. తప్పాడు సమాసాల (పుష్పచెట్లు, వృద్ధతల్లి) సినిమాపాటలను కూడా వెక్కిరిస్తాడు.

అలాగే రాజకీయం గురించి చెప్పాలంటే దానికీ, డబ్బుకీ లంకె ఉంది. ఆర్థిక అవసరాల వల్ల సూరయ్య, స్వార్థపరులైన కంట్రాక్టరు, హోటల్ ఈసరయ్య, సుబ్బిశెట్టి వీళ్లేకాదు, రామారావు మిత్రబృందం కాన్వాస్ చేసిన బంగారయ్య కూడా ఓటు దగ్గరకి వచ్చేసరికి హీనంగా ప్రవర్తించాడు. రామారావుకే ఏవగింపుతో ఒళ్లు జలదరించేట్లా కర్కశంగా అరిచేడు. రాజకీయాల ప్రభావం అటువంటిది. గ్రామస్థాయిలోనే అయినా, చిన్నపాటి పనికే అయినా ఎలక్షన్ హామీలు ఎంత వింతగా ఉంటాయో కూడా చూపాడు రమణ. ఈ వికృతరూపాన్ని ప్రదర్శిస్తూనే రమణ సామాన్యరైతుల ఇబ్బందులను కూడా స్పృశించాడు. సుబ్బిశెట్టిని దొంగరాముడిచేత తన్నిస్తే పంటలు

నిర్లక్ష్యం చేశాడు అని సీత అనుకుని ఉంటుంది', 'సుందరంబాబూ, మీరు నా అంత అందంగానూ ఉంటారు..అఁ! నేనీ మాట గట్టిగా చెప్పగలను') అప్పుడప్పుడు మాత్రం క్విక్ డెసిషన్స్ తీసుకుంటూంటాడు. వాళ్ల అమ్మను బెల్లించి డబ్బు సంపాదించగలడు కూడా. అతనికంటె వీర్రాజు ఎక్కువ చాకచక్యం, చురుకుదనం కలవాడు. ఇద్దరూ కలిసి సుందరాన్ని తిట్టేటప్పుడు మాటల కోసం వెతుక్కున్నా వీర్రాజు ఎక్కువ భాషా ప్రావీణ్యత కలవాడు. ('గా'భాష, 'గర' భాష రెండూ వచ్చు. రామారావుకి 'గా'భాష మాట్లాడ్డం బాగారాదు.) ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ బాగా వంటబట్టించుకున్నవాడు. ఇక సుందరం కూడా దేవాంతకుడే కానీ వీక్ పాయింట్స్ (పకోడీ, సినీభాయ్)ల వల్ల అతని ఆట కట్టయింది.

రమణకు అతి ఇష్టమైన మూడు సబ్జెక్ట్లు – ప్రేమ, రాజకీయం, సినిమా – మూడూ ఈ పెద్దకథలో ముప్పేటగా కలిసి మరీ దర్శనమిస్తాయి.

కథారంభమే సినిమాహాల్లో! కథానాయకుడు చలనచిత్ర పరిశ్రమకు మహారాజ పోషకుడు. అతనికి అతి ఇష్టమైన సబ్జక్ట్ – 'సినిమాహాల్లో నల్లులు', సుందరాన్ని తిట్టేసమయంలో కూడా సినిమాకొచ్చిన ఖలుర్ని కుట్టి నల్లులు విల్లురాయకుండా మరణిస్తున్న సంగతి విస్మరించడు. 'వాల్తేరులో ఉన్నప్పుడు సుందరాన్ని లాంగ్ షాట్లో చూసేవాణ్ణి..' అంటాడు సినీపరిభాషలో. సీత, వీర్రాజు ప్రేమసంభాషణలో కూడా 'దీదార్' సినిమా గురించి ముచ్చటే. గుడిసీనులో వీర్రాజు జరిగినదంతా చెప్పి సినీకరపత్రాల భాషలో ప్రశ్నలేసి 'మిగతాకథ వెండితెరపై చూడుడు' అంటాడు. కథలో అతి ముఖ్యమైన విలన్ సినీభాయ్. సుందరానికి, నాయుడు గారబ్బాయికి అందరకీ టోకరా ఇచ్చే రకమే. చిత్రమేమిటంటే అంతటి టోకరాసురుడు వీర్రాజు తను బొంబాయిలో అసిస్టెంటు కెమేరామన్ అని చెప్పేసరికి 'దారున నమ్మేసి తన పురాణం' చెప్పేస్తాడు. సినీమాయ అలాటిది. అర్ధవిలన్ సుందరం కూడా సినిమాపిచ్చిలో పడి అందర్నీ దగాచేయబోయాడు. అతని ఆటకట్టించడానికి ఉపయోగపడినది కూడా సినిమాహాల్లో అమ్మే పకోడీల వ్యవహారమే!

చిన్నపాత్రలైన రాముడు, భీముడు సినీ అభిమానులు. పైగా భీముడు ఘంటసాల 'స్టోన్'(టోను) అంటే పడిఛస్తాడు. వీరితోబాటు సినిమా పత్రికలకు ప్రశ్నలు పంపేవాళ్ళూ కనబడతారు ఈ కథలో. రచనలో కూడా రమణ సినీటెక్నిక్కే ఉపయోగించాడు. దుళ్లతూము దగ్గరకు సైకిళ్లమీద వెళుతూ మాట్లాడుకుంటున్న మిత్రులనుండి ఫ్రేమ్ అతి స్పీడుగా కట్ అయి వాళ్లని పలకరించడంలోకి వెళిపోతుంది. ('మహారాజు – యువరాజు'లో హోటల్లో అరువడిగిన యువరాజు హఠాత్తుగా పాన్ షాపు వద్ద కూడా అరువడిగి సాధించడంలోకి వెళ్లిపోతాడు,) అలాగే గుడిసీనులో వీర్రాజు 'అటు సూర్యుడిటు తిరిగినా అయన పిల్లనివ్వడు,' అంటూనే 'ఒరేయ్, అటు సూర్యుడిటు తిరిగాడురోయ్ చీకటి పడొస్తోంది వెళ్లాలి' అంటూ చేరుస్తాడు. ('ఈశ్వరేచ్ఛ' లో కూడా 'కొంపతీసి గజపతి కాదుగదా' అంటూనే 'కొంపలు తీసే గజపతి కూడా...' అంటూ కలుపుతాడు)

ఇది బేసిక్గా ప్రేమకథ కదాని ప్రేమికులందరూ దేవదాసు, పార్వతి లెవెల్లో లేరు. హీరో రామారావుది, అతని అంతరంగికుడు వీర్రాజు మాటల్లో 'ఊరికో

కోసినప్పుడు సుబ్బిశెట్టి కసికొద్దీ ఈ ఊళ్లో మానేసి ఇంకో ఊళ్లో కొంటాడని, రైతులు నష్టపోతారని వీర్రాజు చేత అనిపించాడు. అంతేకాదు, ఆ శెట్టి ఓ బీదరైతు ఓటును ఒక్క చూపుతో ఆపేశాడని కూడా రాసాడు. రాజకీయాల్లో బహుచిత్రమైనది vocal power. జయజయ ధ్వానాలతో మూకస్వామ్యం నడిపే విధానాన్ని క్లైమాక్స్ ఘట్టంలో చూపాడు. పిల్లా, మేకా ఎవరికి జైకొడుతున్నారో తెలియక అరవడంతో సూరయ్య గెలిచేస్తాడు, కరణం కొందరు స్పీకర్లలా, గవర్నర్లలా ప్రజాస్వామ్యాన్ని కాలరాయడంతో. శంకరయ్య స్వామివారిని తెచ్చి కథ అడ్డం తిప్పి రాజకీయాలకు, పెద్దల స్వార్థాలకు ప్రేమ బలికాకుండా కాపాడతాడు.

కొన్ని పదాలకు అర్థాలు: జమిలి – జంట, కామాటం – పెద్ద ఎత్తున చేసే వ్యవహారం, ఢంకాపలాసు – మూడుముక్కలాట, జాయ్‌గా – మెల్లగా, కుసింత – కాస్త, పాల్‌రాబ్సన్ – మంద్రగంభీరస్వరంతో ఇంగ్లీషుపాటలు పాడే నీగ్రోగాయకుడు, రవ్వా రట్టూ చేయడం – showdown, గోరోజనం – పోజు, సొళ్లు కబుర్లు – పనికిమాలిన కబుర్లు, వాడియా వారి నాడియా – హోమివాడియా తీసిన పిక్చర్స్‌లో స్టంటు హీరోయిన్‌గా నటించిన నాడియా, రాలుగాయ – ఘటికురాలు, సిడ్నీకార్టన్ – చార్లెస్ డికెన్స్ రాసిన 'టేల్ అఫ్ టూ సిటీస్' లో ప్రియురాలు ప్రేమించిన వాడికోసం ఉరికంబం ఎక్కిన త్యాగమూర్తి, అవటా – విషయం చెప్పాక emphasis కోసం చేర్చే వ్యర్థపదం.

జాతీయాలను, పలుకుబడులను రమణ ఏ విధంగా మార్చి వాడాడో గమనించండి – 'పిల్లా, మేకా' (ఊరి వర్ణన) 'గతజీవితం అంతా కడిగేసి ముగ్గులుపెట్టాను', 'సూరయ్యగారి ఇంగితం ఇతనికి పదో ఎక్కం అంత బాగా కంఠతా వచ్చు', 'ముప్పావలా కోడిపిల్లకి మూడున్నర చేసే పందిపిల్లను దిష్టి తీసినట్టుంది', 'మీ మగదక్షత లేడా? – లేకేం, అమోఘంగా బోలెడున్నాడు!, 'తెలిగ్గా నాలిక్కరుచుకోవడం', 'సూరయ్య ప్లాను అడ్డం తిరగడంతో కంట్రాక్టరు అతని మొగాన కత్తివాటు వేయలేదు (నెత్తురు చుక్క రాలుతుందో లేదో చూడడానికి)', 'విల్లైనా రాయకుండా నల్లులు అమాంతం చావడం', 'వెధవ్వేషాలు వేయడం' (ఎన్నిరకాల ప్రశ్నలు దాంట్లోంచి పుట్టించాడో గమనించండి), 'తరువాత? – తరూ లేదు, వాతా లేదు' 'చవటచవటలం అనుకున్నాడు కామోసు' 'నేను మాట ఇచ్చేసి వచ్చా – దానికేం, ఇచ్చిన మాట మళ్లీ అడిగి పట్టుకు చక్కా వచ్చెయ్.'

వీటితోబాటు హాస్యంలోని ఇతర రూపాలను కూడా వాడాడు రమణ. స్పూనరిజానికి ఉదాహరణలు చూడండి – 'చెవులకు గోడలు మొలుస్తాయి' (గుడిసీను), 'బ్రదర్ ఇవి కాళ్లుకావు, చేతులనుకో' అని సుందరం భుజాలు పట్టుకుంటాడు వీర్రాజు. మేలప్రాపిజానికి ఉదాహరణ కావాలంటే – రసకందాయం బదులు రసగంధాయం అంటాడు వీర్రాజు గుడి ఎన్నిక గురించి చెబుతూ.

కథలో హైలైట్లు నల్లుల థీసిస్, గుడిసీను, పల్లెటూరి సుప్రభాతవేళ దృశ్యవర్ణన అని అందరూ ఒప్పుకుంటారు. వీటికి తోడు గోదావరిజిల్లా జనాభా కూడా పలురూపాలలో కనబడతారు. 'మీ డబ్బాతో డబ్బాడు కాఫీపొడి' అరువడిగే పొరుగింటి బామ్మగార్లూ, విచ్చురూపాయల్లే ఖంగుమని మోగిపోతూ వూరంతా చడామడా

తిరిగేసే వాళ్లు, ఏకటాకీని కథలు గుప్పించేసేవాళ్లు, హిందీ సినిమాను అనువదించి పెట్టే దుబాసీలు (1970 ప్రాంతాల నుండి ఈ పద్ధతి పోయింది), కాలవగట్టు హోటలునుంచి ఎండుతామరాకుల వేడివేడి ఇడ్లీ పొట్లాలని ఆఘ్రాణించి ఆనందించే కుర్రాళ్లు, సాటిలేని మేటి ఢంకాపలాసు ఆటగాడిగా పేరుబడి అప్పలపాలయేవాళ్లు, పంచాయితీయే కాదు ఐక్య రాజ్యసమితి కూడ స్థాపించదగ్గ లెవెల్లో పార్టీలు, కక్షలు మెయింటెన్ చేసే గ్రామవాసులు, రామభజన పోటీ తట్టుకోవాలంటే 'సానిమేళం ఎట్టించాలి. బలేరంజుగా ఉంటది' అనే సుబ్బిశెట్టిలు, నోటి ఆగ్నేయమూల నుండి చిన్ననవ్వు నవ్వే సైడుహీరోలు – ఇలా బోల్డుమంది.

దీనిలో బంగారయ్య, సుందరం అప్పు చేతులు మారినట్టే, జనతాఎక్స్‌ప్రెస్‌లో వీర్రాజు ఇచ్చిన చేబదులు కూడా చేతులు మారుతుంది. అలాగే దీంట్లో 'గుడి – బడి' వివాదం 'బుద్ధిమంతుడు' సినిమాలో చోటు చేసుకుంటుంది.

రసరమణీయంలో రెండో కథ "సీత". ఇద్దరు వ్యక్తులకు పరస్పరం ఇష్టం ఉండి కూడా బింకానికి పోయి కథ దుఃఖాంతం చేయబోవడం, పేరు సరిగ్గా తెలియక ప్రేమికుల మధ్య కమ్యూనికేషన్ గాప్ తెచ్చిపెట్టే ప్రమాదం రావడం ఈ ప్రేమకథకు సహజత్వాన్ని సమకూర్చాయి. ఈ కథ 1953 నాటిదైనా క్లైమాక్స్ ఆధునికరచనల ముగింపును తలపుకు తెస్తుంది. రోడ్డు మీది ఎండమావులను గొప్ప సింబాలిక్‌గా వాడుకున్నాడు రచయిత. ఎండమావులు అనుకున్నవి తటాకం అని తెలియగానే సత్యంలో ఆశ జనించి, కథను సుఖాంతం వైపుకు తిప్పింది. రమణ స్త్రీపాత్రలన్నిటిలాగానే సీత కూడా స్ట్రాంగ్ కారెక్టరు. ఎండలో రోడ్డు వర్ణన, 'యుగాలనాటి అనాగరిక మానవుడికి ...సివిక్ అంటాడు' పేరాలో చేసిన వ్యాఖ్యానం చెప్పుకోదగ్గవి. బిగుసుకుపోయే అమ్మాయిని Ice Goddess అనడం కద్దు. అలాటి మగవాళ్లకు 'హిమవంతుడు' అనే పదం coin చేసాడు. ఓ వివరణ – డాన్‌జువాన్ – కాసనోవా వంటి ప్రసిద్ధ ప్రేమికుడు

భగ్నవీణలూ, బాష్పకణాలు – విరహవేదనతో హంగామా చేసే కుర్రకారు గురించి రమణ వ్యంగ్యోక్తి రచన. 1954 లో రాసినా, ఈ నాటి ప్రేమికుల ఊహలు కూడా ఇంతకంటే భిన్నంగా ఉండవు (లవ్‌లెటర్‌లో వల్లమక్కా, ఎర్రగీత గురించి మీమాంస చూడండి, లేదా రోడ్డుమీద బీటు వేసే వారి వర్ణన చూడండి) కాబట్టి కథ చిరంజీవియే. ప్రతీ ప్రేమికుడు ప్రేమ తనతోనే జనించి, గిట్టిందని నమ్ముతాడు కాబట్టి వారి పోకడలు మనకు నవ్వు తెప్పిస్తాయి. వాటిని అతిశయోక్తి అలంకారంతో మన ముందుంచి మరింత హాస్యాన్ని పుట్టించాడు రమణ. గ్రాంథిక భాషలో నరసింహావతారోద్భవాన్ని నరసింహన్‌కు అన్వయించడంతో నవ్వు వస్తుంది. చివరిలో ఆడవాళ్ల తరఫునుండి ఇలాటి ప్రేమికులపై వారి అభిప్రాయాలు చెప్పించి కళ్లు తెరిపిస్తాడు.

కొన్ని వివరణలు – అనూమినూ తేల్చు – అటో, ఇటో తేల్చడం, క్లార్క్‌గేబుల్ – గాన్ విత్ ద విండ్ ఫేమ్ హాలీవుడ్ నటుడు, రాబర్ట్‌టేలర్ – హాలీవుడ్ నటుడు, రీటా హేవర్తు, జాజా గేబర్ – అందాల హాలీవుడ్ నటీమణులు, దిలీప్‌కుమార్ – రమణ తరచుగా ప్రస్తావించే హిందీ నటుడు, విషాదపాత్రల అభినయానికి విఖ్యాతుడు,

మధుబాల – అందాల హిందీనటి, కిలారున నవ్వడం – కిలకిలా నవ్వడం, విన్నుగినా – విన్నేమైనా, వీరవాసర వానరవరులు – వీరవాసరం ఊరిపేరు. ప్రద్యుమ్నులు – 'ప్రభావతీ ప్రద్యుమ్నం' పింగళిసూరన రాసిన ప్రసిద్ధ కావ్యం. అమ్మాయి పేరు ప్రభావతి కాబట్టి ఆమె ప్రియులందరూ తమ పేర్లు ప్రద్యుమ్నులుగా మార్చుకున్నారు, మలబారు పోలీసులు – క్రౌర్యానికి పేరుబడ్డారు వీరు. మాలదు – వీలుపడదు, కాల్నా – అణాలో నాలుగోవంతు. స్కాపన్‌హోవర్ – జర్మన్ వేదాంతి.

ఇదీ, వేట (1950), సీత (1953), అదోరకం ముచ్చట (1955), ఆ చేతిచేత (1956) లతో బాటు 1979 దాకా పుస్తకరూపంలో రాలేదు.

ఋణరమణీయంలో కథ "వేట" – గొప్ప అప్పిలసాఫికల్ కథ. పులి – ఆవు కథ కూడా 'రీటోల్డ్ ఫర్ అప్పారావ్స్'. అప్పరాయల కథలో గొప్ప పేరడీ ఉంది. పొగిడిన కవులకు రాజులు ఊళ్లు దానం చేయడం సాధారణం. ఈ కథలో రాజు మాత్రం అప్పడిగే హక్కు ధారాదత్తం చేస్తాడు. కవి నుండి అప్పు పుచ్చుకుంటాడు. కథలో బోల్డంత అప్పు టెర్మినాలజీ – లోన్ అవర్స్, ఋణాళువు, అప్పరస, అప్పో, బాకీయో తేలని మొత్తం. అప్పు తప్పి రూపాయి లొట్టబోవడం, అప్పాలజీ. చివరికి • ఎవరు వేటగాడో, ఎవరు ఎరో తెలియనంత కన్‌ఫ్యూజన్. క్లైమాక్స్ ఘట్టాన్ని కళ్లు మూసుకుని ఊహించి చూస్తేనే ఆ తమాషా ఆస్వాదించగలుగుతాం. అకాడెమీ వాళ్లు కూచిపూడిని గుర్తించకపోవడం కూడా ప్రస్తావించేడు రచయిత సందర్భం దొరకబుచ్చుకుని. వివరణలు: ఇలకోళ్లు – కీచురాళ్లు, ఫుంజీ – నాలుగు.

జనరమణీయం – మధ్యతరగతి వాళ్ల కథలు. రమణ ఫేవరేట్ క్లాసు మధ్యతరగతే. 'ప్రేమ, అపేక్ష, ఆవేదన, తాదాత్మ్యం ఉండడం వల్లనే హాస్యంలో మాటమాటకి కండపుష్టి కలుగుతుంది' అని భమిడిపాటి కామేశ్వరరావు గారి గురించి రమణ రాసినది అక్షరాలా అమలు చేసిన కథలివి. అందులో మొదటిది "జనతాఎక్స్‌ప్రెస్" – ఇది రాసి పత్రిక వీక్లీ కిస్తే భారతిలో (1955లో) ప్రచురించబడడం రమణకు గర్వకారణం. మధ్యతరగతి జీవితాలకు అద్దంపట్టినా హాస్యంలా కనబడే కథ. వారిలో అన్ని గుణాలను – స్వార్థపరత్వం, పైకెగబాగాలనే పేరాశ, గొప్పకబుర్లు, అసూయ, అనవసరమైన జాలి – ఇలాటి అవగుణాలతో సహా అన్నీ నిర్మొగమాటంగా ఎత్తిచూపించడం ఎంత నేర్పుగా జరిగిందంటే – వారంటే అసహ్యం కలగదు, జాలివేస్తుంది. అందుకే కథలో ప్రతీపాత్రా, ప్రతీ ఘట్టమూ ఆస్వాదనీయమే. సుందరమ్మ తన కారు డ్రైవరు దనడం, 'అక్కడికీ వెచ్చాలన్నీ మీ చేతే కొనిపిస్తున్నానుగా' అని సుబ్బారావు మామగారితో అనడం (సు.మా.గారు చొక్కా విప్పబోవడం మంచి కెమెరా టెక్నిక్), నాగపూరు కప్పతో నాగపూరు కాఫీపొడుం అడిగితేనే అప్పిచ్చే పిన్నిగారూ, నరసమ్మకు ఒకే పట్టుచీర ఉన్న వైనం, చిరునవ్వుల ద్వారా ఒకరికొకరు చెప్పకునే ఇల్లాళ్ళూ, ధూర్తుడైన మావగారిమీదా జాలిపడే సుబ్బారావూ, 'ఈశ్వరేచ్ఛ'లో గుర్రంలా కారు కూడా స్వంత ఆలోచనలుండి ('మహారాజు – యువరాజు' లో బియ్యంకొట్టు అరిష్టం ఆపడానికి మహారాజు ఎదరపడి అతని చుట్టూ నిలబడుతుంది, 'ఆకలీ – ఆనందరావు' లో బజారు అవలిస్తుంది) మూడోమార్గం పట్టడం, రహస్యం కాపాడలేక ఉక్కిరిబిక్కిరయినా అప్పివ్వని రాక్షసులకు

రహస్యం చెప్పబూనని నరసమ్మా, అగస్త్యభ్రాతలైన సు.మా.గారు, పిన్నిగారి భర్తగారు – ఇలాటివన్నీ ఎన్నిసార్లు తలచుకున్నా నవ్వొస్తాయి.

హీరో పేరు వీర్రాజు కావడం అదోలా ఉంటుంది ('ఇద్దరమ్మాయిలు..'లో పైడు హీరో కూడా వీర్రాజే!) ఇలాటి కథల్లో ఎక్కడ మొదలెట్టాలో, ఎక్కడ ఆపాలో తెలియదు. ఎందుకంటే వీరి జీవితాల్లో డ్రాస్టిక్ ఛేంజ్ కనబడదు. డ్రామా ఏదైనా పెడితే తెచ్చిపెట్టినట్టు (contrived) అనిపిస్తుంది. జానకి పెళ్లిని సమస్యగా పెట్టుకుని, దాని వల్ల clash of interests (పిన్నిగారికి మేడగది దక్కడం vs. సుందరమ్మ కారు కళ్లెదుట ఉండడం) కల్పించి ఆ ఇబ్బందిని అధిగమించాడు రచయిత. క్లైమాక్స్‌లో కారు స్టార్ట్ అవుతుందా లేదా అన్న ఏక్షన్ కమ్ సస్పెన్స్ సీన్ సృష్టించాడు. నోరూరగ చవులుబుట్ట అన్న సుమతి శతకపద్యాన్ని బలే వెటకారంగా ఉపయోగించాడు. అక్కడ శతకారుడు చెప్పినది మంచిమాటలయితే, ఇక్కడ పక్కింటి కయ్యాలు.

కొన్ని మాటలకు అర్థాలు – మురారే: తృతీయపంథా – ఊరిజనం రెండుగా చీలిపోయినప్పుడు ఒక మనిషి మాత్రం ప్రత్యేకంగా మరోమార్గం పట్టడం, లాకేత్వం ఇవ్వడం – లేదనడం, తూనాబొడ్డు అనుకోవడం – అంతకుముందు చెప్పినదానినుండి withdraw కావడం, ఆరిందా – expert.

"John Steinbeck farm community మనుష్యుల గురించి కథలు (The Pastures of Heaven) ఇలాగే రాసేడు, మీరు దాన్ని చూసి ఇన్‌స్పైర్ అయ్యారా?" రమణను అడిగేరు కొందరు. అక్కడిదెక్కడిదో ఎందుకు? రమణ మద్రాసులో జనతాకాలనీలో (2/27 రాయపేట) నివసించిన ఇల్లు ఇలాంటిదే! అక్కడ ఉన్నవాళ్లు, అప్పటి రమణతో సహా ఆ స్థాయి వాళ్లే. భర్తను, వైభవాన్ని పోగొట్టుకుని, ముగ్గురు పిల్లలతో మద్రాసు చేరి, హిందీ టీచరుగా చేస్తూ, చిన్న చిన్న పనులు చేస్తూ సంసారాన్ని నెట్టుకొచ్చిన (తన తల్లి ఎంతటి దృఢచిత్తురాలో, తనపై ఆమె ప్రభావం ఎంత ఉందో రమణ 'కక్కి గారబ్బాయి' లో వివరంగా రాసారు) రమణ తల్లి తన పిల్లలకు అంతకంటే మంచి నివాసం ఎలా ఏర్పరచగలరు? ఆ ఇంటిలో చూసిన మనుష్యులే 'అందాలరాముడు' తీసినప్పుడు రమణ మనస్సులో మళ్లీ మెదిలారు.

"మహారాజా యువరాజా" – 1950లనాటి ఈ కథ రమణ గొప్పకథల్లో ఒకటి. అతడు నిరుద్యోగిగా, బ్రహ్మచారి చిరుద్యోగిగా ఉండే రోజుల్లో రాసినది. కథకు ముగింపు, మలుపు అంటూ పెద్దగా ఏదీ లేకపోయినా a slice of life captured in certain frames on paper అనిపిస్తుంది. ఇంగ్లీషులోకి కూడా అనువదితమైంది. ఈ కథ పుణ్యమాని నిరుద్యోగులను యువరాజులనడం, చిరుద్యోగులను మహారాజులనడం రివాజయింది. ఇద్దరిలోనూ ఒక రికామీతనం కనబడుతుంది. ఇద్దరూ చేతికొచ్చిన డబ్బును తగలేస్తారు. సర్వర్ ఏమైనా అనుకుంటాడేమోనని అనుకున్నదానికంటే ఎక్కువ తింటాడు మహారాజు. యువరాజు వెయిటర్‌కి పావలా టిప్ ఇస్తాడు. తర్వాత వేరుశెనగ ఉండలు తినడానికి నామోషీపడి చివరికి గతిలేక తింటూ – అదీ వేరుశెనగ ఉండల పరిశ్రమను ఉద్ధరించేవాడిపోజులో స్టయిలిష్‌గా తింటాడు. 'ఛాయలు'లో లాగానే ఇంజనీరు కూతురితో ఇంటర్వ్యూ, వయారిభామతో సమాగమం ఊహల్లో తేలిపోయి సున్నితమైన నరాలు ఫ్యూజు వైరులా భస్మం చేసుకుంటాడు. ఇంగ్లీషుకథలు అనువదిద్దామనుకుంటాడు (రమణ అప్పటికి అనువాదాలు కూడా

చేస్తున్నాడు). అదృష్టవశాన్న అర్ధరూపాయి దొరికినా దాంతో పజిల్ కడతాడు, ఉన్న అణాతో మూడు పజిల్స్ పంపకుండా అప్పు కోసం తిరుగుతాడు. చివరికి పోస్టల్ ఆర్డర్స్ నష్టానికి అమ్ముకుంటాడు.

ఇద్దరూ కన్‌స్ట్రక్టివ్‌గా ఏదీ చేయరు కానీ నిజాయితీపరులే. యువరాజు పజిల్ ఊహల్లో కూడా నిజాయితీగా వ్యవహరించి సగం ప్రైజు సంపాదించుకున్నట్టు కల కంటాడు. చిత్రమేమిటంటే, ఇద్దరూ ఒకరిని చూసి మరొకరు అసూయపడతారు (ఇద్దరి మధ్య కథ సాగడం మంచి ఎడిటింగ్ టెక్నిక్ అనిపిస్తుంది). కథలో గుండె కదిలించే దృశ్యం – హైక్లాసు ముష్టాడు, పెద్ద హోటల్ క్లీనర్ మధ్య బేరసారాలు. ("ఇరుకుసందుల్లోకి కూడా తీక్షణంగా చూసి సునిశితంగా ఆలోచించి సున్నితంగా చెప్పాడు రమణ" అంటాడు ఎమ్వీయల్.)

నూనె రాసుకోకుండా అప్పడాల పిండితో ఆటలాడబోయిన మహరాజు అసలు పిండే కాదు చేతులే లేవనుకుని తృప్తిపడడం కూడా హృదయవిదారకంగా అనిపిస్తుంది. రమణ అలవోకగా చెప్పిన ఒక గొప్ప జీవితసత్యం ఉంది ఈ కథలో. డెన్మార్కు యువరాజు పరిస్థితి కొచ్చినప్పుడు మనం గుర్తుంచుకోవాల్సినది – అటుకీ ఇటుకీ మధ్య ఒకటి ఎప్పుడూ ఉంటుంది. లేపోతే ఇటూ అటూ అనే ప్రస్తావనే లేదు. అలాగే వేడి కన్నీటి ప్రవాహం భగవంతుడు చెంపలు నిమిరినట్లయిందవడం అద్భుతమైన వర్ణన. మహరాజు బియ్యం కొనబోయినప్పుడు సందర్భాన్నిబట్టి దుకాణం, షావుకారు ఎలా వేషాలు మార్చేసుకుంటాయో చూడండి. 'ఇద్దరమ్మాయిలు – ముగ్గురబ్బాయిలు'లోలా పిల్లకాకికీ పాత్ర ఉంది ఈ కథలో. జంతువులను, పక్షులను కూడా రమణ కథాగమనానికి ఎలా ఉపయోగించుకుంటాడో చూడండి. 'ఆకలీ – ఆనందరావు'లో టీకొట్టు నాయర్ ఇక్కడా కనబడతాడు గొయ్యిలాగ (నుయ్యి యువరాజు ఇంటివాడు.)

ఎమ్వీయల్ ఈ కథ గురించి చక్కటి విశ్లేషణ ఇచ్చాడు – "ఈ కథ మొదట్లో తాకట్టు ప్రస్తావన చక్కటి సింబాలిజం. తాకట్టు పడింది మహరాజు అక్షయపాత్ర. అనగా అడుక్కు తినడానికి కూడా మరేమీ మిగల్లేదన్నమాట. తాకట్టుపడింది యువరాజు ఫౌంటెన్‌పెన్. అంటే ఉద్యోగాలకోసం అప్లికేషనులు రాసే అవకాశం కూడా పోయిందన్నమాట. నిజానికి తాకట్టు పడింది చెంబూ, పెన్నూ కానేకావు. వాళ్లిద్దరూ తాకట్టుపడిపోయారు. తాకట్టుతో ప్రారంభమయిన ఈ కన్నీటిగాథను కన్నీటిజాలుతో చెప్పే కోరికా, ఓపికాలేక ఎండిన కనుకొలకులలో నిస్సారత చిరునవ్వుగా ప్రగల్భించి ఆ వరసలోనే సాగించాడు రమణ భాష, భావం కూడా."

"యువరాజు, మహరాజు వీరిద్దరికి ప్రధానమైన తేడా ఉంది. వర్తమానం అలకొట్టి తరిమికొట్టగా మొహం పగిలి వేదాంతంలోకి జారిపోతాడు మహరాజు, వర్తమానం వికృతంగా భయపెట్టగా కలలరాజ్యానికి పట్టాభిషిక్తుడవుతాడు యువరాజు. పలాయనాన్ని ప్రదర్శించే ఈ కళల్ని, వేదాంతాన్ని మధ్యతరగతి చేతగానితనంగా సరిపెట్టుకునే తత్వంగా చిత్రించాడు రమణ."

"వీరిద్దరిలో పోలిక కూడా ఉంది. జీవితం అంటే మొండికెత్తడం, అదృష్టం మీద నమ్మకం ఉండడం, ఫాల్స్ ప్రిస్టేజితో బతకడం, తమనుతాము మోసగించుకోవడం, ఎవరికి వారు మరొకరు హాయిగా ఉన్నారని భ్రమపడటం.."

వివరణలు – వీశ (1400 గ్రా) లో సగం పదలం. అందులో సగం ఏబులం.

"అర్థాన్వేషణం" – 1956 లో రాసిన ఈ కథ పుస్తకరూపంలో వచ్చింది 1995 లోనే (బొమ్మా – బొరుసూ). కథ పేరులోనే pun ఉంది. అర్ధనూరు కోసం సగం చచ్చి సాగించే అన్వేషణే కథావస్తువు కాబట్టి. అన్వేషణలో అరగంటలు తిరుగుతాయి. అదే థీమ్‌తో కథ మొదలవుతుంది, జీతం 150 రూ|| ఉంటే బాగుండేది అనే బదులు 'రూపాయికు 3 అర్ధరూపాయిలిస్తే సరిపోతుంది..' అంటూ. 'కాదుసుమా' (రాజకీయ బేతాళ...)లో కనబడే నరసన్నగారే ఇక్కడా ప్రత్యక్షమవుతాడు అర్ధాకలితో. 'ఆకలీ – ఆనందరావు'లో వేపుకుతినే ఆత్మారాముడు కడుపులో కాముడుగా ఇక్కడా వెంటాడతాడు. అప్పారావు గెస్ట్ ఎపిరియన్స్ ఇచ్చి దారి చూపుతాడు కూడా. జీవిత వాస్తవాలు ప్రవచించిన అప్పన్న ఉపన్యాసంతో కథ ముగిస్తే రంజు ఉండదు. అందుకే చివర్లో ఓ కొస మెరుపు పెట్టాడు రమణ.

బాలరమణీయంలోని కథ "భోగిమంట" – భోగిమంటల ముచ్చటలు పిల్లలభాషలో (ఫ్రెండ్స్‌ని ఇనీషియల్స్‌తో పిలవడంతో సహా) చెప్పే ఈ కథ పత్రికలో 1955లో పడినా పుస్తకరూపంలో ఎక్కడా రాలేదు. 40 ఏళ్ల తర్వాత "రచన" మాసపత్రిక పునర్ముద్రించింది. దీనిలో రమణ స్వంతఊరైన ధవళేశ్వరం జనార్దనస్వామి కోవెల ప్రస్తావన కనబడుతుంది. అక్కడ భీష్మఏకాదశి (జనవరిలో వస్తుంది) కి స్వామి రథయాత్ర జరుగుతుంది. ఆ గుడిలో ఉన్న సొరంగం కాశీదాకా వెళుతుందని జనాలు చెప్పుకోవడమూ ఉంది. భోగిరోజుల్లో అల్లరిచేయడం, బోర్డులు మార్చడం రివాజుగా ఉండేది. 'మహరాజు – యువరాజు' లో adlanguage ని వెక్కిరించినట్టే దీనిలో సైన్ బోర్డు (సెలూన్) భాషను వెక్కిరించడం జరిగింది. వివరణలు: తలంటిపొరేయడం – తిట్టడం, పేకావారి అమ్మాయినిచ్చి పెళ్లిచేయడం – పేకబెత్తంతో కొట్టడం.

లోకాభిరమణీయం కథల్లో మనుష్యుల మనస్తత్వాలను విశ్లేషించిన కథలు కన బడతాయి. వాటిలో మొదటగా చెప్పదగినది "ఛాయలు" – ఇదీ, 'ఆకలీ – ఆనందరావు' 1953 (ఫిబ్రవరి, జూలై)లో ఆంధ్రప్రభ వీక్లీలో వచ్చాయి, రమణ ఆంధ్రపత్రిక డైలీలో చేరుతుండగా! (రెండు సంస్థల మధ్య స్పర్ధ ఉందని, తన ఉద్యోగానికి ముప్పువస్తుందేమోనని రమణ కాస్త భయపడ్డారట!) రెండూ గొప్పకథలే. "ఛాయలు" ఇలలో సాధించలేని దాన్ని కలల్లోకి వెళ్లి సాధించినట్టుగా ఊహించడం, మళ్లీ దానికి సవరణలు చేయడం – తర్వాత్తర్వాత చాలామంది వాడుకున్నారు, (ముంఘేరీలాల్ కే సప్నే వంటి టీవీసీరియల్స్‌లో) అనుకరించారు. కథలో తమ్ముడు పారిపోవడం సింబాలిజం అంటాడు ఎమ్వీయల్. "తనకంటె తక్కువస్థాయి వర్గాలు (పోర్టరు) తమలోకి లాగేసుకోకుండా ఉండడం నుంచి తనకంటె పైస్థాయి వాళ్లు తనని దూరంగా విసిరేసిన స్థలం నుంచి, తన నుంచి, స్వేచ్ఛగా పారిపోయినది సుబ్రహ్మణ్యమే! ఈ అసమర్థత, పిరికితనం, మనసులో భయంగా రూపొంది ప్రతీ నీడనీ పోలీసుదని, వాడు తనను పట్టుకోవడానికి వస్తున్నాడని అనుమానిస్తుంటాడు సుబ్రహ్మణ్యం".

సమస్యలను ఎస్కేపిజంతో సాధించబూనే వాళ్ల గురించిన ఈ చక్కటి మనోవైజ్ఞానిక విశ్లేషక కథకు చమత్కారపు పూత పూసాడు రమణ. అంతటి

బాధల్లో కూడా సుబ్రహ్మణ్యానికి ఇంగ్లీషు భాష పట్ల ఉన్న అబ్సెషన్ చూసి నవ్వాలో, ఏడవాలో తెలియదు. ("ఈశ్వరేచ్ఛ"లో గుర్నాథం కూడా 'మిరాజ్' గురించి మహా ఇదవుతాడు.) అసలు తమ్ముడు పట్టుకుపోయిన పాతిక రూపాయిలు ముఖ్యమా, తమ్ముడు ముఖ్యమా అని ఆలోచిస్తే సుబ్రహ్మణ్యం దృష్టి పాతిక రూపాయిల మీదే అంటాడు ఎమ్వీయల్.."అవి తగలేసే లోపుల వాడిని పట్టుకోవాలని తాపత్రయం. కానీ అవి లేకపోవడం వల్ల జరిగే లోటు పూర్తి చేసే అవకాశం లేదు. అందుకే వాటిని ఎలా సంపాయించాలన్న ఆలోచనలు వదిలేసి CID ని శిక్షించే మార్గాల్ని ఎక్కువ కలగన్నాడు. లేదా యువరాజులా పజిల్స్ గురించి కలగని ఉండేవాడు."

'అకలీ – ఆనందరావు' కథలో ఆత్మారాముడు చివరిదాకా ఉంటాడు కానీ దీనిలో ముందులో కనబడిన కవి హఠాత్తుగా మధ్యలో మాయమయిపోతా డెందుకో! "కానీ కవి పాత్రకు చాలా ఇంపార్టెన్స్ ఉంది. ప్రతిమనిషిలో ఉండే split personalityని కవి ద్వారా సుస్పష్టంగా వివరించాడు కవిని ఆధారం చేసుకుని. కవిని మించిన ఫస్ట్‌క్లాస్ ఎస్కేపిస్టు ఎవరు?" (ఎమ్వీయల్). కథ చివరిలో 'మహరాజా – యువరాజా' కథలో యువరాజులో బాధ్యతారాహిత్యం కనబడుతుంది. 'అకలీ – ఆనందరావు' రమణ ఆత్మకథయే అన్నారు ఆయన చిరకాలమిత్రులు, బంధువు అయిన నండూరి రామమోహనరావు గారు ఒకసారి. 'ఛాయలు' కూడా అలాటి కథే కావచ్చు. రమణకు కూడా తన తమ్ముడి ద్వారా కొన్ని చికాకుల నెదుర్కోవలసి వచ్చింది. పైగా రాసేనాటికి రమణ వయస్సు ఇరవైరెండే! అంటే తన వయస్సుకుర్రాడి ఊహలు, ఊహాగానాలు మూడోవ్యక్తి విశ్లేషించినట్టు విశ్లేషించి రాగద్వేషాలు లేకుండా రాసాడు. (ఇప్పటివరకూ రమణ ఏ కథా first personలో రాయలేదని ఈ సందర్భంలో గుర్తు చేసుకోవాలి.) ఈ కథ నాచే 'Shadows' గా అనువదితమై తానా వారి 1995 సావనీర్‌లో ప్రచురించబడ్డప్పుడు 'నలభై ఏళ్ల క్రితమే ఇంతటి అత్యాధునికమైన కథ రాసారా తెలుగులో?' అని ఆశ్చర్యపడ్డవారెందరో. అంత పాత కథ కాబట్టే మద్రాసులో ట్రాములు కనబడతాయి. ఎల్‌ఫిన్‌స్టన్ థియేటర్ కనబడుతుంది. రెండాల్ఫ్ స్కాట్ సినిమాల, రిపబ్లిక్ సీరియల్స్ ప్రస్తావన కనబడుతుంది.

"ఆ చేతి చేత" – భీమశంకరం గారు అంత భార్యావిధేయుడు కావడం, ఇంట్లోంచి బయటకు కదలలేకపోవడం చిత్రంగా తోస్తుంది. కానీ ఇలాటి ఘట్టాలు సత్యదూరమయితే కాదు. ఆయన పడే కంగారుకు సరైన పదచిత్రం – 'నాకిత్తానన్న రూపాయేది బాబూ?' 'రేపు రేపు రేపు. లేదు లేదు చిల్లర లేదు. రేపు రెండు. రేపు రెండిస్తా. పద పద పద'. ('వేట' లో 'దండాలు బాబయా..' ఋణగుణధ్వని ఓ హడావుడి సంభాషణకు అక్షరరూపం అయినట్టే) మొహాన్ని పోలుస్తూ అణా యిడ్డైనంత అంటాడు ('ఈశ్వరేచ్ఛ' లో బురదడాగు కూడా అదే సైజు), పోలిక ఇప్పటి వారి ఊహ కందదేమో! పెద్దజంట, చిన్నజంటలను పోలుస్తూ రతీ మన్మథులు చెన్నపట్నానికి, పార్వతీ పరమేశ్వరులు స్వగృహానికి బయలుదేరారంటాడు. కథలో తమాషా ఏమిటంటే ఆడవాళ్లకి ఆడవాళ్ల మీద ధీమా, మగవాళ్లకు మగవాళ్ల మీద. వరాముళ్లపూడి ఈ 1956 నాటి కథను టీవీ ఎపిసోడ్‌గా నిర్మించారు 1996 లో.

"స్వయంవరం" – పొడుపుకథలాటి కథేగాని ఒక స్త్రీ అత్తగారయినప్పుడు కొడుకుమీద తన కంట్రోలు పోకుండా పడే జాగ్రత్త గురించి చెబుతుంది. 1955లో రాసిన ఈ కథ ఇప్పటికీ పనికివస్తుంది. "రాజకీయ బేతాళ..."లో 15 వ కథలో "అయినవాళ్లు మంచాడని, కానివాళ్లు మెతకవాడని" అని వర్ణించినట్లు ఈ కథలో శ్రీదేవి కూడా 'మంచివాళ్లకు నెమ్మదస్తురాలుగాను, చెడ్డవాళ్లకు వాజమ్మగాను కనబడుతుంది.'

"సన్మానభంగం" – ఆశ్చర్యపడడంలో 'పడడం' మీద అనేకసార్లు పన్ చేసిన రమణ ఈ కథలో కళ్లు నెత్తికెక్కడం, కొమ్ములు రావడం నిజంగా జరిగితే ఎలా ఉంటుందో ఊహించి రాసాడు. అహంభావితనాన్ని ఈ కథలో అతి దా'ఋణంగా' వెక్కిరించిన రమణ నిజజీవితంలో ఆడంబరం, ఆర్భాటం గిట్టని వ్యక్తి. సన్మానాలకు, పొగడ్తలకు దూరంగా ఉండే మనిషి. బాపూ కూడా అంతే. నవతా కృష్ణంరాజు చెప్పినట్టు, "బాపు డబ్బుకు లొంగడు, డబ్బాకు లొంగడు." ముఖస్తుతి మాటలను 'ముత్యాలముగ్గు' లో మేళం పెట్టి మరీ హేళన చేసిన జంట ఇలా ఉండడం ఆశ్చర్యకరం కాదేమో!

"వేట" కథలో క్లైమాక్స్‌లో అనేకపాత్రలతో ఒక్క ఫ్రేమ్‌లో గందరగోళం చూపితే సన్మానభంగం లో చివరి భాగం చకచక కదిలే కార్టూన్లా రెండే పాత్రలతో, అనేక ఫ్రేములతో బలే అయోమయాన్ని సృష్టిస్తుంది. ఊహించిగలిగినంత వారికి ఊహించినంత మహాదేవా! సందు దొరికితే చాలు రమణ రచనల్లో దూసుకువచ్చే అప్పారావు ఈ కథలో విశ్వరూపం ప్రదర్శించాడనడంకంటే బహురూపిగా భాసించాడనడం సబబు.

వివరణలు – కాంగో రాజకీయాలు – కాంగో అప్పట్లో రెండుగా చీలింది. చాలా ఏళ్లపాటు అంతర్యుద్ధం సాగింది. మందః కవియశః ప్రార్థ – మందబుద్ధినైనా మహాకావ్యానికి ఉపక్రమించానంటూ రఘువంశారంభంలో కాళిదాసు వినయం ప్రకటించిన శ్లోకం.

"ఈశ్వరేచ్ఛ" – ఒక నిరుద్యోగి విజయం కథ. రమణ నిరుద్యోగులను జాలిపడవలసిన వాళ్లగా చిత్రీకరించినట్టు తోచదు. "మహారాజా – యువరాజా"లో నిరుద్యోగిలాగే గురునాధరావు కూడా హాపీగా బతుకు లాగించేస్తాడు. వాచీ తాకట్టు పెట్టి దర్జాగా పేకాడతాడు. అప్పచేసి కాఫీ తాగుతాడు. పజిల్ కడతాడు. ఎత్తుకు పైయెత్తు కథగా మాత్రమే కాకుండా రమణ దీనిలో అనేక సొగసులు కూర్చాడు. 'సుదృఢమైన ఆత్మవిశ్వాసం' లాటి ఏడ్ భాషా పదజాలాన్ని పేరడీ చేసాడు. టోకరాసురుడు, టోకరాస్యుడు (అక్షరాస్యుడులా), టోకరేజీ, పేకాటవికి వేట కెళ్లడం వంటి పదాల్ని, ఎక్స్‌ప్రెషన్స్‌ని సృష్టించాడు, దివంగతులు పదంలో దివంగంతులు అంటూ కన్‌ఫ్యూజన్ చూపాడు, ఇంగ్లీషు ఉచ్చారణ పై డిస్కషన్ చూపాడు. గుర్రానికి, గాడిదకు కూడా ఆలోచించే పాత్రలు ఇచ్చాడు. అవకరాల మీద రమణ ఎప్పుడూ హాస్యాన్ని పండించలేదు. కానీ ఈ కథ గజపతి దృష్టిలోపంతో (కళ్లజోడు లేకపోతే కనబడకపోవడం) మలుపు తిరుగుతుంది. కానీ అతని నీచప్రవర్తన వల్ల మనకు జాలి కలగదు సరిగదా అతని అవస్థలు చదువుతూంటే మహా ఆనందంగా

అనిపిస్తుంది. రాసిన నాలుగు దశాబ్దాలకు ఈ కథను 'పెళ్లికొడుకు' (1995) సినిమాలో ఉపయోగించుకున్నారు.

కొన్ని మాటలకు అర్థాలు – ఠోలీ – రూపాయిలో 384వ వంతు, కురునాథ కుమారుడు – దుర్యోధనుడు.

సరదారమణీయంలో కనబడే "అదోరకం ముచ్చట" – ఓ చిన్న జోక్ లాటి కథ. రమణ నవలలు ఎప్పుడూ రాయలేదు. విక్రమార్కుని..., రాజకీయ...ఋణానందలహరి – ఇవన్నీ కథా మాలికలే. ఇద్దరమ్మాయిలు... పెద్ద కథ. వీటితో బాటు రమణ చిన్న, చిన్న కథలు కూడా రాసారు. ('కథ కాని కథ' లాటివి). సినీరచయిత అయిన తర్వాత రమణలో క్లుప్తత మరీ పెరిగింది.

"భూషణం వైరాగ్యం" – సాదాసీదాగా కనబడే కథే (1955 లో ప్రచురితం) అయినా దంపతుల మధ్య కమ్యూనికేషన్ గాప్ ఎంతటి దూరానికి (కాశీలో వదిలేసేటంత) తీసుకెళుతుందో చెబుతుంది. దీన్ని TV ఫిల్మ్‌గా రమణ కుమారుడు, బాపు అసిస్టెంటు అయిన వరా ముళ్లపూడి 1996 లో తీయడం జరిగింది. కథను మణిసిద్ధుడు – గోపన్నల ద్వారా చెప్పించారు. రమణ కథలు చెప్పడానికి ఎంచుకున్న పద్ధతులు కొన్ని ఉన్నాయి. పంచతంత్రం మోడల్లో కథలో కథ లాటివి (ఋణానందలహరి), మధిర సుబ్బన్న దీక్షితులు రాసిన కాశీమజిలీ కథల్లోని పాత్రయైన మణిసిద్ధుడు మణి చూసి విషయం గ్రహించి వెంటవచ్చిన గోపన్నకు కథ చెప్పడం (ఇదీ, రా.బే.లో 'సేవాంతకుడు') సుబ్రహ్మణ్యం అనే లోకజ్ఞుడు కథ చెప్పడం (కృతజ్ఞత, ప్రయోజకుడు, ప్రాప్తి) సాలభంజికల టైపులో అందరూ ఏదో కథ చెప్పి వెనక్కి వెళ్లిపొమ్మనడం (విక్రమార్కుని...) బేతాళ కథల మోడల్ (రాజకీయ...)

కౌటిల్యరమణీయంలో కనబడే "రాజకీయ బేతాళ పంచవింశతిక" –

రమణకు అభిమాన విషయాలలో రాజకీయం ఒకటి. అభ్యుదయరచయితల సంఘంలో సభ్యుడైనా ఎలాటి రంగుటద్దాలు పెట్టుకోకుండా, ఏ పార్టీని వెనకేసుకు రాకుండా, నిష్పక్షపాతుడైన ప్రేక్షకుడిలా స్పందించే పౌరుడిగా రాజకీయ కెలిడియోస్కోపు పాఠకుల ముందుంచి, దాన్ని చూసి బెదిరిపోకుండా ముందుకు రమ్మని సందేశం ఇస్తాడు చివరిలో. (విక్రమార్కుడి సింహాసనం కథల్లో సినిమారంగం గురించి చెప్పినట్టు) కృష్ణుడి వద్దకు సాయం కోరవచ్చిన అర్జునుడిలా రామిరెడ్డి వద్దకు వచ్చిన సుబ్బరాజుకి విశ్వరూప దర్శనం చేయిస్తాడు. అయితే కథనానికి ఎన్నుకున్నది బేతాళకథల తీరు. కథ చెప్పడం, ప్రశ్న వేయడం, సరైన జవాబు చెప్పమనడం. అయితే రమణది ఎంత కొంటెతనం అంటే చివరికి బేతాళ కథలను కూడా పేరడీ చేయకుండా వదిలిపెట్టలేదు. 'జవాబు చెప్పడంలో అతి తెలివి అక్కర్లేదు, కామన్‌సెన్సు ఉంటే చాలు' అనిపిస్తాడు 23 వ కథలో. అంతేకాదు, పుస్తకంగా వేసినప్పుడు కథల్లో సెక్సప్పీలు లేక ఎదరంతా ఎడారి కాబట్టి కన్నుగొట్టే బాపూ భామ బొమ్మొకటి వేసి చూసుకోమన్నాడు. 10 వ కథ ముందులో ఉత్తిపుణ్యానికి ఓ అమ్మాయిని వెంట తీసుకొస్తాడు సుబ్బరాజు, కథల్లో ఆడపడుచుల్లేరు కాబట్టి.

రాజకీయాల గురించి రమణ అనేక విధాలుగా చెప్పుకొచ్చాడు తన కథల్లో. రిఫరెన్సు చూసుకోవడానికి వీలుగా కథల నెంబర్లు బ్రాకెట్లలో ఇస్తున్నాను. పొలిటిక్స్

పుట్టుక చెప్పాడు (7), పొలిటీషియన్స్ పుట్టుక వింతగా చెప్పాడు (25), వాళ్లని ఊసరవెల్లి అనడం మన అవగాహనా రాహిత్యం అంటాడు (17), రాజకీయ కళ గురించి చెప్పాడు (13), రాకెట్‌తో ఉపమించాడు (15), స్త్రీపరంగా చెప్పాడు (10). రమణ పాత్రలు రాజకీయాన్ని వ్యాపారంతో ముడివేసినవే. 'రాజకీయాల్లో డబ్బు తిప్పచ్చుగా' అంటారు (6), నోట్లు జల్లి ఓట్లు పండిస్తారు (15), తమ గురించి తమకు బాగా తెలుసుకాబట్టి ఎవడైనా నవ్వితే తమని చూసే నవ్వాడేమోనని భుజాలు తడుముకుంటారు (16), వారి ఉద్దేశ్యాల ప్రకారం – దేశ సేవ మీద ఉబలాటం ఉంటే ఆటిరాదు (12), చేస్తానని చెప్పిన పనులు చేసేసినవాడు అసమర్థుడు (1), దేశం కంటే వార్డు, అంటే వోట్ బ్యాంక్ ముఖ్యం (9), ప్రజలు వేరు, ఓటర్లు వేరు (25).

వాళ్ల విధానాలు కూడా విలక్షణంగా ఉంటాయి. పగసాధించాలంటే పంచన చేరతారు (2), అవతలివాళ్లెంత అసమర్థులో చూపడానికి డబ్బు అజమాయిషీ నిస్తారు (7), అనుచరుణ్నే ముంచుతారు (13,14), ప్రత్యర్థి వద్ద చేరి తప్పుడుదారి పట్టిస్తారు (18), తమ ప్రతిష్ఠాన్ని తామే తయారుచేసుకుంటారు (15).

అందరూ ఒక్కలాగానే ఉండరుగా! కొందరు ఆదర్శవాదులూ ఉంటారు. రోడ్డు వేయించబోతారు (8), సైకిలు పన్ను తీయించేయబోతారు (9), కానీ వాళ్లు 'ఆటిరారు'.

రాజకీయపార్టీల అంతర్గత పరిస్థితులు పరామర్శిస్తూ పార్టీ టిక్కెట్లు తెచ్చుకోవాలంటే జనసేవ కంటే జననాయకసేవే ముఖ్యం అంటాడు. కావలిస్తే వినాయకుడు గణాధిపత్యం తెచ్చుకున్నతీరు చూడమంటాడు (10). రెండు మానిఫెస్టోలు ఉండాలిట – ఒకటి ప్రజలను ఆకట్టుకునేది, మరోటి గ్రూపులను, నాయకులను ఆకట్టుకునేది (10). దేశంలో పన్లు పాలిసీలనుబట్టి కాదు, మనుషుల పాలసీలనుబట్టి జరుగుతాయి (3), అందుచేత నాయకసేవే ముఖ్యం (15). పార్టీ టిక్కెట్లు ఏ కన్సిడరేషన్స్ మీద ఇస్తూ ఉంటారో ఓ విసురు కూడా విసిరేడు (12).

ఎన్నికలతంతు గుర్తించి రమణ చెప్పని అంశం లేదు. ఎలక్షన్ సీజను వర్ణన (16), బీదపెళ్లిళ్లు, బైస్కోపు స్టార్సుని తేవడం (20), పెన్షన్లకు కూడా ఇంక్రిమెంట్లు ఇస్తాననేలాటి హామీలు గుప్పించడం (11), అవతలివాడి ప్రచారాన్ని మిస్‌లీడ్ చేయడం (11), నోట్ల పంపిణీలో గూడుపుఠాణీ (22), ఒకే రోడ్డుని ఇద్దరు ప్రారంభించడం (24) – ఇవన్నీ కూడా పలకరిస్తాయి మనని.

ఎన్నికలయ్యేక ఏర్పడే ప్రభుత్వాలను కూడా విడిచిపెట్టలేదు రమణ. సంకీర్ణ మంత్రివర్గాలను పొట్టిగుడి వర్ణన (7) లో చెప్పడమే కాక 'గవర్నమెంటు నాలుక్కాలాలు నిలిపి, నడపలేని మంచివాడికన్నా ఎత్తుకు పై యెత్తు వేస్తూ పవరులో నిలబడే చెడ్డవాడే మెరుగు' (7) అనిపిస్తాడు. కమిటీల ఏర్పాటు (5), వాటి హంగామా (19), వాటి తప్పుడు నిర్ణయాలు (15) మన కళ్లముందు నిలుపుతాడు.

వారేర్పరచిన రూల్స్ గురించి, వాటిని చూపించి జనాల్ని హడలేసే బ్యూరాక్రసీ గురించి (8), వాటిని వంచగలిగిన ఒడుపు గురించి (18) కొన్ని డిపార్టుమెంటులంటే పాలకులకే బెదురన్న విషయం (19) గురించి కథలు చెప్పాడు రమణ.

పాలకుల గురించే కాక పాలితుల గురించి కూడా చెప్పాడు రమణ. చాప్లిన్‌ను తలపుకు తెచ్చే కరుణ, హాస్య రసాల మేళవింపుతో వారి దీనావస్థను వివరిస్తాడు పాయ్యిలో పిల్లి ద్వారా (16). జీతాలు చాలని వారి జీవితం (5), అభ్యర్థులలో ఎవర్నీ ఎన్నుకోలేని దురవస్థ (4), మంచి జరుగుతుందన్నా వద్దనే పిరికితనం (8), స్టాంపుకు గుండుసూది గుచ్చవలసిన కరువు పరిస్థితి (22), అందరూ నీళ్లు పోసి పక్కవాడు పాలు పోస్తాడని ఆశించడం (25), తక్షణ సౌకర్యాలకై ఆశించడం (9), ఐదేళ్లకోసారి వచ్చి మొహం చూపించినా మురిసిపోవడం (11) వంటి అన్ని అంశాలు స్పృశించడం జరిగింది.

మరి వీరిని ఆకట్టుకోవాలంటే కొన్ని ఇజాలు కావాలి. వాటిగురించి రమణ సలహా – 'ముద్దరిష్టం లేకపోతే తేలిగ్గా వేసుకోవాలి తప్ప అసలొద్దనరాదు' (17), ఓ కుహనా సోషలిస్టు గురించి 'కలవారి ఫేషను, లేనివారి పాలిట ఆశ' (9).

దేవుణ్ని కూడా విడిచిపెట్టలేదు రమణ. తన నిస్సహాయత తెలిసి ఎక్స్‌పోజ్ చేయబోయిన భక్తుడి మీద అలుగుతాడు దేవుడు (14). "దేవుడు ధనసాధనలో, విజయసాధనలో తురుఫాసు లాటివాడు" (14). చేసిన తప్పులు కమ్ముకోవడానికి మేడ్–టు–ఆర్డర్ పూజాకాలు వచ్చేస్తూంటాయి (7), ప్రజలు నమ్మేస్తూంటారు. 'ఇద్దరమ్మాయిలు–ముగ్గురబ్బాయిలు'లో సైడుహీరో అంటాడు దేవుడి నిస్సహాయత గురించి – 'భగవంతుడు ఏం చేస్తాడురా, కాస్త పాపం, పుణ్యం, దేవుడూ దెయ్యం ఆలోచించి భయపడే వాళ్ళని దేవుడయినా మందలించి బాగుచేస్తాడు. మొహం ఎదటే ఘోరాలు చేసి బరితెగిస్తూంటే నివ్వెరబోయి చూస్తున్నాడు. మొండివాణ్ని రాజేం చేస్తాడు?'

లోకంపోకడపై చాలా విసుర్లు విసిరాడు రమణ. అయినవాళ్ళు మంచాడనీ, కానివాళ్ళు మెతకవాడనీ అంటారు (15), ఇష్టం ఉన్న పేపర్లు 'ఏకగ్రీవంగా' ఎన్నికయినట్లు రాస్తే, ఇష్టం లేనివాళ్ళు 'పోటీలేకుండా' అని రాసాయి. (15), ప్రజలు కుడినీ, ఎడమనీ కుడిగానే ఎంచనారంభించారు (1) చదువుకున్నవాడు గుమాస్తాయే అవుతాడు (6), 'పూరీజగన్నాథం'లో బొమ్మలు చెక్కించింది రాజాగారు కాబట్టి ఆ బొమ్మ దక్కింది. అదే నేనూ మా కంట్రాక్టరూ అయితే బొమ్మలు సగం చెక్కించి డబ్బు తినేశామనేవారే...(7) గుమ్మడిదొంగలనగానే భుజాలు తడుముకోవడం ఎందుకు (1), మినిస్ట్రీ పేరు జెబితే పెతివోడికి హేళన, వెటకారం తన్నుకొస్తనయి. రూపాయికి చిల్లర మార్చడం చేతగానోడు కూడా మినిస్ట్రుగారి తలకాయలు మార్చే ప్రశ్నె మీద విసుర్లే...(17)

తెలుగు జాతీయాలకు, పలుకుబడులకు తన విరుపులతో కొత్త అందాలు తెచ్చిన వైనం మీరు రిఫర్ చేసి చూస్తేనే తెలుస్తుంది. బతికిబట్టకట్టడం (16) సిటింగ్ ప్రెట్టీ (10) గిట్టనివాళ్ళు (9) అవినీతి పనులు (12) ఆశ్చర్యపడిపోవడం, ఎసరు మరగడం (22) పైకి వెళ్ళడం (25) ఎగిరిగంతేయడం (10), సిగదరగడం (13) తడపడం (8) సమ్మెలు కట్టించడం, ఇప్పించడం (17) చేతికి ఎముకలేకపోవడం (13) కాపు సారా, కామాపు సారా (ఉపసంహారం) వీటి నెలా ఉపయోగించాడో చూడండి.

అనవాయితీగా కొన్ని కొత్తపదాలు కూడా సృష్టించాడు రమణ – లాజీత్తు, కరణీకులం, పాలి(ట్రిక్సు, రాజాజీనామా, అధికారులు, ధిక్కారులు, బేవారసత్వం, రారాజధాని, ఊహాగానసభలు, మ్యునిసిపాలిటిక్స్, పొజిషన్ – 'అ'పోజిషన్,

భావుకుడైన రమణ రాజకీయపుస్తకంలో కూడా తన కవిత్వధోరణి విడిచిపెట్టలేదు. లంచాలన్నీ మంచాలపడడం (9), పరువుల్దీసి పందిర్లేయడం (23), కప్పేలా ఒప్పేలా తప్పాలు చేయడం (13), తృణరాశి అంత డబ్బు తృణంలా ఇవ్వడం (19)– బిల్లు తయారుచేసి చట్టం కట్టడం (చట్రం కట్టినట్టు) ఇవన్నీ కనబడతాయి ఈ పుస్తకంలో.

వీటిలో కొన్ని కథలు చెప్పడానికి రమణ ఉపయోగించిన టెక్నిక్స్ కొన్ని – లక్ష్మణుడి నవ్వు గాథలో లాగే రామనరసు నవ్వు అనేక అపోహలకు దారితీస్తుంది. 'కాదుసుమా కథ కాదు సుమా' (కీలుగుఱ్ఱంలో ఘంటసాల పాటపల్లవి అది) కథలో. శాసన(క్రీడాభిరామం పేరు వినుకొండ వల్లభరాయుని (క్రీడాభిరామం నుండి takeoff. 'కిటుకు' మాఘం కథ ("The Verger" – చదువు రాకపోవడంచేత చర్చిలో ఉద్యోగం పోగొట్టుకొని వ్యాపారస్తుడవుతాడు.)పై ఆధారపడినదని ఆయనే చెప్పాకున్నాడు. అందరికీ తెలిసిన ఏడుచేపల కథలలోంచి passing the buck సిద్ధాంతం ఆధారంగా 'అనగనగా ఒక చేప', జానపద కథల ఫక్కీలో 'పాలి(ట్రిక్సు కథ' కాశీమజిలీ కథల కథల్లో వచ్చే మణిసిద్ధుడు, గోపన్నలు పాత్రలుగా 'సేవాంతకుడి కథ', శుకసప్తతి కథల్లో వచ్చే చిలక బాణీలో 'చిలకచెప్పిన రహస్యం కథ' రాయడం జరిగింది. అయితే ఈ చిలక ఒక కథకు బదులు పొరబాటున ఇంకో కథ చెప్పేస్తుంది. (ఋణానందలహరిలో చీమలా). కావాలని చెప్పిందేమో కూడా.. అదీ పార్టీ ఫిరాయిస్తుందిగా! (రాజకీయాల మహిమ, ఇన్ని కథలు చెప్పిన రామిరెడ్డి కూడా చివర్లో సర్(ప్రైజ్ చేసినట్టు – 'కృష్ణుడిని మించిన పొలిటీషియన్‌రా' అనిపించేట్టు!) అలాగే ఇద్దరమ్మాయిలు, ముగ్గురబ్బాయిల కథలోలా ఆలయానికి విరాళం ఇవ్వడం 'సేవాంతకుడి కథ'లో కనబడుతుంది. ఉద్దేశ్యాలు వేరనుకోండి. 'బుడుగు', 'విమానంకథ'లలో కనబడే పకోడీల నారాయణ ఈ కథల్లోనూ (కాదు సుమా..) అతిథి పాత్రలో హలో అంటాడు. 'ఇరుసున బెట్టిన కందెన'లో లంచానికి పర్యాయపదంగా వాడిన 'బరువు' 'కథానాయకుడు' సినిమాద్వారా మరింత (ప్రచారానికొచ్చింది.

సన్నివేశం కళ్ళకు కట్టినట్టు చెప్పడంలో రమణ కెమెరా టెక్నిక్ ఉపయోగిస్తాడ నడానికి ఇంకో ఉదాహరణ: 'మూడ్నెళ్ళు గడువు' అని కేకేశాడు తండ్రి కొడుకులు గుమ్మం దాటుతూండగా (12), 'శివమెత్తినట్టు ఆడిపోతాడు...' అంటూనే మర్నాడు ఊళ్ళో శివాలెత్తడం (ప్రస్తావిస్తాడు. (7) ఇంకో తమాషా టెక్నిక్ ఏమిటంటే 'మీరు పెట్టించిన పొడ్డింగు బట్టి చూస్తే...' అని పాత్ర చేత అనిపిస్తాడు. ఇది వి(క్రమార్కుని... కథలో 'రచయిత పాసార్ది చెప్పినట్టు...'లో కూడా కనబడుతుంది.

ఎమ్వీయల్ అంటాడు – "ఉచ్చారణలో శబ్దం ఎలా ఉంటుందో 'అక్షరాలా' అలాగే రాశాడు రమణ. అంతేకానీ పదస్వరూపం మారిపోతోందేనన్న జంకు కనబరచలేదు. పాత్రోచితంగా సామెతలు, జాతీయాలుకూడా అవసరాన్నిబట్టే వాడినట్టు కనబడతాయి గాని రచయిత పాండితీ (ప్రకర్ష (ప్రదర్శించడానికి పనిగట్టుకు వచ్చినట్టుండవు." కొన్ని మచ్చుతునకలు – 'మా అమ్మకి చీర లేదు. వ్యామ్యానోరు నొక్కుతావేం' అన్నాడు

నరసుగారి మూడ్ వాడు. (16) 'హ్యాటీ ఏమిటి? స్విడ్జర్లాండెళ్ళచ్చు.' (11) ఇది 'బాగుల్లాయి బుగ్గలు' అని అరుగుమీద పళ్ళు తోముకుంటూ ముగ్గుల్ని మెచ్చుకునే రామారావు (ఇద్దరమ్మాయిలు, ముగ్గురబ్బాయిలు) 'నా మనస్సు బాహూలేదోయ్' అనే శోభనాద్రి (భగ్నవీణలు...)

ఈ కథల్లో వచ్చే కొన్నిమాటలకు అర్థాలు వెతికేవారికోసం: అబోరు–పరువు, ప్లాసిబో మాత్రలు – పేషంటు తృప్తికోసం ఇచ్చే ఉత్తుత్తి మాత్రలు, గుణించడం – ఖర్చుపెట్టడం, తుమ్మాయి, జగ్గాయి – Tom, Dick and Harry లాటి వాళ్ళు, రాజాజీ – గవర్నర్ జనరల్‌గా పదవీవిరమణ చేశాక రాష్ట్రముఖ్యమంత్రి కావడానికి కూడా వెనుకాడని చక్రవర్తుల రాజగోపాలాచారి, రాజకీయచతురతతో మద్రాసు తమకు దక్కకుండా చేశాడని తెలుగువారి ఆరోపణలకు గురయినవ్యక్తి, కాంగ్రెసులోంచి బయటపడి స్వతంత్రపార్టీ స్థాపించినా పైకి రాలేదు. రమణ అభిమానాన్ని నోచుకున్నట్టు కనబడదు. (ఓచోట సూక్తులు అనే హెడింగు క్రింద రమణ రాసాడు – 'రాజాజీ ప్రధాని కావాలి' – రాజాజీ అని.), జయప్రకాశ్ నారాయణ్ – సోషలిస్టు, నెహ్రూకి మిత్రుడు కానీ రాజకీయ ప్రత్యర్థి, ధేబర్ – కాంగ్రెసు నాయకుడు యు. ఎన్. ధేబర్, పి.ఎస్.పి. – అనేకసార్లు చీలడంతో రాజకీయ ప్రాబల్యం కోల్పోయిన ప్రజాసోషలిస్టు పార్టీ, ఆయూబ్ – పాకిస్తాన్ సైనిక నియంత, కృశ్చేవ్ – రష్యానాయకుడు, డిగోల్ – ఫ్రాన్స్ అధ్యక్షుడు, డా॥ లోహియా – సోషలిస్టు నాయకుడు, కామాపు – hush up చేయడం, ఖడేరావు – stubborn, సతిగాడు – చదివాడు,

ఈ కథలు 1961లో ఆంధ్రప్రభ వీక్లీకి సీరియల్‌గా రాయబడిన ముప్పైఏళ్ళ తర్వాత ఆంధ్రభూమి డైలీలో మళ్ళీ సీరియల్‌గా వచ్చాయి. వీటిలో 'దాచింపేడు రోడ్డు కథ' 'The Saga of a Road'గా నాచే అనువదించబడి A.P. Times అనే ఇంగ్లీషు డైలీలో 1997లో ప్రచురితమయ్యింది. 'ఓటరు నవ్విన కారణం' ఆంధ్రప్రభ వీక్లీలో 1999లో పునర్దర్శనం ఇచ్చింది. ఆ విధంగా తన ఈ కథలు అజరామరంగా, నిత్యనూతనంగా ఉండేట్లు నాలుగుదశాబ్దాలుగా రాజకీయవాతావరణాన్ని ఏమాత్రం మెరుగుపరచకుండా ఉంచిన రాజకీయవాదులకు రమణ కృతజ్ఞతలు చెప్పకోవాలి.

అతి త్వరలో వెలువడబోయే కథారమణీయం–II లో మరిన్ని కథలతో, మరిన్ని విశేషాలతో మళ్ళీ కలుద్దాం.

ఈ సంపుటిపై తమ అభిప్రాయాలు తెలుపదలచేవారు రచయిత (అడ్రసు – No. 4, Greenways Road Extn., Raja Annamalaipuram, Chennai-600 028)కు లేదా సంపాదకుడు (అడ్రసు – 502, Siri Enclave, 8-3-960, Srinagar Colony, Hyderabad 500 073)కు వ్రాయగోర్తాను.

– ఎమ్బీయస్ ప్రసాద్

* * *

# ఇదీ వరస....

రస రమణీయం




ఫెళ్ళున విల్లు విరిగింది.
మైథిలి గుండె ఝల్లుమంది.
సిరి హరిని వరించింది.

☆ ☆ ☆

పర్జన్య గర్జన వంటి ఆ ఫెళఫెళార్భటికి సమస్త చేతనా ప్రపంచము సంభ్రమ చకితమై సమ్మోహితమై పోయింది. భూధరాలు బద్దలయే వేళ వలె భువన భవనం దద్దరిల్లిపోయింది.

ఆ హర ధనుర్భంగ ధ్వని ధర్ములకు అభయదమై, అధర్ములకు భయదమై మనోహరంగానూ, ప్రాణహరంగానూ కూడా వినిపించింది. దశ దిశాంతాలనూ సోకి ప్రతిధ్వనించింది.

దూరాన, హిమవత్పర్వతసీమలో తపోనిష్ఠలో వున్న భార్గవరాముడికి అది హెచ్చరిక అయి వినిపించింది. ధర్మప్రతిష్ఠాపనలో, అధర్మ క్షాత్ర సంహారకుడు భృగుకులతిలకుడి భూమికను క్షాత్ర ధర్మ సంతారకుడు రఘుకులతిలకుడు స్వీకరించే మహత్తర సన్నివేశానికి నేపథ్య గీతమై భాసించింది. భార్గవుడు ఆ ధ్వని విని ముహూర్తకాలం పాటు భ్రుకుటి ముడిచాడు సాలోచనగా.

మిథిలాధిపుడి సభలోనే దగ్గరగా వున్న బ్రహ్మర్షి విశ్వామిత్రుడికి అది విజయభేరిగా వినిపించింది. 'ప్ర-కృతయుగధర్మ ప్రవర్తనానికి నాందీ ప్రస్తావన చేశావా ప్రభూ!' అనుకున్నాడాయన.

"దశకంఠ సంహారకాండలో పతాక సన్నివేశం ఆరంభమైంది" అనుకొని ఆనందించారు దేవతలు.

"మా అన్న!" అనుకున్నాడు లక్ష్మణుడు సగర్వంగా.

"నా ప్రతిజ్ఞ చెల్లింది. భగవంతుడే నాకు అల్లుడౌతున్నాడు" అనుకున్నాడు రాజర్షి జనకుడు తృప్తిగా, సగర్వంగా.

☆ ☆ ☆

నీలమేఘ శ్యాముడు రాముడు, తాను విరిచిన విల్లును సగౌరవంగా వేదిక మీద ఉంచి, గురువుకు నమస్కరించి నిలచాడు.

'కల్యాణమస్తు, (లోక) కల్యాణమస్తు' అన్నాడు గురువర్యుడు విశ్వామిత్రర్షి.

అన్న బలాన్ని తానెరిగినా, కన్నులారా మనోహర హర ధనుర్భంగ దృశ్యాన్ని చూచి ముగ్ధుడు కాకుండా ఉండలేకపోయాడు లక్ష్మణుడు. విల్లును చేపట్టబోవడంలో సొగసు, నిలబెట్టి దక్షిణ పాదంగుష్ఠానికి దన్ను పెట్టి వంచి, త్రుటిలో అల్లెతాడు ఎక్కించడంలో ఒడుపు, సౌలభ్యం, బాణం ఆరోపించడంలో మెలకువ, నారిని ఆకర్ణాంతం లాగబోవడంలో చూపిన అంగవిన్యాసం సమ్మోహనకరంగా తోచాయి. అవలీలామానుష విగ్రహుడుగా గోచరించాడు .... 'ఈయన మా అన్నగారు' అనుకున్నాడు లక్ష్మణుడు.

శివ ధనుర్భంగ గర్జనను మించిన జయఘోషతో లక్ష్మణుడు ప్రకృతం లోకి వచ్చాడు. రఘుకులానికి, రాముడికీ, మిథిలాపతికి, మైథిలికీ జయాలను, శుభాలను ఆకాంక్షిస్తూ వారిని కీర్తిస్తూ అప్పుడే తెప్పరిల్లిన సభికులు చేస్తున్న జయధ్వానాలతో హర్షధ్వానాలతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. శివుడి విల్లు విరచిన ఈ నల్లటివాడి ఘనతను వందిమాగధులు ఉత్సాహంగా అనర్గళంగా గానం చేస్తున్నారు. లక్ష్మణుడు సగర్వంగా సభనంతా కలయజూశాడు.

ఎదుట జనకరాజు ఉత్సాహంతో ఉప్పొంగిపోతూ 'రామా! ఇటు రా నాయనా' అన్నాడు, తాను ఒక మెట్టు దిగుతూ.

విశ్వామిత్ర సమేతుడై రఘురాముడు ఒక అడుగు ముందుకు వేసేవరకూ మరోసారి హర్షధ్వానాలు చెలరేగాయి. జరగబోతున్నదేమిటో అందరికీ తెలుసు. జరగబోతున్నది అందరికీ ఆనందకరమైనదని కూడా అందరికీ తెలుసు. మనసులో పదే పదే అనుకొంటున్న ఆ మంచి మాట, అనవలసిన మనిషి నోట రాగా చెవులారా వినాలని అంతా చంద్రుడి కోసం చాతకపక్షులలా ఎదురుచూస్తున్నారు.

జనకమహర్షి అంజలి ఘటించాడు. "పూజ్య విశ్వామిత్ర మహర్షీ! మీ శిష్యుడు, నా అనుంగు మిత్రుని పుత్రుడు అయిన ఈ దశరథరాముని పరాక్రమాన్ని కన్నులారా చూచి ఆనందించాను. అసంభవము, అసాధ్యము అనుకున్న ఈ రుద్రధనుర్భంగం మేము ఊహించనంత అద్భుతంగా జరిగింది. నాకు బహిఃప్రాణమైన సీతను వీరశుల్క ప్రతిఫలంగా ఇవ్వ సంకల్పించాను. ఇపుడు ఈ విధంగా దాశరథిని భర్తగా పొందుతున్న మా జానకి, విదేహవంశానికే కీర్తిప్రతిష్ఠలు సమకూర్చుతున్నది. ఓ మహర్షీ! ఈ పురుషోత్తముడు రామచంద్రుడికి నేను నా కుమార్తె, సుగుణాలపేటి సీతావధూటిని కన్యాదానం చేయ సంకల్పించాను" అంటూ జానకిని దగ్గరకు తీసుకొని జలకలశం అందుకోబోయాడు జనకమహారాజు.

హర్షధ్వానాలతో మంగళవాదాలతో సభ మార్మోగింది.

రామచంద్రుడు ఒక్కమారు విశ్వామిత్ర మహర్షి వంక చూచి వినయంగా తల వంచుకున్నాడు.

"మా తండ్రిగారి అనుమతి లేనిదే పాణిగ్రహణం సంభావ్యం కాదు గదా" అన్నాయి రాముడి చూపులు.

"ఔనౌను. ఈ ఆనందోద్వేగ సమయంలో కూడా ఎంతటి స్థిమితమయ్యా నీకు" అంది ముహూర్తకాలం పాటు సౌమిత్రి వదనంలో తొంగిచూచిన గౌరవ భావరేఖ.

'అది న్యాయమే. అవశ్యకరణీయమే' అని ఆమోదించింది గురువుగారి మనస్సు.

పరేంగితజ్ఞులయిన ప్రభువు, జనకరాజర్షికి రామహృదయం అవగతమైంది. జనకసుత సీత కూడా ఈ ధర్మాన్ని గ్రహించిందని, ఆమె చెంపలకెంపుల వెలుగులోనే అధరాగ్రాన లీలగా గోచరించి మాయమైన మందహాస రేఖను చూచి రాముడు అవలీలగా గ్రహించాడు.

సభలో హర్షధ్వానాలు స్థిమితపడేవరకు ఈ కర్తవ్య నిదాన, నిర్ణయాలు జరిగిపోయాయి.

☆ ☆ ☆

"కావున ఓ బ్రహ్మజ్ఞాన సంపన్నుడా! ఈ శుభ వర్తమానాన్ని దశరథ మహారాజుకు అందజేసి వారిని ఆహ్వానించడానికై నా మంత్రులను అయోధ్యకు పంప సంకల్పించాను. ఇందుకు తాము అనుమతించవలెను" అన్నాడు జనకమహారాజు.

☆ ☆ ☆

జనక నృపతి పురోహితుడు శతానందుడు దారి చూపగా విశ్వామిత్రుడు, రామచంద్రుడు, ఆ వెనుక సౌమిత్రి విడిదికి బయలుదేరారు.

ఈసారి దారి వేరు.

తాము మిథిలానగరం వచ్చిన వేళ జనకమహారాజు యాగశాలలో వున్నాడు. ఆహూతులతో నగరం కోలాహలంగా వుంది. రథాలతో వీధులన్నీ నిండివున్నాయి.

"మహర్షీ! మనకు ప్రశాంతమైన స్థలంలో నివాసాన్ని చూడండి" అని రాముడు కోరాడు.

విశ్వామిత్రుడు చూపిన బసలో విడిది చేసిన వేళ, శివధనుస్సును చూడవచ్చిన మరిద్దరు రాకుమారులు...

"ఆ నల్లనివాడే విల్లు విరచిన రాముడట" అంటున్నారు ఎవరో....

"వాళ్ళు మొత్తం నలుగురన్నదమ్ములు.... రాముడి వెంట ఉన్న తేజోవంతుడే..."

"వంధిమాగధుల స్తుతిపాఠాలు ఇవాళ శ్రుతి మధురంగా, అతి సహజంగా వినిపించాయి సుమీ!"

"దాదాపు అతిశయోక్తులు దొరకక అవస్థ పడ్డారట. ఎంత చెప్పినా వాళ్ళకే తృప్తి లేదనుకున్నారు ఇందాక."

"విశ్వామిత్ర మహర్షి వీళ్ళను వెంట బెట్టుకు వచ్చాడు. ధనుర్వేదం అంతా ఉపదేశించాడట."

"అయ్యా వందిగారూ.... ఇందాక మీరు గానం చేసినపుడు రాముడి పేరుతో ప్రాస వేసిన మిగతా మూడు మాటలు ఏమిటండీ–"

"అలా వెళ్ళవయ్యా. వెళ్ళి ఆయన ఎదుట నిలబడు. మాటలు వాటంతట అవే వస్తాయి. ధారాళమైన కవితాశక్తి అబ్బుతుంది."

'శతానందుల వారి తల్లి అహల్యాదేవికి శాప విముక్తి ప్రసాదించిన రామ పాదాలు అవే. నమస్కరించు నాయనా! నమస్కరించు.'

ఈ మాట విన్నపుడు రామ పాదాల మహిమ వల్ల సంభవించిన ఒక రమణీయ సన్నివేశం లక్ష్మణుడి మనస్సులో మెరసింది.

అహల్యా గౌతమ మహర్షుల వద్ద సెలవు తీసుకొని, మిథిలకు ప్రయాణం కొనసాగిస్తూ ఉండగా గంగానది తీరాన తామంతా విశ్రమించారు. మరునాడు ఉదయం నదిని దాటడానికి పడవ ఎక్కబోయే వేళ ఈ రామపాదమే పేచీ తెచ్చి పెట్టింది. పడవవాడు ఒక్క నమస్కారం పెట్టి వెళ్ళిపోబోయాడు.

"ఏమయ్యా గంగ దాటించవా?" అన్నారు విశ్వామిత్రులవారు.

"స్వామీ, మీ వెంట ఉన్న ఆ నల్లనాయన పాదధూళి సోకితే రాళ్ళు ఆడవాళ్ళుగా మారుతున్నట్టు విన్నాను బాబూ! నాకున్నదల్లా ఒక్కటే పడవ. ఇపుడాయన కాలు మోపగానే ఇది ఇంకో ఆడదిగా మారిపోతే నా గతేం కాను?.... నన్ను దయ చూడండీ" అన్నాడా పడవవాడు గడగడ వణుకుతూ.

అందరికీ నవ్వు వచ్చింది "భయపడకయ్యా! అలాంటిదేమీ జరగదులే" అన్నారు విశ్వామిత్రులవారు నెమ్మదిగా నవ్వుతూ.

"అదుగో తనలో తాను నవ్వుకుంటున్నాడే.... అందగాడు. ఆయనే లక్ష్మణుడు. సుమిత్రాదేవి కుమారుడు."

"అపర విష్ణువులా ఉన్న ఆ చిన్నవాడికి ఊర్మిళాదేవి నిచ్చి పెళ్ళి చేస్తేనో...."

జనవాణి అని ఆనందిస్తున్న సౌమిత్రి ఉలికిపడి, చుట్టూ చూచి తల వంచుకొని అడుగు చురుకుగా వేసి అన్నకు దగ్గరగా వెళ్ళాడు.

అన్ని కక్ష్యలూ దాటి, సింహద్వారం సమీపించేసరికి రథం ఆయత్తం అయి ఉంది. అక్కడ రామదర్శనం కోసం వేచి ఉన్న వేలాది జనులు జయధ్వానాలు చేశారు.

రాముడు అందరికీ నమస్కరించి రథం ఎక్కాడు.

దశరథమహారాజుకు జనకుడి శుభవర్తమానం అందజేయబోయిన దూతలు మూడు పగళ్ళు, హుటాహుటిగా ప్రయాణం చేసి అయోధ్య చేరుకొన్నారు. చేరిన వెంటనే రాజదర్శనం సంపాదించారు.

తేజస్వి అయిన చక్రవర్తిని చూచి అంజలి ఘటించి తమను పరిచయం చేసుకొన్నారు. ఆ స్నేహమయుడి ప్రియవాక్కు విని ధైర్యం తెచ్చుకొని మాట్లాడారు. రామలక్ష్మణుల క్షేమం తెలిపారు. శివచాప ఖండనోదంతాన్ని విన్నవించారు. జనకమహర్షి హృదయాన్ని, కల్యాణ సంకల్పాన్ని నివేదించారు.

దశరథ మహారాజు సంతోషంతో ఉప్పొంగిపోయాడు. తమ ఉపాధ్యాయులు వసిష్ఠ వామదేవుల ఆమోదంతో, మర్నాడే మిథిలకు ప్రయాణం కావాలని నిశ్చయించాడు.

ధనకనక వస్తువాహనాలతో ప్రయాణానికి సర్వం సిద్ధమైంది. వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, దీర్ఘాయుష్మంతుడు మార్కండేయుడు, కాత్యాయనుడు మొదలగువారు ముందు నడువగా దశరథ మహారాజు భరత శత్రుఘ్నులతో, భార్యలతో

ఇతర బంధు మిత్రులతో నాలుగు పగళ్ళు ప్రయాణం చేసి మిథిలాపురి చేరుకున్నారు.

ఈ సప్తాహాలూ రామలక్ష్మణులు పుణ్యకథా శ్రవణంతో శ్రుతకథా పునశ్చరణంతో కాలక్షేపం చేశారు. విశ్వామిత్రుడి వెంట నిత్యమూ యాగశాలకు వెళ్ళి అక్కడికి వచ్చిన ఋషులను దర్శించి సద్గోష్ఠి నెరపారు. విడిదిలో ఉన్నపుడు, సిద్ధాశ్రమం నుండి తాము మిథిలకు సాగించిన ప్రయాణంలో రాత్రివేళ విశ్వామిత్ర మహర్షి చెప్పిన గాథలను.... కుశ వంశీయుల కథ, గంగావతరణం, కుమార సంభవం, సాగరచరితం, సముద్ర మథనం మొదలైనవాటిని చర్చించి లోకవృత్తాన్ని ఆకళింపు చేసుకున్నారు.

దానవులను సంహరించి సాధుజనులను సంరక్షించడానికి శ్రీ మహావిష్ణువు ఎత్తిన అవతారాల కథలు చెప్పుకొన్నారు.

అక్కడ జనకరాజు అంతఃపురంలో కూడా ఈ యేడురోజులూ పుణ్యకథలే వినిపించాయి. అక్కడ పుణ్యకథానాయకుడు ఒకడే. పురుషోత్తముడు రాముడు. చెలులూ, చెల్లెళ్లూ కూడా జానకికి ముప్పొద్దులా రామకథలే చెప్పారు. చెప్పిన కొద్దీ ఊరేవి; ఊరిన కొద్దీ ఊరించేవి.

☆ ☆ ☆

దశరథ మహారాజు వస్తున్నాడన్న వార్త రాగానే జనకుడు ఉపాధ్యాయ, మంత్రి పరివార సమేతుడై కాబోయే వియ్యంకుడు అయోధ్యా నగర చక్రవర్తికి ఎదురేగి స్వాగతం చెప్పాడు. వారందరినీ యజ్ఞశాలకు తీసుకు వచ్చి మర్యాదలు చేశాడు.

"ఓ రాజా! తాము మా భూమికి రావడము నా భాగ్యము. వశిష్ఠాది మహర్షులంతా కూడా ఈ శుభకార్య సందర్భంగానైనా ఇటు రావడము నా సుకృత ఫలమనే తలుస్తున్నాను. ఓ రాజా! రామచంద్రుడి పరాక్రమ విభవం తామూ మేము కూడా గర్వించవలసినది. రఘువంశము వారితో ఈ విధంగా మేము వియ్యమాడుతున్నందువల్ల మా వంశ ప్రతిష్ఠ ఇనుమడిస్తున్నది. రేపు యాగం సమాప్తం కాగానే, వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షుల ఆశీర్వచనంతో తమ ఆమోదంతో సీతారాముల కల్యాణం జరిపించవలెనని సంకల్పించాను" అన్నాడు జనకుడు.

దశరథుడు మహదానందహాసం చేశాడు.

"రాజర్షీ! ఇపుడు దాతలు తాము. అందువల్ల దానము మీ సంకల్పం ప్రకారం ఉంటుంది. తాము ఏమి యిస్తామన్నా ఎప్పుడు ఇస్తామన్నా అందుకోవడమే మా వంతు" అన్నాడాయన.

ఈ ప్రియ వచనానికి జనకరాజర్షి, అక్కడి పెద్దలు అంతా ఎంతో సంతోషించారు.

ఆ రాత్రి దశరథుడు సూర్య చంద్రుల వంటి పుత్రులిద్దరినీ తన వద్ద కూర్చోబెట్టుకొని, వారి వనజీవన యాత్రా విశేషాలను గుచ్చి గుచ్చి అడిగి తెలుసుకొన్నాడు. సద్గుణ నిధి రాముడు వినమ్రతతో స్వీయ ప్రతాపాన్ని ప్రస్తావించని సందర్భాలలో తండ్రి తన చిన్న కుమారుడి వంక చూచేవాడు. లక్ష్మణుడు నవ్వి, ఆయా విశేషాలను, అన్నగారి ప్రజ్ఞాప్రాభవాలను మహోత్సాహంతో వర్ణించి చెప్పేవాడు.

ఈ విధంగా ఆ రాత్రి ఉత్సాహవంతంగా గడిచిపోయింది.

☆ ☆ ☆

మరునాడు యజ్ఞకాండ నిర్ణీత ప్రకారం పూర్తి కాగానే, జనకుడు సాంకాశ్య నగరములో వున్న తన తమ్ముడు కుశధ్వజుడిని పిలిపించాడు. ఆయన రాగానే ఉపాధ్యాయ సమేతుడై కొలువు తీరాడు. వివాహ ముహూర్తం నిర్ణయించ నిశ్చయించి అందుకై దశరథ మహారాజునూ, వసిష్ఠ విశ్వామిత్రులనూ ఆహ్వానించవలసిందిగా తన మంత్రి సుదామనుణ్ణి పంపించాడు.

పురోహితులు, హితులు, పుత్రులూ వెంటరాగా దశరథుడు జనక సదనానికి వెళ్ళాడు. స్వాగతాది మర్యాదల అనంతరము ఇక్ష్వాకుల కులగురువు, దైవము అయిన వసిష్ఠ మహర్షి, ఇక్ష్వాకు వంశ సంభవాన్ని, ఆ వంశానికీ, వారేలిన నేలకూ కూడా కీర్తి ప్రతిష్ఠలు చేకూర్చిన రాజుల రారాజుల చరిత్రను వివరించాడు.

"జనక చక్రవర్తీ! ఇక్ష్వాకు వంశీయులంతా మహా పరాక్రమవంతులు, పరమ ధార్మికులు. నీవు వీరితో వియ్యమందడం అందరికీ హర్షం కలిగిస్తుంది. ద్యుతిమంతులు, ధృతిమంతులు అయిన మా రామలక్ష్మణులకు మీ రామ సీత, ఊర్మిళలు అన్ని విధాలా ఈడూ జోడూ అయినవారు" అని వసిష్ఠ మహర్షి చెప్పాడు.

అప్పుడు జనక రాజర్షి వసిష్ఠుడికి వందనం చేసి, తన వంశ చరిత్రను విపులంగా విన్నవించాడు.

"మహర్షీ! సీత దేవకన్య. శివధనుస్సును ఎక్కుపెట్టిన మహా వీరునికే ఆమెను ఇచ్చి వివాహం చేయాలన్న నా సంకల్పం నెరవేరింది. ఇపుడు తాము, నా రెండవ కుమార్తె ఊర్మిళను లక్ష్మణుడికి ఇవ్వవలెనని హితవు చెప్పారు. మీ మాటను శిరసా వహించి, మనసా ఆ ప్రకారమే ఊర్మిళా లక్ష్మణులకు కూడా వివాహం చేస్తాను" అన్నాడు జనకుడు. ఆ విధంగా చెప్పి ముహూర్త నిర్ణయానికి ఉపాధ్యాయులను సంప్రదించాడు.

చిన్న కుమారుడి వంక వాత్సల్యముతో చూస్తున్న దశరథ మహారాజును చూచి, 'ఓ రాజా! తాము రామలక్ష్మణుల వివాహాలకు నాందీకార్యాలను జరిపించాలి. ఈ రోజు మఖా నక్షత్రము. ఎల్లుండి ఉత్తర ఫల్గుణీ నక్షత్రం. వివాహానికి శుభస్కరమైన వేళ' అన్నాడు జనకుడు.

వసిష్ఠుడూ, విశ్వామిత్రుడూ ఈ వ్యవధిలో పరస్పరం సంప్రదించుకొని ఒక తీర్మానానికి రావడం లక్ష్మణుడు గమనించాడు. వారికి తోచిన ఊహను అతడు ఊహించుకొని ఆనందించాడు. క్రీగంట రాముడి వంక చూచి, 'నవ్వు ఎందుకు' అన్న అన్నగారి చూపు చూచి తలవంచుకొన్నాడు.

'నేను విశ్వామిత్రులూ ఆలోచించిన విషయం ఒకటి ఉంది' అంటున్నారు, వసిష్ఠులవారు.

పరేంగితజ్ఞుడు జనకుడు తక్షణం తన తమ్ముడు కుశధ్వజుడి వంక సాభిప్రాయంగా చూచాడు.

"జనకరాజా, నీ సోదరుడు కుశధ్వజుడు వీరుడు. ధార్మికుడు. ఆయన కూడా, మీతోపాటుగా రఘువంశీయులతో వియ్యమాడడం అన్ని విధాలా సమంజసమైనది. కుశధ్వజుడి కుమార్తెలు మాండవీ శ్రుతకీర్తులు ఇద్దరూ అసమాన లావణ్యలు. రామానుజులైన భరత శత్రుఘ్నులు ఇద్దరూ పరాక్రమశాలులు. తేజోవంతులు. వీరికి అన్ని విధాలా యోగ్యులైన వరులు. వీరిని వారికి వరిస్తున్నాము. దిక్పాలకుల వంటి

దాశరథులు నలుగురికీ మీ అన్నదమ్ములిద్దరూ మీమీ కుమార్తెలను ఇచ్చి వివాహం చేసి మీ రెండు వంశాల వారు బాంధవ్యం కలుపుకోవడం శుభప్రదం" అన్నాడు వసిష్ఠుడు.

జనక మహారాజు, కుశధ్వజుడూ ఈ విషయం ఆలోచించి, వెంటనే ఆమోదించారు.

మహర్షులకు అంజలి ఘటించారు. "మీ ఆజ్ఞ మాకు కల్యాణప్రదమైనది. సంతోషంగా మేము శిరసావహిస్తున్నాము. ఎల్లుండి ఉత్తర ఫల్గుణీ నక్షత్రం. ఒక్క ముహూర్తంలోనే నలుగురి వివాహాలు జరగాలని మేము కోరుతున్నాము" అన్నారు.

వసిష్ఠ విశ్వామిత్రులూ, శతానందాది విప్రవరులూ ఈ వాక్యాన్ని ఆమోదించారు. లోకోత్తరమైన ఈ కల్యాణ సంకల్పాన్ని శ్లాఘించారు.

☆ ☆ ☆

జనక మహారాజు, కల్యాణవార్తను తెలుపుతూ శుభపత్రికలు నలుమూలలకూ పంపాడు. దేశం నలుదిశలా ఈ వార్త ప్రకటన చేయించాడు. పౌర్ణమినాటి సముద్రంలా దేశంలో ఉత్సాహం పొంగి పరవళ్లు తొక్కింది. వెన్నెలలా సంతోషం వెల్లివిరిసింది. రామచంద్రుడి కీర్తిలా దశదిశలా వ్యాపించింది.

అతిశయోక్తులను అతి సామాన్య పదాల స్థాయికి దించే స్థాయిలో వాడవాడలా వీధివీధులా అలంకరణలు జరిగాయి. మిథిలా నగరమే ఒక విశాలమైన వివాహ వేదికలా శోభాయమానంగా భాసించింది.

దశరథ మహారాజు పుత్రుల వివాహానికి నాందీకాండనంతా శాస్త్రోక్తంగా జరిపించాడు. ఆరోగ్యవంతాలైన నాలుగు లక్షల గోవులను తెప్పించి వాటి కొమ్ములకు బంగారు తొడుగులు వేయించాడు. పాలు పిండుకోవడానికి కంచుపాత్రలు సమకూర్చి, వత్సాలతో సహా ఆ ధేనువులనూ, విశేషంగా ధనాన్ని దానం చేశాడు. ఉత్తర ఫల్గుణీ నక్షత్ర దివసోదయాన, విజయముహూర్తంలో పుత్ర కళత్ర బంధు మిత్రులతో బయలుదేరి, వసిష్ఠాది మహర్షులను ముందుంచుకొని మంగళవాద్యాలతో భేరీ తూర్య నాదాలతో జయదుందుభి ధ్వానాలతో వైభవంగా జనకమహారాజు యజ్ఞవాటికకు చేరాడు. మంగళస్నానాలాచరించి, శ్రేష్ఠమణిభూషణాలతో అలంకరించుకొని కల్యాణ కంకణ ధారణచేసిన రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు నలుగురూ తండ్రి కిరువంకలాచేరి బ్రహ్మదేవుడిని సేవిస్తున్న దిక్పాలకులవలె, విభవాన్ని ఇనుమడింప చేస్తున్న సుగుణాలవలె నిలచారు.

వసిష్ఠుడు యాగశాలలోకి వెళ్ళి, పెళ్ళి కుమారులు తరలి వచ్చారనీ, దశరథ మహారాజు కన్యాదాత రాకకై ఎదురు చూస్తున్నాడని జనకునికి హెచ్చరిక చేశాడు.

జనక చక్రవర్తి సరస దరహాసంతో, 'ఓ పూజ్యుడా! ఇదేమి రాయబారము?' అన్నాడు. "దశరథ మహారాజుకు ఈ సీమలో అడ్డేమిటి? ఆయన ఒకరి ఆజ్ఞకోసం ఆగడమేమిటి? ఈ రాజ్యం ఆయనది కాదా? ఇంకా ఆలస్యమెందుకు? నా కన్యలు నలుగురూ, ఇదుగో అలంకృతలై, దీపకలికలవలె వేదిక వద్ద కూర్చొని ఉన్నారు. వారిని వెంటనే తీసుకురండి" అన్నాడాయన.

అపుడు వశిష్ఠుడు దశరథ మహారాజును, పెళ్ళికొడుకులను, ఋషులనూ, వివాహ వేదిక వద్దకు తీసుకువచ్చాడు.

పచ్చని కొబ్బరి ఆకులతో వేసిన చక్కని విశాలమైన పందిరి క్రింద శాస్త్రోక్తమైన వివాహవేదిక నిర్మించి ఉంది. గంధ పుష్పాదులతో, నవాంకురాలతో అలంకరించిన బంగారు పోలికలూ, నానా వర్ణ రంజితాలు అయిన కుంభాలూ, ధూపదీపాలు అమర్చే స్తంభాలూ, శంఖాలవంటి చిత్రవిచిత్ర రూపాలలో ఉన్న కలశాలూ, ఇంకా అర్ఘ్యజలం, అక్షతలూ, ఫలాలు ఉంచిన రకరకాల పళ్ళేరాలూ ఆ వేదిక చుట్టూ అందంగా అమర్చారు. ఇవి కాక, అక్కడ కూర్చున్న మహర్షులవల్ల ఆ వేదిక తేజోవంతంగానూ, చుట్టూ చేరిన ఆనందోత్సాహాలతో కల్యాణ శోభాయమానంగానూ రాజిల్లింది.

జనకమహారాజు ప్రార్ధన పురస్కరించుకొని వసిష్ఠుడు విశ్వామిత్ర శతానందోపాధ్యాయులను ముందుంచుకుని వివాహకాండ ఆరంభించాడు. వేదిక మధ్య అగ్నిహోత్రాన్ని వీర్వరచాడు. శాస్త్ర విహితంగా దర్భలు పరచాడు. సమంత్రకంగా హోమం చేశాడు. అపుడు జనకుడు లేచి సీతవంక చూశాడు. మధుపర్కాలు ధరించి మనోజ్ఞ భూషణాలతో అలంకరించుకొన్న జానకి, వేదంలా మహద్వంతమైన, వెన్నెలవలె తెల్లనైన, ప్రియవచనంవలె మధురమైన మందహాసం చల్లగా ప్రవర్తిస్తూ సాక్షాన్మహాలక్ష్మిలా గోచరించింది.

సుహాసిని సీతను జనకుడు అగ్నిహోత్రం వద్దకు తీసుకుని వచ్చాడు. ఆ పైన రామచంద్రుడిని ఆహ్వానించాడు.

అక్కడ నీలమేఘ శ్యాముడు రాముడు అగ్నిహోత్ర కాంతులలో అద్భుతుడై గోచరించాడు. పురుషోత్తముడై ప్రకాశించాడు. సాక్షాత్పరాత్పరుడే నిలచాడనిపించాడు. ఆయనను కన్నతండ్రి దశరథుడు, కన్నెనిస్తున్న జనకుడు, విద్య ప్రసాదించిన విశ్వామిత్రుడు, కులపతి వసిష్ఠుడూ అతని అనుంగు సోదరుడు లక్ష్మణుడు కూడా ఆ వల్లని పెళ్ళికొడుకులో అద్వితీయమైన తేజాన్ని దర్శించి ముహూర్తకాలం పాటు విభ్రాంతులై కర్తవ్యజ్ఞానం కోల్పోయారు. ఏకకాలంలో అత్యంత దర్శనీయుడుగానూ, సత్యంవలె దుర్నిరీక్ష్యుడుగానూ ప్రకాశించిన లోకైక మంగళ విగ్రహుడిని చూచి, చూడలేకా గ్రహించలేకా అనుభవైక వేద్యమైన ఆనంద స్థితిని అందుకున్నారు. క్షణం తరువాత, ఈ లోకోత్తరుడి లోకకల్యాణ కార్యక్రమంలో తామీ భూమికలు నిర్వహిస్తున్నారన్న తలపు రాగానే వారందరికీ శరీరాలు పులకలెత్తాయి.

☆ ☆ ☆

కమలపత్రేక్షణుడు రాముడు మధుమధుర మందహాసం చేశాడు. ముహూర్తం మించిపోతూందని గ్రహించి జనకమహారాజు జలకలశం పైకెత్తాడు.

"ఇయం సీతా–" అన్నాడాయన సముద్ర గంభీరస్వరంతో.

కమలలోచనాలు పద్మదళాయితాక్షివంక చూశాయి.

జనకుని సరసత్వం లక్ష్మణునికి ఆహ్లాదం కలిగించింది. "ఇదేనయ్యా సీత... నీవు సిద్ధాశ్రమం నుండి మిథిల వచ్చేదాకా, శివ ధనుర్భంగం చేసిన ముహూర్తం నుండి ఈ శుభ ఘడియదాకా, ఎప్పుడు చూస్తానని ఆరాటపడుతున్న సీత యిదేనయ్యా" అంటున్నది జనకుడి వాక్యం.



"–మమ సుతా" అన్నాడు కన్యాదాత.

"కన్య ఘనతకు ఆ ఒక్కముక్క చాలుగదా – జనకసుతకావడం" అనుకున్నారు సభ్యులంతా.

"లక్ష్మీదేవిని శ్రీ మహావిష్ణువుకు ఇవ్వగలుగుతున్న భాగ్యశాలి" అన్నుకున్నారు.

జ్ఞాని జనకుడు మాత్రం తన భూమిక గురించి దురభిప్రాయపడలేదు. "మా లక్ష్మి సాక్షాత్తూ మహాలక్ష్మి. ఈమెను నీకు ఒకరివ్వడం ఏమిటి, నీవే గ్రహించాలి" అని ధ్వనించిందాయన ఉచ్చరించిన 'పాణీగృహ్ణీష్వ పాణినా' అన్న వాక్యార్థం; అందరి హృదయాలలోనూ...

ఆపైన మామగారుగా ఒప్పగించి, దీవించాడు. "నాయనా రామా! నా కూతురు నీకిక సహధర్మచారిణి. నీవెంట నీ నీడలా ఉంటుంది. ఈమె చేతిని పట్టుకో. నీకు శుభం అవుతుంది" అంటూ సమంత్రకంగా శ్రీరాముడి చేతిలో నీళ్ళు వదిలాడు జనకుడు.

మంగళవాద్యాలు మిన్నంటాయి; మింట దేవదుందుభులు మ్రోగాయి. పందిరి శుభాక్షతలను కురిసింది. ఆకాశం దివ్యాక్షతలను కురిసింది. దివీ, భువీ కూడా ఒకటై దంపతులను దీవించాయి.

లోకమంతా హర్షపులకాంకితం అయింది.

జనకుడు వెంటనే లక్ష్మణుడిని పిలిచాడు. "నాయనా లక్ష్మణా! నీకు శుభమవుతుంది. వెంటనే వచ్చి, ఇదిగో మా ఊర్మిళ చేతిని చేబట్టు.... ఓ రఘునందనా! భరతుడా! నీవు మాండవి కరాన్ని పరిగ్రహించు. మహాబాహూ! శత్రుఘ్నా! నీవు శ్రుతకీర్తి హస్తాన్ని పట్టుకో. ఓ రఘుకుల దీపకులారా! మీరంతా ఇపుడు అగ్ని సాక్షిగా గ్రహిస్తున్న మీ భార్యలతో సౌమ్యులై ధర్మపథం తప్పక చరించవలసింది" అన్నాడు.

శ్రీ రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు నలుగురూ సీత ఊర్మిళ మాండవీ శ్రుతకీర్తుల చేతులు పట్టుకుని అగ్నికి, వివాహ వేదికకు, చక్రవర్తులిద్దరికీ, మహర్షులందరికీ ప్రదక్షిణం చేశారు. వారికి నమస్కరించారు. పిమ్మట వేదికపై కూర్చున్నారు. తిరిగి శాస్త్రోక్తంగా కన్యాదాన, పరిగ్రహణాదికాలు జరిగాయి. ఆ వధూవరులు చేతులు పట్టుకొని ముమ్మారు అగ్నికి ప్రదక్షిణం చేసి వందన మాచరించారు. పూలవాన కురిపించారు. గంధర్వులు స్పృహణీయమైన మాధుర్యాన్నంతా గానంలోకి అనువదించి భువికి దించారు. అప్సరసలు ఆనందాతిశయంతో నర్తించారు.

విజయ దుందుభులు, తూర్యనాదాలు మరొకమారు దశదిశలా మారుమ్రోగాయి.

రఘురాముడు తన దక్షిణ హస్తంతో సీతావధూటి పాణి పల్లవాన్ని మృదువుగా అదిమాడు.

ఆ పరమకల్యాణి మందహాసం, సిగ్గు దొంతరలలో అందంగా కలిసిపోయింది. సీతారాముల మధ్య ఆ క్షణార్ధంలో జరిగిన ఈ రహస్య మధురసరాగవృత్తం, నేటికీ వధూవర కరకమలాలలో పునఃపునరావృతం అవుతూనే వుంది. లోకమంతటా పాణిగ్రహణ మధురక్షణాల వేళ వధూవరులంతా సీతారాముల ఈ అనురాగాన్ని ప్రస్తరిస్తూ వారిని స్మరిస్తూ తరిస్తూ ఉన్నారు.

★ ★ ★

# సరస రమణీయం




హిందీ సినిమాను ఆంధ్ర ప్రేక్షకులకు అనువదించి పెడుతున్న దుబాసీ –

'ప్రేమ అనగానేమి' అని గంభీరంగా ఒక ప్రశ్నవేశాడు. అతనే జవాబు కూడా చెప్పాడు. 'ప్రేమ అనగా రొండు హృదయములు ఒకే పన్థాన నడచుట!'

రూపాయి టిక్కట్టు మీద కూచున్న వీర్రాజు పక్కనున్న రామారావును మోచేత్తో పొడిచాడు. "చూశావురా రాముడూ! ప్రేమ అనగా రెండు హృదయములు ఒకే పంథాన నడవటం. నీకు మీ మామయ్యంటే అసహ్యం. సీతకీ మీ మామయ్యంటే రోత. అందుకనే నువ్వు సీతను చేసుకోవాలి" అన్నాడు.

"సీతకేమన్నా నువ్వు లాయరువా యేవిట్రా – ప్రాణాలు తోడేస్తున్నావ్ – వెధవ సొదా నువ్వూను. నువ్వు వెయ్యి చెప్పు. లక్ష చెప్పు, నేను సుబ్బుల్ని తప్ప ఇంకోర్తిని చూడను" అన్నాడు రామారావు.

వెనకాల ప్రేక్షకులకి తెరమీద గాథ పట్ల ఆసక్తి హెచ్చుగా వుంది. రాముడు అనే కుర్రవాడు సీత అనే చిన్నదాని బదులు సుబ్బులు అనే పిల్లని పెళ్ళాడటం సబబా బేసబబా అనే మీమాంసను ప్రేక్షకలోకం యేమంత పట్టించుకోదలచలేదు. అందుకని వెనకవారూ, ముందువారూ, ఎడవారు, పెడవారూ కూడా 'ష్' అన్నారు మర్యాదగా.

తెరమీద కొత్త దృశ్యం వచ్చేసింది పూర్తిగా. అంతకు ముందే ఓ పిల్ల దగ్గర చీవాట్లు తిన్న హీరో యీ దృశ్యంలో యింకోపిల్ల వెంట పడ్డాడు. ఈవిడే అసలు హీరోయిన్.

"ఏదైతేనేంలే అనుకున్నాడు ప్పాపం" అన్నాడు దుబాసీ గంభీరంగా.

"చూశావురా రాముడూ – ఏదైతేనేం అనుకున్నాడట పాపం – ఏం చేస్తాడు చెప్పు. సుబ్బులైతేనేం – సీతయితేనేం – అందుకని సీతనే చేసుకో – మీ మావాఁ, ఊళ్ళో జనం సంతోషిస్తారు" అన్నాడు వీర్రాజు మళ్ళీ.

"మతేమైనా పోయిందా నీకు! సినిమా హాల్లో కూచుని యిదేం గోలరా? తరిమేస్తారు."

"నీకు తెలీదురా. సీత హృదయం నీకోసం సూర్యుడి కోసం పద్మం వలే మధనపడిపోతోంది.... ఒరేయ్ రావుడూ, నల్లులు తెగ కుట్టేస్తున్నాయిరా!"

"కాంప్లిమెంటరీ గాడి వనుకున్నాయి గాబోలు. అగ్గిపుల్ల వెలిగించి టిక్కెట్టు చూపించు, పోతాయి" అన్నాడు రామారావు సాఫీగా, తాపీగా.

రామారావు చలనచిత్ర పరిశ్రమకి మహారాజ పోషకుడు; సినిమా పత్రికలకు రాజపోషకుడు; ఆంధ్ర విశ్వవిద్యాలయానికి పోషకుడు. చిరకాల సాన్నిహిత్యం వల్ల చలనచిత్ర పరిశ్రమను అర్థం చేసుకున్నవాడు; సానుభూతిపరుడు; పరేంగితజ్ఞుడు. అందువల్లనే రూపాయి టిక్కెట్టు చూపిస్తే నల్లులు కుట్టవని అతనికి బాగా తెలుసు. 'సినిమాలు – నల్లులు' అనే విషయంపైనా, 'సినిమాలో నల్లులు' అనే విషయం పైనా అతడు సమగ్ర పరిశోధనలు జరిపి ఒక సిద్ధాంతం తయారుచేశాడు. సంగ్రహంగా దాని సారాంశం ఇది.

– 'పూర్వం సినిమా హాలులో నేల టిక్కెట్లు ఉండేవి. జనం చాపగుడ్డలు, గోనెబరకాలు తెచ్చుకుని కూర్చునేవారు. జంతికలూ, పకోడీలూ, పులిహోర, మరచెంబుతో మంచినీళ్ళూ తెచ్చుకునేవారు. ఆ పైన తాము కూర్చున్నచోటు చుట్టూ శాయశక్తులా ఉమ్మి వేసి ఒక కోటలా కట్టేవారు. దానివల్ల రద్దీ అట్టే వుండేది కాదు. విశాలంగా కూర్చుని, బోలెడు గాలి పీలుస్తూ, జంతికలు తింటూ, ఊసులాడుకుంటూ జనం సినిమా చూసేవారు. అందువల్ల పై తరగతులు అట్టే నిండేవి కావు. హాలు యజమానులు, సినిమా పరిశ్రమ వారూ ఇది చూసి యేమి బాగులేదనుకున్నారు. ఇలా అయితే పరిశ్రమ అభివృద్ధికీ, దేశాభివృద్ధికీ డబ్బు చాలదన్నారు.

అందులో ఆ రోజుల్లో సర్కారువారు రెండు దేశాలను పోషించి బాగుచేసే బాధ్యత వహించారు. అందుకని ఒక సమగ్ర పథకం – 'ఆదాయాభివృద్ధి పథకం' వేయబడింది. (పూర్వులకు కూడా పథకాలూ, ప్రణాళికలూ వేయడం తెలుసుననడానికి యిదొక నిదర్శనం. ॥రా॥) సరే, ఆ పథకం ప్రకారం నేల ఉన్నచోట్ల ఉత్త బల్లలూ, ఇంతకాలం ఉత్త బల్లలున్నచోట్ల జేరబడే బల్లలూ వేశారు. అక్కడికి మూడణాల తరగతీ, అరణాలదీ తొమ్మిదణాలదీ అయిందా! ఇంక ముప్పావలా వారికి కఱ్ఱ కుర్చీలూ, రూపాయి వారికి పేము కుర్చీలూ వేశారు.

ఈ పథకం జయప్రదం కావడానికి నల్లుల ప్రయోగం ప్రాతిపదిక. ఆ మాటకొస్తే పథకం పేరే "నల్లుల పథకం". నల్లబజారు మనిషికే పాఠాలు నేర్పి, సిగ్గుతో, భక్తిప్రపత్తులతో తలవాల్చేటట్లు చేయగలిగినంత రక్తదాహం కల జమాజట్టీల్లాంటి, శాండో ఫైల్వానుల వంటి నల్లులను మూడణాల టిక్కెట్టు బల్లలలో పుష్కలంగా వదిలిపెట్టారు. వీటి పని ప్రేక్షకుల్ని తోడేసి రక్తం పుచ్చుకుంటూ 'పై తరగతులకు పొండి పొండ'ని వేధించడమే. అరణాల తరగతిలో లాంఛనానికి నల్లులు వేశారు. ఇవి కాలీగా వుండి మూడణాల ప్రేక్షకుల్ని ఆహ్వానించడానికి ఉద్దేశించబడ్డాయి. (కొందరు ఆట మొదలెట్టాక దభీమని పిట్టగోడ దాటి అరణాల ఆసనాలు అలంకరించడం కద్దు.) పోతే తొమ్మిదణాలూ, ముప్పావలా – ఈ తరగతుల పట్ల హాలు యజమానుల కన్నా చిత్ర నిర్మాతలకూ, డిస్ట్రిబ్యూటర్లకూ, డైరక్టర్లకూ శ్రద్ధ యెక్కువ.

ఈ రెండింటి నిండా మధ్యతరగతి మహారాజులూ, యువరాజులూ క్రిక్కిరిసి కూచుంటారు. వీళ్ళు తిన్నగా ఉండరు. సినిమా చూసి నోరు మూసుకుని పోరు. కుడీ, ఎడమా, తెలుపూ, నలుపూ, మంచీ, చెడ్డా స్వయంగా ఆలోచిస్తారు. కథాగమనం కుంటుపడినచోట్లూ, డైరెక్టరు మహాశయుడు 'పప్పులో అడుగేసిన' సందర్భాలూ, మ్యూజిక్ దెబ్బతిన్న సమయాలు, సన్నివేశాలు 'పేలవంగా' తయారైన ముహూర్తాలూ, అసభ్య నృత్యాలూ, వీళ్ళు కనిపెట్టేసి పత్రికలకు అభిప్రాయాలు రాసేస్తారు. దానివల్ల ఆరునెలలకు ఆడే చిత్రం ఒక్కొక్కసారి ముచ్చటైన మూడో రోజునే డేరా ఎత్తేస్తుంది. పై కారణాల వల్ల, ఈ రెండు తరగతులకీ సమయస్ఫూర్తి, చురుకుదనం, ధైర్యసాహసాలూ, సినిమా పరిశ్రమ యెడల ప్రత్యేకాభిమానం కలిగి, యౌవనంలో వున్న నల్లుల్ని వదిలిపెడతారు. ఇవి ఎపుడు పడితే అపుడు కక్కుర్తి పడి రక్తం పీల్చవు. సినిమాలో అవకతవకలూ, చవట వేషాలూ, పొడుగు డ్యాన్సులూ ఉండి విసుగు పుట్టించే ప్రమాద భూయిష్ఠ సన్నివేశాలు వచ్చినపుడు, వెంటనే సమయస్ఫూర్తి గల ఈ నల్లులు ప్రతి మహారాజునీ, యువరాజునీ నాలుగు ప్రక్కల నుండీ తగులుకుని చురుకు చురుకుమని కుట్టేస్తాయి. వెంటనే వాళ్ళు వెనక్కి తిరిగి వాటిని వెతుకుతారు. ఈలోగా సినిమా సాగిపోతుంది. (దీనివల్ల యింకో ప్రయోజనం కూడా ఉంది. కొన్ని వివాదాస్పద విషయాలు బయలుదేరుతాయి – నల్లుల మూలంగా చూడబడని సన్నివేశాలలో, ఫలానా తార రైల్లోనో, జైల్లోనో కూచుని పాడుతున్నప్పుడు చారల జాకెట్టు తొడుక్కుందని కొందరు అభిప్రాయపడతారు. 'కాదు, సాదా నల్ల రవికా, అది ఏడుపు సీను' అని కొందరు వాదిస్తారు. పేచీలు వస్తాయి – పందెం వేస్తారు. దానికోసం మళ్లీ మళ్లీ వస్తారు. ||రా||)

పరే, యిక మిగిలిందల్లా రూపాయి టిక్కట్టు. దీనివల్ల సినిమాకు అట్టే ఆదాయం ఉండదు. కొత్త రోజుల్లో కొందరు డబ్బిచ్చి వస్తారు. ఆ తరువాత బావమరుదులూ, మేనమావలూ, ఛైర్మన్‌గారి కుటుంబం, యిన్‌స్పెక్టరు గారి తమ్ముడూ యిత్యాది శాల్తీలు కాంప్లిమెంటరీగా, అంటే వూరికే వచ్చేస్తాయి. ఈ తరగతిలో అట్టే నల్లులు ఉండవు. 'అదిగో చూశావా – ధనికుల తరగతిలో నల్లులు లేవు. ఎంత పక్షపాతం' అని యెవడేనా వేలెత్తి వెక్కిరించగలడనే ఉద్దేశంతో, ఉన్నాయంటే వున్నాయన్నట్టు లాంఛనానికి మూడేసి కుర్చీలకు రెండేసి ముసలి నల్లుల్ని వదుల్తారు. అయితే ఒక్క మినహాయింపు. ఇందులో కాంప్లిమెంటరీ జనం కూచునే కుర్చీలు కొన్ని గుర్తుగా వుంటాయి. వాటిలో మాత్రం నల్లులు పుష్కలంగా వుంటాయి. "ఆ హాలుకి మాత్రం ఇంక చచ్చినా వద్దు బాబూ" అనిపించేస్తాయి కాంప్లిమెంటరీ వాళ్ళచేత.'

రామారావు ఎంతో కష్టపడి పరిశోధన చేసి ఈ థీసిస్ రాశాడు. దీనికోసం చదువు మొదలైన చిల్లర విషయాలు కాస్త పక్కకి నెట్టివేసినందువల్ల ఇంటర్మీడియట్ లాగే బియ్యే కూడా అనేక దఫాలు తప్పాడు.

'అయితేనేంలే' అనుకున్నాడు రామారావు. ఇంత శ్రమ ఇపుడు పనికొచ్చింది. రామారావు సలహా పురస్కరించుకొని వీర్రాజు అగ్గిపుల్ల వెలిగించి ఆ వెలుగులో తన రూపాయి టిక్కట్టు చూపించాడు. తక్షణమే నల్లులు నాలిక్కరుచుకొని 'పొరపాటయింది క్షమించాలి' అని చెప్పి చక్కాపోయాయి పెద్దమనుషులకి మల్లె.

వీర్రాజు ఆశ్చర్యంతో గుండెలు బాదుకున్నాడు. "ఇంత తెలివుంది. నువ్వు సీతని చేసుకుంటే యింకెంత గొప్పవాడవవుతావో" అన్నాడు.

"ఏడిశావు గానీ మామయ్య సంగతీ, సుందరంగాడి సంగతీ కొంచెం ఆలోచించు త్వరగా" అన్నాడు రామారావు. రాజు ఆలోచించసాగాడు.

హఠాత్తుగా రామారావు లేచి నుంచున్నాడు. "ఒరేయ్! ఈ సినిమా యిక చూడలేనురా. చూసినకొద్దీ సుబ్బులు జ్ఞాపకం వస్తోంది. పోదాం పద" అన్నాడు. రాజు ఘొల్లున యేడుస్తూ లేచాడు. "అవుటు పాసులు అమ్మేద్దాం సగం రేటుకి" అన్నాడు బయటికి నడుస్తూ.

ఇది యిలా ఉండగా ముందర మూడణాల తరగతిలో రామన్న, భీమన్న అనే యిద్దరు తోడుదొంగలు నల్లుల్ని వేటాడుతున్నారు.

"సిట్టి అచ్చంగా యిలాగే వుంటది గదేస్" అన్నాడు రామన్న.

"ఔనేస్, నేనూ అదే సూతన్నా, యాడరా దీన్ని సూశాం అని. అవునుగాని సిట్టి కియాాల సీర తెత్తానన్నావ్ గందా ఏం చేశా?" అన్నాడు భీమన్న.

"ఏందోలే, ఇయ్యాల ఒవుడి మొకం చూశానో గాని – ఒక్క జేబు, మచ్చుకు ఒక్క జేబు దొరకలే."

"పోన్లే. కొత్త సైకిలు కొట్టుకొచ్చాం గందా, అది అమ్మేత్తే బాగానే కిడతదిలే" అని ఓదార్చాడు భీమన్న.

"మెల్లిగా ఊసులాడేస్."

ఇద్దరూ నోరు మూసుకుని సినిమా చూడసాగారు. హీరోయిన్ ఏడుస్తూనే ఏదో తింటోంది. "అవును గానీ అది తినేది ఏంటంటావ్ భీమన్నా. రొట్టా బిస్కోతా?" అన్నాడు రావుడు.

"తెల్దేస. పాటిగిరాపోడు బాగా పిలిం తీలే."

ఇంకో అయిదు నిమిషాలు సాగింది. తెర మీద ఓ పోలీసు తెగ ఆడిపోతున్నాడు. రావుడికి యెందుకో దిగులు పట్టుకుంది. కొంచెం భయం కలిగింది. "నెగు నెగేస్ – రేపు 'అంటర్ వాలీ కా బోటీ' కెల్దారి గాని ఇయ్యాలకు నెగు" అన్నాడు గబుక్కున.

భీముడు యిష్టం లేకపోయినా బలవంతాన లేచాడు తిట్టుకుంటూ. ఇద్దరూ బయటకొచ్చేశారు. సాయంత్రం బజారులోంచి కొట్టుకొచ్చిన సైకిలు రంగు గోకేసి యీ సినిమా కొచ్చారు ధీమాగా. ఇపుడా సైకిలు తీసుకుని బయలుదేరారు – స్వగ్రామానికి. అప్పుడే బయటకొచ్చిన రామారావు, వీర్రాజు కూడా ఒక సైకిలెక్కి ట్రంకురోడ్డు మీద బయలుదేరారు. బస్తీకి ఆరుమైళ్ళ దూరాన ఉంది వాళ్ల గ్రామం.

రామన్నకి వీళ్లని చూడగానే ముచ్చటేసింది. "బీవుడోయ్, చిలుకు చొక్కాలు, లిస్టువాచీలూరోయ్" అన్నాడు కన్ను మీటుతూ. భీమన్నకి సినిమా మధ్యలో లేచివచ్చినందుకు బాగా కోపంగా వుంది. 'సరేలే ఎక్కు. పొలిమేర దాటగానే అటకాయిద్దాం' అన్నాడు ఉదాసీనంగా.

రామారావు, వీర్రాజు ఝూంమని ట్రంకురోడ్డు మీద వెళ్లిపోతున్నారు. జనం యెవ్వరూ లేరు. ఫర్లాంగు దూరం వెనకగా దొంగరాముడూ, దొంగభీముడూ వెంటపడ్డారు. 'దొంగరాముడు ఎండ్‌కో' పేరెన్నికగల జేబుదొంగల కమ్ దారిదొంగల కంపెనీ. భీమన్నది అందులో 'ఎండ్‌కో' భాగం.

భీమన్న సైకిలు తొక్కుతున్నాడు, బుస్సుబుస్సుమని కోపం కక్కుతూ. రామన్న ముందు బారుమీద కూచున్నాడు.

"బండి బల్ పోతందే" అన్నాడు రామన్న. భాగస్వామి భీమన్న మాట్లాడలేదు.

"జాయ్‌గా పోదారేస్. తొందరేటి" అన్నాడు రామన్న మళ్లీ.

భీమన్న పలకలేదు. ఇలా భాగస్వామికి కోపం వస్తే బిజినెస్ దెబ్బ తింటుందని రామన్నకి తెలుసు. కోపం ఎలా పోగొట్టాలో కూడా తెలుసు.

"అవునుగానీ భీవుడూ, నాకు తెల్దనుకో. ఇపుడు మనం చూసిన పిలింలో పాట గంటసాలోడి స్టోను గాదటేస్" అన్నాడు తెచ్చుకున్న ఉషారుతో. భీమన్నకి పాటలంటే ఇష్టం.

పాట ఊసెత్తితే కోపం పోతుంది.

ఇపుడు పోయింది.

నవ్వాడు మృదువుగా, "పోపోవేస్, గంటసాలోడి స్టోనేరు, ఈడి స్టోనేరు. ఆడి స్టోనాడిదే, ఈడి స్టోనీడిదే. ఇదో రకం అనుకో. ఇది ఇందీ స్టోన్‌లే" అన్నాడు.

"ఏందోలే మనకి బాస కూడా తెల్దుగా" అన్నాడు రామన్న.

"దానికేంటేస్. బాసబాసే, స్టోను స్టోనే అనుకో."

"అంతేలే అంతే - రేయ్ చైకిలాపరా, తూముకాడి కొచ్చేశాం. నువ్వు దిగి ఎనకాల లగెత్తుకురా. నే ముందెల్లి ఆళ్లనాపుతా" అన్నాడు రామన్న.

భీమన్న సైకిలు దిగి రామన్న కిచ్చాడు. రామన్న బయల్దేరాడు.

వీర్రాజూ, రామారావు పది గజాల దూరంలో పోతూ "కుడి ఎడమైతే" పాడుతున్నారు జమిలిగా.

"ఓరబ్బాయిగోర్లు, కుసంత ఆగండి" అని కేకెట్టాడు రామన్న వస్తున్నట్టు.

"దొంగలురోయ్!" అన్నాడు రాజు. "సైకిలాపకు. జోరుగా పోనీయ్."

రామారావు వెనక్కి చూశాడు. "ఆపకపోతే వాడందుకోలేడనా! మనం ఇద్దరం. వాడొక్కడు! ఫరవాలేదులే" అంటూ సైకిలు దిగాడు రామారావు. రాజు బితుకు బితుకుమంటూ నించున్నాడు.



ఎకరం బాతిక ఛాతీ, అర ఫర్లాంగు ఎత్తు విగ్రహం, గజం మేర బుగ్గ మీసాలూ, సగటు రైతు మీసా లంత కనుబొమలూ, డబాయించే చూపులూ - మొదలైన సరంజా మాతో ఉన్న రామన్న సైకిలు దిగి ఎదట నుంచునేప్పటికే రాజు కళ్ళు మూసుకున్నాడు.

"నే నేల ఈ వేళ సినిమాకు రావలె? వస్తిబో మధ్యలో మా చవటకి లేచిపోవాలని బుద్ధి ఏల

పుట్టవలె? పుట్టితిబో నేనేల లేచి రావలె? వచ్చితిబో యిపుడు సైకిలేల దిగవలె? వేయేల మా దైవ మీ లీల నను బాముల పాలు సేయనేల?" అనుకున్నాడు గబగబా.

రామారావు ధైర్యవంతుడు. హీరో లక్షణాలన్నీ వున్నాయి. "ఏమయ్యా? ఏం? ఎందుకు పిలిచావు? ఏం? అఁ?" అన్నాడు ధైర్యంగా.

ఇంతలో భీమన్న పరుగెత్తుకువచ్చి రామన్న పక్కన •నించున్నాడు. రామన్న విరగబడి విలాసంగా నవ్వాడు. "ఏం ఏం అంతా వున్నాడు పంతులు చూడేస్ – ఏటయ్యా – ఏటేటి? నీతో నాకు వేరే పనేటి? ఊసులాడ్డానికి పిల్చాననుకున్నావా? డబ్బులు కావాలి. డబ్బులూ – రిస్టువాచీలూ ఇచ్చిపోండి" అన్నాడు.

"సైకిలూ, చిలుకు చొక్కా కూడా ఒగ్గేసిపో. మా సిట్టికి చిలుకు చొక్కాలిట్టం" అన్నాడు భీమన్న చాకు తీస్తూ.

రామారావు శాంతికాముకుడు. "ఇదేం పనోయ్ మీకు? ఇలా దోపిడీ – అదే అదే – ఇలా పరుల సొమ్ము కోరడం – బలవంతాన తీసుకోవడం తప్పుకాదూ? మిమ్మల్నే యింకోళ్లిలా విలేస్తే అప్పుడు మీరు..." అని యింకా నచ్చచెప్పబోయాడు.

"ఏటేస్. ఏదో సదుకుతా వుండావు. అయన్నీ కుదరవు. బేగీ ఆ సొక్కా అయీ ఒగ్గేసి లగెత్తు. లేకపోతే యిదుగో చూశావా" అంటూ చాకు చూపించాడు భీమన్న.

రామారావు గుటకలు మింగాడు. "చూశాననుకో" అన్నాడు చాకుని చూస్తూ. అయితేనేం, చూసినా యింకొంచెం ధైర్యం మిగిలిపోయింది. ఏదో చెప్పబోయాడు.

వీర్రాజుకి మాత్రం భీమన్నవాటం, చాకూ చూస్తే యేమంత నచ్చలేదు. రామారావు సణుగుడులు అసలు నచ్చలేదు. పూర్తిగా తగ్గిపోవడం మంచిది. అందుకని 'రావుడూ' అని ఒక్కసారి ఉరిమినట్టు గద్దించాడు రామారావుని.

హఠాత్తుగా దొంగలిద్దరూ త్రుళ్ళిపడ్డారు. దొంగ రావుఁడు మరీని. రామారావుది చురుకైన బుద్ధి అని యింతకుముందే కథకుడు చదువరులకు మనవి చేసుకున్నాడు. తపీమని కిటుకు కనిపెట్టేశాడు.

"ఏం? ఏం? ఏం? అలా తుళ్ళిపడతావేం? నీ పేరెలా తెలిసిందనా? హహ్హహ్హ!" నవ్వు బాగా రాలేదు. తమాయించుకుని డబాయింపు సాగించాడు. "హోరి చవటా! నీ పేరే కాదు. నీ బాబు పేరూ, నీ తాతపేరూ, నీ జతగాడి పేరు మాకు కంఠతా వచ్చు. మా బాబాయి పోలీసు ఠాణా ఇన్‌స్పెక్టరు తెలుసా? నీ పుట్టుపూర్వోత్తరాలన్నీ అక్కడ పుస్తకాల్లో వున్నాయి. హుఁ! కదరా రాజూ!" అన్నాడు.

వీర్రాజు కూడా సంగతి గ్రహించి పుంజుకున్నాడు. "అవునవును. కాదు మరీ? అవును. హుఁ! ఏవిఁటా వీడిలా కొత్త వాళ్ళనుకుని మనవి డబాయిస్తాడూ అని యిందాకటి నుంచీ చూస్తున్నా. కానీ యెంతవరకూ వేషాలేస్తాడో చూద్దాం అని వూరుకుంటున్నా. మన తడాకా తెలీదు కాబోలు" అన్నాడు.

దొంగరాముడూ దొంగభీముడూ గుడ్లు మిటకరించి గబగబా ఆలోచిస్తున్నారు, 'అసలు వీడెవడు? పైగా వీడి బాబాయెవడు? మన పేరెలా తెలిసింది' అని.

వీళ్లు దారికొచ్చారు కాబట్టే కథ అడ్డం తిరగకుండానే వీళ్ళని మంచిచేసుకోవడం యెలాగా అని రామారావు ఆలోచించాడు. ఒక్క నిముషం నిశ్శబ్దం ప్రవర్తిల్లింది.

"ఆ సైకిలెందుకు తెచ్చారురా? పాపం ఆయన యెంత ఇబ్బంది పడుతున్నాడో తెలుసా?" అన్నాడు రామారావు హఠాత్తుగా. దొంగలు మొహామొహాలు చూసుకున్నారు. రైటో అనుకుని విజృంభించాడు రామారావు. "పోనీలే. తెస్తే తెచ్చావులే, వాడుకో... సరేగాని రేపు ప్రొద్దున్న ఓసారి కనపడు, రెండు సిలుకు చొక్కాలిస్తా. మీ చిట్టి కిష్టం అని నాకు తెలుసులే... నా దగ్గిర సిగ్గెందుకురా. అవునుగానీ ఓ ఉపకారం చేసి పెట్టాలిరా రావుఁడూ... అన్నట్టు నీ పేరేమిటన్నావు? ఆ!... భీమన్నా, మరే భీమన్న కదూ... ఓ పని చేసి పెట్టాలోయ్. పది డబ్బులు గిట్టేదేలెండి. జైలుకి పంపే పనికాదు. ఏం, వారంరోజులు నాతో తిరగండి. చెరి పాతిక రూపాయిలిస్తా" అన్నాడు.

దొంగరాముడు అండ్ కో వారు కొంచెం అనుమానంగా చూశారు. ఇదంతా పోలీసులకి పట్టిచ్చే ఎత్తేమోనని.

"ఒట్టురా అబ్బీ. మీ వూరి ముత్యాలమ్మతోడూ, నీతోడు. మా బాబాయికి చెప్పను. నా సొంత పనికే యిది... ఏవంటావు, సరేనా? రైట్. రేపుప్రొద్దున్న తొమ్మిదింటికి దుళ్లతూము దగ్గిరికి రండి. చొక్కాలు, బయానాకి డబ్బూ తెచ్చి యిస్తాం సరేనా?" అన్నాడు రామారావు. "సరే" అన్నాడు రామన్న తెగించి.

రామారావు యింకొంచెం పునాది గట్టిచేశాడు. "నాకు నమ్మకం యెలా? మీరు పారిపోతే?... ఓ పని చెయ్యండి. ఆ సైకిలు నాకిచ్చి మీరు మళ్లీ బస్తీకి వెళ్ల సత్రంలో పడుకోండి. ప్రొద్దున్న బస్సుకి బయలుదేరి వచ్చేయ్యండి సైకిలుకేం ఫరవాలే" అన్నాడు.

దొంగలిద్దరూ తటపటాయించారు. "సరే బాబయ్యా" అన్నారు సైకిలు అప్పగించి.

"రైటో రేపు దుళ్ళ సంతకి రండి!"

దొంగలు దండాలు పెట్టి మరీ వెళ్ళారు.

రామారావు, రాజూ చెరో సైకిలూ ఎక్కి బయలుదేరారు. ఒక ఫర్లాంగు దూరం వెళ్ళాక 'హమ్మయ్య' అన్నాడు రామారావు.

"ముప్పావలా కోడిపిల్లకి మూడున్నర చేసే పందిపిల్లని దిష్టి తీసినట్లుంది. వెధవది సిలుకుచొక్కా, జేబులో ఉన్న రెండు రూపాయలూ పారేస్తే పోయేదానికి ఈ కామాటం ఏవిట్రా రావుఁడూ" అని గొణిగాడు రాజు, సైకిలూ, రిస్టువాచీ కూడా దొంగలకి సరదా కలిగిస్తాయని అతనికి తట్టలేదు.

రామారావు దూరదృష్టిగల రాజకీయవేత్తలా నవ్వాడు గంభీరంగా, మసక వెన్నెల్లో. అది రాజుకి కనబడలేదు. 'పోజంతా దండగ' అనుకున్నాడు రామారావు.

"ఇవాళ చిత్తం వచ్చినట్లు బుకాయించామని రేపు వాళ్ళు పసిగడితే యెంత ప్రమాదంరా! దొంగలతో ఆట పాములతో చెలగాటం అన్నారు" అన్నాడు రాజు మళ్లీ.

"ఏడిశావు బోడి సామెతలూ, నువ్వూను. రేప్పొద్దున్న వాళ్లు తారున హడిలి చచ్చేట్లుగా నిజం చెప్పేయ్యనూ! చెరో ఐదూ చేతికిచ్చి, పైగా వాడి సైకిలు తిరిగి యిచ్చేసి, రెండు సిలుకు చొక్కాలు కూడా ఇస్తే, వాళ్ళు మన చేతిలో కుక్కలై పోర్రుట్రా" అన్నాడు రామారావు.

"ఈ సైకిలు బావుంది" అన్నాడు వీర్రాజు.

"వెధవ్వేషాలెయ్యకు... దొంగలతో ఆట పాములతో చెలగాటం వంటిదన్నారు. తెలుసా!" అంటూ యెత్తి పొడిచాడు రామారావు.

"బోడిన్నర సామెత, ఎంగిలి సామెత. ఇంతకీ వాళ్ళతో నీకు పనేమిట్రా, ఉద్యోగాలిస్తానన్నావు?"

"అదే అడక్కు... నాకూ తెలీదు. కాని సుందరం గాడి సంగతీ, మావయ్య యెన్నికల సంగతీ తాడూ పేడూ తేల్చడానికి వాళ్ళు పనికొస్తారులే" అన్నాడు రామారావు మళ్ళీ గంభీరంగానే.

☆ ☆ ☆

చదువరీ! ఒకపరి యిటు రమ్ము. ఈ తెరువరు లిరువురి తెరగుల పరికింతము.

... ఈ కథకు రామారావు నాయకుడు. ఇప్పటికిప్పుడు కాకపోయినా, తెల్లవారాకయినా అతడిని చూస్తే అతని వయస్సిరువది రెండేండ్లుండ వచ్చునని తోపక మానదు. అయితే అది తప్పు, అతని వయస్సిరువది యారేండ్లు! విశాల ఫాల భాగం, పొడుగైన నాసిక, సన్నటి పెదవులు, చురుకైన కళ్ళూ చూస్తే ఉన్నత వంశ సంజాతుడనీ, అందగాడనీ చటుక్కున స్ఫురిస్తుంది. ఒకవేళ స్ఫురించకపోయినా, ఎవర్నడిగినా చెప్పేస్తారు. చీకట్లో కనబడవుగాని, అతని చేతికి మంచి వుంగరం, రిస్టువాచీ ఉన్నాయి అవీ, వాళ్ళింట్లో యినప్పెట్లో డబ్బూ, అతని పెట్టెలో ఉన్న సిలుకు చొక్కాలూ, సూట్లూ చూస్తే ధనవంతుడని ఒప్పుకుంటారు. హొయలు, వాటం, వాలకం చూస్తే విలాసపురుషుడనిపిస్తుంది.

ఈ రామారావు విలాసాలలో విద్యాభ్యాసం ఒకటి. ఆంధ్రవిశ్వవిద్యాలయానికి పోషకుడు. అనేక సంవత్సరాలు ఇంటర్మీడియట్ పరీక్షలకు వెళ్ళి అనుభవం గడించాడు. ఇటీవల కొన్ని సంవత్సరాలుగా బి.ఏ. పరీక్ష గుట్టు మట్టులన్నీ పరిశోధిస్తున్నాడు. చలనచిత్ర పరిశ్రమకు మహారాజ పోషకుడన్న విషయం సువిదితమే. పోతే, సినిమా పత్రికలకు రామారావు రాజపోషకుడు: అతను తన కాపీని ముందుగానే రిజర్వు చేసుకుంటాడు. సినిమా పత్రికలకు ప్రశ్నలు పంపడం దైనందిన కార్యక్రమం.

"ఎడిటర్జీ! ఫలానా తారా తారడూ యేమౌతారు?"

'ఫలానా చిత్రంలో ఫలానేశ్వరరావూ, ఫలానీమతీ యెడబాటుకు గురి అయినపుడు శ్రీమతి ఫలానీమతి యేడుస్తూ ఓ పాట పాడుతుంది. ఆ సన్నివేశంలో ఆమె చారల జాకెట్టు ధరించిందని నేనూ, కాదు నల్లజాకెట్టని మా మిత్రుడూ వాదించుకుంటున్నాం. మీరెవరితో యేకీభవిస్తారు సంపాదక మహాశయా?' ... 'నాకు ఫలానా తారణేశ్వరితో హీరోగా నటించాలని వుంది. మీ అభిప్రాయం?' ... ఇత్యాది ప్రశ్నలు ఆయా పత్రికలలో నుండి కత్తిరించిన కూపన్లలో మాత్రమే ఇతడు వ్రాసి పంపుతాడు. అవి ప్రచురింపబడే పర్యంతం ఆయా పత్రికలు కొంటూ వుంటాడు. ఒక్కొక్కసారి కాలేజీ అమ్మాయిల పేరుతో తనే ప్రశ్నలు పంపడం కద్దు.

రామారావు పరేంగితజ్ఞుడు. ముఖ్యం అమ్మాయిల ఇంగితం ఇట్టే గ్రహించగలడు. వాళ్ళ మావయ్య సూరయ్యగారి ఇంగితం యితనికి పదో ఎక్కం అంత బాగా కంఠతా వచ్చు. తరువాత నల్లి ప్పొచయం కూలంకషంగా అవగాహన చేసుకున్నాడు.

దీనిపై బ్రహ్మాండమైన పరిశోధనలు చేశాడు. వాటి ఫలితాలను చిన్న గ్రంథంగా రచించాడు. వాటిని చక్కని ముచ్చటైన ముద్దుగొలిపే బైండు పుస్తకం రూపంలో ప్రచురించాలని అతని ఆశయం... అందుకు డబ్బుకావాలి.

డబ్బైతే ఇంట్లో వుంటుందికాని అమ్మ యివ్వదు. అమ్మకి మావయ్యమాట సుగ్రీవాజ్ఞ. మావయ్య లావుగా వుంటాడు. పెద్దవాడు. పైగా పెద్ద మనిషి. అన్నింటికీ 'ఎందుకూ?' అని అడుగుతాడు, 'నాకు తెలుసులే వెధవాయా' అంటాడు. అందుకే నాన్న పోతూ పోతూ మావయ్య మాట వినవలసిందని అమ్మకి చెప్పి ఒట్టేయించుకు పోయాడు. తనని ఆకతాయని తిట్టి మరీ పోయాడు. అందుకని యినప్పెట్టె తాళాలు అమ్మచేతిలోనే వున్నా ఆ తాళాలకు తాళాలు మావయ్య చేతిలో వుంటాయి. ఇంకోటే... మావయ్య అచ్చం అసలు సిసలు మావయ్యకాదు. ఓ వేలువిడిచిన మావయ్య అన్నమాట. ఒంటరి పక్షిలా పెళ్లీగిట్రా లేకుండా వూళ్ళుంట తిరుగుతూ ఉంటే నాన్నే దగ్గరకు తీసి ఆశ్రయం యిచ్చాడు. ఈ విషయాలన్నీ రామారావు వీర్రాజుకీ ఆప్తమిత్రులకీ చెప్పుకుని ఇదవుతూ వుంటాడు.

"మావయ్య మనకి పెద్ద దిక్కురా నాయనా. వాడి మాట తోసి రాజనకు, దక్షత గలవాడు" అంటుంది రామారావు తల్లి ఎప్పుడూ.

రామారావుకి మావయ్య దక్షత ఏమిటో బోధపడలేదు. అదంటాడు, ఇదంటాడు, ఐదంటాడు, పదంటాడు. అమ్మని బెల్లించి డబ్బు ఒడేసుకుని పోతాడు బస్తీకి, పేకాడతాడు డబ్బు పెట్టి. పైగా నల్లమందొకటి. అమ్మకి చెప్పితే నమ్మదు. "పోనీలే పెద్ద ముండావాడు, బతికినన్నాళ్ళూ బతకడు. వాడేడుపు వాడు చూసుకుంటాడులే గాని నువు- నీతులు చదవకు. తప్పు" అని కోప్పడుతుంది అమ్మ. ఈ లోగా నా ఏడుపు నన్నేడవనీయడే అని విసుక్కుంటాడు రామారావు. ఇంకొక్క ముక్క. రామారావుకి పెళ్ళి కాలేదు. సుబ్బలక్ష్మి అనే పిల్లని చేసుకోవాలని ఉబలాటం. ఇంక వీర్రాజు అంటే రాజు. ఈ రాజు రామారావుకి నేస్తం. ఇతనూ విద్యా సంస్థలనీ, కళనీ పోషిస్తాడు. కొంచెం ఆస్తి, ఓమాదిరి అందం, బోలెడు తెలివితేటలూ, అమ్మా, ఓ ముసలిబామ్మా ఉన్నారు.

దొంగరాముడు బారి నుండి తప్పించుకున్న హీరో రామారావూ, సైడు హీరో వీర్రాజూ ఇళ్లకెళ్ళి పడుకున్నారు. పొద్దున్నే ఎచ్ రామారావే, ఎ ఎచ్ వీర్రాజును పరిచయం చేస్తాడు.

☆ ☆ ☆

తెల్లవారిందనే దురభిప్రాయంతో కోడికూసింది. కాకులు మేలుకున్నాయి. ఈగలు డ్యూటీకి బయలుదేరాయి. దోమలు విశ్రాంతికి ఉపక్రమించాయి. దాలిగుంటల్లో పిల్లులు బద్ధకంగా లేచి వళ్ళు విరుచుకుని బయటకు నడిచాయి. ఆవులు అంబా అన్నాయి. పువ్వులు వికసించాయి. నవ్వడం అలవాటైన పిల్లలు చక్కగా నవ్వారు. ఉత్తిపుణ్యానికి యేడవడం వృత్తిగా గల పిల్లలు చక్కగా ఏడుపు మొదలెట్టారు. కాద్దో గొప్పో పాడిగల ఇళ్ళల్లో అమ్మమ్మలూ, బామ్మలూ భూపాల రాగచ్ఛాయలో "అమ్మా గుమ్మడేడే" అని పాడుతూ మజ్జిగ చిలుకుతున్నారు. ముద్దబంతి పూలలా బొద్దుగా పచ్చగా వున్న అమ్మాయిలు పంచకళ్యాణి గుర్రాలకు మల్లే శోభిస్తూ

కళ్ళు నులుముకుని కాటుక  మరింత అందంగా పులుముకుంటూ, అమ్మలచేతా, బామ్మలచేతా సున్నితంగా చివాట్లు తింటూ  కలకలలాడేలా తిరుగుతున్నారు. కొందరు గుమ్మాలలో పేడనీళ్ళు చల్లి, సంక్రాంతి ముగ్గులు  తీర్చిదిద్దుతూ, ముగ్గులంత అందంగా సజీవంగా నవ్వుతున్నారు. పదేళ్ళ పిల్లలు  గొబ్బి తట్టుతున్నారు. రౌడీ తమ్ముళ్ళూ, రాలుగాయి కుర్రాళ్ళూ లేచి గోడిబిళ్లలూ, బొంగరాలూ, పిడకల దండలూ కులాసాగా ఉన్నాయో లేదో చూసుకుని, చద్దన్నాలకి సిద్ధం అవుతున్నారు. బస్తీ  వెళ్ళొచ్చిన యువకులు గడ్డాలు పెరక్కపోయినా సరేనని రేజరుసెట్టు, అద్దం సిద్ధం  చేసుకుంటున్నారు, చివాట్లు తింటూనే. సాతాని జియ్యరు ఒక ట్రిప్పు పూర్తి చేసుకున్నాడు. కాలవరేవు అంతా నీటి కడవలు నెత్తిన పెట్టుకుని నడిచే అప్పలమ్మలతో, బిందెలు చంకనపెట్టుకుపోయే  బామ్మలతో చూడముచ్చటగా ఉంది. బస్తీకి కూరకావిళ్లు చాలా పెందరాళే వెళ్ళాయి

ఆలస్యంగా లేచినవాళ్ళు హడావిడిగా పోతున్నారు. ఈసరయ్య హోటలు నుంచి, ఎండు తామరాకుల  వేడివేడి ఇడ్లీ పొట్లాలని ఆఘ్రాణించి ఆనందిస్తూ కొందరు కుర్రాళ్ళు తిరుగుతున్నారు. ఈ  హడావిడంతా చూసి నిజంగానే తెల్లవారిందనుకుని సూర్యుడు ఉదయించాడు. మొత్తం మీద లోకం  అంతా మేలుకుని బిలబిల తిరగసాగింది.

రామారావుకి మాత్రం ఇంకా తెల్లవారినట్లు నమ్మకం కుదరలేదు.  వాళ్ళ మావయ్య  బోలెడుసార్లు రామారావుని తిట్టి, గావుకేకలు పెట్టి కండువా వేసుకుని ఊరేగబోయాడు. రాత్రి  సినిమాలో హీరోయిన్ యిటూ, సుబ్బలక్ష్మి అటూ ఉండగా పండు వెన్నెలలో విహరిస్తున్నట్లు  కలగంటున్న రామారావుకి లేవడానికి బుద్ధి పుట్టలేదు. 'వెర్రిలోకం మోసపోతూంది' అనుకున్నాడు, మగత నిద్రలో. సూరమ్మగారు వచ్చి తట్టి లేపారు. గోడగడియారం తొమ్మిది వేసింది. ఠపీమని లేచి కూర్చున్నాడు రామారావు. సీమ గడియారాలు అబద్ధం చెప్పవు.

వేపపుల్లా, చెంబూ నీళ్ళూ పట్టుకుని వీధరుగు మీద మఠం వేసుకుని దంతధావనానికి ఉపక్రమించాడు  రామారావు. సంక్రాంతి ముగ్గులతో వీధిలోని ప్రతి ఇంటి వాకిలీ వెలిగిపోతోంది. "బాగుల్లాయి బుగ్గులు" అనుకున్నాడు రామారావు బద్ధకంగా.

వీర్రాజు వచ్చి రివ్వున వాలాడు అరుగు ప్రక్కన. "సిగ్గు లేకపోతే సరి తొమ్మిదింటికి లేచి... పైగా వీధరుగుమీద దుకాణం పెట్టాడు... తెములు, తెములు. దొంగరావుడు వెదుకుతూ వుంటాడు దుళ్ళ దగ్గిర. అనుమానం తగిలితే తరిమి తరిమి తంతాడు" అన్నాడు. "రాజు వెడలె రవితేజము లలరగ" అనతగినంత ఊపులో జోరుగా వచ్చాడు వీర్రాజు. సిలుకు చొక్కా  వేసుకున్నాడు.



సిలుకు పైజమా కూడా తొడిగాడు. సున్నగా క్రాపు దువ్వాడు. రాత్రి దొంగరాముణ్ణి దబాయించి తెచ్చిన రాలీ సైకిల్ మీద కూర్చుని విలాసంగా ఓ కాలు రామారావు కూర్చున్న అరుగుమీద ఆనించి హొయలు ఒలకపోశాడు. రామారావు బద్ధకంగా తలెత్తాడు. ఎగాదిగా చూశాడు వీర్రాజుని. "మెడలో ఒంటిపేట బంగారపు గొలుసు ఒక్కటే తక్కువ... దసరాబుల్లాడిమల్లె, తోటిపెళ్ళికొడుకల్లె ఉన్నావు" అన్నాడు.

"చాల్లేవోయ్, సణుగుడుమాని తెములు."

"అయిపోయింది తొందరపడకురా... స్నానం గీనం జెయ్యాలె... వచ్చాక చూసుకుందాం" అన్నాడు రామారావు.

"ఏం గిరాకీ! స్నానం వాయిదా వేస్తున్నావు. మీ మగదక్షత ఊళ్లో లేడా?"

"లేకేం నిక్షేపంగా ఉన్నాడు. అమోఘంగా బోలెడున్నాడు. ఆ మాటకొస్తే మా పెద్ద దిక్కు ఉన్నంతగా యింకెవడూ లేడు. ఇప్పటిదాకా కథాకళీ ఆడి ఇప్పుడే ఊరేగాడు, కండువా వేసుకు దండోరా వెయ్యడానికి."

"దండోరా ఏంట్రోయ్ పంతులూ!" అన్నాడు వీర్రాజు ఉషారుగా.

"ఏమిటి కాదురోయ్ అను... నేను పాజమ్మననీ, చవటననీ, స్నానం చెయ్యననీ దండోరా వేయించి, అందరిచేత సుబ్బలక్ష్మి నాన్నకి చెప్పించాలని."

"ఊ!... చెప్పించి...?"

"సుబ్బుల్ని బంగారయ్య దూరపుచుట్టం సుందరంగాడికి ఇప్పించాలని. ఆ పైన కరణంగారి కూతురు సీతని నా నెత్తికి కట్టాలని."

"భేషుగ్గా ఉంది. మనక్కావలసిందదే, పోయి మీ మావయ్య కాళ్లమీదపడు. 'హో పెద్దదిక్కా! మా యింటి మగదక్షతా! నిన్ను అపార్థం చేసుకున్నానుస్మీ' అను" అన్నాడు వీర్రాజు.

రామారావు దంతధావనం పూర్తిచేసి లేచి నుంచున్నాడు అరుగుమీద.

"సరేలే, అరుగుమీద కూర్చుని యేడుస్తూ వుండు.... బట్టలు మార్చుకుని అమ్మదగ్గిర డబ్బులు సంపాదించుకు అరగంటలో వస్తా... చాలా మాట్లాడాలి. రాత్రి మా పెద్ద దిక్కు నా పెళ్ళి గురించి అమ్మకి బోలెడు హితోపదేశం చేశాడులే" అంటూ లోపలికి వెళ్ళాడు రామారావు...

☆ ☆ ☆

... ధనియాల కాఫీ గడగడా తాగేసి "అమ్మా పదిరూపాయలే" అన్నాడు రామారావు "అమ్మా కానీయే" అన్నంత ముచ్చటగా గారాబంగా.

"ఎందుకు చిట్టినాన్నా పదిరూపాయలు? నౌకర్లకీ చాకర్లకీ జీతాలివ్వాలా? చుట్టలు కాల్చడానికా?" అంది సూరమ్మగారు.

"కాదులే అమ్మా, రాజమండ్రి వెళ్ళాలి... ఉద్యోగం దొరికే టట్టుందిలే" అన్నాడు రామారావు.

"చాల్లే. నువ్వేం ఉద్యోగాలు అఘోరించనక్కరలేదు... అయినా డబ్బా, గిబ్బా నన్నడక్కు, మావయ్య రానీ చూద్దాం. అన్నట్టు మర్చిపోయా, అలా కూచో. ఏవిటలా ఆడిపోతున్నావు? చూడూ, మావయ్య కరణం గారితో మాట్లాడాడుట. ఈ వేసంగుల్లో వాళ్ళ సీతమ్మనిచ్చి.."

"నేను బి ఏ అయేదాకా పెళ్ళిమాట ఎత్తకమ్మా."

"బి యే అయితే అవుదువుగానిలే యిప్పుడు మాట చెప్పడానికేవిట్రా?"

రామారావు చురుకైన బుర్ర చకచక పనిచేసింది. "సరే నేనడిగిన పదిహేను రూపాయలూ యిప్పుడిస్తే కరణంగారి సంబంధం సంగతి ఆలోచించి రేపు చెబుతా."

"ఇపుడే కదురా పదిరూపాయలన్నావు!"

"సమయానుకూలముగా రేట్లు హెచ్చించబడును. షరా: రూల్సు మామూలే" అన్నాడు రామారావు.

"తగలెయ్యి నాయనా తగలెయ్యి నీ యిష్టం వచ్చినట్లు తగలెయ్యి డబ్బు. ఆ మారాజు చచ్చిచెడి యిచ్చిందంతా యిలా నిర్వాకం చెయ్యి... పట్టికెళ్ళు... మీ మావయ్య వచ్చాక –"

"అయితే నాకసలు డబ్బే అక్కర్లేదమ్మా.. ప్రతిదీ మావయ్యతో చెప్పాలేవిటి?... నాకక్కర్లేదు. పాతికేళ్లొచ్చినా ఇంకా పర్మిషనే" అంటూ గునిశాడు.

"నువ్వు పాతికేళ్ళొచ్చిన కుర్రాడిలాగే నడుచుకుంటున్నావా అంట. నీకామాత్రం జ్ఞానం ఉంటే మావయ్య పెద్దరికం ఎందుకు చేస్తాడు నీ మీద... కాకపోయినా వాడేం పరాయివాడుట్రా... మనకి మాత్రం వాడికన్న కావలసిన వాళ్ళెవరున్నారు" అంది సూరమ్మగారు.

"అంతక్కర్లేని వాళ్ళింకోళ్ళు లేరు... నీకేం తెలుసమ్మా. ఇంట్లో నాలుగు గోడలమధ్యా కూచుంటావు. మీ వేలు విడిచిన అన్నయ్య, మన యింటి పెద్ద దిక్కు అయిన సూరయ్యగారి పేరు రాజమండ్రి నుంచి తెనాలిదాకా మోగిపోతోంది... సాటిలేని మేటి ఢంకాఫలాసు ఆటగాడని."

"ఛప్... పెద్దంతరం చిన్నంతరం లేకుండా నోటికొచ్చినట్టల్లా ఏవిట్రా ఆ పేలుడు? మిడిసిపడిపోతున్నావు... వాడంటే, వాడి పొడంటే యెందుకలా గుయ్యిమంటావు – ఏం చేదు పెట్టాడా?"

"పెడతాడు చూడు... నాకు టైమవుతోంది... అయితే నేను సీతని పెళ్ళాడడంలేదు, అంతేగా?"

సూరమ్మగారు ఫక్కున నవ్వింది. "పొట్టనిండా పుట్టెడు బుద్ధులున్నాయి పొట్టివాడివి కాకపోయినా... ఇంద. పట్టికెళ్ళు... పెందలాడే కొంప చేరు మళ్లీ" అంటూ పదిహేను రూపాయలు చేతిలో పెట్టిందావిడ.

"ఇదేమిటమ్మా! ఇరవై ఇస్తానని పదిహేను చేతిలో పెట్టావు? నేను అడిగింది పాతికా నువ్వు యిస్తానన్నది యిరవై. తీరా చేతికిచ్చింది పదిహేనూనా? బావుంది. పంచపాండవు లెందరంటే మంచపుకోళ్ళలా ముగ్గురంటూ రెండు వేళ్ళు చూపించాడట వెనకటి కెవడో" అంటూ తూనీగలాగ ఎగిరిపోయాడు రామారావు.

"హారా! ఎంత నేర్చుకపోయావురా మాటలు!" అంటూ ముక్కుమీద వేలువేసుకు విస్తుపోయింది సూరమ్మగారు. "మరే. అచ్చం ముమ్మూర్తులా వాళ్ళ తండ్రి తీరే... పోలిక లెక్కడికిపోతాయి వదినా. అన్నగారంత చతురుడే వీడూను. ఔగాని వదినా మీ డబ్బాతో డబ్బాడు కాఫీపొడి ఉంటే యిద్దురూ... చుట్టాలు దిగారు" అంది పెరటి గుమ్మంలో నించున్న పొరుగింటి బామ్మగారు.

☆ ☆ ☆

రామారావూ, వీర్రాజూ చెరోసైకిలూ యెక్కి ఉషారుగా బయలుదేరారు దుళ్ళ సంతదగ్గిర దొంగరాముణ్ణి కలుసుకోడానికి.

రామారావు పట్టపగ్గాలు లేకుండా ఉన్నాడు. "రాజా! ఈసరయ్య దుకాణానికి పదరా! ముందర పెసరట్లు లగాయించి మా సుబ్బుల్ని చూసి మరీ వెళ్దాం దుళ్ల సంతకి, అయిన ఆలస్యం ఎలాగా అయింది" అన్నాడు.

ఈసరయ్య హోటలులో వేడివేడి ఇడ్లెన్నూ, చెరో పెసరట్టూ ఆరగించి కర్తవ్యం ఆలోచించారు. ఈసరయ్య ఇచ్చే ఇండియా కాఫీ ఏడుస్తూ తాగారు. కిళ్ళీ బిగించి సిగరెట్టు ముట్టించి శివాలయం వీధంట బయల్దేరారు.

సుబ్బలక్ష్మి ఇల్లు ఆ వీధిలో వుంది.

"అదుగోరా సుందరంగాడు, దొంగవెధవ" అన్నాడు రామారావు. అరుగుమీద సుబ్బులు తండ్రితో సుందరం మాట్లాడేస్తున్నాడు – తలా చేతులూ ఊహూఁ తిప్పేకుంటూ. ఆయన యెంతో ఆదరంతో సుందరం మాటలు విని తల వూపుతున్నారు.

"హో! వీడా నీ పాలిటి విలన్?" అన్నాడు రాజు సాలోచనగా. రామారావు మాట్లాడలేదు. ఎదురుగా కాలవనించి మంచినీళ్ళ బిందె చంకనేసుకుని, ఎడంచేత్తో యెనిమిదేళ్ళ పిల్ల చెయ్యిపట్టుకుని కబుర్లు చెబుతూ వయ్యారంగా వస్తోంది సుబ్బులు. పమిట పరికిణీ కుచ్చెళ్ళు పనిమంతురాలైన ఇల్లాలి చీరకుమల్లె ఒక పక్కకి యెత్తికట్టింది. పసుపు పచ్చగా ఉన్న ఆమె కోలముఖంలో సన్నటి కళ్ళ నలుపు కొంచెం చెదిరిన కాటుకవల్ల కొట్టొచ్చినట్టు కనబడింది. పక్కన నడుస్తున్న చిన్నపిల్ల మూలంగా ఆమె విగ్రహం నిండుతనం ప్రస్ఫుటంగా కనబడింది. ఒంటిరాయి ముక్కు పుడకవల్ల పొడుగైన నాసిక మెరిసిపోతోంది. ఎర్రటి, మెత్తటి పాదాలు, వాటిని చుట్టుకుని ఉన్న సన్నని వెండిపట్టాలు, వాటికి మూడంగుళాలపై అడవి గుర్రం మెడ మీద జూలులాగ యెగిరెగిరి పడుతున్న తెల్లపరికిణీ తాలూకు నల్లంచు చూస్తే రామారావుకి దేవతలూ వాళ్ళూ జ్ఞాపకం వచ్చారు. శ్రావణలక్ష్మి ఆకారం కొద్దిగా స్ఫురించింది. పక్కనున్న పిల్లతో ఏదో మాట్లాడుతూ మందహాసం చేస్తున్న సుబ్బలక్ష్మి పది అడుగుల దూరంలోకి రాగానే దేవుడు బొమ్మల్లో తలకాయచుట్టూ



ఉండే పచ్చటి చక్రం వుంటుందేమోనని వెతకబుద్దేసింది రామారావుకి. అమ్మాయిల్ని చూసీ చూడగానే నవ్వేసి ఈలవేసే రామారావుకి ఈ సుబ్బులు ఎదటపడగానే అలాంటి వెకిలి ఆలోచనలు ఆమడదూరానికి పోతాయి. కళ్ళు, ఎడంవేపు గుండెకాయ మినహా మిగతా శరీరం యావత్తూ మరణిస్తుంది. మెదడు గడ్డకట్టుకుపోతుంది.

అందుకనే సుబ్బులు నాన్నా, సుందర్రావూ అరుగుమీద ఉన్నా లెక్కచెయ్యకుండా, ఆ యింటి యెదటి నడిరోడ్డు మీద నిలబడిపోయాడు రామారావు. సుబ్బులు

తలఎత్తి చూసింది. నవ్వింది, క్షణంలో సగం సేప్పు రామారావు నిండా దీపాలు వెలిగిపోయాయి. సుబ్బులు నీళ్ళ బిందెతో సహా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"నిన్నేనోయ్ రామం! ఎక్కడికి బయల్దేరావ్?" అని మూడోసారి అడిగాడు సుబ్బులు తండ్రి జగన్నాధంగారు. "ఆయ్–ఆయ్..." అన్నాడు రామారావు.

"ఆయేమిటోయ్. ఆయా ఓయాఁనూ... మీ మావయ్య యేమి చేస్తున్నాడు?"

రామారావు అప్పటికి బాగా తేరుకున్నాడు. "మావయ్యండీ... ఉన్నాడు... ఉన్నాడండీ... షికారెళ్ళాడు... అదే ఆ కరణం గారింటికి... వస్తానండి. దుళ్లదాకా వెళ్ళాలి" అంటూ సైకిలెక్కాడు రామారావు.

జగన్నాధంగారు మళ్ళీ సుందరంతో మాటలకు దిగారు.

ఊరుదాటాక రామారావన్నాడు "అబ్బీ! వాడేరా సుందరం, వాడికే ఈ సంబంధం చెయ్యాలని మావయ్య ప్రయత్నం." "వాడికేం నిక్షేపంలా ఉన్నాడు. దీపంవంటి కుర్రాడు." "నేను కాదన్నానురా! ఫస్టుగా ఉన్నాడు. చదువుంది; డబ్బు అట్టే లేదు. బుద్ధిమంతుడు, పైగా పాటలు రాస్తాడు. ఇంచుమించు నా అంత అందంగా వుంటాడు. ఎటొచ్చీ లోటాకటే – పూర్తిగా నా అంత అందంగా వుండకపోవడం."

"అందుకనే నువ్వు సీతను పెళ్ళాడు."

"ఒరేయ్! నువ్వు సైకిలు దిగరా!"

"ఏం కొడతావా?"

"దిగు చెప్తా – అదక్కడ పడేసి ఇలా కూర్చో –"

దోవ పక్కన మామిడి చెట్టు నీడని కూచుని యిద్దరూ సిగరెట్లు ముట్టించారు.

"రాజా! ఇంక వేళాకోళం ఆడకురా – నాకు ఏడుపొస్తోంది" అన్నాడు రామారావు.

"ఏడవడం మాత్రం వద్దు. సంగతి చెప్పి మరి ఏడు."

"సుబ్బుల్ని నేను సీరియస్‌గా ప్రేమించానురా. నిజంగా పెళ్ళి చేసుకుంటా."

"నీ తలకాయి, నీకు లవ్వేమిట్రా నా బొంద. ఊరికో లవ్వూ, వీధికో లవ్వూ, రోజుకో లవ్వూను."

"రాజా, హాస్యంకాదురా. నీమీద ఒట్టు. ఈ సిగరెట్టు మీద ఒట్టు. ఈసారి సెలవలకొచ్చాక సుబ్బుల్ని చూశాక గట్టిగా తెలిసొచ్చింది... ఇంత చిత్రమైన తియ్యటి బాధ ఎప్పుడూ లేదురా – ఇదే ప్రేమనుకుంటా!"

"రావుఁడూ! నాకు తెలుసురా – సుబ్బులి క్కూడా నువ్వంటే యిష్టమే. కానీ – వీలూ చాలూ కూడా కొంచెం ఆలోచించు. నీ స్థితికీ, నీ హోదాకు తగినదాన్ని మీ మావ కుదిర్చాడు. పెద్దవాళ్ళు మాటలిచ్చుకున్నారు. సుందరాన్ని కూడా సుబ్బులికి స్థిరపరిచారట. నేను వాణ్ణి ముందు ఎపుడూ చూడలేదనుకో..."

"నేను మాత్రం చూసేడిశానురా? వాల్తేరులో అప్పుడప్పుడు లాంగ్‌షాట్‌లో చూసేవాణ్ణి. బొత్తిగా యింత క్లోజప్‌లో చూడ్డం ఈ వూళ్ళోనే. మావయ్యతో పోటీ చేస్తున్నాడే – బంగారయ్యగారు – ఆయనకి యెక్కడో ఆమడ దూరపు చుట్టంట. తల్లిలేదు. మొన్ననే తండ్రి పోయాట్ట. అందుకని చదువు మానేశాడు. ఆస్తి కూడా

యేమంత లేదు. ఆ మాటకొస్తే ఏం లేదు. బంగారయ్యగారు యెన్నికలకోసం అని వాణ్ని లాక్కొచ్చాడు. పనిలో పని పెళ్ళికి ఏర్పాటు చేస్తున్నాడు. ఆయనకి కొడుకూ గట్రా లేరుగా."

"బాగుంది" అన్నాడు వీర్రాజు నిట్టూర్చి.

"ఏం బాగుంది? నీ తలకాయ, నా తలకాయానూ."

"కథ ఇంతవరకెళ్ళాక యింక యెవరేం చెయ్యగలర్రా – బాగుందనక."

"నోరు మూసుకోగలరు. నన్ను హేళన చెయ్యడం మానగలరు; స్నేహితులయితే సాయం చెయ్యగలరు."

"సరేలేరా, నా నోరు మూసుకుంటా. నువ్వు మాత్రం ఏ చేస్తావు చెప్పు."

"ఎలాగైనా కరణంగారి కూతుర్ని తప్పించుకుని సుబ్బుల్ని చేసుకోవడమే నాకిష్టం – సుబ్బులికిష్టం. మా అమ్మను ఒప్పించగలను. చిక్కంతా ఇంటి మొగదక్షతగాడే."

"అదే ఎలాగంట! అయినా మీ మావకి ఇంత పట్టుదలెందుకురా!"

"అదే తెలీదురా. అరా తీద్దాంలే. ఇంకోటిరోయ్. కరణంగారి కూతుర్ని నాకు కట్టబెట్టడం కోసం యెంత తిప్పలు పడుతున్నాడో, సుబ్బుల్ని సుందరావి కిప్పించడానిక్కూడా అంత తిప్పలూ పడుతున్నాడురా. దాని కోసం జగన్నాథం గార్ని మాలీసు చేస్తున్నాడు. 'సుందరం – ఇంతవాడు అంతవాడంటు'న్నాడు. కరణంగారి చేత బంగారయ్యకి చెప్పిస్తున్నాడు ఏమిటో మరి –"

"ఈ రామాయణంలో దొంగరాముడు పిడకలవేటేమిట్రా. వీళ్ళకి ఉద్యోగం యిస్తానంటావ్ – ఈ గోలేమిట్రా –" అన్నాడు వీర్రాజు లేస్తూ.

ఇద్దరూ సైకిళ్ళెక్కారు.

"నేను కలగన్నానేమిటి దొంగల సంగతి. నిన్న రాత్రి తప్పించుకోడానికి యేదో ఎత్తువేశాను. దరిమిలాను ఓ ఊహ తట్టింది. వీళ్ళని మన పనిలో యెక్కడో వాడుకోవచ్చని..."

"అందాకా పోషిస్తావా?"

"పోషణేముంది? ఇప్పుడు వాళ్ళ సైకిలు వాళ్ళకిచ్చేస్తాం. ఆపైన చెరో ఐదూ బయానా ఇస్తాం. ఎల్లుండి కనబడమందాం. ఎన్నికలు ఆదివారం నాడేగా? – అదుగో రామన్నా, భీమన్నా. ఔను – ఏమోయ్, కులాసానా? ఆలస్యం అయింది. ఏమనుకోకండి" అన్నాడు క్షమాపణ చేపుతున్నట్లు.

☆ ☆ ☆

చదువరీ – ఈ కథకు రంగస్థలం ఒక చిన్న గ్రామం. జనాభా పిల్లా మేకా కలిసి యేడువందలు పై చిలుకు. మేకల్ని తీసేస్తే దాదాపు ఏడొందలు. ఇందులో పిల్లలు రెండొందల పాతిక. పెద్దలు నాలుగువందల అరవై అయిదు మంది. మిగతా పది మందిలో కథాకాలం నాటికి పెళ్ళీడు ఆడ పిల్లలు ఇద్దరు. పెళ్ళీడు హీరో అతని చెలికాడూ కాక మిగతా ఆరుగురూ పెద్ద మనుషులు. వీళ్ళుకాక కొత్తగా కాపరం వచ్చిన కుర్రవాడు సుందరంతో కలిసి మొత్తం జనాభా ఏడువందల ఒకటి. అయినా శ్రీ ప్రభుత్వంవారు ఈ గ్రామస్తులు ఎన్ని మహజర్లు పెట్టుకున్నా పంచాయితీ

"చాలా సంతోషపడ్డాడమ్మా వెర్రిబాగులాడు" అన్నాడు రామారావు అన్నం తింటూ.

"ఏం బాగో నాయనా, నాకు నీ పద్ధతి మీ మావయ్య గోలా చూస్తే మతి పోతోంది. ఇద్దరూ కలిసి కొంప గుండం చేసేట్టున్నారు... అదేం తిండిరా? కోడి కెక్కిరించినట్లు. అవున్లే, ఇంకా సిగరెట్లు కాల్చు, తిండి బాగా వంటపడుతుంది."

"మావయ్యేం చేశాడేం." అన్నాడు రామారావు.

"ఏం చేస్తాడు? వాడికి చేతనైంది వాడు చేస్తున్నాడు. ఎన్నికలన్నాడు, ఏదో గోలన్నాడు, పొద్దున్నే పాతిక రూపాయలు తీసుకున్నాడు. మధ్యాహ్నం పెద్ద మనుషులొచ్చారన్నాడు. వాళ్ళను తెచ్చి ఊహా మంతనాలాడేడు. మళ్ళా వాళ్ళంతా వెళ్ళారు. ఇందాకా వచ్చి తైతక్కలాడాడు. అక్కణ్ణించీ మీ నాన్న పంచెలు మూడూ, నల్లకోటూ, కండువా, రెండు చొక్కాలు పట్టుకుపోయాడు."

"ఎందుకూ?" అన్నాడు రామారావు కళ్ళు పెద్దవిచేసి.

"ఎందుకేమిటి నాయినా, అంతా నా ఖర్మకి. వొక్కటి సవ్యంగా ఏడిచిందా. మధ్యాహ్నం వచ్చిన పెద్ద మనుషులు ముగ్గురినీ ఇందాక ఎవరో దొంగలు అటకాయించి దోచుకున్నారట. గోచిపాత కూడా లేకుండా గుడ్డా గుడుసూ ఊడ్చుకు చక్కాపోయారుట."

రామారావు కర్థం అయింది. విరగబడి నవ్వసాగాడు. "మావయ్యను కూడానా?"

"కాదు. ఈయనగారు ఎక్కడో వూరేగి కాలవగట్టు కెళ్ళేసరికి పెద్ద మనుషులు ముగ్గురూ కాలవలో మంచుని ఏడుస్తున్నారట. దొంగలు దోచుకున్నారు, పంచలు తెమ్మన్నారట. మీ మావయ్య ఇంటికొచ్చి పెద్ద మనుషులు, పెద్ద మనుషులంటూ మీ నాన్న బట్టలు తీసుకుపోయారు. ఆయనే ఉంటే..." అని కంట తడి పెట్టుకుంది సూరమ్మగారు. రామారావు మాట్లాడలేదు.



భోజనం కానిచ్చి సావిట్లో కొచ్చేసరికి పెద్ద మనుషులూ మావయ్యా బిల బిల్లాడుతూ లోపలికొచ్చేశారు.

మావయ్య వంటింట్లోకి వెళ్ళి "వక్క శేరుబియ్యం ఉడకేసి పెట్టు చెల్లీ, పెద్ద మనుషులొచ్చారు" అని పురమాయించి, చెల్లెమ్మ మాట వినకుండా సావిట్లో కొచ్చేశాడు.

"అంతేనయ్యా, బంగారయ్యే చేయించి ఉంటాడీ పని. అంచేత మీరు తప్పకుండా రేపు వుండి నన్ను గెలిపించాలి" అన్నాడు సూరయ్యగారు.

"చాల్లేవయ్యా – చేశావ్ మర్యాద" అన్నాడు కంట్రాక్టరు.

సుబ్బిశెట్టి మెత్తపడ్డాడు. "ఎర్రి బొమ్మడాయన మీద ఎగిరితే లాభమేమిటయ్యా. ఆ దొంగ వెధవన్ని ఈన పిల్చుకొచ్చాడా యేం!" అన్నాడు.

"సూరయ్యగారూ" అని బయట కేక వినబడింది.

రామారావు వెళ్ళి తలుపు తీశాడు. "ఈసరయ్య వచ్చాడు మావయ్యా" అన్నాడు.

ఈసరయ్య లోనికొచ్చాడు. "సూరయ్యగారూ, మీరు గెలవకపోతే లాభం లేదు, గెల్చి తీరాల్సిందే" అన్నాడు వస్తూనే.

సూరయ్య విస్తుపోయాడు హఠాత్తుగా వచ్చిన ఈసరయ్య ప్రేమకి.

"ఏవిఁటోయ్" అన్నాడు విలాసంగా.

ఈసరయ్య కథ ఏమిటో చెప్పాడు. ప్రత్యర్థి బంగారయ్య తనకి ఓటేస్తే రామాలయం ఊరి నడిమధ్యన కట్టిస్తానని అప్పుడే అందరికీ చెప్పి ఓట్లు కూడబెట్టుతున్నాట్ట. పైగా ఆయన బంధువు సుందరం ఓడు సిలుకు చొక్కా వేసుకు మరీ ప్రచారం చేస్తున్నాట్ట.

సూరయ్య ఒక్కసారిగా గంయ్‌మన్నాడు. "చూశారయ్యా పెద్ద మనుషులు – నేను మాటవరసకి నిన్ననే కరణంగారి అరుగుమీద కూచుని ఈ ముక్క అన్నా. రామాలయం ఊరి మధ్యగా శివాలయం దగ్గర్లోనే కట్టిస్తే బావుంటుందని, ఆ మాట ఈనోటా ఆనోటా విని ఇపుడు అది తన ఊహే అయినట్టు చాటిస్తున్నాడు బంగారయ్య. చూడండయ్యా హుఁ" అన్నాడు. పెద్దమనుషులెవరూ మాటాడలేదు. ఈసరయ్యే కొంచెం మూలిగి మొదలెట్టాడు. ఊరి చివర తన కాఫీ హోటలుంది కాబట్టి రామాలయం కూడా అక్కడే కట్టించడం మంచిదని ఈసరయ్య గట్టిగా అభిప్రాయపడ్డాడు. హోటలికొచ్చే జనం రామమందిరంలోకి రావచ్చు. మందిరానికొచ్చే జనం తన హోటలుకి రావచ్చు.

కంట్రాక్టరుకిది సబబుగానే తోచింది. "మంచిదే" అన్నాడు. సెట్టికి యింకా పెద్ద ఊహపోయింది. "ఈసరయ్యా, మాటవరసకి అడుగుతాగానీ – నువ్వు ఓ కిరాణా దుకాణం కూడా అక్కడెట్టరాదూ?" అన్నాడు.

సూరయ్యగారు కలుగజేసుకున్నాడు. "మీకు తెలీదులెండి. ఊరి మధ్య మాసరమ్మ దుకాణం వుంది. ఉప్పూ, పప్పూ అంతా అక్కడే కొంటారు. ఇక వీడు వూరి చివర పెడితే ఎవడొస్తాడు" అన్నాడు.

"దానికేముందయ్యా బ్యామ్మడా! ఊరి చివరాళ్లే వత్తారు. నువు చెప్పిన దుకాణం కన్నా ఓ దమ్మిడీ తగ్గించి ఇస్తే ఊరి మద్దోళ్లు కూడా వత్తారు. దానికేటి, ఊరే ఉండాలికాని. ఏమంటావు ఈసరయ్యా – నువ్వు ఊఁ అను. నేను బస్తీ నుంచి నీకు వారం వారం సరుకు పంపెత్తా, అమ్ముకో, వచ్చే పావలా డబ్బుల్లో బేడ నీకు, బేడ నాకూ నాయంగా." ఈసరయ్య ఎగిరి గంతేశాడు. "అంతకన్నానా" అన్నాడు. కంట్రాక్టరుకి కొత్త ఊహ తోచింది – "ఊరు పెరుగుతుంది. నలుగురూ ఇళ్ళు కట్టుకుంటారు. ఆనక అదే నడిమధ్య అవుతుంది" అని. ఈసరయ్య ఆనందం పెల్లుబికింది. "సూరయ్య గారూ! చల్లకొచ్చి ముంత దాచడమెందుగ్గానీ ఓ మాటచెప్తా. మీరు గనక రామ్మందిరం ఊరి చివర కట్టిత్తానని మాటిస్తే రైతు కుర్రాళ్ళ ఓట్లు, పాలేళ్ల ఓట్లు మీకే. అళ్ళంతా నాకు అణా బేడా కాఫీడబ్బులు బాకీ ఉంటారులెండి. మనమాట కాదనరు" అన్నారు.

సూరయ్య బుర్ర వేడిగా పనిచేస్తోంది.

"ఏమోయ్. ఈసరయ్యా – నువ్వు దుకాణం, హోటలూ కలిపి పెట్టాలంటే ఆ పాక లాభంలేదు, కాస్త షెడ్డులాంటి దుండాలి. షెడ్డు వేయించుకుని ఇటికలతో గోడ కట్టించాలి. ఎండా వానా వచ్చినా చెక్కు చెదరకుండా పడుంటుంది" అన్నాడు కంట్రాక్టరు.

"ఓరబ్బో! ఇటికల గోడా, రేకుల షెడ్డే!?.... మానం తూగలేవండి" అన్నాడు ఈసరయ్య.

"వెయ్యి రూపాయల్లో కట్టించిపెడతా."

"ఏటిబాబూ మీ మాటలు మరీ ఇదిగానీ, ఏడొందలు జనం ఉన్న ఊరికి ఎయ్యిరూపాయిల షెడ్డేటిబాబూ" అన్నాడు ఈసరయ్య నానుస్తూ.

"అదికాదోయ్. రేపు ఊరు పెరుగుతుంది. ఓ సినిమా డేరా వేస్తారు. చిన్న బజారు లేస్తుంది. అపుడు సరుకు గిరాకీ పెరిగితే నీ వంతు ఖర్చు పెట్టగలవా – పోనీ అందాకా మట్టిగోడమీద రేకు వేయించు" అన్నాడు కంట్రాక్టరు.

సుబ్బిశెట్టి కొంటెగా నవ్వాడు. కంట్రాక్టరు పెరట్లో తుప్పుపట్టిన రేకులున్నాయి. వాటికి రంగేయించి తోసెయ్యాలని ప్లాను. అందుకే ఈసరయ్యకి ఈ మాలీసు. మందిరం ఎలాగా తనే కట్టిస్తాడు – కాబట్టి దానికి పనిచేసే కూలీలతో చిల్లర మల్లర సామానులతో ఈ షెడ్డు చవకలో లేపుతాడు. చివరికి వందరూపాయలకు బేరం కుదిరింది. కంట్రాక్టరుకి ఉషారొచ్చింది, తుప్పురేకులికి వందరూపాయలు గిడుతున్నందుకు. "ఇంకేం పంతులూ – రామమందిరం ఊరి చివర్ని కట్టిస్తానని చెప్పు నలుగురికీ" అన్నాడు.

గవరయ్య కూడా సరేనసేశాడు. దేవాలయ పూజారి కూతుర్ని గవరయ్య తన కొడుక్కి చేసుకుందామనుకున్నాడు. అందుకని ఈ ఊళ్ళో పూజారిపార్టీ ఓట్లు సూరయ్యగారికే ఇప్పిస్తానన్నాడు.

"రాముడూ, కాళ్ళు కడుక్కోవచ్చని చెప్పరా" అంది సూరమ్మగారు వంటింట్లోంచి.

భోజనాలయాక సూరయ్య, శెట్టి, ఈసరయ్య, కంట్రాక్టరూ, గవరయ్యా కరణంగారింటికెళ్ళి సంగతి చెప్పారు, రామమందిరం ఊరి చివర కట్టించడానికి నిశ్చయం అయిందని. కరణం గారేమంత ఉత్సాహం చూపించలేదు. తనతో మాటామంతీ లేకుండా సూరయ్య తక్కినవాళ్ళతో లాలోచీ అయి నిర్ణయాలు చేయడం ఆయనకి సయించలేదు. "సరే కానియ్యండి" అన్నాడు చప్పగా.

"మీ అండ మాకుండగా గెలుపు సందేహం ఏముందండీ" అన్నాడు వెకిలిగా సూరయ్య.

"ఆ! మాదేవుంది లెండి. ఏదో చిన్నవాళ్ళం." వెక్కిరింపుగా గొణిగాడు కరణంగారు.

సూరయ్యకు వినపడ్డా వినిపించుకోలేదు.

"ఎంతమాట! సెలవు – వస్తా" అన్నాడు.

☆ ☆ ☆

తెల్లవారింది. సూరయ్యగారూ, ఆయన బృందం ఓ పక్కా; బంగారయ్యా, సుందరం ఓపక్కా బయల్దేరి మనిషి మనిషినీ మాలీషు చేసి మంచి చేసుకోసాగారు.

మెడమీద తలవున్న పెద్దలు నలుగురూ చప్పరించారు, ఏదో దీనికీ ఎన్నికలేమిటి – ఎందుకు పార్టీలూ, ప్రచారాలు అని.

రామారావూ, వీర్రాజూ విడిగా ఓ పార్టీ అయ్యారు. "సూరయ్య గారికి మీరు ఓట్లివ్వకండి, ఊరు చివర రామాలయం ఏమిటి – నా తలకాయ! మా మావయ్యయితేనేం, నేను సబబు మాట్లాడుతున్నా" అని కనబడ్డవాళ్ళతో అన్నాడు.

కరణంగారికీ, సూరయ్యగారికీ ఈ సంగతి తెలిసి మండిపడ్డారు – "బుద్ధిలేకపోతే సరి. పెద్దవాళ్ళం వోపక్క నలుగుర్నీ ఆకట్టుకోలేక ఛస్తూంటే మధ్య పుల్ల విరుపుమాటలివేమి"టని.

బంగారయ్యగారు మధ్యాహ్నానికి కొత్తరకం ప్రచారం లేవదీశారు – రామమందిరం ఊరిమధ్యని కట్టించడమే కాకుండా దానికి వెనకాలవైపు వేరే ఓ పాక వేయించి అక్కడ చదరంగం అదీ ఆడుకోడానికీ, నవల్సా, నాటకాలూ చదువుకోడానికీ, లోకాభిరామాయణానికీ ఏర్పాటు చేయిస్తానన్నాడు. హరికథలూ, పురాణాలు జరపడానికి చిన్న చెక్కబల్లల స్టేజీ కట్టిస్తానన్నాడు.

సుందరం సిల్కు చొక్కాలు ఆ ప్రచారానికి కొంత తోడ్పడుతున్నాయని సూరయ్యగారి మురాకి హఠాత్తుగా తట్టింది.

తిరిగి తిరిగి మధ్యాహ్నం ఇంటికొచ్చేసరికి రామారావూ, వీర్రాజూ పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుకుంటున్నారు. "నీకూ బెబ్బెబ్బే నీ తాతకూ బెబ్బెబ్బే" అన్నట్టు దొంగరాముడు అండ్ కో వారు బస్తీ పెద్ద మనుషుల్ని దోచుకుని, పత్తా లేకుండా పారిపోయారు. వాళ్లకి పదిరూపాయలు బజానా యిచ్చి ఆస్థాన చోరులుగా ఉంచుకోబోయిన వీర్రాజుకీ, రామారావుకీ కూడా ఎగనామం పెట్టారు.

సూరయ్యగారు సావిట్లో అడుగుపెడుతూనే మండిపడ్డాడు. "ఏరా రాముడూ, నాకు ఓట్లివ్వద్దని ఊళ్ళో అందరికి చెబుతున్నావుటగా? బుద్ధిలేదూ? సుందరంగాణ్ణి చూడు. వాళ్ళ బాబాయి కోసం ఒక్కలా తిరుగుతూ నోరు పడిపోయేటట్టు ప్రచారం చేస్తున్నాడు సిల్కు చొక్కాలేసుకుని. వాణ్ణి చూసేనా సిగ్గు తెచ్చుకో" అని కసిరాడు. రామారావుకి కోపం వచ్చింది. "మావయ్యా నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు. నేను నీ తరఫున ఒక్క మంచి ముక్క ఆడను. ఇంక దేనికైనా అయితే ఏమోగానీ ఈ విషయంలో మాత్రం నాకు తోచినదే నేను వాగుతాను. నా యిష్టం. నీక్కోపం వచ్చినా, అమ్మకి కోపం వచ్చినాసరే" అన్నాడు.

"ఏమిట్రా ఆ పొగరు. ఏం చూసుకొని అంత మిడిసిపాటు? విశ్వాసం లేకపోతేసరి. అయ్యో తండ్రిలేని బిడ్డ గదా అని సాకినందుకు బాగానే బుద్ధి చెప్పావులే.... అసలు నాదే తప్పు. గంగలో కలవండని నా దారి నేను చూసుకోవలసింది. ఛీ" అన్నాడు సూరయ్యగారు.

రామారావు ఉద్రేకంతో లేచి జవాబివ్వబోయాడు. కాని వీర్రాజు పట్టుకుని వారించాడు. ఈ గోలకి వంటింట్లోంచి సూరమ్మగారు రావడంతో సూరయ్యగారు పనివున్నట్టు జారుకున్నారు.

"పిన్నిగారూ – వీడిదేం తప్పులేదండీ. ఆయనే అనవసరంగా కోప్పడ్డారు" అన్నాడు వీర్రాజు.

"ఏదోలే నాయినా, ఇదంతా నా ఖర్మ. వీడి వాలకం ఇది, వాడి వాలకం అది. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడేను. ఎవరితో చెప్పకుని ఏడిచేది బాబూ, ఆ మారాజే ఉంటే నాకీ గతి పట్టేదా...." అంది.

"అబ్బెబ్బే. మీరలా కంటనీరెట్టుకోకండి పిన్నిగారూ, అన్నిటికీ దేవుడే వున్నాడు" అన్నాడు వీర్రాజు.

రామారావు సందుచూచి చిట్కా వేశాడు. "ఏం దేవుడురా. దేవుడూ దెయ్యమూను. దేవుడు వుంటే నాకిష్టంలేని పిల్లని ఒద్దు మొర్రో అంటూంటే ఇలా నెత్తిన రుద్దనిస్తాడా మామయ్యచేత."

సూరమ్మగారికి కోపం వచ్చింది. "ఏమిట్రా నీ ఇష్టం? ఇప్పుడు నీకొచ్చిపడ్డ కష్టం ఏమిటి! వంశంలోనే లేవమ్మా ఇలాంటి బుద్ధులు. ఆయన వెళ్ళినా ఇంకా ఈ ఘటం మిగిలింది.... ఏం? కరణంగారి పిల్లకేమొచ్చిందిరా. అన్నీ కుదిరాయి! నేనూ మావయ్యా అవునన్నాం. తీరా రేపు తాంబూలాలు యిచ్చుకోబోతూ వుంటే ఏవిటీ భాగోతం? శాస్త్రం చెప్పినట్టుంది."

వీర్రాజు ఒళ్ళంతా తేళ్ళూ జెర్రులూ పాకినట్టయింది ఈ మాటలు వినగానే. బుర్రలో రైళ్ళు పరుగెత్తాయి. అమాంతం సీత తనకి రాసిన ఉత్తరం చూపించేద్దామను కున్నాడు నిజం చెప్పేసి. కాని పూర్తిగా తగ్గిపోయి తలవంచుకున్నాడు. రామారావూ తలవంచేసుకున్నాడు. ఇంకా వాదిస్తే అమ్మ మళ్ళీ నూతిలో దూకుతానంటుంది. ఇలాంటి గోల నాలుగుసార్లు జరిగింది.

"రారా రాజా, అలా వెళ్లొద్దాం" అన్నాడు.

ఇద్దరూ రోడ్డంట పోతూవుంటే తెలుకుల వీరయ్యసావిడిలో పెద్ద దీపం వెలుగుతున్నట్టు ఇద్దరికీ కనపడింది. రామారావుకి కనపడిన దీపం పేరు సుబ్బలక్ష్మి, వీర్రాజుకి గోచరించిన దీపం పేరు సీతాలక్ష్మి.

రామారావు, వీర్రాజు ఆగిపోయి యమవేగంతో ఆలోచించారు. గబగబా చెవులు కొరికేసుకున్నారు.

"నీకు ఫరవాలేదులేరా నేను క్షణంలో తేల్చేస్తాను సంగతి. మన బంగారం అనగా నా హృదయేశ్వరి ఉండగా భయమెందుకురా?" అన్నాడు వీర్రాజు. తెలుకుల వీరయ్య సావిట్లో ప్రవేశించారు ఇద్దరూ. సుబ్బులూ, సీతా గానుగమీద కూర్చుని తిరుగుతూ కబుర్లు చెప్పకుంటున్నారు. తెలుకుల వీరయ్య గానుగ ఆడుతున్నాడు కునుకుతూ.

"ఏం వీరయ్యా! కులాసానా?" అన్నాడు వీర్రాజు. గానుగమీద అమ్మాయిలిద్దరూ ఉలిక్కిపడి గానుగ దిగిపోయారు. "ఏదో తమ దయవల్ల ఇలా వున్నాం" అన్నాడు వీరయ్య. సీత పకపక నవ్వింది. "మీరా, ఎవరో పెద్ద మనుషులనుకున్నా" అంది. రామారావు ముఖం రంగు కొంచెం మారింది సుబ్బుల్ని చూడగానే. సుబ్బులు తలవంచుకుని అవతలమూలకి వెళ్ళి నించుంది. రామారావు ఇవతలమూల చిన్న అరుగుమీద చతికిలబడ్డాడు — కాళ్లు వణుకుతున్నట్టు కనబడకుండా ఉండాలని. వీర్రాజు మాత్రం గుండె నిబ్బరంగల మనిషి. ఒళ్లు పులకరించడం, కాళ్ళు వణకడం, మాట తడబడడం అతనికి రావు, లేవు. "సీతా, హాస్యాలకేంగాని యిలారా మాట" అన్నాడు తొణుకూ బెణుకూ లేకుండా. సీత కొంచెం నివ్వెరపోయింది,

వీర్రాజు ధీమాచూసి. ఆపైన రామారావు వంక రెప్ప వెయ్యకుండా చూసింది. సాలోచనగా ముందుకు వచ్చింది. "నీకేమయినా మతిపోయిందా రాజూ, ఎవరేనా మననిచూస్తే ఇంకేమైనా ఉందా!" అంది.

"కాదు సీతా, వెంటనే వెళ్లిపోతాం. కాని ఒక ముఖ్యమైన సంగతి అడగాలి" అన్నాడు వీర్రాజు ప్రాధేయపూర్వకంగా. సీత రామారావు వంక బాధగా జాలిగా చూసింది. "రాజూ, నాకు తెలుసు నువ్వు చెప్పబోయేది" అని తలవంచుకుంది.

"మనసులు కలవనప్పుడు మనుషులు కలవడం అసంభవం. పెళ్ళి అనేది అయితే వరం. కాకపోతే శాపం. అంతే రాజ్! నీ హృదయం ఇంత గొప్పదనుకోలేదు రాజ్! నాకు తెలుసు, రామారావు నన్ను ప్రేమించాడు. అయితే విధివశాత్తూ ఛిద్రమైపోయిందని నాకు తెలుసు. నువ్వు అతని స్నేహితుడవు కాబట్టి అతని కోసం నీ సౌఖ్యం త్యాగం చేసుకుని, నా హృదయాన్ని అతని కర్పించమని కోరడానికి వచ్చావు... కాని రాజ్! మనసులు కలవకపోతే మనుషులు కలవరు. ఇంకేం చెప్పకు. నా హృదయం ద్రవించిపోతోంది..." అంది.

వీర్రాజుకి జుట్టు పీక్కునే పర్యంతం మతిపోయింది. "ఇదెక్కడి గోల సీతా? తెలుకులాడు వింటే మావాళ్ళెవరో చచ్చిపోతే నువ్వు నన్ను ఓదారుస్తున్నావనుకుంటాడు... నేచెప్పేది కాస్త వినవేం–"

"కాదులే రాజ్! నా మాటకు తిరుగులేదు. నిన్నూ నన్నూ వేరు చేస్తే నూతిలో దూకుతానని మా అమ్మకు చెప్పాను." "నిన్నూ నన్నూ దేవుడు కూడా వేరుచెయ్యడులే కాని చెప్పేది విను" అన్నాడు రాజు.

సీత వినిపించుకునే ధోరణిలో లేదు. "రాజ్! హామ్లెట్ కథ తెలుసా?... కాదు రోమియో... రోమియో కథ తెలుసుగా. ముందర ఓ కన్యని ప్రేమించాడు. విఫలుడయ్యాడు. మళ్ళీ ఇంకో కన్యని ద్విగుణీకృతమైన ప్రేమతో ప్రేమించాడు. అమరజీవి రోమియో... రామారావుకి నువ్వు చెప్పు. వృధాగా హృదయాన్ని వ్యధ పెట్టవద్దని చెప్పు. సుబ్బుల్ని ప్రేమించమను. దానికి అతనంటే తగని ప్రేమ. ఎంత ప్రేమో చెప్పలేను. దాన్ని ప్రేమిస్తే వాళ్లిద్దరి జీవితాలూ హాయిగా..."

"హిప్ హిప్ హుర్రె" అన్నాడు వీర్రాజు అమాంతం ఎగిరి గంతులేస్తూ. "ఏమిటి బాబూ?" అన్నాడు తెలుకుల వీరయ్య. "ఏమిటి రాజ్?" అంది సీత.

"ఏమిటీ లేదు కోవటీ లేదు. వాడిక్కావలసిందదే. సుబ్బులుకి వాడంటే యిష్టం ఉందో లేదో తెలుసుకొందామనే నిన్ను అడుగుదామని వచ్చాం" అన్నాడు వీర్రాజు. సీత బరువుగా నిట్టూర్చింది. "నా హృదయ భారం తగ్గింది రాజూ... మళ్ళీ చెబుతున్నా – సుబ్బులు రామారావుని ప్రేమిస్తోంది" అంది సీత.

"రైటో. ఫస్టుక్లాసయిన పని చేస్తోంది. సరే, మరిప్పుడు వాడితో మాట్లాడుతుందేమో కనుక్కో."

"మాట్లాడదు. మనకున్న విశాలభావాలు, ధైర్యం లేవుదానికి... తగని సిగ్గు" అంది సీత.

"మరేం ఫరవాలేదు. ఆడదానికి అందం సిగ్గన్నారు. మన సంగతి వేరనుకో.... పోనీ వాడికేసి ఓ చిరునవ్వేనా విసురుతుందేమో అడుగు... తెల్లవార్లూ ఆ నవ్వును తలచుకుని జాగారం చేస్తాడు" అన్నాడు రాజు.

"నీకు బొత్తిగా ఒళ్ళు పొగరెక్కిందే రాజ్! హృదయాలతో వేళాకోళాలాడుతున్నావు."

"పోన్లే వద్దులే. వస్తా సీతా. నీకు దేవుడు మేలుచేసి నాకిచ్చి పెళ్ళి చేయించుగాక... వస్తా వీరయ్యా, మళ్ళీ వస్తా" అన్నాడు వీర్రాజు బయటికి నడుస్తూ. రోడ్డెక్కగానే రామారావు నిట్టూర్చాడు 'హమ్మయ్య' అని.

"అదృష్టవంతుడివిరా రావుడూ! సుబ్బులు నీకోసం తిండీ తిప్పలూ మానేసి ఏడుస్తోందిట" అన్నాడు రాజు.

రామారావు ఆనందం అవధులు దాటిపోయింది. మాటలు రాలేదు. వీర్రాజు చెయ్యి పట్టుకుని ప్రగాఢంగా అదిమాడు. కాసేపు ఆగి మెల్లగా అన్నాడు – "ఇంకో గొప్ప అదృష్టం. ఈ సీత నా పాలబడకుండా నిన్ను ప్రేమించడం! ఆ హృదయం నాకే అర్పిస్తే గుండాగి చచ్చేవాణ్ని!"

వీర్రాజు జవాబివ్వలేదు – కోపం వచ్చింది.

"ఎవడ్రావాడు? ఇతర దేవతలూ వాళ్ళూ సముద్రం చిలికిన హాలాహలం వస్తే మింగేశాడు? ఎవడో... దేవుడే." రాజు జవాబివ్వలేదు దీనిక్కూడా, ఆ దేవుడి పేరు గుర్తుకొచ్చినా.

"నాకు గుర్తు రావడం లేదు. మొత్తానికి అంతవాడివి నువ్వు. నీకసలు అది ఎలా నచ్చిందిరా?" అన్నాడు రామారావు నవ్వుతూ.

"సీత హృదయం నీకర్థం గాదులేరా" అన్నాడు రాజు బరువుగా.

"అందుకే ఇంత సంతోషం...కొండల్లె వచ్చిన కష్టాలు మంచల్లె కరిగిపోతున్నాయి కదరా రాజా, దేవుడు లేడని బొత్తిగా కొట్టిపారెయ్యడానికే వీల్లేదు సుమా!" అన్నాడు రామారావు విలాసంగా పొగవదుల్తూ.

☆ ☆ ☆

రాత్రికి బంగారయ్య, పంతులుగారి బడిలో రామభజన, పురాణ కాలక్షేపం ఏర్పాటు చేశాడు. ఊరంతా దండోరా వేయించాడు.

రామారావు మావయ్య, పెద్ద మనుషులూ మండిపడ్డారు దండోరా విని.

"చూశావుటోయ్ – వీడి గుంటనక్క ఎత్తులూ వీడూను – రేపు ఎన్నికలు పెట్టుకుని ఇవాళ భజనలూ, హరికథలూ పెట్టిస్తాడూ జనాన్ని వశపరచుకోడానికీ! హమ్మ వెధవ హెంత పన్నాగం!" అన్నాడు సూరయ్య.

"సూరయ్య గోరూ – యీడి పోటీ తట్టుకోవాలంటే మనం సానిమేళం ఎట్టించాలి. బలేరంజుగా వుంటుంది" అన్నాడు సుబ్బిశెట్టి కళ్లెగరేస్తూ.

"మేళమెందుకేస్ ఈపాటిదానికి. మేళమంటే మాటలనుకున్నావా ఏం... డబ్బు ఖర్చుతో పని, మనవూ౦ భజనే పెట్టిస్తే సరి" అన్నాడు కంట్రాక్టరు నవ్వుతూ.

గవరయ్య వారించాడు. "మీకు తెలీదండి. భజన కూడా పెట్టకూడదు, నన్నడిగితే. వాడు పెట్టాడని మనమూ పెడితే పోటీ భజనంటారు. బాగుండదు. అదీగాక చేతి

అముదం ఎందుకూ? – అయినా వీడి భక్తి చట్టుబండలుగానూ – యిదటయ్యా పద్ధతి! మనం దండోరా వేయించాలి. 'మాకు దొంగ భక్తి లేదూ, మాంసం తింటే ఎముకలు వేళ్లాడగట్టుకుని తిరుగుతారా – అంచేత మాకు భక్తి పుష్కలంగా వున్నా మేము భజన పెట్టించలేదు – రామమందిరం కట్టించడం ద్వారానే మా భక్తి వెల్లడవాలీ' అని చాటిస్తే చాలదయ్యా" అన్నాడు.

సూరయ్య ఆలోచించాడు "చాటించొద్దుగానీ మనవేఁ నలుగురికీ చెప్పేద్దాం" అన్నాడు.

బంగారయ్యగారు ఏర్పాటు చేసిన భజనకి చాలామంది జనం వచ్చారు. సుబ్బలక్ష్మి వచ్చింది. రామారావుని దూరం నించి చూసింది. ఆమె మందహాసం రామారావుకి కనబడిపోయింది.

హరికథ పూర్తి కాకుండానే జగన్నాథం గారొక్కరూ యింటికెళ్ళిపోయారు.

ఇది చూసి వీర్రాజు సుందర్రావుని పిలిచాడు. "ఆయన ఒక్కడే వెళ్లాడు సుందరం! ఇపుడే వెళ్లి చెప్పెయ్ నువ్వు సుబ్బుల్ని చేసుకోవనీ, పైగా చెన్నపట్నం వెళ్ళిపోతున్నాననీ – పనిలో పని – రామారావు... ఒద్దులే – నీ సంగతి చెప్పెయ్ చాలు" అన్నాడు.

సుందరం నవ్వాడు. హరికథ అవనిచ్చి సుబ్బుల్నీ వాళ్ళమ్మనీ దిగబెట్టే నెపంతో వెళ్లి మాట్లాడేస్తానన్నాడు.

రామారావు మర్నాడీ సంగతి విని "హమ్మయ్య" అన్నాడు. "పంతులూ – సమస్యలు మెల్లిగా పరిష్కరించి అవతల పారేస్తున్నాం" అన్నాడు కథా సంగ్రహాన్ని ఒక్కమాటలో సమీక్షిస్తూ.

ఇంక ఒక్కటే తరువాయి – మావయ్య ఓడిపోవడం, కరణంగారితో తన విషయమై చేసుకున్న ఒప్పందానికి ఎగనామం పెట్టడం. మూడోదీ, ముఖ్యమైనదీ సుబ్బలక్ష్మితో పెళ్ళి. ఇందులో సగంపని పూర్తి అవనే అయింది. సుబ్బులికి తనంటే ఇష్టం వుంది. సీతకి తనంటే ఇష్టం లేదు. రాజుకి సీతంటే యిష్టం. సీతకి 'రాజ్' అంటే ఇష్టం. మావయ్య పన్నాగంలో ఒక భాగమయిన సుందరం – సుబ్బలక్ష్మి వివాహం పకోడి మంత్రంతో ఛిన్నాభిన్నమైపోయింది. సుందరం రాత్రి వెళ్లి తను చెన్నపట్నం వెళ్లిపోతున్నట్లు సుబ్బులు తండ్రితో చెప్పేశాడు.

ఇక ద్వితీయభాగం ఒకటే. ఈ భాగంలో రామారావు ఆస్తి – హీరోయిన్ అనగా కథానాయిక కరణంగారు – హీరో లేక నాయకుడు – ఆయన రామారావు ఆస్తిని గాఢంగా ప్రేమించాడు. వరించడానికి తిప్పలు పడుతున్నాడు. ఈ స్వయంవరానికి సూత్రధారి రామారావు మావయ్య సూరయ్య. మావయ్య ఈ సత్కార్యానికి చేసే కృషివల్ల ఆయనకి కరణంగారి ముఠా ఓట్లు వస్తాయి. ఓట్లు వస్తే ఎన్నికల్లో గెలుస్తాడు. గెలిస్తే రామమందిరం నిర్మాణానికి కంట్రాక్టరిని నియోగించి తన బాకీ నుంచి తప్పించుకుంటాడు. కంట్రాక్టరుకీ డబ్బు ముడుతుంది. ఊరి చివర రామమందిరం కడితే ఈసరయ్య వ్యాపారం బాగుపడుతుంది. చివరికి అంతా సుఖంగా ఉంటారు.

కానీ రామారావే సుఖంగా ఉండడు. కథానాయకుడు మట్టి కొట్టుకుపోయి,

దగుల్బాజీలు పరస్పరం రాజీలుపడి బాగుపడిపోతారు. అపుడు కథ కంచికి, జనం యింటికి వెళ్ళడం కుదరదు.

"డామిట్, ఎక్కడో అక్కడ కథ అడ్డం తిరగాల్సిందే, లేకపోతే తిప్పాల్సిందే" అన్నాడు రామారావు.

రాత్రి హరికథ మూలాన వీర్రాజుకి నిద్ర ముంచుకొస్తోంది. "ఏవిఁటోరా – రాత్రి దాసుగారు సెలవిచ్చినట్లు మనమంతా నిమిత్తమాత్రులం. అంతే. కథలు మనం అడ్డం తిప్పేదేవున్నిరా" అన్నాడు ఆవలిస్తూ.

"అందుకే కథ అడ్డం తిరగడం మన చేతిమీదుగానే జరగాలి" అన్నాడు.

"నీ బొంద. నీకంత శక్తేదీ. దొంగరాముడి ఎదాన పది రూపాయలు పోశా. వాడిచేత ఏదో చేయించి ఉద్ధరిస్తానన్నావు. వెధవ, పత్తాలేడు – వాడి మూలాన్ని కథ ఎదురు తిరిగి యీ దొంగరాముడి చేత దోచుకోబడిన మీవాడి నేస్తాలు మరింత ప్రచారం చేస్తున్నారు. ఏవిటో!...కాసేపు పడుకో యింటికెళ్ళి."

"వూరు నానాగోలగా ఉంటే నిద్రేవిట్రా బడుద్దాయ్. లేరా" అంటూ బలవంతాన వీర్రాజుని బయల్దేరదీశాడు రామారావు.

పదడుగులు వేసే సరికి సుందరం ఎదురయ్యాడు రామానాయుడు జట్కాలో. "సాయంత్రం మెయిలుకే వెళ్ళడానికి నిశ్చయించుకున్నానండీ. మీరు మరి అడ్డు చెప్పొద్దు. మీకు నెల తిరిగేలోగా డబ్బు మనియార్డరు చేస్తా. మీ మేలు మరిచిపోలేను" అన్నాడు రామారావుతో. వీర్రాజు వంక తిరిగి "రాత్రే జగన్నాధంగారికి చెప్పేశానండి. ఆశ్చర్యపడ్డాడనుకోండి. అమ్మాయి బాధపడుతుందని అన్నాడు. అమ్మాయికి ఎవరంటే ఇష్టమో నాకు తెలుసు, కావలిస్తే కనుక్కోండి అన్నా. ఆయన లోపలకెళ్ళి ఆవిడతో చెప్పాడు. ఆవిడ పేరు పేరునా చెప్పి అడిగింది. చివరికి వీరి పేరు (రామారావుని చూపిస్తూ) చెప్పగానే బోలెడు సిగ్గుపడి పెరట్లోకి పారిపోయిందండి" అన్నాడు.

అమాంతం సిగ్గుపడిపోయిన రామారావు సిగరెట్ పొగ బయటికి వదలబోయి లోపలికి మింగేశాడు. సుందరం మృదువుగా నవ్వాడు. "రామారావుగారూ, మీరదృష్టవంతులు. సుబ్బులు బంగారు తల్లి. సెలవండి" అని బండి వాడితో "పోనీవోయ్ త్వరగా" అన్నాడు.

మధ్యాహ్నం మూడుగంటలయ్యేసరికి రచ్చబండ దగ్గర పిల్లా మేకా పోగయ్యారు. కాసేపటికి పెద్దలంతా చేరుకున్నారు. నవ్వులాటలూ, ఎత్తిపొడుపులూ, ఎకసక్కాలూ, ఏడుపులూ, ఈలలూ, వాదోపవాదాలూ మొదలైన సరంజామాతో అంతా గోలగోలగా సందడిగా వుంది.

సూరయ్య, బంగారయ్య ఉపన్యాసాలిచ్చారు. రామమందిరం ఊరుమధ్య ఎందుకు కట్టించాలో, ఊరు చివర ఎందుకు అవసరమో ఎవరికి వారు సమర్థించారు. ఊళ్ళో స్వార్థపరులవల్ల నాశనం యెలా దాపరిస్తుందో విడివిడిగా వివరించారు. అందరూ ఐకమత్యంగా ఉండాలని ఏకగ్రీవంగా ఉద్ఘోషించారు. అదే బలం అని కూడా అన్నారు. ఆ తరువాత అదన్నారు ఇదన్నారు. ఆఖరున మీ ఓట్లు మాకే, మీ పాట్లు మీకే అన్నారు.

సభికులలో కొందరు గంభీరంగా తలలూపారు. మాటల విలువలు తూచుతూ కొందరు నవ్వారు. కొందరు హేళన చేశారు. ఆ మారాజు డబ్బిచ్చి రామమందిరం కట్టించుకోండయ్యా అంటే ఈ గోలా పోటీలు ఏమిటన్నారు కొందరు గట్టిగా.

చివరికి ఓట్లు లెక్కపెట్టి వారో వీరో తేల్చే ముహూర్తం వచ్చింది. కరణంగారు పెద్దగా కూర్చున్నారు. తీరా అంతా సిద్ధమై సై అంటే సై అన్నాక కొందరు చేతులెత్తడానికి భయపడ్డారు. ఒక బీదరైతు 'బంగారయ్యకే నా ఓటు' అంటూ చెయ్యి ఎత్తబోయాడు. వెంటనే సూరయ్య పార్టీవాడైన సుబ్బిశెట్టి (ఆఫ్ ఢంకా పలాస్ ఫేం) ఓ చూపు చూశాడు... ఈ ఏటి పంట సుబ్బిశెట్టే బేరం పెట్టాడు. శెట్టికి కోపం వస్తే అది కాస్తా చెడుతుందని రైతుకి బాగా తెలుసు. అందుకని ఓటు ఉపసంహరించాడు.

"అదుగో బెదిరింపు. ఆ ఓటు నాకే... ఎత్తు చెయ్యి!" అని బంగారయ్య కర్కశంగా అరిచాడు. బంగారయ్య కేకలోని కర్కశత్వం, కక్కుర్తి, అధికార దాహం కొందరికి జుగుప్స కలిగించింది. రామారావుకి ఏవగింపుతో ఒళ్ళు జలదరించింది.

'ప్రజాస్వామ్యం' అన్నాడు వీర్రాజు.

'ముఠాస్వామ్యం' అన్నాడు రామారావు.

'డబాయింపు స్వామ్యం' అన్నాడు ప్రక్కనే వున్న జగన్నాథంగారు. జనంలో రొద ప్రారంభం అయింది. ఈ దారుణం చూడగానే కొందరికి అసహ్యం వేసింది.

"సూరయ్యగారికి జై" అనేశారు కంట్రాక్టరూ, సుబ్బిశెట్టి సందుచూసి. వెంటనే అక్కడి కుర్రాళ్ళంతా "సూరయ్యగారికీ జై" అన్నారు. సుబ్బిశెట్టి అన్నాడని కొందరూ, – కంట్రాక్టరు అన్నాడని ఈసరయ్యా, అతని ముఠావాళ్లూ – లోపాయికారీ ఒప్పందం ప్రకారం కరణంగారి జనం, – సూరయ్య మరీ మరీ చెప్పి సిద్ధం చేసుకున్నవారూ – ఈ జయ ధ్వానంలో ఒక్కసారిగా చేరారు. ఓటింగ్ జరక్కుండా శెట్టీ వాళ్లు ఎందుకు జై అన్నారో ఎవరికీ బోధపడలేదు. బంగారయ్య కొంచెం తెల్లబోయాడు. తన పార్టీ మనిషిని మోచేత్తో పొడిచాడు. అతగాడు వెంటనే "బంగారయ్యగారికీ జై" అన్నాడు. బంగారయ్య మనుషులు గొంతులెత్తేలోపే సూరయ్య మనుషులు మళ్లీ 'జైజై', సూరయ్యకి జై అన్నారు. దాంతో కరణంగారు కండువా సవరించుకుని "సూరయ్యగారే గెలిచారు. డబ్బు ఆయనకే అప్పగిస్తాం" అని ప్రకటించారు. బంగారయ్య అభిమాని మునసబుగారు అడ్డుతగిలాడు. "ఓటింగు లేకుండానే గెలిచినట్లు ఎలా ప్రకటించావయ్యా" అని గద్దించారు.

"ఇంకా లెక్కలెందుకండీ, అంతా ఆయనకే జై కొడుతున్నారు" అన్నాడు కరణంగారు సమరస భావంతో.

అమాంతంగా కంట్రాక్టరు అందుకో వారు మళ్ళీ "సూరయ్యగారికీ జై" అన్నారు. పిల్లా, మేకా, పార్టీవాళ్లూ కలిసి హుషారుగా అందుకున్నారు "జై" అని.

"హర హర! మా పెద్ద దిక్కు, మా యింటి మొగదక్షత ఇలా అన్యాయంగా గెలిచిపోతే నా గతేమిట్రా రాజా! కరణంగారు మావయ్యని వదుల్తాడురా ఇంక" అన్నాడు రామారావు బాధగా. "ఎలాగరా?" అన్నాడు వీర్రాజు.

కాలవగట్టు దగ్గిరనుంచి శృంగనాదం వినవచ్చింది. జనం అంతా అటు చూశారు.

"ఉప్పాదోనె వచ్చింది, సింగినాదం ఊదారు" అన్నాడు రామినాయుడు. కరణంగారు కాగితాలు సర్దుతున్నాడు, సూరయ్యకి డబ్బు అప్పగించే నిమిత్తం.

"ఓటింగులేందే కుదరదయ్యా" అన్నాడు బంగారయ్య.

"యింకా ఓటింగేమిటి అంతా తేలిపోతే" అన్నాడు కంట్రాక్టరు. "సూరయ్యకీ జై" అన్నాడు.

"ఆపండి ఆపండి. ఎన్నికలు ఆపండి. రామనాధం గారొచ్చారు. ఎన్నికలాపండి" అంటూ కేకలేస్తూ ఊరి బడిపంతులు శంకరయ్యగారు ఒగుర్చుకుంటూ వచ్చాడు.

అందరూ స్తబ్దులైపోయారు.

శంకరయ్యగారు అరుగుమీద నుంచుని చెప్పారు: "అయ్యలారా! మీరంతా ఒక్కసారి కాలవగట్టుకి దయచెయ్యండి. రామనాధంగారు రమ్మంటున్నారు. ఆయన సన్యాసం పుచ్చుకున్నందువల్ల ఊళ్ళోకి రారు."

జనం అంతా బయల్దేరారు రకరకాలుగా ఆశ్చర్యపడుతూ. అందరికన్న ముందు శంకరయ్యగారు ఉత్సాహంగా నడిచాడు. ఆయనకి ఈ వూరి రాజకీయాలు కూలంకషంగా తెలుసు. ఆయన మాట వినే పెద్ద లెవరూ లేరు. ఆయన బడిపంతులు కాబట్టి వాటితో ప్రమేయం పెట్టుకోడు. అందుకే ఎన్నికల సమయానికి కాలవగట్టుకివెళ్ళి కూర్చున్నాడు.

రామమందిరం నిర్మాణానికి నాలుగువేల రూపాయల విరాళం ఇచ్చి సన్యసించి రామేశ్వరం వెళ్ళిన రామనాధంగారికి, తన గ్రామంలో రామమందిరం యే దశలో వుందో తెలుసుకు పోదామనే సంకల్పం కలిగింది. ద్రాక్షారామం వెడుతూ, పనిలోపనిగా స్వగ్రామం వచ్చాడు. యాదృచ్ఛికంగా ఆ వేళకే అక్కడ కూర్చున్న శంకరయ్యగారు ఆయనకి ఊళ్ళో గొడవ యావత్తూ పూసగుచ్చినట్లు తెలియచెప్పాడు.

కాలవగట్టున, రావిచెట్టు క్రింద ఉపవిష్టుడైన స్వాముల వారికి జనం ప్రణామం చేశారు. పెద్దలు కొందరు కుశలం అడిగారు. కరణంగారూ, సూరయ్యా, బంగారయ్యా పోటాపోటీలుగా స్వాములవారిని పొగిడారు.

స్వాములవారు దేనికీ జవాబివ్వలేదు. అందరూ చెప్పదలచింది చెప్పడం అయ్యాక నిశ్శబ్దంగా ఉండమని కోరారు. జనం అంతా ఆయన మాటకోసం చెవులు రిక్కించుకు కూర్చున్నారు. చెట్టుమీద కూర్చున్న ఒక పిల్లకాకి తెలీక బాల్య చాపల్యం కొద్దీ 'కావు కావు' అంది. వాళ్ళమ్మ 'హాం' అని గద్దించడంతో నోరు మూసుకుంది. ఇది చూసిన ఒక మేక పిల్ల 'మేమే' అని నవ్వి, గబుక్కున తప్పు గ్రహించి, నాలుక కరుచుకుని చెట్టుచాటుకి తప్పుకుంది.

స్వాములవారు తాను చెప్పదలచిన నాలుగు ముక్కలు నిష్కర్షగా సూటిగా చెప్పారు. రామమందిరం నిర్మాణం ఇన్ని గొడవలు తెస్తుందనీ, దాన్ని కట్టించే పెద్దరికం కోసం ఇంతమందికీ పట్టుదలలు పెరిగి స్పర్ధలేర్పడి, రభస జరుగుతుందనీ తాము ఎప్పుడూ భావించలేదన్నారు. రామమందిరం పేరు అడ్డుపెట్టుకొని చదరంగాలూ, పేకాటలూ సాగుతాయనుకోలేదన్నారు. చాలా బాధ కలిగించిందన్నారు. స్వాములవారికి ఇక్కడి రాజకీయాలన్నీ తెలిశాయన్న సంగతి ఆయన నోటనే వెల్లడికావడంతో, ఈ రభసతో, రాజకీయాలతో ప్రమేయంలేని, ఏ పాపమూ ఎరుగని జనం, సిగ్గుతో తలలు వాల్చారు. పెద్ద మనుషులంతా యిది ఈయనకి ఎలా తెలిసిందా అని ఊహాగానాలు చేయసాగారు.



అర్ధ నిమీలిత నేత్రులై, స్వాములవారు గంభీరంగా ప్రవచించారు: "నేను దేవుడుని వెతకడంకోసం సన్యసించాను. కాలినడకన చాలా ఊళ్లు తిరిగాను. గుడిగోపురాలు చూశాను. భగవంతుడి గురించి నేనేమి తెలుసుకో గలిగానో చెప్పలేను. కాని మనుషులంతా మంచివాళ్లై సుఖంగా ఉండడమే భగవంతుడికి ప్రీతికరమనీ, ఆయన మనకు ప్రసాదించినవన్నీ అందుకేననీ, అందుకోసం ఎవరెంత కొద్ది చేసినా ఆయన సంతోషపడగలడనీ నాకు మనసారా అనిపించింది. నమ్మకం కుదిరింది. మన ఊళ్ళో రామమందిరం కట్టించడానికి, పూర్వాశ్రమంలో నేను ఆరుమాసాల క్రితం యథాశక్తి కొంత సొమ్ము వదలివెళ్ళేను. దానివల్ల పని కాకపోగా, ఊళ్లో స్పర్థలకు దారితీసిందని ఇప్పుడే తెలుసుకున్నాను. బాగా ఆలోచించుకోగా నాకు ఒకటి తోచింది. స్పర్థలు పూర్తిగాపోయి అందరూ కావాలనుకున్నప్పుడే రామమందిరం కట్టుకోవచ్చు. నేను ఇచ్చిన డబ్బుతో ఊళ్ళో పాఠశాల కట్టించాలని నా అభిమతం. మీ పిల్లలూ, తీరికైనప్పుడు మీరూ చదువుకోవచ్చు. ఇప్పుడు ఉన్న బడి ఒక తాటాకుల పాక. శిథిలావస్థలో ఉంది. అది పంతులుగారి ఇల్లు. దాన్నే పెద్దచేసి బడి కట్టించండి. ఈ కార్యభారం శంకరంగారే నిర్వహిస్తారు."

స్వాములవారి మాటలు జనానికి నచ్చాయి. కొందరు తటపటాయించారు – భగవదర్పితమైన ధనం అన్యథా వినియోగించడం అసత్కార్యం ఏమోనని.

"దానికేముంది. బడిలోనే ఒక గదిని ప్రార్థన మందిరం చేయవచ్చు. అప్పుడక్కడ చదరంగాలకీ, పేకాటలకీ, కీచులాటలకీ ఆస్కారం ఉండదు" అన్నారు శంకరయ్యగారు.

కరణంగారు చిన్న అడ్డుపుల్ల వేశారు. కడసారి ప్రయత్నంగా "స్వామీ, మీరు పూర్వాశ్రమంలో ఈ గ్రామానికి డబ్బు ఇచ్చారు. సన్యాసాశ్రమ స్వీకరణతో, ధర్మశాస్త్ర రీత్యా తాము మృతతుల్యులు. అందువల్ల ఈ సొమ్ముని అన్యథా వినియోగించాలని తమరు ఆదేశించడం ధర్మ విరుద్ధం అవుతుంది. మేము రామ మందిరమే నిర్మిస్తాం. అదే ప్రజల అభిమతం కూడా. తాము కాదనరాదు" అన్నారు.

కంట్రాక్టరు అందుకో వారు హఠాత్తుగా "సూరయ్యగారికి జై" అన్నారు.

జనం ఎవరూ ఉలకలేదు, పలకలేదు.

"మీకు రామాలయం వద్దా" అని గద్దించారు సూరయ్యగారు.

స్వాములవారు మందహాసం చేశారు. "ఎందుకు వద్దండీ రామాలయం? ఎవరు వద్దంటారు? దానికోసం స్పర్థలు వద్దంటాను. ఇప్పుడు ఈ వూరికి బడి అవసరం కాబట్టి బడి కట్టించడం మంచిది. అందులోనే రాముడికి ఒక మందిరం ఏర్పాటు చేయండి. బడే ఒక గొప్ప గుడి. ఆ గుడికి ఇవాళ మీరంతా వెళ్ళితే, మీ పిల్లల్ని పంపితే, మీకు మంచిదారి కనబడుతుంది. మీరు కోరే వరాలన్నీ ఆ దారినే

వెళ్ళితే దేవుడు ఇస్తాడు. కరణంగారు ధర్మశాస్త్రం చెప్పారు. దాని ప్రకారం నాకు ఉత్తర్వులు ఇచ్చే హక్కులేదు. అయితే మీ మంచి కోరేవాడిగా నేను మిమ్మల్ని అడుగుతున్నాను. బడి కట్టించి అందులో రాముడి బొమ్మ పెట్టి, అదే గుడి - అదే బడిగా దాన్ని మీరు గౌరవించి తరించలేరా?"

"రామనాథంగారికీ జై" అన్నాడు వీర్రాజు - స్వాములవారి పూర్వాశ్రమ నామధేయం• అలవాటున్నందువల్ల జనం జయధ్వానాలు చేసి స్వాములవారికి ప్రణామాలు ఆచరించారు. సూరయ్యా, కంట్రాక్టరూ, సుబ్బిశెట్టీ కొరకొర చూశారు. సూరయ్యకు మతి బొత్తిగా పోయింది. కంట్రాక్టరుకి, శెట్టికి, నల్లమందువారికి ఇచ్చుకోవలసిన బాకీ సమస్య అస్కారం లేకుండా పోయింది. ఈ సంగతి గ్రహించే, కంట్రాక్టరు సూరయ్య ముఖాన కత్తివాటు వెయ్యలేదు. రామమందిరం పేరుచెప్పి సంపాదిద్దామనుకున్న రెండువేల పై చిలుకూ దక్కకుండా పోయినందుకు ఏడుపు వచ్చింది. అయినా తుది ప్రయత్నం చేశాడు. 'కొత్తబడి కట్టించే కాంట్రాక్టు నాకు ప్రసాదించాలి స్వామీజీ!' అన్నాడు చేతులు జోడించి భక్తి ప్రపత్తులు వెదజల్లుతూ. స్వామీజీ మందహాసం చేశారు. "బడి కట్టడానికి ఊళ్ళో జనం అంతా శ్రమదానం చేస్తారు. నీకు అభిమానం ఉంటే సలహాలు ఇచ్చి తోడ్పడు. బడి కట్టడం ఒకటే కాదు, దాంట్లోకి పుస్తకాలు అవీ కొనాల్సి వుంటుంది" అన్నారు.

చదువరీ! కంచికి బయలుదేరిన కథ మధ్యలో తప్పదారినపడి తిరిగి హఠాత్తుగా అడ్డం తిరిగి కంచికి అభిముఖంగా బయలుదేరింది. స్వాములవారు సందేశం ఇవ్వగానే ప్రయాణం అయ్యారు. ఎందరు బ్రతిమాలినా ఆ ఊళ్ళో భిక్ష స్వీకరించారు కాదు. సుబ్బిశెట్టీ, కంట్రాక్టరూ, గవరయ్యగారూ సూరయ్యని చాటుకు పిలిచి, అతన్నీ, అతని దురదృష్టాన్నీ విడివిడిగానూ, జంటగానూ దుయ్యబట్టి, వారం తిరిగేలోగా బాకీలు చెల్లగట్టకపోతే నడివీధికి లాగుతామని హెచ్చరించి, కాలవగట్టునించే పడవెక్కి పట్నం వెళ్ళిపోయారు.

సూరయ్యగారు తలవంచుకుని విచారపడుతూ కొంపకి బయల్దేరారు. కరణంగారు వెంటపడ్డారు. సూరయ్య ఎన్నికలలో గెలవడం ఓడడంతో ఆయనకి పనిలేదు. ఓట్లు ఇప్పించేవరకే. ఒప్పందం ప్రకారం సూరయ్యగారు ఇవాళ సాయంకాలం తన మేనల్లుడు చి॥ రామారావుకి కరణంగారి కూతురు చి॥సౌ॥ సీతాలక్ష్మిని ఇచ్చి పెళ్ళిచేయించడానికి తాంబూలాలు ఇప్పించాలి.

కరణంగారు వెంటపడగానే సూరయ్యగారు మండిపడ్డాడు. "పోవయ్యా, పరువుపోయి నేనేడుస్తూంటే పెళ్ళంటావు" అన్నాడు చిరాకుగా. కరణంగారికి కోపంరాదు. వస్తే కక్ష వస్తుంది. అదొచ్చినా ఇదొచ్చినా ఆయన మనిషికాడు. ఆ సంగతే కరణంగారు గట్టిగా చెప్పి "జాగ్రత్త" అనడంతో సూరయ్యగారు సరేననేశాడు - కట్నంలో అడ్వాన్సుగా రెండువందలు తీసుకుని బస్తీలో బాకీలు చెల్లగొట్టొచ్చుననే ఊహతో.

దగ్గిరుండి సూరయ్యగారినీ, పెళ్ళికొడుకు రామారావునీ యింటికి తీసుకెళ్ళే ఉద్దేశ్యంతో "పదండి ముందు. మీ ఇంటికెళ్ళి సూరమ్మగారికి చెబుదాం. అడుగో అబ్బాయి. రా! రామారావు! రాహోయ్" అన్నాడు కరణంగారు.

కొంచెం అవతల్లగా పోతున్న రామారావ్వూ, వీర్రాజు దగ్గిర కొచ్చారు. కరణంగారు రామారావు చెయ్యిపట్టుకున్నాడు ఆప్యాయంగా. వీర్రాజు గబగబ ఆలోచించాడు కర్తవ్యం ఏమిటా అని. అరనిముషంలో స్వంతంగా ఓ ప్లాను వేసుకున్నాడు: ఇప్పుడది రామారావుకి వెంటనే చెప్పెయ్యాలి. కరణంగారూ సూరయ్యగారూ పక్కనే ఉన్నారు యమదూతల్లా – ఎలా?

వీర్రాజుకి 'గా' భాష క్షుణ్ణంగా వచ్చు. రామారావుకి 'గా' భాష బాగానే అర్థం అయిపోతుంది కాని మాట్లాడ్డం బాగా రాదు. "గర" భాష అని ఇంకో భాష వుంది. చిన్నపిల్లలూ, ఆడపిల్లలూ పరిమిత మేధాసంపన్నులూ దాన్ని వాడుతారు. పాత భాష అయినా ఈ ఆపత్కాలంలో అదే ఆదుకుంది. విద్య విదేశ బంధువన్నారు. కరణంగారి చెయ్యిపట్టుకు నడుస్తూన్న రామారావుకు అతనిపక్క నడుస్తూన్న వీర్రాజు ఈ క్రింది సందేశం ఇచ్చాడు: "వెగధగవాగాయాగా! సీగీతగ నాగాకుగు రాగాసిగినగ ఉగుత్తగరగం ఇగిందగ అగిందుగుకోగో" అంటే "వెధవాయా! సీత నాకు రాసిన ఉత్తరం ఇంద అందుకో." "సగమగయగంచూగూసిగి నగలుగుగురిగి ముగుందగరగ పెగెట్టేగేయ్" ("సమయం చూసి నలుగురి ముందు పెట్టేయ్).

రామారావు సందేశం బోధపరుచుకుని గుట్టుగా వీర్రాజు అందిచ్చిన ఉత్తరం తీసుకుని జేబులో పెట్టుకున్నాడు. వీర్రాజుకి సీత రాసిన ఉత్తరం అది. రెండు క్షణాల్లో రామారావుకి ఒక ఊహ తోచింది. తనకు ప్రావీణ్యం ఉన్న 'గర' భాషలో వీర్రాజుకి ఈ క్రింది సందేశం ఇచ్చాడు:

"ఒగారొగెరేయి రగరాజా! నుగురుగువ్వు పగరరిగెట్టుకుని మిగిరిమీ ఇగిరింటికి వెళిరెళ్లి మిగిరిమీ అగరమ్మని బగరబామ్మనీ మగర మా ఇగిరింటి తీసుకురా" (ఒరేయ్ రాజా, నువ్వు పరిగెట్టుకుని మీ యింటికి వెళ్ళి మీ అమ్మనీ బామ్మనీ తీసుకురా.)

"రైతో" అని తుర్రుమన్నాడు వీర్రాజు. "ఏమిట్రా ఆ గొణుగుడు" అని గద్దించాడు సూరయ్యగారు. "ఏదో కుర్రాళ్ళ కబుర్లు పోనిస్తురూ" అన్నాడు కరణంగారు.

ఇల్లు చేరీచేరగానే "ఇప్పుడే వస్తానండీ" అంటూ పరుగెత్తాడు రామారావు. పక్క వీధిలో ఉన్న జగన్నాధం గారింటికి సరాసరి వెళ్ళాడు. సావిట్లో ఉయ్యాల బల్లమీద కూర్చుని తలదువ్వుకుంటూంది సుబ్బలక్ష్మి. రామారావుని చూసి చెంగున లేచి స్తంభం చాటుకి వెళ్ళి నించుంది.

రామారావుకి ఈసారి ఎక్కడలేని ధైర్యం వచ్చేసింది.

రామారావు అటూ ఇటూ చూశాడు. "ఏయ్ సుబ్బులూ!" అన్నాడు మెల్లిగా. సుబ్బులు ఠపీమని ఆగిపోయి మెల్లిగా వెనక్కి తిరిగి చూసింది. రామారావు గుటక మింగాడు. రామారావుకి స్పృహ వచ్చేసరికి "ఏం రామం?" అన్నారు జగన్నాధంగారు. "ఏంలేదండీ, మీరు మాయింటికి అర్జెంటుగా రావాలి. మా మావయ్య నాకు అన్యాయం చేస్తున్నాడు.... సీతని, నాకు.... రండి.... ఏమనుకోకండి" అన్నాడు.

"అబ్బే, అనుకోడాని కేముందోయ్... కానీ చూడు..."

"మీరు సందేహించకండి... రండి చెబుతా" అని చెయ్యి పట్టుకున్నాడు రామారావు.

జగన్నాథంగారిని వెంటబెట్టుకుని రామారావు గుమ్మంలో అడుగు పెట్టేసరికి సూరయ్యగారు, కరణంగారు మండిపోతున్నారు జమిలిగా. జగన్నాథంగారిని చూసి కొంచెం తగ్గారు. ఇంతలో వీర్రాజు వాళ్ళమ్మనీ, బామ్మనీ వెంటబెట్టుకుని వచ్చేశాడు. సూరమ్మగారు చాపవేసి మర్యాద చేసింది. రామారావుకీ, వీర్రాజుకీ తప్ప ఇంకెవరికీ ఇదంతా ఏమిటో అంతుచిక్కలేదు. ఒక అరనిమిషం నిశ్శబ్దం ప్రవర్తిల్లింది. కరణంగారు గొంతు సవరించుకున్నారు. "సూరయ్యగారూ, మనం లేద్దామా మరి? వేళయింది" అన్నారు.

"ఆఁ ఆఁ పదండి.... రారా, రావుఁడూ" అన్నారు సూరయ్యగారు వ్యవహారదక్షుడిలా.

రామారావుక్కోపం వచ్చింది. "ఏమిటమ్మా ఇది? రాజు సీతని చేసుకోవాలను కుంటూంటే నేనెలా చేసుకోనే? వాడూ నేనూ అన్నా తమ్ముళ్ళలా నీ కళ్ళముందు పెరిగాంకదా?" అన్నాడు.

కరణంగారు గెయ్యిమన్నాడు. "రాజుకి చేసుకోవాలనుంటే నాకివ్వాలని ఉండొద్దా, సీతకి ఉండొద్దా?"

వీర్రాజు తల్లికి అభిమానం వేసుకొచ్చింది: "బాబూ కరణంగారూ, మేం మిమ్మల్నేమీ అడగలేదుగా మీ పిల్లనిస్తారా అని? ఆ కుర్రాడి మాటలు పట్టుకుని ఎందుకలా విసుక్కుంటారూ?.... ఏంరా రాజూ? ఇందుకా మమ్మల్ని ఇక్కడికి ఈడ్చుకొచ్చావు?.... ఏమిటీ గోల?" అంది.

"పిన్నిగారూ, మీరు కోప్పడకండి" అంటూ జేబులోంచి ఉత్తరం తీశాడు రామారావు. "రాజు సీతని చేసుకోవాలని ఉబలాటపడుతున్నాడు. ఎదటే ఉన్నాడు. కావాలంటే అడగండి. ఇంక సీతకి కూడా వీడంటే తగని అభిమానం. అందుకు ఇదే నిదర్శనం. ఇక్కడ పరాయి వాళ్లెవరూ లేరు. కాబట్టి చూపిస్తున్నా. ఇదిగో ఇది సీత రాజుకి రాసిన ఉత్తరం. ఏం అమ్మా, ఇవన్నీ చూసి, రాజు నా అన్నతమ్ముడంటి వాడని ఎరిగుండి నేను సీతని చేసుకోవాలని ఇంకా పట్టుపడతావా అమ్మా? – పైగా నాకు ఆ పిల్లంటే ఇష్టంలేదు. మనస్తత్వాలు కలవవు.... అయ్యా కరణంగారూ, కోప్పడకండి ఉన్నమాట ఇప్పుడే చెప్పాను. ముసుగులో గుద్దులాటలు నాకు నచ్చవు.... ఏమమ్మా.... ఇంకా తాంబూలాలు పుచ్చుకోవాలంటావా?" అన్నాడు ధీమాగా.

సూరమ్మగారు నానుస్తూ అంది: "అయినా నీకిష్టం లేకపోతే నేనెందుకు బలవంతం చేస్తానురా... నీకు నచ్చిందాన్నే చేసుకో!"

కరణంగారు చురుకుగా ఆలోచించారు. వీర్రాజు కూటికీ కులానికీ కూడా పేదవాడు. తండ్రి లేడు. బాగానే ఉంటాడు. ఇంతో అంతో చదువుంది. ఒకటే లోపం. రామారావుకన్న తెలివైనవాడు. లౌక్యం బాగా తెలుసు. పైగా సీత రాసిన ఉత్తరం ఇక్కడి వాళ్ళకేకాక, పైవాడు జగన్నాథానికి కూడా తెలిసిపోయింది. ఇది బయటపడితే పిల్లకి పెళ్లవడం కష్టంకూడా. పట్టుసడలకుండానే కట్నం పెరగకుండానే కరణీకం చెయ్యాలి.

"అయితే ఇంకేం! నా కూతురికి రాజు నచ్చి, వాడికి అది నచ్చితే ఇంక అడ్డేమిటీ? – ఇప్పుడే తాంబూలాలు ఇచ్చుకుందాం."

"శుభస్య శీఘ్రం" అన్నాడు ఇప్పటికీ తేరుకుని సంగతి సందర్భాలు బోధపరుచుకున్న జగన్నాథంగారు.

"తథాస్తు" అన్నాడు రామారావు మావయ్య, ఏడవాలో నవ్వాలో ఇదమిత్థంగా నిర్ధారణ చేసుకోకుండానే.

"సరే, మీరంతా ఇంత ఇదిగా మా మేలుకోరి చెబుతూవుంటే నేను కాదంటానా.... ఏమంటారు అత్తయ్యా?" అంది వీర్రాజు తల్లి.

"మరేనమ్మా మరే" అంది వీర్రాజు బామ్మగారు.

అమాంతంగా నిశ్శబ్దం ఏర్పడింది. ఎవరికెలా మాట్లాడాలో తోచలేదు – ఏం మాట్లాడబడాలో తెలిసినా.

కరణంగారే మళ్ళా కొంచెం దగ్గి గొంతు సవరించుకుని "ఊఁ" అన్నాడు. "చెప్పవయ్యా పెళ్ళికొడకా... నీకు నచ్చిన పిల్ల ఎవరైనా ఉంటే ఇప్పుడే చెప్పేయ్" అన్నాడు.

సూరయ్యగారు మందహాసం చేశాడు, ఓడిపోయిన ఛాంపియన్‌లాగా. రామారావు వాళ్ళమ్మవంక చూశాడు పరీక్షగా. ఆ తరువాత జగన్నాథంగారి వేపు చూశాడు. తలవంచుకున్నాడు. "సుబ్బులు" అన్నాడు మృదువుగా.

జగన్నాథం గారు త్రుళ్ళిపడి తక్షణం తమాయించుకుని "అంతకన్నా నాక్కావలసిందేముంది నాయనా! సూరమ్మగారు నా పిల్లని కడుపులో పెట్టుకుంటానంటే కాదంటానా? సందేహించేది యింక ఆవిడే కావాలి" అన్నాడు.

సూరమ్మగారు రామారావు వంక చూసింది. విప్పారిన కళ్ళతో ఆశగా చూస్తున్నాడు. ఆవిడలో వాత్సల్యం పొంగింది. కంట నీరు తిరిగింది. "వాడి ఇష్టానికి నేనెప్పుడూ అడ్డు చెప్పను. సుబ్బులు బంగారుతల్లి, మా లక్ష్మి" అంది నెమ్మదిగా.

"ఇంకే, పనిలో పని. ఈ జంటకి ఇవాళే తాంబూలాలు యిచ్చుకోవడం మంచిది. శుభస్య శీఘ్రం" అన్నాడు కరణంగారు. "తథాస్తు" అన్నారు గుమ్మందాటి అప్పుడే సావిట్లో కాలుపెట్టిన బడిపంతులు శంకరయ్యగారు.

★ ★ ★

# సీత




సాయంత్రం ఐదున్నరకి సత్యనారాయణా, రాజూ, బీచికి బయలుదేరారు. "అందమైన అమ్మాయిల సమూహం వస్తున్నదోయ్!" అన్నాడు ఎప్పుడూ సరదాపడే రాజు.

"ఔను చూస్తున్నాం" అన్నాడు సత్యం, అమ్మాయిలను యథాశక్తి చదువుతూ.

ఎత్తుగా విశాలంగా ఉండే రాజు నుదురు మరీ ఎత్తుగా అయ్యింది. అతని నున్నటి క్రాపు మరీ నున్నన అయింది. అతని ఎర్రటి శరీరం ఇంకొంచెం ఎర్రబడింది.

సత్యం సిగ్గుపడ్డాడు రాజు పోకడలకి – మరీ కుర్రతనం కాకపోతే అమ్మాయిల్ని చూసినపుడల్లా అందాన్ని ఎక్కువ చేసుకోవడం ఏమిటని.

"అందరిలోకీ ఆ అమ్మాయి బాగుంది కదూ? ఇందరే కాదులే, ఎందరిలోనైనా ఆ అమ్మాయి బాగుంటుంది" అన్నాడు సత్యం.

ఆ బాగున్న అమ్మాయి, తక్కిన అమ్మాయిలూ దగ్గరగా వచ్చారు. సన్నగా నల్లగా పొడుగ్గా ఉండే సత్యం, – తెల్లగా బంతిపూల రథమల్లే బొద్దుగా ఉన్న ఆ అమ్మాయి బాగా దగ్గిరకు వచ్చినా విశ్వరూపం ఎత్తలేదు, మామూలుగా నడిచిపోయాడు.

తెల్లచీర కట్టుకున్న ఆ అమ్మాయి మాత్రం చాలా బాగుంది అనుకున్నాడు. రాజుతో కూడ అన్నాడు.

బీచి దగ్గర కాఫీ తాగుతూ మళ్ళా చెప్పాడు రాజుకి – తెల్లచీర కట్టుకున్న అమ్మాయి చాలా బాగుంది అని. సాధారణంగా అమ్మాయిల అందాన్ని మెచ్చుకోని సత్యం, ఇవాళ ఈ తెల్లచీర కట్టుకున్న అమ్మాయిని రెండవమాటు మెచ్చుకోవడం చూసి రాజు ముచ్చటపడ్డాడు. ఆ అమ్మాయి మీద సత్యం కవిత్వం చెప్పలేదుకాని అందం అనే మాటకి నిర్వచనం ఆ అమ్మాయి అన్నాడు.

హిమవంతుడు కదిలాడు అనుకున్నాడు రాజు. ఇంటికి వెళ్ళినప్పుడు సత్యం మళ్ళా మెచ్చుకున్నాడు. "ఆ అమ్మాయి నవ్వితే ఎంత బాగుంటుంది!"

"ఎంత బాగుంటుందీ" అంటూ వంత చెప్పాడు రాజు.

☆ ☆ ☆

ఆదివారం సాయంత్రం ఐదు గంటలకి లజ్ కార్నర్‌లో వున్న షాపు దగ్గర నిల్చున్నాడు సత్యం. నిన్న చూసిన అందమైన అమ్మాయి షాపులో రిబ్బనులు కొంటున్నది. రెండు నిమిషాల తరువాత ఆ అమ్మాయీ, స్నేహితురాలూ బయటకి వచ్చారు. ఈ అమ్మాయి ఎందుకో కిలారున నవ్వింది.

రాజు వచ్చాడు. సత్యం భుజంమీద చెయ్యివేసి "ఆ అమ్మాయి నవ్వు హిమమువలె శీతలంగానూ, వెన్నెలవలె తెల్లగానూ, ఆకాశమువలె నిర్మలంగానూ ఉన్నది" అన్నాడు.

పకాలున నవ్వాడు సత్యం. రోడ్డు దాటబోతున్న ఆ అమ్మాయి ఆగి వెనక్కి చూసింది క్షణంలో సగం సేపు. మిగతా సగం క్షణం సేపూ కంగారుపడింది. ఉత్తర క్షణంలో మల్లెపూల అంగడివేపు చూసి, "మల్లెపూలు కొనుక్కుందామే" అన్నది స్నేహితురాలితో.

"పట్టుదారం మీద ముత్యాలు జారినట్లు, ఆ అమ్మాయి సన్నటి స్వరం మీద పెదవులు దాటి మాటలు అవతరిస్తున్నవి" అన్నాడు సత్యం.

"ఇవాళ ఎన్ని కప్పులు కాఫీ తాగావు?"

"ఏం?"

"కవిత్వం ప్రకోపిస్తున్నది."

"ఏడిశావులే గాని.... హనుమాన్లూ, బీచికి పద" అన్నాడు సత్యం.

"మా అమ్మావాళ్ళూ నా బారసాల రోజున నాకు రామరాజు అని పేరు పెట్టారట. అందరూ అదేమాట.... నువ్వూ అలాగే పిలూ" అన్నాడు రాజు.

సత్యం నవ్వలేదు. మల్లెపూలు కొనుక్కుని బీచీవేపు వెళ్తున్న ఆ అమ్మాయిని చూస్తున్నాడు..

బీచికి వెళ్ళే ట్రాములో ఎక్కారు ఆ అమ్మాయిలు ఇద్దరూ, రాజు సత్యం వాళ్ళకి ఎదురుగా కూర్చున్నారు. ఆ అమ్మాయి కిటికీలోంచి బయటకి చూస్తున్నది. తల పక్కకు తిప్పి సత్యం జోక్సు కట్ చేశాడు. రాజు యథాశక్తి భూమి బీటవేసేట్లు నవ్వాడు.

ఆ అమ్మాయి తలమాత్రం ఇటు తిప్పలేదు. చలించలేదు. అలా మెడ పక్కకి తిప్పి, కళ్ళు ఇంకా పక్కకి తిప్పి రోడ్డుమీద బోర్డులు అంత తీక్షణంగా చదివేస్తే దరిమిలాను ఆ అమ్మాయికి మెడ నెప్పి పెట్టడానికి అవకాశాలు లేకపోలేదు అనిపించింది సత్యనారాయణకి.

"రాజూ.... ఇది నీకు తెలుసా?"

"ఏది నాకు తెలుసా?"

"మా చుట్టాల అమ్మాయి ఒకర్తి ఉండేది. దానివి పంకజాలవంటి పెద్దకళ్ళు. కాని ఎప్పుడూ ఎటు చూస్తే అటే చూస్తూ ఉండేది. కళ్ళు కలిపేది కాదు. అట్లా ఉండగా ఏమయిందో తెలుసా?"

"ఏమి అయిందో తెలియదు."

"కొన్నాళ్ళలో అంత చక్కని పెద్దకళ్ళూ చింతాకులంత చిన్నవయిపోయాయి."

ఆ అమ్మాయి మెడమాత్రం పక్కకి తిప్పలేదు. నవ్వలేదు. భ్రుకుటి ముడిచి

కేంద్రీకృత దృష్టితో  చూచిన సత్యానికి ఆ అమ్మాయి ముఖంలో ఏ చలనమూ కనిపించలేదు – అథమం చిరునవ్వు ఛాయలు  కూడా....

ఎదురుగా వున్న రెండో అమ్మాయి మాత్రం పెదిమలు బిగించి నవ్వు ఆపుకుంది.

శాంథోమ్ బీచి దగ్గర ట్రాము దిగి, వెంటనే రిక్షా ఎక్కి వాళ్ళు హాస్టలుకి వెళ్ళారు.

బీచిలో కాస్సేపు నిశ్శబ్దంగా కూర్చుని సిగరెట్టు కాల్చాడు సత్యం.

"ఆ అమ్మాయి నిజంగా అందంగా ఉందోయ్" అన్నాడు రాజు.

"అందమే కాదు. ఆ అమ్మాయిది సూదివంటి సూక్ష్మబుద్ధి, చాలా తెలివైనది, దూరదృష్టి వుంది. సంపూర్ణమైన స్త్రీత్వం పొందింది..... రాజా! 'డిగ్నిటీ' అనే మాటకి పూర్తి నిర్వచనం ఆ అమ్మాయికి  తెలుసును."

"'ఔను, నిండుకుండ తొణకదు'" అన్నాడు రాజు.

"ఏమో, పైన బుడగలు ఉన్నా తొణకదు."

"బుడగే వుంటే కొంచెం సేపేగా."

"ఏడిశావు, కవిత్వం చదవకు."

"ఆ అమ్మాయి ఎవరో!"

"అలా ఆశ్చర్యపడుతూ ఉండు. ఆకలిగా ఉంది. నేను ఇంటికి వెళ్తా."

☆ ☆ ☆

తిరిగి ఆదివారం వచ్చేలోగా ఆ అందమైన అమ్మాయిని ఆరుసార్లు చూశాడు సత్యనారాయణ. ఆ  ఆరుసార్లలోనూ దాదాపు మూడుసార్లు ఒంటరిగా కనపడింది ఆ అమ్మాయి. పలకరించి  మాట్లాడుదాం అనుకున్నాడు సత్యం. కాని ఏమని మాట్లాడుతాడు? ఆ అమ్మాయి చూస్తే  'హౌ టు షో డిగ్నిటీ' అనే పుస్తకం నిత్యపారాయణ చేస్తున్నట్లుంది.... జవాబివ్వకపోతే....

లోకల్ రోమియోల తొందర, తాపత్రయం చూసి తను ఎన్నిసార్లు నవ్వుకున్నాడు, "వీళ్ళు  బొత్తిగా పసివాళ్ళు. డిగ్నిటీ తెలీదు" అని. అసలు చదువు సంస్కారం కల ఒక అమ్మాయిని పలకరించి  మాట్లాడడానికి భయం ఎందుకు? ఎన్ని ప్రశ్నలకి జవాబు చెప్పకోవాలో. పరస్పరం వాళ్లకింత  భయం ఏహ్యత ఎందుకు కలగాలి? అమ్మాయి నవ్వు చూసి అబ్బాయీ, అబ్బాయి చొరవ చూసి  అమ్మాయీ తొందరపడి, పరస్పరం అంచనాలు వేసి విలువలు కట్టి, అపోహలు ఏర్పరచుకున్నారంటే అది  వాళ్ళ తప్పకాదు. చుట్టూ వున్న గాలి, నీరు, మనుష్యులు వాళ్ల కుసంస్కారాల ఫలితం....

సత్యానికి నవ్వొచ్చింది. తను సమాజం యొక్క సంస్కారం గురించి ఇంత హఠాత్తుగా ఇవాళ  ఆలోచించడం సిల్లీగా కనపడ్డది. తనదాకా వస్తేకాని తెలీదు అని సామెత చెప్పాడు ఒకాయన. బహుశా ఆయనదాకా వచ్చాక ఆయన ఈ సామెత చెప్పి వుంటాడు.

మొత్తానికి దక్షిణ హిందూ దేశపు భావిపౌరులు అయిన యువకులు అందరిలాగానే సత్యం కూడా ఈ  అమ్మాయితో మాట్లాడి, ఆమెపేరు, ఆమె ఏం చదువుతున్నదీ అడిగి తెలుసుకోవడానికి భయపడ్డాడు. కాకపోతే జంకాడు. లేకపోతే సందేహించాడు. పుస్తకాలలో ప్రవహించే వాక్యాలకీ, జీవితంలో తూచి  అనవలసిన మాటలకీ, తెలుపుకీ,

నలుపుకీ ఉన్నంత తేడా వుంది.... "నేను నిన్ను ప్రేమిస్తున్నా. నా హృదయం నీకు అర్పిస్తున్నా" అని మీరు ప్రేయసి వేపు చూస్తూ అనగలరూ!

అందుచేత ఆదివారంలోగా సత్యం ఆ అమ్మాయిని చూసిన ఆరుసార్లలోనూ అధమం ఒక్కసారి అయినా పలకరించలేదు. ఆ అమ్మాయి అంతకన్నా తొణకలేదు.

తనలాగే అమ్మాయికి కూడా ఇంత విచక్షణ తెలిసినా, ఆమె కూడా అందరితోపాటుగానే ప్రవర్తిస్తుంది. ప్రవాహంలో కలిసిపోతుంది. ఎందుకు అంటే – అది మనుష్యులమీద ప్రేమదేవత శాపం... ఇలా అనుకోవడం ఒక ఓదార్పు.

యుగాల నాటి అనాగరిక మానవుడికీ, దివి నుంచి దిగిన పాపికీ సంస్కారం తెలీదు. మనసులో ప్రేమ పొంగినా, అసహ్యం పుట్టినా తక్షణం వెల్లడిస్తారు – ఏడ్చీ, కొట్టీ, కరిచీ – సంస్కారం పొంది మనస్తత్వాల రహస్యాలు ఊహించగల మనం మన మనసులని దాచేసుకుంటాం. మన మనస్సులో భావాలు దాచుకుని, వ్యతిరేకమైనవి చెప్పడానికీ, మోసం చెయ్యడానికీ, అబద్ధం చెప్పడానికీ మనం "భాష"ని సృష్టించాం. ఎదుటివాడికి నీ మీద ఇష్టమని నువ్వు తెలుసుకుని ఆనందిస్తూ, నీ ఇష్టాఇష్టాలు నీలోనే దాచుకుని వాడి ఆవేదన చూసి ఉపేక్షించగల నిన్ను శాడిస్టు అన్నవాణ్ణి నువ్వు సినిక్ అంటావు.

సామెత చెప్పినట్లు తనదాకా వచ్చింది కాబట్టి ఆంతర్యాల ముసుగులు తొలగించి నగ్నీకృతం చెయ్యడానికి నిశ్చయించాడు సత్యం. లోకాన్ని మరమ్మత్తుచెయ్యడం గురించి పుస్తకాల్లో చదివాడు. తనని మరమ్మత్తు చేసుకోవటం తన దగ్గిరే చదువుకుంటాడు.

ఆదివారం సాయంకాలం అమ్మాయిల కాలేజీలో కార్నివాల్‌కి వెళ్ళాడు సత్యం. రాజు గేటు దగ్గిర కనపడ్డాడు. లోపల పదివేలమంది సత్యాలున్నారు. పదివేల మంది అందమైన అమ్మాయిలు ఉన్నారు. దీపాలు ఉన్నవి. సంగీతం ఉంది. హంగామా ఉంది. ఆనందం ఉంది. విద్యుద్దీపాల కాంతివలె సంస్కారం కుంభవృష్టిగా కురుస్తుంది. ప్రవహిస్తుంది.

"ఏమిటి సత్యం, ఈ గూడకట్టూ నువ్వూను" అన్నాడు గార్డెన్ మధ్య నించున్న రాజు.

"సింపుల్‌గా ఉంటుందని."

"సింపుల్‌గా ఉండటమే ఒక ఫోజు" అన్నాడు ఒక శోభనాద్రి.

"రేటెంత?"

"ఆఁ?"

"నీ విట్టుకు రేటు ఎంతా అంటున్నా."

"విట్టుకాదు. సూక్తి. సూక్తి ఒక్కొంటికీ ఒక సిగరెట్ ఛార్జి."

ఇద్దరూ సిగరెట్ అంటించారు. కార్నివాల్ చూస్తూ తిరగసాగారు. అంతా జూదం. బెటింగ్. మంచి ఉద్దేశ్యంతో కాబట్టి తప్పులేదు అనుకున్నాడు సత్యం.

హఠాత్తుగా ఆ అమ్మాయి కనపడింది స్నేహితురాలితో. ఇంతవరకూ కార్నివాల్ ఎక్కడి నించి చూడాలో నిర్ణయించుకోలేని సత్యానికి సరి అయిన మార్గం దొరికింది. ఆ అమ్మాయి అడుగు జాడలే.

రౌలట్ బల్లదగ్గిర ఆగారు ఆ అమ్మాయిలు. దాని పేరు వీల్ ఆఫ్ ఫార్చ్యూన్.

నాలుగో నెంబరు మీద పావలా కాసింది ఆ అమ్మాయి. ఎనిమిదో నెంబరు మీద పావలా పెట్టాడు సత్యం. చక్రం గిర్రున తిరిగి ఆగింది చివరికి గెల్చిన నెంబరు 32.

డబ్బులు పోయినందుకు ఆ అమ్మాయి తమాషాగా నవ్వింది. సత్యం కూడా నవ్వాడు. దీటుకు 8×4=32 అన్నాడు గట్టిగా. జనాంతికం విని కిలకిల నవ్వింది ఆ అమ్మాయి.

"సుమతీ! తొరగా రావే" అన్నది ఎవరో అమ్మాయి దూరంనించి.

"రావే పోదాం" అంటూ ఈ అమ్మాయి స్నేహితురాలి చెయ్యి పట్టుకుని బయలుదేరింది.

"అమ్మయ్య. పేరు తెలిసింది. ఈ పిల్లపేరు సుమతి" అన్నాడు సత్యం.

☆ ☆ ☆

మర్నాడు ఉదయం తొమ్మిదిలోగా అనేకమంది పరిచితులని కలుసుకుని, "సుమతి" అనే అమ్మాయి ఆడపిల్లల కాలేజీలో బి.యే. మొదటి సంవత్సరం చదువుతున్నదని తెలుసుకున్నాడు సత్యనారాయణ.

సాయంత్రం వరకు చాలా జాగ్రత్తగా ఆలోచించి, చివరికి సుమతికి ఉత్తరం రాయడానికి నిర్ణయించాడు. ప్రేమలేఖ కాదు. ఎంతమాత్రం కాదు. బొత్తిగా కాదు – కేవలం పరిచయం కోరుతూ ఆ రాత్రి ఉత్తరం రాశాడు హాస్టలుకి... అపార్థాలకు, చిరాకులకు, పరాకులకు అవకాశాలు లేకుండా సవ్యంగా సంస్కారంగా రాశాడు.

ఆ అమ్మాయిని తాను చాలాసార్లు చూశాడు అనీ, తనని కూడా ఆ అమ్మాయి చూసిందనీ సూచించి, కార్నివాల్ నాటి సంఘటన వివరించి ఆమెతో మాట్లాడాలని తాను ఆశిస్తున్నాననీ, అభ్యంతరం లేకపోతే హాస్టలు వద్దకాని, బీచ్ వద్దకాని తాను కలుసుకొని మాట్లాడతానని అతడు రాసిన లేఖ సారాంశం.

తరువాత ముప్పయి రోజులలో సత్యం సుమతికి పదిహేను ఉత్తరాలు రాశాడు. ప్రతి ఉత్తరం చిన్నదిగా ఉండేది. బాధ తెలిసిన భాషలో భాష తెలిసిన బాధతో ఉండేవి. ఆ అమ్మాయి ఆ వాక్యాలు పైకి చదువుతే ఆమె లేత పెదవుల మీదుగా రావడానికి అర్హత కలిగిన అందమైన మాటలు ఊహించి రాశాడు. ఆమె ఫలానా ఐస్‌క్రీం పార్లర్లో ఐస్‌క్రీం తింటూ ఉండగా తాను ఆమెను చూడడం ఆమె చూసి ఉండవచ్చు. ఆ ఫలానా పార్లరుకు ఫలానా రోజున సాయంత్రం వస్తే తాను సంతోషిస్తాను అని రాసేవాడు. కాకపోతే బీచికాంటీను దగ్గరేనా సరే అన్నాడు. కావలిస్తే తన స్నేహితురాలిని వెంటబెట్టుకుని రావచ్చు అని సూచించాడు. ఈ శతాబ్దంలో వచ్చిన కవిత్వాల అందం యావత్తూ పుణికి పుచ్చుకున్న అందమైన వాక్యాలు రాసేవాడు.

కాని అతను సూచించిన చోటుకి కోరిననాడు చెప్పిన టైముకి ఆమె రాలేదు. అతను నిరాశతో చూసిపోయేవాడు. అతడు ఎదురుచూడని క్షణాన హఠాత్తుగా అవతరించేది! అదృశ్యమయ్యేది.

ఈ ఉత్తరాలు రాయటం ప్రారంభించిన తరువాత సత్యం కూడా డిగ్నిటీలో ప్రాథమిక సిద్ధాంతాలు అమలుపరిచాడు.

ఆ అమ్మాయి రోజూ కనబడుతూనే ఉంది. ట్రాములో, బస్సులో, బీచిలో, ఐస్క్రీం పార్లర్‌లో – హాస్టలు గేటు మలుపులో.

ఇప్పుడు సత్యం ఆమెకి ఎదురైనపుడు అల్లరి చేయడు. ఆమె దృష్టిని ఆకర్షించ ప్రయత్నించడం, గట్టిగా జోక్సు కట్ చెయ్యడం మానేశాడు.

అసలు ఆమె కనబడగానే ఆమెను తప్ప మిగతా ప్రపంచాన్నిఅంతా చూసేవాడు. చాలా మంచివాడిలాగ, ఆమె ఉనికి తెలియనివాడిలాగ ఎటో చూస్తూ వెళ్ళిపోయేవాడు.

అతనికి ఒకటే ధైర్యం. తను ఉత్తరాలు రాస్తున్నాడు. తను చెప్పాకోవలసినవి అవి చెబుతున్నవి. ఇష్టపడి ఆ అమ్మాయి ఇంటర్వ్యూ ఇస్తే తరువాత తను చెప్పాకుంటాడు.

ఆ అమ్మాయి కూడా అతను ఎదురైనపుడు చాలా మామూలుగా నిశ్చలంగా వెళ్ళేది.

ప్రతి ఉత్తరంలోనూ ఆ అమ్మాయి నవ్వూ, ఆమె చలనం, విన్యాసం తనలో రేకెత్తించిన అనుభూతిని అక్షరాలలో నింపి పంపేవాడు.

రాజు ఒక మాటు అపశ్రుతి పలకడానికి ప్రయత్నించాడు. పక్షుల పాటలు నీకోసం కాదు వాటికోసం. కాని నువ్వు అవి విని అనుభూతి పొందుతావు. అమ్మాయి చిరునవ్వూ అంతే, నవ్వులన్నీ నా కోసమే అని ఎవడి మటుకు వాడే అనుకుంటే పక్షులన్నీ పాటలు ఆపేయవలసి వస్తుంది అని.

సత్యం నవ్వాడు "నీకు తెలీదు లేవోయ్" అంటూ.

ఇరవై అయిదు ఉత్తరాలు రాశాక ఒక చిన్న సంఘటన సంభవించింది.

లంచ్‌లో ఆ అమ్మాయి బస్సు ఎక్కింది. తనూ ఎక్కాడు కుర్రాడి లాగ. లాయిడ్స్ రోడ్ దగ్గర ఆమె దిగి ఒక ఇంట్లోకి వెళ్ళింది.

హఠాత్తుగా ఒక ఆలోచన మెరిసిన ఫలితంగా తక్షణం టాక్సీ ఎక్కి ఇంటికి వెళ్ళాడు. షెడ్డులో కారు తీసుకుని మళ్ళీ వచ్చాడు. బస్సు ఆగేచోట పక్కగా ఆపి కూర్చున్నాడు. ఆరు సిగరెట్లు, అరవైవేల ఆలోచనలూ..... ఆ అమ్మాయి రోడ్డు మలుపు తిరగడం చూసి కారు స్టార్టు చేసి పక్క వీధులంట తిరిగి అటునించి వచ్చాడు. ఆమె దగ్గర కారు ఆపాడు తను అప్పుడే ఆమెను చూచినట్లు.

"హలో.... మీరు కాలేజీకేనా?"

అవునన్నది ఆ అమ్మాయి.

"అభ్యంతరం లేకపోతే కారులో ఎక్కండి. అక్కడ డ్రాప్ చేస్తాను."

సందేహించి ఆమె అంది: "అక్కరలేదండి. థేంక్సు."

"పరవాలేదు రావచ్చును" అన్నాడు సత్యం కొంచెం తలవంచుకుని.

"అబ్బే వద్దండి బస్సులో వెళ్తా."

ఒంటరిగా వెళ్ళిపోయాడు సత్యం.

☆ ☆ ☆

సాయంత్రం రాజు తీర్పు చెప్పాడు: "ఆ అమ్మాయిది తప్పు కాదు. నీ తప్పు కాదు. నీ పర్సనాలిటీ, నీ అంతర్యాలకు తగినట్టు ఉండదు. నువ్వు రాసే ఉత్తరాలు చదివి నీ మొహం చూస్తే నమ్మరు నిన్ను."

రాత్రి తొమ్మిదింటికి డేగ తరిమిన పావురంలాగ పరుగెత్తుకు వచ్చాడు రాజు.

"సత్యం! పొద్దున ఆ అమ్మాయి కారెక్కక పోవటం ఆమె తప్పూకాదు, నీ తప్పూ కాదు – మన పొరపాటు."

"ఏమిటి నువ్వనేది?"

"సుమతి పేరు సీత."

"ఆఁ?...."

"సీతని సుమతీ అంటే పలుకుతుందా?"

"నిజమే."

"అక్షరాలా.... ఇప్పుడే తెలిసింది. మా అత్తయ్య కూతురు సుగుణా, మీ ఏంజెలూ లజ్‌కి వచ్చారు ఇందాక. నువ్వు ఇంటికి వెళ్ళగానే షాపింగు చేసుకొని ఏంజెలు బస్సెక్కి వెళ్ళిపోయింది. సుగుణని పలకరించాను. మా ఇంటిదాకా వచ్చిందిలే. షాంగ్రిలానించి ఏంజెల్‌తో కలిసి వచ్చిందట – "సుమతి నీకు ఫ్రెండా" అన్నా. "సుమతి కాదు. దీని పేరు సీత" అంది. ఆశ్చర్యపడ్డాను. "ఏవిటి బావా! విశేషా" లంది కనుబొమ్మలెగరేస్తూ. "అదే.... అదే సీత పేరు సుమతి అనుకున్నాను" అన్నా.

"కాదు సీత పేరు సీతే, సుమతి పేరు సుమతే. పోతే సీత హాస్టలులో ఉంది. సుమతి అడయారులో వాళ్ళమ్మా నాన్నా అక్కచెల్లెళ్ళతో ఉంది." అని చెప్పింది.

సత్యం గుండె ఝల్లుమంది. "అయితే మన ఉత్తరాలు ముప్పయీ...... యు మీన్...... లెటర్లు..... ఐ మీన్....."

రాజు సుస్పష్టమైన తెలుగులో వాక్యీకరించాడు: "అవును... సీత అనుకుంటూ నువ్వు రాసిన ఉత్తరాలు సుమతికి వెళ్ళాయి. ఆ సుమతి ఎవరో నీ ఉత్తరాలు చదువుకుని ఏమయిపోతుందో వెండితెర మీద చూడాల్సిన విషయం. పోతే, సీత నిన్ను గురించి ఏమీ అనుకోటం లేదు – నీ ఉత్తరం ఒక్కటీ ఆమె పేర వెళ్ళలేదు కనుక. నువ్వు రోడ్డుమీద ఆ సీతని చూసినప్పుడు మడి కట్టుకొంటున్నావు. బంగారు తండ్రిలా తల వంచుకుని పోతున్నావు. అందువల్ల ఇప్పుడు సీత దృష్టిలో నువ్వు ఎవరు? బాటసారివి. బైపాసర్‌వి. శ్లోకం చదువు – సుమతీ సుందరి! ప్రీత్యర్థం – నమస్కారం సమర్పణమ్."

ఆ రాత్రి అనిర్వచనీయమైన వైరుధ్య అనుభూతుల సంఘర్షణల మధ్య తుపాను గాలిలో రావి ఆకువలె రెపరెపలాడు గుండెలతో సత్యం సీతకి మొదటి ఉత్తరం రాశాడు. చాలా పెద్ద ఉత్తరం!

"నిన్న కారులో ఎక్కనందుకు – మిమ్మల్ని ఇప్పుడు అభినందిస్తున్నాను. మీ పేరు సుమతి అనుకుని ముప్పై ఉత్తరాలు రాశాను. అవి మీకే చేరినవన్న అభిప్రాయంతో 'వన్ వే ట్రాఫిక్' అయినా మనకి పరిచయం ఉంది అన్న ఉద్దేశంతో మీకు నేను నిన్న కారుమీద లిఫ్ట్ ఆఫర్ చేశాను. అంతేకాని అపరిచితు లందరినీ కారులోకి ఎక్కమని అడిగే అలవాటు నాకు ఎన్నడూ లేదు. ఈ పొరపాటును అర్థం చేసుకోమని కోరుతున్నాను. దయచేసి రేపు ఐస్‌క్రీం పార్లర్‌కి సాయంత్రం ఐదు గంటలకి వస్తే మీకు వివరిస్తాను." ఇదీ ఆ లేఖ సారాంశం.

మర్నాడు సాయంత్రం సీత పార్లర్‌కి వచ్చింది. కానీ చాలామంది స్నేహితురాళ్ళతో ఉంది. సత్యం పలకరించలేదు. ఆ అమ్మాయి చాలా చలాకీగా ఉంది.

రోజులు దొర్లుతున్నాయి రోడ్లు అరుగుతున్నాయి.

సీత కనబడుతూనే వుంది. ఎప్పుడూ – ఒక ఊర్మిళ, ఒక మాండవిక, శ్రుతకీర్తి కూడా ఉంటారు. ఎన్నో అపాయింటుమెంట్లు నిర్ణయించాడు. సత్యం సీతకి రాసిన ఉత్తరాలలో ఆయా చోట్లకి వచ్చేది. కాని అతను చెప్పిన రోజుకాదు, కోరిన టైముకి కాదు. హఠాత్తుగా కనపడేది. కిలారున నవ్వు నవ్వుతూ వెళ్ళిపోయేది.

సీతకి వున్న చీరలు మొత్తం ఎన్ని రకాలో అతనికి కంఠతా. అన్నీ చాలా సింపుల్‌గా, ఆడంబర రహితంగా ఉంటాయి. అందుకే హఠాత్తుగా ఒకనాటి నుంచి ఆమె జార్జెట్టు రంగుల చీరెలు కట్టడంతో చివుక్కుమంది అతని మనసు. ఆమె స్వచ్ఛమైన అందానికి ఈ ఆడంబరాలు ఒక అపశృతి అనుకున్నాడు. రాజుకి చెప్పాడు.

"నీకేం మధ్య?" అన్నాడు.

"అహఁ.... ఐమీన్..... ఎందుచేతో ఈ షోకులు ఆ సీతకి తగవేమో ననిపిస్తున్నది" అన్నాడు సత్యం.

"ఇష్టం లేదా నీకు?"

"అలా అని కాదనుకో.... ఏమిటో అంత మంచి అమ్మాయి ఇలా అయిపోయిందని... బాధ... చిరాకు"

"సత్యం! నీకు పొసెసివ్ ఇన్‌స్టింక్ట్సు బయలుదేరుతున్నదోయ్!" అన్నాడు రాజు.

సత్యం ఉత్తరం రాశాడు:

"సీతా! నాకు మతి పోతున్నది. రేపు సాయంకాలం పార్లర్‌కి తప్పకుండా రావాలి. ఇది ఆఖరి ఉత్తరం, నువ్వు వస్తావు – అని నమ్ముతున్నాను. నువ్వు వచ్చి రేపు నాతో మాట్లాడక పోయినా, అథవా నేను కోరిన టైముకి ఆ చాయలకి వస్తే చాలు. నేను సంతోషిస్తాను. నీకు వీలున్నప్పుడే మాట్లాడవచ్చు... సీతా! నేను నీకు ఎంతో గౌరవమైన స్థానాన్ని ఇస్తున్నాను. నిన్ను ఉద్ధరించడానికని చెప్పటం లేదు. నిజం..... పోతే "అసలు నీకు ఎందుకు ఇంత పట్టుదల?" అని నువ్వు అడిగితే నేను ఏం చెప్పలేను. ఏం మాట్లాడుతావు అంటే – ఏమో! కాని ఒక్కటి బాగా తెలుసు. నీతో మాట్లాడాలని, నిన్ను జీవితాంతం ఆరాధించుకునే అదృష్టం పొందాలి అని. దీనికి 'ప్లెటోనిక్ లవ్' అని పేరు పెట్టవద్దు. అలా అని నిన్ను పొసెస్ చేయాలి అని ఆశలేదు... ఏమిటో సీతా? నాకేం తెలీదు. నీతో మాట్లాడాలి అంతే. నీ పరిచయం కావాలి. అథమం 'హలో!' అని పలకరించే పరిచయం. నువ్వు నాతో మాట్లాడకపోయినా, నీకు ఇష్టమైతే నువ్వు ఇంకోసారి కనపడ్డప్పుడు మాట్లాడవచ్చు. అసహ్యమైతే చీదరించుకోవచ్చు. కాని ఒక్కసారి మాట్లాడి నా బాధ వెళ్ళపోసుకొనే అవకాశం మాత్రం ఇయ్యి. ఇదే నా వినతి."

సీత మర్నాడు అసలు కనపడలేదు.

ఆ రాత్రి సత్యం సీతకి ఇంకొక తుది లేఖ వ్రాశాడు:

"సీతా! ఇది రెండో తుది లేఖ. నవ్వవొద్దు... ఇది నిజంగా ఆఖరు ఉత్తరం. నువ్వు రేపైనా తప్పకుండా నా వినతి మన్నిస్తావు అని ఆశిస్తున్నాను. నువ్వు నిర్లక్ష్యం

చేస్తే, మోసం చేస్తే నేను పడే బాధ మితి దాటుతుంది. బహుశా మతిపోయి సద సద్విచక్షణ సన్నగిల్లుతుంది.... నీ స్నేహితురాలు ఒకామె నాకు బాగా తెలుసు. ఆ అమ్మాయికి నా కథ చెప్పి, నా సంగతి నీకు వ్యక్తిగతంగా చెప్పమని ఆమెని కోరవలసి వస్తుంది. నిన్న నువ్వు లజ్ లో షాపులో స్నో కొనుక్కుని బయటికి వస్తూ, నన్ను చూసి నీతో ఉన్న స్నేహితురాలితో ఏదో చెప్పి పకాలున నవ్వావు. నీతో ఉన్న ఊర్మిళ ఎవరో కాని ఆమె కూడ నవ్వింది. నువ్వు ఎందుకు నవ్వావో ఆమెతో నా గురించి ఏం చెప్పావో ఊహించి అంచనాలు వెయ్యదల్చుకోలేదు. నీమీద పూర్తి విశ్వాసం ఉంది అనుకుంటున్నాను. కాని నా విషయం నీ ఫ్రెండ్సుకి చెప్పటం మంచిదికాదు. కాని నువ్వు ఆ పని చేశావు గనక నేను అంతే చెయ్యబోతున్నాను. రేపు నువ్వు కనపడకపోతే నీ స్నేహితురాలితో చెప్తాను. ఆమె నా తరపున నీతో మాట్లాడుతుంది. రేపు నువ్వు పార్లరుకి వస్తే ఏ గొడవా ఉండదు."

మధ్యాహ్నం పోస్టాఫీసుకి వెళ్ళి ఉత్తరం రాస్తున్నాడు సత్యం, పోస్టువారు వుంచిన బల్లమీద అనుకుని. సీత వచ్చింది. తనకి ఎదురుగా నించుని తలవంచుకుని ఉత్తరం రాస్తూంది. సత్యం కొంచెం ఆగి వెనక్కి చూశాడు. కొద్ది దూరంలో నించున్న ఇద్దరు సత్యభామలు తనని పూర్తిగా చదువుతున్నారు అనిపించింది. తల వంచుకుని ఉత్తరం పూర్తిచేసి వెళ్ళిపోయాడు.

సాయంత్రం 5 గంటలకి ఐస్క్రీం పార్లర్ కి వచ్చింది సీత. కాని కూడా చెలికత్తెలు ఉన్నారు. సత్యం లోపలికి వెళ్ళాడు. నిశ్చలంగా. కూర్చుని కాఫీ తాగుతున్నది సీత. ఇతనివేపు చూడలే. చెలికత్తెలు మాత్రం మాటలు ఆపేశారు.

కాఫీలు పూర్తి చేసుకుని వాళ్ళు బీచికి వెళ్ళారు. తనకి చెలికాడు దగ్గర లేకపోవడం లోటు అనిపించింది సత్యానికి. గబగబా నాలుగు వీధులు నడిచి రాజు ఇంటికి వెళ్ళాడు. తిరిగి బీచికి వచ్చేసరికి ఆరున్నర అయింది. చీకటి పడుతూంది. మెయిన్ రోడ్డు దాటి బీచి రోడ్డు ప్రవేశించే సరికి సీత ఎదురుగా వస్తున్నది. కూడా ఒక్క ఊర్మిళే ఉంది.

బాగా దగ్గరకు వచ్చాక సీత కొంచెం తటపటాయించింది ఆగి. ఇది చూసిన సత్యం సందేహిస్తూ ఆగాడు.

అందంగా, అమాయికంగా, మెత్తగా, సున్నితంగా సంస్కారంగా స్టయిలిష్గా అడిగింది సీత.

"మిష్టర్ సత్యం మీరేనా అండి?"

అసలు ఈ అమ్మాయితో ఎట్లా మాటలు మొదలుపెట్టాలా అన్నది పెద్ద సమస్య సత్యానికి. ఈ సమస్య ఈ క్షణాన ఇంత సునాయాసంగా పరిష్కరించబడింది. ఈ హఠాత్ప్రశ్నతో కథ ఈ విధంగా జరుగుతుందని ఎరగని సత్యం కంగారుపడ్డాడు కొంచెం.

"ఔనండి" అన్నాడు చివరికి.

"మీతో కొంచెం మాట్లాడాలి. ఈ పక్కకి రండి" అన్నది సీత. రాజు తిన్నగా బీచివేపు నడిచాడు. ఊర్మిళ రోడ్డు దాటి ఇంకో శ్రుతకీర్తితో మాట్లాడుతూ నించుంది.

మెడలో ఒంటిపేట గొలుసు పళ్ళకింద నొక్కిపట్టి కనురెప్పలు వాల్చి, చర్చి గోడకి చేరబడి గోడమీద నీడలో నిలబడింది సీత. సత్యం ఆమె ఎదురుగా, అవకతవకగా అపభ్రంశంగా నించున్నాడు – తప్పు చేసిన కుర్రాడు తల్లి ఎదుట నించున్నట్టు.

సీత చేతిలో నలిగిన ఉత్తరం ఉంది. అది సత్యం రాసినది.

"ఈ ఉత్తరం....."

సత్యం మాట్లాడలేదు.

"మీరు ఇలా ఉత్తరాలు రాస్తే, ఇవి హాస్టలు అధికారులు చూస్తే మా నడతని సస్పెక్టు చేస్తారండి."

సత్యం కొంచెం స్థిమితపడ్డాడు. "సారీ.... కాని మీరు నేను అడిగిన అవకాశం ఇచ్చి ఉంటే అన్ని ఉత్తరాలు రాయకపోదును" అన్నాడు.

"మీరు ఇన్ని రాయకపోతే నేను ఇవాళ మీతో మాట్లాడకపోదునండి.... సరే, ఇప్పుడు చెప్పండి మీరు చెప్పదలచుకున్నదేదో."

"అదెలాగండి.... ఇప్పుడు ఇక్కడ నించున్నపాటున నేనేం మాట్లాడగలనండీ.... మీరు రేపుగానీ...."

"సారీ, ఇంకోమాటు కలుసుకునేందుకు వీల్లేదండి" అంది సీత కటువుగా.

"మీరు అట్లా అంటే ఎలా చెప్పండి? ఇలా రోడ్డుమీద నిలబడి...."

సీత కొంచెం మెత్తబడింది.

"అబ్బే, మళ్ళా రేపు ఇంకోమాటూ.... కలుసుకునేందుకు వీలుండదేమోనండి."

సత్యానికి తెలుసు ఆమెకి నిజంగా రావాలనే ఉందని. తను ఇంకో మెట్టు కిందకి దిగాడు.

"అబ్బే. రేపే అని అనటం లేదండి. మీకు వీలు ఉన్నప్పుడు ఎప్పుడైనా సరే.... అసలు నేను మిమ్మల్ని పలకరించే అవకాశం కోసం ఎదురుచూస్తున్నాను. కాని ఎప్పుడూ మీతో మీఫ్రెండ్సు ఉంటారు.... అదృష్టవశాన ఇవాళ మీరే ఈ ప్రసక్తి చేశారు" అన్నాడు.

"అహా. అదీ కాదులెండీ.... మీరు ఎవరో అమ్మాయికి చెపుతాను, ఆ అమ్మాయి నీతో మాట్లాడుతుందనీ ఏదో ఏదో రాశారు. అందుకని ఇప్పుడు నేనే పలకరించాల్సి వచ్చింది."

సత్యం మాట్లాడలేదు.

వంచిన తల పైకెత్తి ధైర్యంగా అతని మొహంలోకి చూస్తూ సీత దబాయింపు అభినయించింది, "ఇప్పుడు చెప్పండి మీరు చెప్పదలచుకున్నది" అంటూ.

"అదే చెప్పాను కదండి. ఇలా హఠాత్తుగా కలుసుకుని రోడ్డుమీద ఏం చెప్పమంటారు.... రేపు వీలయితే....."

"సరే, రేపు మధ్యాహ్నం ఒంటిగంటకి రండి ఈ పోస్టాఫీసు దగ్గరకి."

సత్యం అంగీకరించి ఇంగ్లీషులో వందనాలు తెలిపాడు. "సరే మీరు వెళ్లండి. మీ స్నేహితురాలు పాపం కాసుకుని ఉంది" అన్నాడు.

సీత మెల్లిగా బయలుదేరి వెళ్ళింది.

☆ ☆ ☆

పోస్టాఫీసు పక్కని చెట్టు నీడని కారు ఆపాడు సత్యం. ఒంటిగంట అయింది. సీత ఇంకా రాలేదు.

ఎండ తీవ్రంగా ఉంది. గాడుపు వీస్తున్నది. రోడ్డుమీద ఎక్కడా మనుష్యులు నడవడం లేదు. పక్షులు కూడా ఎండకి బెదిరి గూళ్ళలో కునుకుతున్నాయి.

ఎండ వేడితో వేడి గాడుపుతో నిండి నిర్మానుష్యమై, మండుతూ ఉన్న తారు రోడ్డులో దూరంగా ఎండమావులు కనబడుతున్నవి. ఆ నిశ్శబ్దతలో, స్తబ్దతలో, శూన్యతలో ఎడారిగీతం వంటి ఎండిన సంగీతం మందంగా ఈదుతోంది. సముద్ర ఘోష నిర్విరామంగా ఉపశ్రుతి వేస్తూంది. జీవితంలోని నిర్జీవతను ఇంత నిర్దయతో ఆలాపించే ఎడారి రాగంలో అపశ్రుతి ధ్వనిస్తూ గవర్నమెంటు బస్సు మహావేగంగా వెళ్ళిపోయింది. తిరిగి నిశ్శబ్దత.... స్తబ్దత.... శూన్యత.

ఒంటి గంట మీద మూడు నిముషాలు అయింది. సిగరెట్టు అంటించాడు సత్యం. రెండు పీల్పులతో చిరాకు పుట్టింది. విసిరి నేలకు కొట్టాడు.... సీత ఇంకా రాలేదు.

పరాకుగా పాట మొదలు పెట్టాడు. రెండు నిముషాలసేపు తను పాడింది విన్నాడు. తను పాడిన రాగం ఏదో జాలిపుట్టించేట్టుగా, బాధని ధ్వనించింది.... సంతోషంగా ఇంటి దగ్గర ఈలపాట వేసి బయలుదేరిన తను ఇప్పుడు ఆవేదనతో నిండిన ఈ రాగాన్ని ఎందుకు ఆలాపించాడు? అది ఎలా ధ్వనించింది? తను మనస్సులో నిజంగా బాధపడుతున్నాడా?.... పర్యవసానం బాగుండదేమోనని భయమా?

సీత తనతో మాట్లాడటానికి ఇలా సమయం – ఈ మిట్టమధ్యాహ్నమపుడు మండుతున్న తారురోడ్డు పక్క ఎందుకు నిర్ణయించింది?.... తను చెప్పి ఉండవలసింది – మధ్యాహ్నం వద్దు, సాయంత్రం మాట్లాడదామని. మధ్యాహ్నం మాట్లాడడానికి ఒప్పుకున్నది సాయంత్రం అంటే ఎందుకు ఒప్పుకోదు? మధ్యాహ్నానికి సాయంత్రానికి తేడా ఏముంది?

చాలా ఉంటుంది అనుకున్నాడు సత్యం. నలుపుకీ తెలుపుకీ, ఏడుపుకీ నవ్వుకీ ఉన్నంత తేడా – అశుభానికీ శుభానికీ ఉన్నంత, ఇష్టతకీ అయిష్టతలకీ ఉన్నంత.

ఈ తేడాలు తెలిసే – వాటి విలువలు తెలిసే సీత తమ సమాగమానికి ఈ మిట్టమధ్యాహ్న ముహూర్తం నిర్ణయించిందా?

అసలు నిన్నటితో కథ ముగించక, ఇవాళ తిరిగి మాట్లాడడానికి సీత ఎందుకు అంగీకరించింది?.... భయపడింది కాబోలు – అనుకున్నాడు సత్యం. తను ఇంకో అమ్మాయికి చెప్తాను అని బెదిరించాడుగా, కేవలం మూడో వ్యక్తికి ఈ కథ తెలుస్తుందేమోననే భయం సీతకి ఉంటే ఆమె నిన్ననే నిర్మొహమాటంగా, కటువుగా, సరిఅయిన, బరువైన మాటలతో కథ ముగించును. "అబ్బాయ్!? నువ్వు ఎవరి ద్వారాను రాయబారాలు పంపనక్కరలేదు. దయచేసి ఈ విషయం మరిచిపో, ఇక ఉత్తరాలు రాయకు, నాకు ఇష్టం లేదు" అని చెప్పి ఉండును.

సీత అలా చెప్పలేదు కాబట్టి ఆమెకి ఇష్టం ఉంది.... అందువల్ల భయం లేదు. అయితే, ఇంక ఆమెను బాధించేది ఏమిటి.... సందేహం. అనుమానం..... ఎందుకంటే – సత్యం ఉత్తరాలు తన ప్రవర్తన, ప్రవృత్తి ఏర్పరచే అభిప్రాయాలతో

తన ఆకారం – పర్సనాలిటీ ఏకీభవించదు. రెండింటికీ వైరుధ్యం ఉంది. సీత ఇది చదువుకున్నది. అందుకే సీతకి సందేహం. ఈ అబ్బాయిలో తాను ఉంది అనుకుంటున్న సిన్సియారిటీ, నైతికౌన్నత్యం నిజంగా ఉన్నవా – అనీ.... ఈ అబ్బాయి లోకంలో స్వయంగా నిలవగలడా? అనీ..... ఇతని నీడలో నిలిచిన వారికి విశ్రాంతి, సంతృప్తి దొరుకుతాయా అని....

అమాయకంగా నిన్ను చూసి ఆరాధిస్తున్నట్లున్న అతని కళ్ళ వెనక మోసం కౌటిల్యం ఉండగలవా? సీతకి ఎక్కడా కనబడలేదు. తాత్కాలిక లక్ష్యసాధనకి తలపెట్టే ఆశల చాయలు అతనిలో ఆమెకు దొరకలేదు. ఆమె చదివిన మనుష్యులకీ, ఈ అబ్బాయికీ పోలిక లేదు. వైరుధ్యం ఉన్నది. ఈ వైరుధ్యం, ఈ అబ్బాయిలో కనబడే ఈ అమాయకత్వం, మంచితనం, ఈ ప్రేమ – ఇవి అన్నీ నిజంగా ఉన్నవా? అభినయమా?..... ఇది సీత సందేహం. భయంకాదు.... సీతకి..... ఈ సందేహం తీరితే ఆపైన పర్యవసానం తెలుపా నలుపా అన్నది వేరే విషయం.

నీకు నాకు కలిసి ఇంకో రేపు లేదు అని మొదట గంభీరంగా ధ్వనించిన సీతకి, తరువాత రెండు నిముషాలలో సత్యాన్ని నిర్భయంగా చూచి అతని మాటలోని "సిన్సియారిటీ"ని తూచిన సీతకి తేడా వుంది. అందుకే సత్యం మళ్ళీ బతిమాలగానే "రేపు"కి అంగీకరించింది.

సత్యం టైము చూశాడు. ఒంటిగంటా అయిదు నిముషాలు అయింది. అరఫర్లాంగు దూరంలో ఉన్న హాస్టలుగేటులోంచి సీత బయటకు వస్తూంది. కూడా ఒక శ్రుతకీర్తి ఉంది. ఒక్క నిముషంలో సీత కారు దగ్గరికి వచ్చింది. కారు దిగి బయటకు వస్తూ చిరునవ్వు నవ్వాడు సత్యం. సీత నవ్వింది బదులుగా. సీతకి ఇంత శ్రమ ఇచ్చినందుకు ఇంగ్లీషులో విచారించాడు సత్యం. శ్రుతకీర్తి ఆగకుండా పోస్టాఫీసులోకి వెళ్లి ఒక కార్డుకొని మహా వేగంతో రాత ప్రారంభించింది. ఈ "ఇందుకు సాక్షురాలిని" సీత ఎందుకు తెచ్చిందో అంతుపట్టలేదు సత్యానికి...

పోస్టాఫీసు కటకటాలకి జేరబడి నించుంది సీత. ఎదురుగా ఎండలో నిలబడ్డాడు సత్యం. తల వంచుకుని సీత అన్నది: "చెప్పండి మీరు చెప్ప దలచుకున్నదేదో."

ఆశ్చర్యపడ్డాడు సత్యం. పని తొందరలో వున్న తాసీల్దారు – ఒక్క క్షణం తెరిపిచేసుకొని ఉద్యోగాభ్యర్థనార్థం వచ్చి ఎదురుగా నిలిచిన కుర్రాణ్ణి చెప్పవయ్యా, నీ గోడు అన్నట్టుగా ఉంది. ఇలా అడిగితే అర్జునుడు, రోమియో, డాన్‌జువాన్ కలిసి రిహార్సలు చేసుకున్నా ఒక్క ముక్క అనలేరు. మాట పెగలదు. పోతే అర్జునుడు, రోమియో, డాన్‌జువాన్ కూడా కాని సత్యం తను వేసుకున్న రిహార్సలు ఇటువంటి సన్నివేశానికి కానందువల్ల జవాబివ్వలేకపోయాడు. తలవంచుకున్నాడు.... తనని, ఇంకోళ్ళ ఎదుట ఫూల్‌చేసే ఉద్దేశంతోనే సీత ఇంకో అమ్మాయిని తెచ్చిందా?

తటాలున తల ఎత్తాడు సత్యం. తనవేపు చూస్తున్న సీత కళ్ళు, తన చలనం చూడగానే వాలిపోటం చూశాడు. నవ్వొచ్చింది.

ఆ నవ్వుకే ఇంకా కొంచెం తెలుపు రంగు వేసి జవాబు చెప్పాడు: "ఎలా సీతా! ఇంత ఎండలో, ఈ రోడ్డు మీద నుంచుని నేనేమి చెప్పగలను?.... దయచేసి ఈ కారులో ఎక్కు, మెరీనా హోటలుకు వెళదాం. అక్కడ వివరంగా చెప్తాను."

"సారీ అలా వద్దండి. ఇక్కడ చెప్పండి. ఇక్కడ ఎవరూ లేరుగా మన మాటలు వినడానికి?" అంది సీత.

సీత బుజాలు తడుముకుంది. అయినా, తను చెప్పిన అభ్యంతరం ఇతరులు వింటారని కాదుగా.

నవ్వుతూ అన్నాడు సత్యం: "పోనీ మీ ఫ్రెండుని కూడా రమ్మనండి మీకు అభ్యంతరం లేకపోతే. మెరీనాలో కూర్చోడానికి ఇష్టంలేక పోతే కారులోనే చెబుతా. తిరిగి వచ్చి మీ హాస్టలు దగ్గర డ్రాప్ చేస్తా."

"అబ్బే అవసరం లేదండి, ఇక్కడ చెప్పవచ్చుండి" అంది సీత.

"చెప్పకూడదనలేదు. నేను చెప్పలేను అంటున్నా."

ఇద్దరికీ మనస్సులు చివుక్కుమన్నవి. మరు క్షణంలో వాటి క్రీనీడలు ఇద్దరి మీదా పడ్డాయి.

సత్యం మళ్ళా ఒక మెట్టు తగ్గాడు. మనసు కుదుటపరచుకుని, "పోనీలెండి, మీకు ఇప్పుడు వీలులేకపోతే సాయంత్రం కలుసుకుందాం."

"వీల్లేదండి. ఇప్పుడే చెప్పండి చెబుతే. ఇంకోమాటు కలుసుకుందుకు వీలు ఉండదు" అంది సీత కొంచెం మొండిగా.

సత్యం ఈ దెబ్బకి తట్టుకోలేకపోయాడు. "సరేలెండి, అయితే నేనేం చెప్పలేను. మీరు వెళ్ళొచ్చు" అన్నాడు.

ఇంటర్వ్యూ ఇంత అపభ్రంశంగా, హఠాత్తుగా అపశ్రుతులతో ముగుస్తుందని ఇద్దరూ అనుకోలేదు. సీత మనస్సు చివుక్కుమంది. అతను తనని "వెళ్ళు" అని అంత హఠాత్తుగా, అంత పొగరుగా అన్నందుకు.

సుడి గుండాలతో గాడుపు చెలరేగింది.

"సరే వెళ్తాలెండి. మీరింక ఉత్తరాలు రాయవద్దు" అంటూ సత్యం రాసిన తుది లేఖ అందించింది.

"రాయనులెండి" అంటూ లేఖ అందుకోబోయాడు సత్యం. జారి కింద పడిపోయింది ఆ ఉత్తరం. ఒక్క క్షణం కిందకి చూశాడు



సత్యం. తిరిగి సీతవేపు చూశాడు. ఉత్తరం తియ్యకుండా అలాగే వదిలేసి కారు తలుపు తీశాడు.

సీత చలించింది. విచారించింది. తను అనుకోని విధంగా కథ మలుపు తిరిగింది. కాని తను పూర్తిగా బాధ్యురాలు కాదేమో అనుకుంది – అయితే ఈ తిరుగుబాటు తనకి ఇష్టం లేదా.... తక్షణం సీత రెండడుగులు ముందుకు వేసింది. చివరి ప్రయత్నం.

"ఏమండీ.... అసలు మీకు నా ఎడ్రసు ఎలా తెలిసింది?" అంది తటాలున.

ఉద్విగ్నుడై కళ్ళు మూసుకుని కారు ఎక్కుతున్న సత్యానికి సీత మాటల బరువు తెలియలేదు. పరిస్థితులు ఇలా వక్రించాక, తిరిగి అతన్ని ఈ ప్రశ్నతో నిలవేసి, – బహూశా అతను చెప్పదలచుకున్నది. అతనికి తెలియకుండానే చెప్పించి సక్రమపరచాలనే ఉద్దేశాల, ఆశల, చాయలు సీతలో ఉన్నవని అతను గ్రహించలేదు.

కోపంతో, కసితో, బాధతో, పసివాడిలా జవాబిచ్చాడు సత్యం:

"నేనింకేం చెప్పను, నేను వెళ్ళిపోతున్నా" అని.

తన సదభిప్రాయాన్ని, తన ఆశని, తన వినతిని, తనని లక్ష్యం చేయకుండా సత్యం తిరిగి అవమానించినందుకు కోపంతో సీత చెంపలు ఎర్రబడినవి. పెదవులు వణికాయి. స్వస్తివాచకానికి నాంది చదివింది. "అయితే, సరేలెండి, ఇంకెప్పుడు ఉత్తరాలు రాయకండి" అంది కోపంగా.

"రాయనులెండి" అన్నాడు సత్యం కారు స్టార్టు చేస్తూ.

రోదసిలో విహరిస్తున్న శతసహస్ర దేవతల కంఠాలు.... ఎడారి సంగీతపు నిర్జీవరాగాన్ని ఆలాపించాయి.

సముద్రుడు వినలేక హోరున ఘోషించాడు.

కారు స్టార్టుచేసి తిన్నగా ఉన్న రోడ్డు చివరికి చూసిన సత్యానికి దూరంగా ఆ తారురోడ్డు మీద మెరుస్తున్న ఎండమావులు కనపడ్డాయి.

"ఎండమావులు" అనుకున్నాడు.

నూరు గజాలు కారు పరుగెత్తేసరికి సత్యం కారుకి బ్రేకు వేసి ఆపాడు. తను పావు నిముషం క్రితం ఎండమావులు అనుకున్నవి నిజంగా ఎండమావులు కావు. రోడ్డు పక్క కార్పొరేషన్ పంపుకి చిల్లుపడి మంచి నీళ్ళు రోడ్డుమీద చిన్న తటాకం వలె నిలిచాయి.

"ఎండమావులు కావు" అనుకున్నాడు కారు ఆపిన సత్యం.

అనిర్వచనీయమైన అనుభూతికిలోనై అర్థంకాని ఊహాలతో వెనక్కి చూశాడు.

దూరంగా పోస్టాఫీసు దగ్గర ఎండలో నిలిచిన సీత శిలావిగ్రహం వలె అక్కడే నిలిచివుంది. పావు నిముషం నిశ్చేష్టుడై చూశాడు సత్యం.

సీత ఒంగి నేల మీద పడివున్న నలిగిన ఉత్తరం తీసింది. మళ్ళీ తల వంచుకుని నిలుచుంది.

ఆనందంతో, పట్టరాని ఆనందపు బాధతో ఆ అబ్బాయి సత్యనారాయణ హృదయం ఉధృతంగా కొట్టుకుంది.

కారు మళుపు తిప్పకుండానే వెనక్కి నడిపాడు మహావేగంతో. వందగజాల దూరంలో ఉన్న పోస్టాఫీసుకి తను చేరే వరకూ సీత అలాగే నించుని ఉంటుందా. ఉండదా అనే ప్రశ్న అతని హృదయం అడిగింది.

దిగంతాలకు పోయి వచ్చిన ఆ ప్రశ్న అతని చెవులలో ప్రతిధ్వనించింది. ఆ ప్రశ్న సీతని స్పృశించింది.

"ఉంటానా, ఉండనా" అని ప్రశ్నించుకుంటూ నిలిచింది సీత, మహావేగంతో వెనక్కి వస్తున్న కారును చూస్తూ.

★ ★ ★



# భగ్నవీణాలూ బాష్పకణాలూ

"ప్రభావతి ప్రద్యుమ్నుడిని ముద్దు పెట్టుకున్నదట" అన్నాడు దిలీప్ నెంబరు మూడు కుర్చీలో కూర్చుంటూ. "ఎన్నో నెంబరు?" అంటూ ఉరిమాడు – తుళ్ళిపడి మట్టగిడసలా తన్నుకుని బల్లమీదకి ఎగిరి కూర్చున్న రెండో నెంబరు ప్రద్యుమ్నుడు.

దిలీప్ నెంబరు మూడు చిరాకు పడ్డాడు.

"ముందు నా మొహం మీద నుంచి నీ మొహం తీసి కుర్చీలో కూర్చో – చెబుతాను."

బిక్క మొహంతో, కొట్టుకునే గుండెలతో బల్లదిగి కుర్చీలో కూర్చున్నాడు రెండోనెంబరు ప్రద్యుమ్నుడు. దిలీప్ సావకాశంగా గోళ్ళు భుజించడం ప్రారంభించాడు. "ఊఁ చెప్పు – ఎన్నో నెంబరు వాడు" అంటూ ప్రశ్నించాడు ప్రద్యుమ్నుడు.

"ప్రభావతి మూడో నెంబరు ప్రద్యుమ్నుడిని ముద్దుపెట్టుకున్నది" సావధానంగా చెప్పాడు దిలీప్ నెంబరు మూడు.

కెవ్వున అరచి, బల్లమీది ఛేంబర్సు డిక్షనరీ (జెయింటు క్యాలికో వాల్యూము – 1500 పుటలు) దగ్గరికి లాక్కుని దానిమీద తలపడేసి మూర్ఛపోయాడు – రెండో నెంబరు ప్రద్యుమ్నుడు చొంగ కారుస్తూ. నలుగురూ పోగయ్యారు చుట్టూ.

ఒక హృదయం చితకటం, ఒక తీగ (హృదయ వీణ తాలూకుది) తెగటం అందరికి వినపడింది. మొహాలు చూసుకున్నారు పరస్పరం.

ఇంత పెద్ద దెబ్బతిన్న క్షుభిత ప్రేమికుడి హృదయంపై అందరికీ జాలివేసింది.

వెంటనే అందరి యొక్క జాలి, కరుణా వాళ్ళ వాళ్ళకి ఉండుకున్న హృదయాల నుండి వేయి నయాగరాల వేగంతో మూర్ఛితుడి పైకి ప్రవహించాయి.

మూర్ఛితుడి తలక్రింద చొంగలో నానుతున్న ఛేంబర్సు డిక్షనరీ (జెయింటు క్యాలికో వాల్యూము – 1500 పుటలు) ఆ ప్రవాహంలో కొట్టుకుని పోయింది. కొట్టుకు పోతున్న ఆ డిక్షనరీని గేబుల్ ది సెకండ్ తక్షణం పట్టుకుని, మూలగా

ఉన్న తన బల్ల దగ్గరికి చక్కా పోయాడు – తను రాస్తున్న ఇంగ్లీషు ప్రేమలేఖలో మంచి మంచి మాటలు రాయడానికి.

ది యునైటెడ్ లవర్స్ అసోసియేషన్ – ఇన్‌కార్పొరేటింగ్ ది ప్లెటోనిక్ లవర్స్ సిండికేట్ యొక్క కార్య నిర్వాహక వర్గంవారు పై సంఘభవనంలో కమిటీ అధ్యక్షతన అత్యవసర అసాధారణ సమావేశం జరిపారు – మధ్యాహ్నం మూడున్నర గంటలకి.

అయిదు నిమిషాలపాటు తీవ్రస్థాయిలో తర్జన భర్జనలు జరిగిన అనంతరం ప్లెటోనిక్ లవర్స్ సిండికేట్ వారు "సుమ బాణు రాణీ – ఘనశ్యామల వేణీ – సుమ కోమల వాణీ – శరణం నమామీ" అనే ప్రార్థన పాడారు.

ఆ తరువాత దేశవాళీ దొరలూ, ఇమిటేషన్ దొరలూ కలిసి "ఓ మై డాలింగ్ ఐవానా లవ్ యర్" అనే గీతాన్ని బృందగానం చేశారు.

తరువాత అధ్యక్షుని సూచనపై అందరూ కలిసి – ఇందాక మూర్ఛపోయి, ఇంకా అలాగే వున్న రెండో నెంబరు ప్రద్యుమ్నుడి పట్ల సానుభూతి ప్రకటిస్తూ ఒక తీర్మానం చేశారు.

ఒకటో నెంబరు ప్రద్యుమ్నుడు లేచి, పై తీర్మానంలో "మూర్ఛ" అనే పదం తొలగించి, ఆ స్థానంలో "మృతి" అనే పదాన్ని చేర్చాలని కోరుతూ తెచ్చిన సవరణ తీర్మానాన్ని సభవారు ఏకగ్రీవంగా ఛీత్కరించి త్రోసిపుచ్చారు.

అనంతరం రెండో అంశం చర్చకు వచ్చింది. ప్రభావతి చేత ముద్దు పెట్టుకొనబడినాడని చెప్పబడుతున్న సదరు మూడో నెంబరు ప్రద్యుమ్నుడిపై క్రమశిక్షణ చర్య తీసుకోవాలనీ, అమరమైన ప్రేమకు శారీరకమైన, అశాశ్వతమైన ఐహికమైన విషయాలను జోక్యంచేసి సదరు "ప్రేమ" అనే పదాన్ని పైన చెప్పబడిన మూడో నెంబరు ప్రద్యుమ్నుడు కలుషితం చేశాడని, ప్లేటోనిక్ లవర్స్ సిండికేట్ వారు తీర్మానం ప్రతిపాదించారు.

ఆ తీర్మానం ఆమోదింపబడని పక్షంలో, యునైటెడ్ లవర్స్ అసోషియేషన్ నుంచి తమ పార్టీ వారు విడిపోగలరని ఒక బెదిరింపు కూడా చేయబడింది. తీర్మానం ఓటుకు పెట్టగా ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

సరేనంటే సరే అన్నారంతా.

మూడో నెంబరు ప్రద్యుమ్నుడిపై విచారణ జరిపే నిమిత్తం ఫుల్ బెంచ్ న్యాయమూర్తులు కూర్చున్నారు. ఇందులో ఒకటో నెంబరు ప్రద్యుమ్నుడు ఉండరాదని ఒకాయన సవరణ తెచ్చాడు. కాని సదరు ఒకటో నంబరు ప్రద్యుమ్నుడు లేచి, ఒళ్ళు విరుచుకుని సావకాశంగా ఆవలించడం మొదలు పెట్టాడు; కండలూ గిండలూ, ఒళ్లూ గిళ్లూ ప్రదర్శిస్తూ, ఆవలింత ముగియగానే పై సవరణ ఉపసంహరించుకోబడినట్లు ప్రకటించబడింది.

విచారణ ప్రారంభమైంది. కాని ముద్దాయి ఏడీ?

"ఏడీ...ఏడీ" అన్నారంతా..... "అరే రాలేదే" అన్నారంతా. ఆశ్చర్యపోయారు ఏకగ్రీవంగా. ఛీత్కారాలు ప్రారంభమయ్యాయి.

నౌకరు కుర్రాడు ఒగురుస్తూ వచ్చాడు ఆ మూలనించి.

"ఉంకో తీగె తెగిందంటండి రెండో నెంబరు పెద్దుమ్నుడు గోరికి" అన్నాడు.

అందరూ విస్తుపోయారు. దిలీప్ నెంబరు ఒకటి బరువుగా నిట్టూర్చాడు. రెండు హృదయతంత్రులు పది నిముషాల తేడాలో తెగడమంటే సామాన్యం కాదు....

"ఒరేయ్ బాష్పాలెన్నిరా?"

"పాతికండి. గొట్టాల్లో కెక్కించారండి – నెక్కెట్టి."

అధ్యక్షుడు దాదాపు గంభీర స్వరంతో చిన్న ప్రకటన చేశాడు. "సోదరులారా! ఇది అపత్సమయం. ప్రమాద సమయం. రెండో నెంబరు ప్రద్యుమ్నుడు మూర్ఛనుండి క్షేమంగా కోలుకోవాలని మనందరం కలిసి రెండు నిముషాలు ప్రార్థన చెయ్యాలి. మూర్ఛితుని క్షేమంకోసం అతని గౌరవార్థం అతని ఖర్చుపై మనం ఒక రౌండు కాఫీ – తలకి ఒక కప్పు చొప్పున స్వీకరించాలి. అంతవరకూ మూడో నెంబరు ప్రద్యుమ్నుడి పైన విచారణ వాయిదా వేయబడుతుంది."

కాఫీలకు నౌకరు వెళ్ళాడు.

దిలీప్ నెంబరు మూడు (ఇతడిని ఇటుపై దిలీప్ త్రీ అని వ్యవహరిద్దాం) మాత్రం ఈ ధర్మం కాఫీ పుచ్చుకోదలచలేదు. వేరే కాఫీ, ఒక ప్లేటు బజ్జీ తనకి విడిగా తెమ్మని ఇంకో కుర్రాణ్ణి పంపాడు.

అతనికి నవ్వు వచ్చింది. "పిచ్చిమాలోకం – ఉత్త జడ్డిమూక" అనుకున్నాడు, తన బల్ల దగ్గరికి పోతూ – "రికామీగా తిరిగే వెర్రి వెధవలు. వీళ్ళకి ప్రేమంటే ఏం తెలుసు?.... వాడు దొంగమూర్ఛ పోవడం, వీళ్ళంతా సానుభూతి పారబోసి వాడి డబ్బులతో కాఫీలు తాగెయ్యడం.... కపట నాటకం.... ప్రేమ..... ఎంత పవిత్రమైనదీ! ఆ మాట.... సరోజకే తగింది ఆ మాట" అనుకున్నాడు.

భావానుగుణంగా రంగులు మారుస్తున్న అతడి ముఖం సరోజ జ్ఞాపకం రాగానే ఎర్రబడింది. ఒళ్ళు గగుర్పొడిచింది.

సరోజ మధుబాలలా వుంటుంది. ఐహికమూ, అశాశ్వతమూ అయిన ఈ భూలోకంలో మాత్రం ఆమె పేరు సరోజ. భూలోకంలో సరోజ ఇంటరు చదువుతున్నది. నాన్నా అమ్మా, మీసాల మావయ్యలూ, దళసరి గోడలున్న సంఘం – సరోజని చిన్న పిల్లలాగా చూస్తారు. కాని అమరమూ, పవిత్రమూ, జ్యోతిర్మయమూ అయిన ప్రేమ ప్రపంచంలో ఆమె పేరు మధుబాల. అక్కడ ఆమె దేవత. అందరూ ఆమెను పూజిస్తారు.

"తపించి, కృశించి, నశించి పోదునా" అని మధుబాలని బెదిరించే వాళ్ళు దిలీప్ త్రీ కాకుండా ఇంకో నలుగురు ఉన్నారు. దిలీప్ నంబరు ఒకటీ, దిలీప్ నంబరు రెండూ, మిగతా ఇద్దరూ దేశవాళీ దొరలు. ఒకడి పేరు రాబర్ట్ టెయిలర్ జూనియర్, రెండోవాడు క్లార్క్ గేబుల్ ది సెకండ్. ఈ గేబుల్ ది సెకండ్‌ని వ్యావహారిక భాషలో రికామీ గొడ్డు అనడం కూడా కద్దు.

దిలీప్ త్రీ తీసివేతలు ప్రారంభించాడు.

"మధుబాల దొరలని ఎలాగూ లెక్క చెయ్యదు. పోతే ఒకటో నెంబరు దిలీప్‌కి లావు పెదిమల విషయం మినహా ఇంకే దృష్ట్యానూ అసలు దిలీప్‌కుమార్‌తో

పోలిక లేదు. అంచేత వీణ్ణి కూడా తీసిపారేయ్. రెండో నెంబరు దిలీప్ మాత్రం దిలీప్‌కుమార్ నటించిన సినిమాలు చాలా చూసినందువల్ల అతగాని నడక హొయలూ అనుకరించగలడు. రూపంలో మాత్రం పోలిక సున్నా. జుట్టు కొంచెం పోలిక తెచ్చుకుంటుందేమో. అంచేత వీడికి కూడా మైనసే."

ఇంతవరకు సమీక్షించాక దిలీప్ శ్రీకి ఒళ్ళు పులకరించింది. ఇంక మిగిలింది తనే. తనకి జుట్టూ, కట్టూ, (బొట్టు ఇద్దరికీ లేదు) పెదిమలు, కళ్లు, ముఖ్యంగా హృదయం పోజు – వీటన్నిటిలో తను అసలు దిలీప్‌ని నూటికి నూరుపాళ్ళు పోలి ఉంటాడు. పొడుగు మాత్రం తక్కువ అనుకో...

"అనుకో.... అనుకో....." ఎంత తియ్యగా అంది మధుబాల యీ మాటని! తను చాలా దగ్గిర నుంచి విన్నాడు. రోడ్డు మీద ఎండలో నిలిచిన తన పక్కనించి వెళ్తున్నప్పుడు ఆమె చెంపలు ఎర్రబారాయి. సిగ్గుపడింది. కంగారు పడింది – తన సామీప్యాన.....

దేశవాళీ దొరా, రికామీ గొడ్డూ అనబడే గేబుల్ ది సెకండ్ – కాదని డబాయిస్తాడు. పది గజాల దూరంలో తను ఉన్నందువల్లనే మధుబాలకి బోలెడు సిగ్గేసిందనీ ఆ సిగ్గు తాలూకు చివరి ముక్క దిలీప్ శ్రీకి అందిందనీ అంటాడు.

శుద్ధ అబద్ధం.... మధుబాల తనది..... తను మధుబాల వాడు.

"ఛా – వాక్యం తప్పు." అనుకున్నాడు దిలీప్ శ్రీ.

వాక్యం, వ్యాకరణం గుర్తుకు రాగానే భాష, కళ, కవిత్వం తన్నుకు వచ్చాయి.

తను స్వంతంగా కట్టిన పాట పాడుతూ మధుబాల బొమ్మ గియ్యడం ప్రారంభించాడు.

"నీ చేతి రుమాలును నేనైతే
నీ చెంపను తాకే వాడినిలే" ".... నీ"

(ఈ పాట "హమ్ తుఝసె మొహొబ్బతు" అనే హిందీ పాట మెట్లను అనుసరించి పాడుకొనవలెను.) పాటని ఇరవై మూడుసార్లు తిరిగి తిరిగి పాడేసరికి బొమ్మ పూర్తయింది. లక్షమాట్లు వేశాడు. తలెత్తి చూశాడు చుట్టూ కాఫీలు వచ్చాయి. సోదరులంతా తాగుతున్నారు.

తిరిగి బొమ్మవంక చూశాడు. చూసినకొద్దీ పోలికలు కనబడ్డాయి. పోలికలు కనబడ్డకొద్దీ ప్రేమ ప్రకోపించింది. భరించలేకపోయాడు. బొమ్మ పట్టుకొని బల్ల బల్ల దగ్గరికి బయలుదేరాడు బాధగా, జాలిగా.....

"బ్రదర్! ఈ బొమ్మ ఎవరో చెప్పగలవూ?" అన్నాడు ఒక బల్ల దగ్గర ఆగి.

ఉడతలు పీకిన తాటి టెంకవలె ఎఱ్ఱగా, పిచ్చి పిచ్చిగా ఉన్న జుట్టును సర్దుకుంటూ, తల ఎత్తాడు ప్రశ్నించబడిన "బ్రదరు." అప్పటి వరకు బల్లమీద తలపెట్టి, ప్రేయసిని తలపోసుకుని దుఃఖిస్తున్నాడు అతను. అతని పేరు కిరీటిరావు. కిరీటిరావు మొన్న మొన్నటి వరకు ఎలిజిబెత్ రాణిని మహా జోరుగా ప్రేమించాడు. మొన్నమొన్నటి నుండే రీటా హేవర్తుని గాఢంగా ప్రేమిస్తున్నాడు. రోజూ ఆమెకు ఉత్తరాలు రాస్తూనే ఉంటాడు. టెలిగ్రాములు ఇస్తూ వుంటాడు.

ఇటలీ గిటలీ, అమెరికా గిమెరికా అతను చచ్చినా వెళ్ళడు. అతనికి బాగా నమ్మకం ఉంది. రీటా యిప్పుడు ఇండియా రావడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నది....

అయినా ఆవిడకి బోలెడు పనులాయె... చక్కబెట్టుకోవద్దూ..... ఆలస్యం అయినా తను మాత్రం వెళ్ళడు - రీటా పిలవకుండా... పిలవకేం చేస్తుందిలే..... బహుశా ఇవాళో రేపో టెలిగ్రాం వస్తుంది తక్షణం బయలుదేరమని, లేకపోతే మనిషే రావచ్చు - కబురు పట్టుకుని. పెట్టే బేడా క్లబ్బులోనే పడేసి వుంటాడు కిరీటిరావు. ఏమో ఏ క్షణాన ఏమవుతుందో ఏమిటోనని.

పోస్టు బంట్రోతు, టెలిగ్రాఫు జవానూ కూడా కిరీటిరావుకి చేతిలో చెయ్యివేసి ప్రమాణం చేశారు - రీటా హేవర్తు నించి ఏ కబురు వచ్చినా రెక్కలు కట్టుకు వచ్చి అందజేస్తామని.

రీటా కనపడగానే తను ఎలా ప్రవర్తించాలో తీవ్రంగా ఆలోచిస్తున్నాడు కిరీటిరావు.... అవును, తను ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి?

మధుబాల బొమ్మతో మతి పోగొట్టుకున్న దిలీప్ శ్రీ సరిగ్గా యిలాంటి సమయంలో అడిగాడు కిరీటిరావుని. "బ్రదర్! ఈ బొమ్మ ఎవరో చెప్పకో" అన్నాడు.

"కిరీటిరావుగారు ఇంట్లోలేరండి. రీటాతో ఇటలీ వెళ్ళారు" అన్నాడు కిరీటి తల ఎత్తకుండా. దిలీప్ శ్రీ కదల్లేదు. మళ్ళా అడిగాడు. పరాకుగా తల ఎత్తి చూశాడు కిరీటి. కొంచెం ఆలోచించి జవాబిచ్చాడు:

"ఆడది!"

"గుర్తుపట్టావే! ఇంతకీ ఎవరంటావ్?" అన్నాడు దిలీప్ ఉత్సాహంతో.

చాలా ఆలోచించాడు కిరీటిరావు.... దిలీప్ వంక అనుమానంతో చూశాడు. తెగించి చెప్పేశాడు నిష్కర్షగా, "అబ్బే, రీటా హేవర్తు కాదు. చచ్చినా కాదు. అబ్బే - ఎక్కడా పోలిక లేందే.... నీ బొంద - నువ్వు బొమ్మ లెయ్యడమేవిటి? అబ్బాయ్, ఖచ్చితంగా చెబుతున్నా.... శషభిషలు వద్దు... ఇప్పుడు మూడున్నర అయ్యింది.... నాలుగింటికి హెలికాప్టర్ వస్తుంది. నేను ఇటలీ వెళ్ళాలి.... నిన్నుగినా తీసుకెళ్తాననుకున్నావేమో.... అదేం కుదరదు.... అసలు సంగతీ...."

ఒళ్ళు మండింది దిలీప్‌కి. మంటలకి ఆవిరొచ్చింది. ఆవిరి కన్నీళ్ళైంది. కన్నీళ్ళు కారుస్తూ బొమ్మ పట్టుకుని పక్కబల్ల దగ్గరికి వెళ్ళాడు.

"ఇది మధుబాల కదూ?" అన్నాడు దీనంగా.

నల్లనివాడు, చిన్ననయనమ్ములవాడు, నాలుగే అడుగుల పొడుగువాడు.... భావకవి, బాధకవీ అయిన "రోదసి" బాధగా నవ్వాడు.

"రా కూర్చో - ఈ కుర్చీలో - కూర్చో మిత్రమా - నా పాలిటి సత్రమా" అన్నాడు రోదసి సిగరెట్టు కోసం చెయ్యిజాస్తూ.

సిగరెట్టు ఇచ్చి కూర్చున్నాడు దిలీప్ - "వీడు వెర్రి వెధవ. వీడికి ప్రేమేవిటి" అనుకుంటూ.

సరిగ్గా రోదసి కూడా అదే అనుకున్నాడు.

"తుప్పజుట్టువాడు. వీణ్ణెవర్తి ప్రేమిస్తుంది భగవాన్లూ" తరవాత - "వీడిగోల విని చూస్తా - అయితే వినకేం చేస్తా -" అనుకున్నాడు. "తప్పదుగా - చెయ్యక దగా -" అని మళ్ళా అనుకున్నాడు.

"ఈ బొమ్మ ఎవరో చెప్పవ్?" అన్నాడు దిలీప్ శ్రీ దీనంగా.

రోదసి హసించాడు.... నశించిన హృదయంతో, జేబులోంచి ఓ చిన్న పుస్తకం తీశాడు. "ఇదుగో యీ పద్యం – పరమ హృద్యం. నేను రాశా – నిన్న నిశా.... ఇది మొదట విని, ఈమె ఎవరో, ఈ నా రాణి ఎవరో చెప్పుకో.... తరువాత నేను నీ బొమ్మ ఎవరో చెప్తా" అన్నాడు.

"గోవిందా గొహోవిందా" అనుకున్నాడు దిలీప్ శ్రీ.

రోదసి తను రాసిన పాట చదివాడు:

"ప్రేయసీ నువ్వో చిన్న కురంగం
పాపం నీది నిర్మలాంతరంగం
నేను తప్ప మిగతావాళ్ళు నీకు చేస్తారు శృంగభంగం
అందుకే నాకు తప్ప అందరికీ తిప్పు తారంగం
వీడున్నాడే – వీడు
(అంటే "నేను" అనేవాడు)
వీడు బహు మంచివాడు
అందరి లాంటివాడూ కాడు
వీడి లాటి వాడు వీడే
ప్రేయసీ
తారంపం తారంపం తరరంపం
నీ కోపం నా పాలిటి అంపం
జింపం జిగి జింపం జిగి జింపం
వస్తోందదుగో భూకంపం
కాని నాకు ఎంత మాత్రం రాదు కంపం
నిత్యం చేస్తాను నీ నామ జపం
పాడకు పాడకు తారంగం
నా పాలిటి ముద్దుల కురంగం
భరిస్తాను నీ పరాకు
కాని ఒద్దు బాబోయ్ చిరాకు
వీడు కేవలం నిన్నటి ఎంగిలాకు"

"ఇంకా ఎంతుంది?" అన్నాడు దిలీప్ శ్రీ.

"రెండు పేజీలు" అంటూ రోదసి ఒగర్చాడు.

"ఫస్టుగా ఉంది... ఎవరో చెప్పనా?"

"అంతా వినందే!"

"తెలిసిపోయిందిగా.... స్పష్టంగా కొట్టొచ్చినట్టు తెలిసిపోతుంటేనే!"

"ఎవరంటావ్?"

"హిహిహి.... ఇంకెవరోయ్.... రోదసి యొక్క ప్రేయసి!"

"హోహోహో.... కరెక్ట్.... పెర్ఫెక్ట్...."

"ఊం..... ఇప్పుడు మరి నా ఛాన్సు. ఈ బొమ్మ ఎవరో చెప్పు."

రోదసి ఆలోచన అభినయించాడు. "అవును గాని ఓ రూపాయి అప్పిచ్చెయ్యి – రేపిస్తాలే" అన్నాడు. దిలీప్ రూపాయిచ్చాడు.

"థ్యాంక్స్.... ఇపుడు చెప్పనా..... నీ హృదయరాణి... దయరాణి... యరాణి... రాణి – కాని అమోఘమైన పోలిక వచ్చిందిలే."

చిరునవ్వుతో, సంతృప్తి ప్రకటించి, వందనాలు చెప్పి సెలవు తీసుకున్నాడు దిలీప్ శ్రీ.

దిలీప్ బాధపడడం ప్రారంభించాడు..... మధుబాలకి జాలిలేదు. తను ఎన్ని లేఖలు రాశాడు! ఎన్ని కార్డులు పంపాడు!! ఎక్కడా చలనం లేదే!!! అథమం అవి అందుకున్నట్లైనా సూచన కూడా లేదే!....

తక్షణం ఒక తుది లేఖ రాయ నిశ్చయించాడు. ఈ దెబ్బతో తేలిపోవాలి వ్యవహారం. మూడు సంవత్సరాల ప్రేమ కలాపం – వన్ సైడ్ ట్రాఫిక్కే అనుకో.....

ఉద్రేకం పొంగిపొరలింది. క్లబ్బు తుది లేఖల శాఖవైపు పరుగెత్తాడు. బరువెక్కిన హృదయంతో కూర్చున్నాడేమో – చివికిన పాత కుర్చీ ఫెళఫెళమంది కావి విరగలేదు పాపం!

ఆశ నిరాశ, జయం అపజయం, జీవం మరణం సంధించే జంక్షన్ వంటిది తుదిలేఖలశాఖ. అన్నిప్రయత్నాలూ వ్యర్థమై, నిరాశతో, తెగింపుతో అక్కడ కూర్చుని తుది లేఖ రాస్తారు ప్రేమికులు. ఈ తుది లేఖ జయం, సంతోషం చేకూర్చవచ్చునేమో అనే ఒక సన్నని ఆశ మిగిలి వుంటుంది వాళ్ళలో.

అందుకే ఈ శాఖ గోడమీద ఒక నల్లని పట్టు తెర. దాని మీద దూరదూరంగా ఎర్రని దీప కళికలూ ఉంటాయి. ఈ తెరకి కొంచెం పైన ఒక చితుకుతున్న హృదయం, ఒక భగ్నవీణ, కొన్ని బాష్పకణాలూ త్రివర్ణాలలో చిత్రింపబడి ఉంటాయి.

కాగితం కలం తీసుకుని ఏకధాటిగా రాసేశాడు దిలీప్ శ్రీ – ఒక సుదీర్ఘమైన తుదిలేఖని –

శ్రోతని పిలిచాడు.

ఈ క్లబ్బులో మొత్తం ముగ్గురు శ్రోతలున్నారు – వాళ్ళు ఎవరినీ ప్రేమించరాదు. ఎవరిచేతా ప్రేమించబడరాదు. కేవలం బాధిత ప్రేమికుల విషాద గాథలు విని సానుభూతి పూర్వకమైన సలహాలు యివ్వటం వాళ్ళ విధి. ఆ మాటకొస్తే ఈ శ్రోతలు "అసలు బాధపడుతున్న ప్రేమికుడి" కన్న రవంత ఎక్కువ బాధపడాలి.

శ్రోత వచ్చాడు. వాడు రావటమే దీనవదనంతో ,వచ్చాడు. "ఏం చేస్తాం? ఇది యిలా జరగాల్సింది కాదు. నేను ద్రవించి పోతున్నాను మీ బాధచూసి" అన్నధోరణిలో మొహం పెట్టాడు. సరాసరి వచ్చి "చదవండి" అన్నాడు. లేఖ చదివాడు దిలీప్.

ఇద్దరూ బోలెడు బాధపడ్డారు జమిలిగా. దిలీప్ మధుబాలని తిట్టాడు.

"మీరు ఇంత బాధపడ్డారు కాబట్టి తిట్టారనుకోండి – కానీ, ఎలాగేనా అలా తిట్టకండి – ఏమో...." అన్నాడు శ్రోత.

దిలీప్ మధుబాలని పొగిడి తనని తిట్టుకున్నాడు.

"ఆ! మీకు పిచ్చిగాని ఆడదానికోసం మీరు మిమ్మల్ని ఇంత తిట్టుకోవడం శోచనీయం...." నసిగాడు శ్రోత.

"నీకు తెలీదు శ్రోతా – నేను శుద్ధ వెధవని" అన్నాడు దిలీప్. పరాగ్గా వున్న శ్రోత "అవుననుకోండి.... కానీ" ..... అన్నాడు. విసుగించుకున్నాడు దిలీప్.

"సరేగానీ – ఈ ఉత్తరం చివర నల్లని సిరా చుక్క పెడితే బావుంటుంది కదూ" అన్నాడు.

"వండర్ ఫుల్ – చాలా ఇఫెక్టివ్‌గా ఉంటుంది. నిరాశ, వేదన స్ఫురింపజేస్తుంది ఆమెకు" అన్నాడు శ్రోత ఉషారుగా.

"ఏవిటా ఉషారు – నవాబు గారి అల్లుడిలా" అన్నాడు దిలీప్ చిరాకు పడుతూ.

శ్రోత తల వంచుకున్నాడు నిశ్శబ్దంగా.

నౌకరు రెండు కాఫీలు, ఒక ప్లేటు బజ్జీ తెచ్చాడు. దిలీప్ ఓ బజ్జీ తిన్నాడు. రెండోది చేత్తో పట్టుకుని ఆగాడు.

"శ్రోతా – పోనీ యింకోటి చేస్తే –" అన్నాడు మెల్లిగా. శ్రోత తల ఎత్తాడు.

దిలీప్ చెప్పాడు-"నేననేదీ – పోనీ ఆ నల్లచుక్క మానేసి కొంచెం లావుగా ఎర్రని గీత పెడితే."

శ్రోత ముఖం వికసించింది. "నేననుకున్నానండీ ఇందాకనే. ఎరుపు పెడితే రక్తం, ప్రమాదం జ్ఞాపకం వస్తాయి. మీకు మీరు ప్రమాదాన్ని చేసుకుంటారనే బెదిరింపు కనబడుతుంది."

"రైట్ రైట్.... ఎర్రగీత బెస్టు. చూడు శ్రోతా – – నీకు నేనెంతో ఋణపడి వున్నా నీ సలహాలకి – నాకు తట్టలేదు సుమా! నువ్వు ఎవర్నీ లవ్ చెయ్యవేం?"

శ్రోత మోడెస్టుగా మొహం పెట్టాడు.

"ఇదివరకు చేశానండి. అదంతా ఒక విషాదగాథ.... వింటే బాధ.... గుండెల్లో రొద.... ఎదుటి వాడికి సొద.... నా పాలిటి చెద.... ఓ సుందరిని ప్రేమించానండి.... ఓ మాటు ఆ అమ్మాయి యింటికెళ్ళా.... కారబ్బూంది చేతిలో పోసిందండి.... చేతులు తగిలాయి – కళ్ళు కలిశాయి. ఎదలు వెలిగాయి – ఆ మట్టున ప్రేమించానండి. గడియారం అమ్మేసి, ఉద్యోగానికి రిజైనిచ్చి, ఆ రోడ్డులో తిరిగే వాడిని – హోటల్లో వేళ్ళాడేవాడిని. అపుడపుడు వాళ్ళింటికి వెళ్ళేవాడిని. కొన్నాళ్ళు ఆ అమ్మాయి బాధగా చూసింది – తరువాత ఆమె సినిమావాళ్ళతో...." అంటూ తల వంచుకున్నాడు శ్రోత.

దిలీప్ ఒళ్ళు మండిపోయింది. పొరబాటున అడిగితే తన కథతో పాటు వాడి కథని మహా పవిత్రమైనదిలా వికరువు పెట్టినందుకు శ్రోతని మళ్ళీ విసుగించుకున్నాడు. అర నిముషం నిశ్శబ్దం పాటించి హఠాత్తుగా అన్నాడు:

"శ్రోతా, చూడు – నువ్వు వెయ్యి చెప్పు, లక్ష చెప్పు – ఎర్రగీత కన్న నల్ల చుక్క మంచిదోయ్!"

రెండు క్షణాలు ఆలోచన అభినయించి శ్రోత చిరునవ్వుతో సమర్థించాడు. "అంతే అంతే ఆలోచించి చూస్తే అదే మంచిదనిపిస్తోంది నాకూను. ఎరుపులూ, రక్తాలూ, బెదిరింపులూ కన్న నల్ల చుక్క పెట్టి నిరాశనీ బాధనీ సూచిస్తే నయం."

చేతిలో యిందాకటి నుంచీ నలుపబడుతున్న రెండో బజ్జీ నోట్లో వేసుకుని, చిక్క మొహంతో సందేహం ప్రకటించాడు దిలీప్. "శ్రోతా, ఏమవుతుందో ఇదంతా! నాకు

అనుమానంగా వుంది. దీనిక్కూడా యిదివరకు ఉత్తరాల్లా జవాబు లేకపోతే?"

"అబ్బే, తప్పకుండా ఉంటుందండి."

"ఉండకపోతే?"

'నీకర్మం' అనుకున్నాడు శ్రోత – కాని బయటికి ఇలా అన్నాడు: "నాకు ఒక్కటే కారణం దొరికిందండి. మిమ్మల్ని చూడగానే ఆ అమ్మాయి అంత వరకూ కుడిచేత్తో పట్టుకున్న పుస్తకాలు ఎడంవేపుకి మారుస్తుంది కదండీ."

దిలీప్‌కి అర్థం అయింది. "అవునయ్యా అవునూ – ఎడంవేపుకి మార్చిందంటే హృదయం అన్నమాట – హృదయాన్ని సూచిస్తోందన్న మాట. పాపం ఎంత బాధపడిపోతోందో నాకోసం" అన్నాడు దిలీప్ మూడో బజ్జీని పరీక్షగా చూస్తూ. "శ్రోతా, నాకు మధు జ్ఞాపకం వస్తే ఏడుపొస్తోంది. నేను చచ్చిపోతా. కృశించి మరీ నశిస్తా – నేనీ బజ్జీలు తినను గాక తినను. తినలేను.... నువ్వు తినెయ్" అంటూ మూడో బజ్జీ ప్లేటులో పడేసి శ్రోతకి యిచ్చాడు.

శ్రోత నిశ్శబ్దంగా ఒక నల్ల కాగితంలో ఆ బజ్జీలు పొట్లం కట్టి దిలీప్ జేబులో పెట్టాడు. "మీకు తెలీదు దిలీప్! ఇవి మీ స్మృతి పథంలో చిరస్థాయిగా నిలిచే బజ్జీలు, ఇవి పదిల పరచండి ఇంట్లో.... ఒకనాడు మీరూ, మీ మధూ కలిసి కులుకుతున్నప్పుడు ఈ బజ్జీలనీ, నన్నూ జ్ఞాపకం చేసుకుని, ఈ సన్నివేశం గుర్తుకు తెచ్చుకుని నవ్వుకుందురు గాని. నా తిండికేం, నేను హోటలుకి పోతా – ఇవి మాత్రం దాచండి" అన్నాడు.

దిలీప్‌కి ఆశ్చర్యంతో, ఆనందంతో ఒళ్ళు పులకరించింది. తనూ, తన మధూ అన్నాడు శ్రోత. ఎంత చక్కగా ఉంది ఆ మాట. అదే నిజమయితే! తక్షణం శ్రోతకి అయిదు రూపాయల కాగితం చేతిలో పెట్టాడు. శ్రోత తలకిందులయిపోయి బోలెడుసేపు తోక తెగ ఆడించాడు.

నాలుగుగంటల వార్నింగు బెల్లు కొట్టింది. తుళ్ళిపడ్డారు. కాలేజీ యిక అరగంటలో వదుల్తారు మేకప్ ప్రారంభించవచ్చు.

దిలీప్ లేచి తన రూముకి బయల్దేరాడు.

హఠాత్తుగా మళ్ళీ వార్నింగు బెల్లు మోగింది. బయట ధన ధన చప్పుడయింది. దాంతోపాటు ఠప ఠప ఇంకో చప్పుడు వినపడింది. శబ్దం దగ్గరకొచ్చిన కొద్దీ ధన ఠప ధన ఠప అనే శబ్దాలు పోటీగా వినపడ్డాయి.

నౌకర్లు ముగ్గురూ అన్ని బల్లల మీద నించీ కాఫీ కప్పులూ, సిరాబుడ్లూ, యాష్‌ట్రేలూ తీసి కింద పెట్టేశారు. హాలులో ప్రేమికులందరూ వరసగా గోడవారని అంటి పెట్టుకుని నుంచున్నారు – ప్రాణాలూ, గుండెలూ బిగపట్టుకుని.

ధైర్యవంతుడూ, చురుకైనవాడు, తెలివిగలవాడూ అయిన ఒక నౌకరు కుర్రాడు తెగించి, హాలు మధ్యగా ప్రవేశ ద్వారానికి ఎదురుగా వున్న బల్లని పక్కకి లాగేశాడు.

ధన ఠప అనే ధ్వనులతో నేల అదిరింది – పై కప్పు కదిలింది. వాయువు కంపించింది.

కెనడియన్ రైలింజనులాగా, మెక్సికన్ ఫైటింగ్ బుల్ లాగా మహా వేగంతోనూ, కానుగచెక్క బల్లల స్టేజీమీద, ప్రమథ గణాలతో సహా ఢంకా, డోలు, డమరుకం

మొదలయిన చర్మవాద్యాలు అనుసరించగా ప్రళయ తాండవం చేస్తున్న మహాశివుని పాద తాడన శబ్దంవలె భూ నభాలకు బీట వేయించగల ధన ఠప శబ్దాలతోనూ – భూమికి అరవై అయిదు డిగ్రీల కోణంలో నడ్డి వరకూ, నలభై అయిదు డిగ్రీల కోణంలో శిరస్సు వరకున్నూ వంచబడిన శరీరంతోనూ, దక్షిణ హస్తంలో ముహుర్ముహుశ్చాలితమైన చేతి రుమాలు మోకాళ్ళ సమీపంలో –

ఠప మంచున్ ఠప మంచున్ మరల

ఠా ఠా ఠా ఠపా మంచు! ఠా ఠా....

అంటూ చప్పుడు చేయగా చాప విముక్త శరమువలె "ది గ్రేట్ లవర్ శోభనాద్రి" క్లబ్బు హాల్లోకి దూకాడు. ఆ రావడం ఒక కాఫీ సాసరూ, ఒక యాష్ ట్రే, ఒక మనిషి కాలూ చితకతొక్కి, తిన్నగా వెళ్ళి ఒక స్థంబానికి గుద్దుకుని దాని పూర్తి సహకారంతో ఆగాడు.

నౌకర్లు తిరిగి బల్లలు సర్ది వాటిపైన సిరాబుడ్లూ, కాఫీ కప్పులూ యధాస్థానంలో ఉంచారు. జనం సర్దుకున్నారు. రోజూ సాయంత్రం నాలుగు గంటలకి జరిగే కార్యక్రమమే ఇది. కాని ఇవాళ శోభనాద్రి జోరు కొద్దిగా మోతాదు మించింది.

శోభనాద్రి కుర్చీలో కూర్చున్నాడు – బరువుగా, గట్టిగా నిట్టూర్చుతూ. నౌకరు వచ్చాడు. "ఖాఫీ" అన్నాడు శోభనాద్రి. కాఫీ వచ్చింది. ఒక శ్రోత, ఒక గాజు గిన్నె కావాలన్నాడు తిరిగి శోభనాద్రి.

రెండు నిమిషాలలో శ్రోత వచ్చాడు గాజు గిన్నె పట్టుకొని. శోభనాద్రి గాజు గిన్నెలోకి అర ఔన్సుడు బాష్పాలు దుఃఖించి క్లబ్బు రికార్డు బ్రేక్ చేశాడు. కళ్ళు తుడుచుకుని శ్రోత వంక చూశాడు.

శాండో బనీను వేసి శాండో బాబులా కనపడ్డాడు శ్రోత. "శ్రోత సోదరా! హేం చెప్పను" అన్నాడు శోభనాద్రి – తన రెండు చేతుల్ని యావచ్ఛక్తితోనూ శ్రోత భుజాల మీద పడేస్తూ, కండపుష్టి గల శ్రోత బయటికి చలించలేదు. కానీ అతని లోపల నరాలు కంపించిపోయాయి. "హిహి" అని యికిలించాడు.

"హుఁ కులాసాగా వున్నావా?" అన్నాడు శోభనాద్రి శ్రోత కుడి చెయ్యి విరిచేస్తూ.

"అఁ" మూలిగాడు శ్రోత తన కుడిచేతిని బాధగా చూసుకుంటూ.

"నా మనస్సు బాహూలేదోయ్! పైగా హృదయం చితికిపోయింది – ఎండిపోయింది" అని వాపోయాడు శోభనాద్రి – ఈమాటు శ్రోత కుడి అరచేతిని, దాని తాలూకు వేళ్ళనూ పిండి ఎండవేస్తూ.

మేకప్ పూర్తిచేసుకొని విలాసంగా సిగరెట్ కాలుస్తున్న దిలీప్ శ్రీ నవ్వుకున్నాడు. "వెర్రి వెధవ అఖరికి వీడికీ ప్రేమేనా" అని.

అతనికి ఒక చిన్న కోరిక పుట్టింది – శోభనాద్రి ప్రేమకథ వినాలని. కాసేపు వినోదంగా కూడా ఉంటుంది. పనిలోపని తన హృదయ వ్యథ కాసేపు మర్చిపోవచ్చు కూడాను.

మెల్లిగా శోభనాద్రి దగ్గరకు వెళ్ళాడు. సానుభూతి పారబోసి కుర్చీలో కూర్చున్నాడు. "ఏమిటయ్యా పాపం, మీ రాణి ఏమంటుంది?"

శోభనాద్రి ఉబ్బితబ్బిబ్బయి పోయాడు – శ్రోతలు తప్ప మామూలు ప్రేమికులెవరూ ఇంకోడి కథ వినరు. అలాంటిది ఇవాళ ఒక హైక్లాసు ప్రేమికుడు – దిలీప్ శ్రీ – తనవంటి "సి" క్లాసు ప్రేమికుడిని పలకరించి కథ అడుగుతున్నాడు – గబగబా క్లుప్తంగా చెప్పబోయాడు శోభనాద్రి.

"మా శశిరేఖ చాలా అందమైనదండి – హుఁ – ఈ దౌర్భాగ్యుడు ఆవిడని ప్రేమించి, కృశించటం మొదలెట్టాడు. చివరికి భరించలేక పోయాడు బాధని" కొంచెం ఆగి సాగించాడు శోభనాద్రి కొంచెం ఉద్రేకంగా.

"నువ్వే వున్నావయ్యా – ప్రేమించ్చావ్ – నీ ప్రేయసి నిన్ను చూడదు.... చూడదయ్యా చూడదు.... చూడదంటే చూడదు. నీకు సిగ్గుండద్దూ, బుద్ధుండద్దూ, మొగాడివి కాదూ – నిలేసి అడగొద్దూ దాన్ని?....

ఏవిటి శశీ, నేనో పక్క యిలా తకతకలాడి పోతుంటే ఏవిటి నీ నిర్లక్ష్యం? ..... అహ..... అసలు ఏవిటంట..... అహ..... నువ్వే చెప్పు. నాతప్పంటే చెప్పుతో కొట్టు. నేనేం గోల చేశానా – ప్రేమలేఖలు రాశానా? .... ముఖాముఖీని తూపుల్లాంటి చూపుల్తో అడిగాను – "కాస్త ప్రేమిస్తావా?" అని. జవాబియ్యద్దు నువ్వూ? ససేమిరా.... అనూమినూ తేల్చవ్ – ఏం? అవునంటే కాదూ? కాదంటే పోదూ? చెప్పు ఇవాళ తేల్చి పారెయ్ – కథా కమామీషూను. ఆఁ.... అవటాన్ని నిలేసి హడలేసి అడిగి పారేస్తే, నాది తప్పటయ్యా? పైగా నన్ను కొడతావూ? నీకేమన్నా అసలు ఎడంవేపు గుండె వుందా అని! అహఁ అడుగుతున్నా... చెప్పవయ్యా చెప్పు – మాట్లాడవేం?"

శోభనాద్రికి ఉద్రేకం మోతాదు మీరింది. కుర్చీలోంచి లేచి పోయాడు. రెండు చేతుల్తోటీ దిలీప్ శ్రీ కాలర్ నలిపేసి, మొహం చిదిమేశాడు.

అతికష్టం మీద తప్పించుకున్నాడు దిలీప్ శ్రీ ఆ పట్టులోంచి.

"చూడు పంతులూ, అలా అలా దూరంగా కూచుని చెప్పు. ఒళ్ళు మసాజు చెయ్యకు – తొరగా కానీ – పోవాలి" అన్నాడు.

అమోఘంగా బోల్డు సిగ్గు పడిపోయాడు శోభనాద్రి. "సారీ బ్రదర్, ఏమనుకోకు.... ఏం? అంతేనా – అనుకోవుగా" అంటూ మళ్ళా లేచి దిలీప్ శ్రీ కుడిచేతినీ, చేతిలో కాలుతున్న సిగరెట్టునీ కలిపి నలిపేశాడీమాటు పశ్చాత్తప్త హృదయంతో.

దిలీప్ శ్రీ వెంటనే యిద్దరు శ్రోతల్ని బుక్‌చేసి శోభనాద్రి చేతుల్ని గట్టిగా పట్టుకోమన్నాడు. తను దూరంగా నుంచున్నాడు – కాలిన చేతి మీద వుమ్ముకుంటూ వూదుకుంటూ.

దిక్కు మొహం వేసి మొదలెట్టాడు శోభనాద్రి.

"అదే అదే – శశిరేఖని కిందిటేడునుంచీ ప్రేమిస్తున్నా. ఏడాది నుంచీ నన్ను నిర్లక్ష్యం చేస్తోంది. భరించలేక ఇవాళ మధ్యాహ్నం వాళ్ళింటికే వెళ్ళా. వాళ్ళ వీధి చివరే కనబడింది. అడిగేశా ఖచ్చితంగా. "ఓ సుందరమైన శశీ! ఎందుకే నామీద నీకంత కసీ!, చేస్తావా నాబతుకు మసీ అవటా" అనీ, "ఇదుగో అమ్మాయ్ నాకు కవిత్వమంత బాగా రాదుగానీ తెలుగులో చెప్తా విను" అన్నా. నవ్వింది. ఎంత బావుందనుకున్నావా నవ్వు. నాకు ధైర్యం వచ్చింది. "ఓరి వెర్రి శోభనాద్రీ! శశి నిన్ను

బోల్డు ప్రేమిస్తోందిరా. ఇంతకన్న రుజువేమిటి?" అనుకున్నా. వెంటనే చెప్పాను "ఓ శశీ, నేను నిన్ను ప్రేమించుచున్నాను. నీవు నన్ను ప్రేమించు చున్నావా? అయినట్లయితే నేను నిన్ను పెళ్ళి ఆడుతాను. మా క్లబ్బు రూల్సు ప్రకారం ప్రేమించేవాళ్లు పెళ్ళాడుతానని మాట యివ్వకూడదు – అయినా నేను నీకు వాగ్దానం యిచ్చాను. నీకోసం ఎంత పనైనా చేస్తాను. ఆఖరికి క్లబ్బు మెంబరుషిప్పు కూడా వదిలేస్తాను అఁవఁటూ" అని. శశి ముందర నవ్వేసి తరవాత నేలమీద వుమ్మేసి "ఫో వెధవా" అంది. నాకు నిజంగా ఏడుపొచ్చింది, కాని తెగించాను.

"పద – మీయింటికొస్తా – మీనాన్న నడుగుతా – నిన్ను పెళ్ళాడుతా తా – తా – తా – టాటా అన్నాను. కొంచెం ఆలోచించింది శశి. తటాలున దూరంగా పరుగెత్తి నాలుగు రాళ్ళు తీసి "ఫో వెధవా, మా యింటికొస్తే రాళ్ళతో కొడతా" అంటూ నేను జవాబిచ్చేలోగానే రాళ్ళతో కొట్టిందండి. ఎవరేనా చూస్తే బావుండదని నేను వెనక్కొచ్చేశాను పగిలిన హృదయంతో" అని ఒగర్చసాగాడు శోభనాద్రి.

దిలీప్ శ్రీ పకపక నవ్వాడు. "పోతే పోయిందిలే – దీని మామ్మ యింకోత్తి. ఇంకో మంచిదాన్ని ప్రేమించు. లేపోతే ఓ సుబ్బలక్ష్మినో యింకో సుందరమ్మనో పెళ్ళాడి పారెయ్, ఆ! దానికి రాయి ప్రేమలేఖలు! పోయిందేముందీ" అన్నాడు.

సిగ్గుతో, చిరునవ్వుతో తలవంచుకున్నాడు శోభనాద్రి. "నేనూ అదే అనుకుం టున్నానండి. హుఁ ఏవిటో – మీవంటివారి ఆశీర్వచనం ఉంటే అదెంత లెండి" అన్నాడు.

హేమవతి ప్రియుడు హయగ్రీవశర్మ ఓ పక్క స్తంభాన్ని కావలించుకుని శ్లోకం చదువుతున్నాడు, దిలీప్ నవ్వుకున్నాడు. "కోడి జుట్టూ వీడూనూ. వీడి చెవులకి జయగంట లొక్కటే తక్కువ. వీడికీ ప్రేమే."

హయగ్రీవుడు తనలో తనే మాట్లాడుకుంటున్నాడు.

"హేమ కులాసాయేనా?" అన్నాడు దిలీప్ శ్రీ ఉద్ధరించేవాడి పోజులో. తటాలున స్తంభం వదిలి దిలీప్ భుజాలు పట్టుకున్నాడు హయగ్రీవుడు. కల్తీలేని హయగ్రీవంతోనే సకిలించాడు.

"చెప్పు దిలీప్; నువ్వే చెప్పు. హేమ కులాసేనా? బావుందా? నా పిచ్చిగానీ హేమ కులాసాగా లేపోతే లోకంలో యింకెవరు కులాసాగా ఉండగలరు?"

న హేమే న దుఃఖమ్ న దుఃఖేన వినా సుఖః
న సౌఖ్యేన వినా లోకమ్ తస్మాన్ హేమాత్మకమ్ త్రయమ్
హయగ్రీవ ఉవాచ:

అనగా హయగ్రీవుడు ఏమంచున్నాడయ్యా – హేమ లేకపోతే దుఃఖం లేదు. దుఃఖం లేకపోతే సుఖం విలువ తెలీదు. అనగా సుఖం లేదు. సుఖమే లేకపోతే ఈ లోకం మనకెందుకూ? అనగా లోకం లేదని భావం. అందువల్ల ఆ యొక్క హేమ కోసం నా దుఃఖం, అంత దుఃఖపడిన మీదట ఆమెను పొంది నేను అనుభవించగల సుఖం, వీటి నిలయము అయిన లోకం – యీ మూడున్నూ కలిస్తే హేమ అని భావము."

"ఇప్పుడే వస్తానండీ" అన్నాడు దిలీప్. అప్పటికే మతి పోయింది.

నాలుగూ యిరవై అయిదు నిమిషాలయింది. ఆడపిల్లల కాలేజీ వదలడానికింకా అయిదు నిమిషాల టైముంది. ఆఖరి వార్నింగు బెల్లు మోగింది. సంఘసభ్యుల మేకప్పులు పూర్తయ్యాయి డ్యూటీ బీటుకెళ్ళడానికి.

సభ్యుల్లో రెండురకాలున్నారు – ఒకరకంవాళ్ళు ఇన్‌డోర్ లవర్స్, అంటే వాళ్ళు ప్లేటోనిక్ లవర్స్ సిండికేటు సభ్యులు – వీళ్ళు కేవలం సంఘభవనంలోనే ఉండి ప్రేమించగలరు. రెండోవాళ్ళు ప్రాక్టికల్ లవర్సు. వీళ్ళది ఔట్‌డోరు వర్కు కాలేజీ దగ్గరా, రోడ్డుమీదా, బస్సుల్లోనూ, ప్రేయసి ఇంటి చుట్టుపట్ల ప్రేమ వ్యవహారాలు – హృదయాలు ఇచ్చిపుచ్చుకోవడాలు – మొదలైన ధర్మాలు నిర్వర్తిస్తారు. అయితే ఒకటి – ఏ ప్రేమికుడైనా సరే ప్రేయసిని చూడబోయేముందు సంఘభవనం ప్రవేశద్వారానికి పైన వ్రేలాడే శ్రీ ప్రేమానందస్వరూప్ సీనియర్ త్రివర్ణ తైలవర్ణ చిత్రానికి నమస్కరించి బయల్దేర్తాడు. శ్రీ ప్రేమానందస్వరూప్ ఈ సంఘ వ్యవస్థాపకుడు. ప్రేమించి కృశించి నశించిన నిస్వార్థ పవిత్రజీవి. ఈయన చిన్నప్పుడు ఒక సుందరాంగికి హృదయం సమర్పించారు. కాని ఆవిడ పుచ్చుకోలేదు. ససేమిరా అంది. ఈయన తీవ్రతపస్సు చెయ్యడం మొదలుపెట్టాడు. కొన్నాళ్ళు ఆమె కనబడలేదు.

ఒక రోజున శ్రీ ప్రేమానంద స్వరూప్ సీనియర్ క్షుభిత హృదయంతో మేడ వరండాలోంచి చూస్తున్నాడు. హఠాత్తుగా ఆమె కనబడింది. సంతోషంగా వెళ్ళిపోతోంది తన భర్తతో. రెండు బాష్పాలు రాలాయి శ్రీ ప్రేమానంద స్వరూప్ సీనియర్ యొక్క రక్తారుణ నయనాలనుండి. తన ప్రేమ దేవత తనని బొత్తిగా ఖాతరు చెయ్యకుండా స్వంత భర్తతో వెళ్ళిపోయింది. ఆమె తలలోంచి ఓ సుపుష్పం – "రాలెను ధూళిలోన" అన్నట్టుగా రోడ్డుమీద పడిపోయింది.

శ్రీ ప్రేమానంద స్వరూప్ సీనియర్ గబగబా మేడదిగి పరుగెత్తుకు వచ్చాడు. కాని – కాని – అప్పటికే ఆ పవిత్ర పుష్పం ఒక క్రూర ద్విచక్ర శకటం కిందపడి నలిగి రోడ్డుకి అంటి పెట్టుకుని మరణించింది. బరువెక్కిన గుండెతో బాధగా తీశాడు ప్రేమానంద స్వరూప్ సీనియర్ దాన్ని. చాలాసేపు దుఃఖించి తరువాత కాఫీ తాగి ఆలోచించాడు తన ప్రేమగాథ లోకంలో చిరస్థాయిగా నిలచే పద్ధతికోసం. వెంటనే ఈ ఐక్య ప్రేమిక మండలి స్థాపించాడు. ఆయన నేడు లేడు.... మనకి లేడు. కాని ఆయన పవిత్ర స్మృతి ప్రతి ప్రేమికుడిలోనూ ఉంది. ఆనాటి ఎండిన పువ్వు పునాదిగా చందాలపై కొత్తభవనం లేచింది.

అందువల్ల ఏ ప్రేమికుడైనా సరే ముందుగా ఆయన చిత్రపటానికి నమస్కరిస్తాడు.

ప్లేటోనిక్ లవర్స్ వాళ్ళు బయటికి వెళ్ళరు. మేడ వరండాలో షికారు చేస్తారు. వెంకటచలం చెప్పినట్టు మామిడిపండును దూరం నుంచి చూసి ఆనందించడం; మహా అయితే ఓమాటు వాసన చూసి లొట్టలు వెయ్యడం వాళ్ళ పని. శరీరం అశాశ్వతం.... బుద్బుదప్రాయం. కేవలం హృదయాలూ ఆత్మా శాశ్వతం. వీళ్ళు చామాలమ్మనుంచి చంద్రవదన వరకూ జానమ్మ నుంచీ జాజాగేబర్ వరకూ ఎవళ్ళనైనా ప్రేమించవచ్చు. వీళ్ళది ఇన్‌డోర్ వర్కు మాత్రమే.

చొక్కాలూ పంచలూ ఊడదీసి కేవలం అండర్‌వేరూ, కట్‌బనీన్లతో వచ్చి మేడ వరండా పిట్టగోడ మీద వీరవాసర వానరవరులవలె కూర్చుంటారు. కొందరు రెండు కాళ్ళూ అటు వేస్తారు ధైర్యంగా. కొందరు ఎందుకేనా మంచిదని ఓ కాలిటూ ఓ కాలటూ వేస్తారు. మిగతావాళ్ళు చాలాదూరం ఆలోచించి పూర్తిగా క్షేమ ప్రదమయిన ప్రదేశంలో నుంచుంటారు. దారంట వచ్చే అమ్మాయిల వంక బాధగా చూస్తారు. హృదయాలు స్పందింప జేసుకుంటారు. ఒకాయన ఆ పిట్టగోడ మీద చేతులెత్తుకుని నడిచి, ప్రేయసి కోసం తను చెయ్యగల ప్రాణత్యాగాన్ని సూచిస్తాడు. ఇంకో భగవాన్లు ఒక కాయితం గులాబీ కొన్నాడు. అతగాడు రోజా నాలుగున్నర నుంచి వాల్లుమ్ముప్పావుదాకా దాన్ని వాసన చూస్తూ ఉంటాడు – కీలు గుర్రంలో నాగేశ్వర్రావు ఫోజులో. అంజలీదేవి ఒక్కొక్క మాటు పైకి చూస్తుంది. ఒక్కోమాటు బటాణీ పొట్టు వొల్చుకోవడంలో నిమగ్నురాలై తల వాల్చుకుని వెళ్ళిపోతుంది.

ఇంక అవుట్‌డోర్ బీటుకి వెళ్ళేవాళ్ళ వ్యవహారం పూర్తిగా వేరు. గాబర్డీన్, ట్వీన్, లినెన్, గ్లాస్కో, పాప్లిన్, లాంక్లాత్, చవక మల్లు తరగతుల వాళ్ళున్నారు. "గాబర్డీన్ వారు బహు ఆడంబరులు" అంటారు మల్లు చొక్కాలవారు. కానీ మరియమ్మ, జానమ్మల కోసం తపస్సు చేసే యోసేపు, దావీదులు మాత్రం ఒప్పుకోరు. "ఆవిడ చీరపాటి ధర చెయ్యోద్దా నీ చొక్కా?" అంటారు. సాధారణంగా రోజా రోడ్డుమీద దారి కడ్డంబడి ప్రేమించేవాళ్ళు (అవుట్‌డోర్ లవర్స్) పద్నాలుగు మంది ఉంటారు – ప్రద్యుమ్నుడు నెంబరు ఒకటీ రెండూ మూడూ, దిలీప్ నెంబరు వన్ టూ త్రీ, నాగేశ్వర్రావు నెంబరు ఒకటీ రెండూ, శివరావు డూప్లికేటు, రాబర్ట్ టేలర్ జూనియర్, గేబుల్ ది సెకండు, శోభనాద్రి ది గ్రేట్, యోసేపు, దావీదు – వీళ్ళు మినహా మిగతా వారంతా ప్లేటోనిక్ ప్రేమికులే.

వాళ్ళప్పుడే వరండా గోడమీద సద్దుక్కూచున్నారు.

ఇంక మూడు నిమిషాల టైముంది. అవుట్‌డోర్ బీటుకెళ్ళే ప్రేమికులు బయలుదేరారు. కొందరావేళ ప్రేయసితో మాట్లాడ్డానికి సన్నద్ధులయ్యారు.

క్రిస్‌మస్ పండుగకని ప్రత్యేకం ఒక గ్రీటింగ్స్ రాశాడు దిలీప్. తనిందాకా రాసిన తుదిలేఖ రేపు అందేలోపల ఈ కార్డు ఆమెకు స్వహస్తాలతో యివ్వదలచుకున్నాడు. ఒకటో నెంబరు ప్రద్యుమ్నుడు కూడా ఉషారుగా వున్నాడు.

మొత్తం పధ్నాలుగు మంది ప్రేమికులకీ ఇవాళ హాజరుగా ఉన్నది పన్నెండుమంది మాత్రమే. ఎందుకంటే, ప్రభావతీ ప్రియులు ప్రద్యుమ్నులు ముగ్గురిలోను ప్రభావతి చేత ముద్దుపెట్టుకొనబడినట్లు చెప్పబడిన మూడవ నెంబరు ప్రద్యుమ్నుడు గైరు హాజరు. పోతే సదరు వార్తవిన్న మీదట మూర్ఛపోయిన రెండోనెంబరు ప్రద్యుమ్నుడు యింకా తేరుకోలేదు. అందువల్ల ఇద్దరు పోటీదారులూ లేనందున ఒకటో నెంబరు ప్రద్యుమ్నుడు ఉషారుగా ఉన్నాడు.

అసలు మూడోనెంబరు ప్రద్యుమ్నుడిని ప్రభావతి నిజంగా ముద్దు పెట్టుకోలేదని ఒకటో నెంబరు ప్రద్యుమ్నుడికి బాగా తెలుసు. వార్త ప్రకటించిన దిలీప్ త్రీకి ఈ విషయం మొదట చెప్పినవాడు కూడా ఇతడే.

అసలు జరిగిన కథ యిది.

మధ్యాహ్నం ఒంటిగంటకి కాఫీ తాగడానికి మెరీనా హోటల్‌కి వచ్చింది ప్రభావతి. ఆమెకు దగ్గిరలోనే ఇంకో బల్లదగ్గర కూర్చున్నారు ఒకటీ మూడూ నెంబర్ల ప్రద్యుమ్నులు. ఫలహారం తిని కాఫీకి ఆర్డరిచ్చి చెయ్యి కడుక్కోవడానికి వెళ్ళింది ప్రభావతి. ఈలోగా మూడో నెంబరు ప్రద్యుమ్నుడు తన జేబురుమాలను ప్రభావతి కుర్చీలో వడేశాడు. ప్రభావతి తిరిగి వచ్చి పరాకుగా ఆ జేబురుమాలుతో మూతి తుడుచుకుంటూ కూర్చుంది. ఇది ముద్దుతో సమానమైనదేనని ఉప్పొంగి పోయాడు మూడోనెంబరు ప్రద్యుమ్నుడు.

పావు నిముషంలో కథ అడ్డం తిరిగింది. మూతి తుడుచుకుంటున్న ప్రభావతికి ఆ జేబురుమాలు సిగరెట్టు వాసన వేసినందువల్ల వెంటనే కళ్ళు తెరచి దాన్ని సరిగ్గా చూసింది. కథ తెలుసుకుని "ఛీ" అంటూ ఆ రుమాలును కిటికీలోంచి బయటకు విసిరివేసింది.

దిలీప్ శ్రీ తెచ్చిన వార్త దీని సారాంశం. దీనికి రెండో నెంబరు ప్రద్యుమ్నుడు మూర్ఛపోయాడు.

ముసిముసి నవ్వులతో సొగసుగా, వయ్యారంగా ప్రేమలేఖలూ, గ్రీటింగు కార్డులూ, పులకించే హృదయాలూ పట్టుకుని బయలుదేరారు ద్వాదశ ప్రేమికులూను. ఒకరి వెనుక ఒకరు మెల్లిగా మెట్లుదిగటం ప్రారంభించారు. పది క్షణాలు గడిచాయి....

కెవ్వున, గొల్లున, ఘొల్లున, హోరున, భోరున, జడ్డిగా, పిచ్చిగా, వెర్రిగా అరుపులు వినబడ్డాయి. లాఠీచార్జి చేస్తున్న మలబారు పోలీసులూ, గొడు గేదెలమందా, కెనడియన్ రైలింజనూ కలిసి పరుగెత్తిన చప్పుడూ ప్రారంభమైంది. ధనధనా, కంగారుగా, మహావేగంగా వెనక్కి పరుగెత్తుకుని వచ్చేస్తున్నారు గ్రేట్ లవర్స్ పన్నెండుగురూ — పులి ఎదురైనవాళ్ళకి మల్లే. ఇప్పుడు షోకులూ హొయలూ లేవు. ప్రాణాలు పోయే సమయం. విలయం వచ్చి పడిపోయింది. ఆ వేగంలో, తొందరలో కాలు తొట్రుపడి బోర్లగిలా పడ్డాడు శోభనాద్రి. అతని మీద నుంచి యోసేపూ, దావీదూ నాడాలు వేసిన బూటుకాళ్ళతో సహా పరుగెత్తారు. ఒకటో నెంబరు ప్రద్యుమ్నుడు మాత్రం జాలిపడి, వీలు చేసుకుని శోభనాద్రిని పట్టుకుపోయాడు సురక్షిత స్థానానికి. అర నిముషంలో అందరూ గోడవారలా, స్థంబాల చాటునా, స్నానాలగదిలో, ఆఫీసు గదిలో సర్దుకున్నారు. వరండాలోని ప్లెటోనిక్ లవర్స్ పత్తా లేరు.



ప్రళయ సమయ పర్జన్య గర్జన సదృశమైన అరుపులు వినపడ్డాయి.నీల మేఘ విలసత్కాలాంజనాకారుడూ, ఉత్థితొష్ఠ్య విష్కృత దంష్ట్ర సదృశ దంష్ట్రుడూ, ఉజ్వల చలద్రక్తాక్షుడూ, ఘనీకృత శోణిత పంకాంకిత శిరస్కుడూ, ఘనశ్యామ వర్ణాంబర గాఢ పరిష్వంగితుడూ, బహూ

బలిష్ట, సుదీర్ఘ, గంభీర శరీరుడూ, ఉగ్రనారసింహుడూ అయిన నరసింహన్ ఆ భవనం బద్దలయే విధాన గర్జిస్తూ, హుంకరిస్తూ, రోదిస్తూ, "ధిక్కారమును సైతునా" అని అప్పుడప్పుడు పాడుతూ హాలులోకి ప్రవేశించాడు. అతని నడుముకు తాళ్ళూ, గొలుసులూ కట్టి ముగ్గురు నౌకర్లు అతడిని అదుపులో వుంచడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. ఈ నరసింహన్ తెలుగు చెడినవాడు. నరుడూ, సింహమూ కలిసినట్టు తెలుగూ అరవమూ కలిసిన భాష కలవాడు, శశిరేఖను ప్రేమిస్తున్నాడు.

ఆనాటి అపరాహ్ణ వేళ మూడుమ్ముప్పావు గంటలకి తన ప్రియురాలు శశిరేఖ పెరట్లో ప్రవేశించి, ఆమెపై తనకుగల ప్రగాఢ ప్రేమ వెల్లడించబోయిన ఫలితంగా, ఆ ప్రేయసి యొక్క పితృభ్రాత్రాది బాహు బల సమన్విత బంధు సందోహోద్భూత దవాగ్ని సదృశ జాజ్వల్య మానాగ్రహానల కారణ సంఘటిత తీవ్ర ఘటిత శిరస్కుడూ, శిరస్తాడన ఫలిత చంక్రమ్యమాణ పలాయిత పాదుడూ, పలాయిత సదసద్వివక్షణా శక్తుడూ, క్షుభిత దందహ్యమాన హృదయోద్భూత రౌద్రుడూ, రౌద్ర నిమజ్జితా గోచర గమ్యుడూ అయి పరుగెత్తుతున్న ఆ యొక్క నరసింహన్ హఠాత్తుగా ఈ ప్రేమికుల భవనం చూడగానే ఆవరణలోకి ప్రవేశించాడు. ఆ కాలాంతక రౌద్ర రూపుడిని చూడగానే నౌకర్లు తమ క్షేమం, ప్రజాక్షేమం ఆలోచించి, తాళ్ళతో గొలుసులతో కట్టి, అతికష్టంమీద పైకి తెచ్చారు – సభ్యునిగా చేర్చడానికి.

ఔట్ డోర్ టీటుకి రెండు నిముషాల క్రితం బయలుదేరిన పన్నెండు మంది ప్రేమికులు మేడమెట్లు సగం దిగేసరికి ఈ ఉగ్రనరసింహుడు భంభజ్యమాన హుంకార హుంకారాలతో ఎదురయ్యాడు. నల్లని బిగుతు పంట్లాం, ఎర్రని కళ్ళు, మహాశరీరం, ఆ యొక్క వేగం చూడగానే – పెనుగాలికి పేకమేడవలె ప్రేమికులు. అందరూ లోపలికి పారిపోయారు కకావికలుగా. హాలు మధ్య నరసింహన్ తాండవం ఆడిపోయాడు తధిగిణతోం అంటూ..... శశిరేఖని దుమ్మెత్తి పోశాడు.

ఇందాకటి గోలలో కిందపడి నలిగిపోయిన శోభనాద్రి "శశి" పేరు వినగానే గంగవెర్రులెత్తిపోయాడు. "హా! నాశశీ! వీడికి నీమీదెంత కసీ! హారి వీడి సిగ గోసి!" అంటూ విజృంభించాడు, కానీ పెద్దమనుష్యులూ హైక్లాసు లవర్సూ ఆపేశారు. "వెళ్ళద్దు పంతులూ, వాడు పేగులు తోడేస్తాడు జాగర్త" అని. తాండవమాడి ఆడి అలసిపోయాడు నరసింహన్.

ఇంక భయం లేదనుకుని సభ్యులూ, సంఘకార్యనిర్వాహక వర్గం అతన్ని సమీపించారు. మెల్లిమెల్లిగా అదియిదీ మాట్లాడి గోడలమీది ఛిద్ర హృదయాలూ, భగ్న వీణలూ, బాష్పకణాలూ చూపించి ఓదార్చారు. తరువాత సభ్యుడిగా చేర్చుకున్నారు – పేరు? వయస్సు? ఆస్తి? ఇహలోకంలో వృత్తి? ఇహలోకపు తాత్కాలిక విలాసమూ, శాశ్వత విలాసము? ప్రేమలోకంలో నివాసం ఎంతకాలం నుంచి? అమరమైన ప్రేమలోకంలో మొత్తం ఎన్ని విలాసాలున్నాయి? శాశ్వత విలాసం? ప్రస్తుత విలాసం? ఇంత వరకూ చెడిన వ్యవహారాలెన్ని? వాటి వివరాలు? – నెగ్గిన వివరాలెన్ని? వాటి వివరాలు? – 'ప్రేయసికి ఎవర్తికీ పెళ్ళాడుతానని వాగ్దానం యివ్వను – పైన చెప్పినవన్నీ పరమ సత్యాలు' – దరఖాస్తుమీద నరసింహన్ సంతకం పెట్టాడు. తంతు ముగిసింది.

ఒక రౌండు కాఫీ వెళ్ళింది – క్రొత్త సభ్యుడి గౌరవార్థం. "అధ్యక్షా! సోదరులారా" అన్నాడు నరసింహన్ గంభీరంగా మంచుని.

"అమ్మ వెధవా! నీ కథ అందరికీ ఖర్చు లేకుండా చెప్పేస్తావ్రా? లోకువ చూసి, డబాయించనూ" అనుకున్నారు శ్రోతలు.

"ఓ మూల టైమయి పోయింది. వెధవ్వేషాలూ వీడూను" అనుకున్నాడు దిలీప్ శ్రీ. కానీ సంఘమర్యాద పాటించి ఆగారు అందరూ.

నరసింహన్ తన కథ చెప్పాడు....

"నేను శశిరేఖని చాలా దినాలుగా చూస్తావుంటిని. అదీ నన్ను చూస్తావుండింది. తిరిగి నేనూ చూస్తావుండినాను. అదీ చూస్తావుండింది ఏమిరా లవ్ అయిపోయిందీ అనుకుంటిని. అదీ అట్లనే అనుకుందని అనుకుంటిని....

"ఇంక పాయిదా నై అనుకోని నేటి మద్దాన్నం ఒక లెటర్ రాస్తిని. నిండా బాగా రాస్తినిలెండి – రైల్వే నవల్సులో మాటలూ పాటలూ అన్నీ ఎత్తి పెట్టి అందులో రాస్తిని. "సరిదా బాగానే వుండాదిరా" అనుకుని నమ్మకంగా నేరుగా శశి యింటికి పోయి, వెనక తట్టు పోతిని. అటుపోయి సూస్తానుగదా శశి అడనే వుండాది. సోపుతో మొగం కడగతా వుండాది. సూస్తిని... మళ్ళా సూస్తిని... తిరిగీ సూస్తిని... పోతామా వద్దా పోతామా వద్దా అనుకుంటిని. "సరిదా ఏమిరా మనకిదా ఆమెపై నిండా లవ్‌గా వుండాదే – మనకేమి" అనుకుంటిని. నేరుగా గోడ అట్లనే జంపు చేసి పోతిని. చెప్పేస్తిని గబగబా, ఇట్లా మోకాలు మీద కూచుని "ఐ లవ్ యూ శశీ" అంటిని ఉత్తరం సూపిస్తా....

"నిండా పొగురుదా దానికి. అట్లనే బకెట్ నీళ్ళెత్తి నా నెత్తిపైన పోసేసింది. "అన్నా అమ్మా" అని ఒకటే కూసింది. నాకు నిండా తొందరయిపోయిందబ్బా. ఏం? ఇలా కళ్ళు తుడుసుకోని లేస్తిని చూడుమీ వాళ్ళ నాన్నా అన్నా యింకా ఎవడో, ఎవడో కెట్ట పసంగో – చెడ్డ యెదవలు అంతా వచ్చేసి నెత్తిపైన దబ దబా కొట్టేసినారు.

"ఏమ్రా మన లవ్ ఇట్లా అయిపోయిందే. వీళ్ళందర్నీ కొట్టడానికి నావల్ల మాలదే" అని నిండా యోచన చేస్తిని... అంతదా..... నేరుగా ఒకటే పరుగెత్తి వస్తిని.... హుష్ – హే యప్పా:... బ్రదర్సు – మీ అందరికీ చెప్పేసినాను సిగ్గులేకుండా. మీరు నన్ను మనసులో పెట్టుకోండిమీ – నాకు నిండా సంతోషంగా వుండాది యిప్పుడు.... హో శశీ ఓసీ రాకాసీ" అంటూ మూర్ఛిల్లాడు నరసింహన్.

తక్షణం ప్లెటోనిక్ లవర్స్ వరండా గోడమీదకి పరిగెత్తారు – బయటికెళ్ళే పన్నెండుగురూ కిందికి పరుగెత్తారు – ఆలస్యం అయిపోయినందు కేడుస్తూ.

కాలేజీ నుంచి మెయిన్ రోడ్డును కలిపే ఆ రోడ్డు మీద పన్నెండుగురు అక్కడక్కడా సర్దుకున్నారు. కిళ్ళీ కొట్టుదగ్గరొకడూ, మర్రిచెట్టు కిటూ అటూ యిద్దరూ, అద్దాల మేడ నీడకొకడూ అప్పలమ్మ గుడిసె పక్కనొకడూనూ. వీళ్ళలో కొందరు స్వస్థానాలలోనే నిలచి ఘాటుగా చూస్తారు – తమ తమకి వుండుకున్న ప్రేయసుల వంక. కొందరు సదరు ప్రేయసులను బస్సు స్టాండు దాకా సాగనంపుతారు. మిగతా వాళ్లు ఆ అమ్మాయిల్ని యింటిదాకా దిగబెడతారు – అంగరక్షకుడి ఏర్పాటుతో.

కొందరికిలిస్తారు – కొందరు సకిలిస్తారు. ఒకళ్ళిద్దరు మాత్రం ఆ యొక్క ప్రేయసీమణి రాగానే ఆమెని తప్ప మిగతా వాళ్ళని చూసి ప్రకృతి సౌందర్యాన్ని పూర్తిగా ఆస్వాదిస్తారు. ఇంటిదాకా సాయం వెళ్ళేవాళ్ళు ఆ అమ్మాయితో బస్సులో ఎక్కి ఆమెకి ఎదురుగా నుంచోడమో కూర్చోడమో ఏర్పాటు చేసుకుంటారు మొదట. ఆ తరువాత ప్రేయసి తెలివి తేటలపై, అభిరుచులపై ఇదివరకే వేసిన అంచనాల ప్రకారం వెంకటచలం బూతు కథలూ, స్కోపన్ హోవర్ ఫిలాసఫీ, మాఘమ్ నవల్సా – మొదలైన పుస్తకాలు టైటిలు బాగా కనబడే ధోరణిలో పట్టుకుంటారు. ఇంకొందరు తాము చదివే క్లాసూ, తమ పేరూ, అడ్రసూ పెద్ద అక్షరాలతో చక్కగా రాసి, కాస్త దబాయింపుగా దళసరిగా కనపడే ఏదో ఒక పుస్తకానికి అట్టవేసి దాని మీద ఈ లేబిల్ అంటించి చూపిస్తారు – ఆయా ప్రేయసీమణులు ఈ వివరాలు చదివి కంఠస్థం చేసుకునే అవకాశం యిస్తూ.

తెలుగు నవల్సు సాయంతో పోజులు కొట్టే ప్రద్యుమ్నుడిని చూసి, "ట్రూ రొమాన్సు", "రియల్ డిటెక్టివ్"ల వంటి హైక్లాసు అమెరికన్ పత్రికలు పట్టుకు తిరిగే టేలరూ గేబిలూ నవ్వుకుంటారు.

ప్రద్యుమ్నుడూ, శివరావు నాగేశ్వర్రావుల నకిలీలు – గేబుల్ టైలర్‌లని చూసి నవ్వుకుంటారు – "దేశవాళీ దొరలు – పెద్ద యింగ్లీషు బుక్కులు తెచ్చారయ్యా – తెలిసి చచ్చినట్టు" అని. దిలీప్ శ్రీ మాత్రం వీళ్ళందర్నీ చూచి నవ్వుకుంటాడు. అతను పుస్తకాలేం తేడు – హృదయం తప్ప. "ఈ లోకల్ రోమియోలకీ స్థానిక జూలియట్‌లకీ సరిపోయింది. ప్రేమంటే వీళ్ళకేం తెలుసు? అసలు ప్రేమకి నిర్వచనం చెప్పగలరా అని వీళ్ళు."

మధుబాల విషయంలో అతనికిదే ధైర్యం. ఆమె మనుష్యులకి సరి అయిన విలువ కట్టి వెర్రివెధవల్నీ వెంగళాయిల్నీ వేరు చెయ్యగలదు. మధుబాల చక్కని పిల్ల. చదువుకున్న పిల్ల. మిలమిల మెరిసే అల్లరి కళ్ళూ పెంకిగా పొగరుగా కనబడే కొనదేరిన ముక్కూ, పచ్చగా మెరిసిపోయే కోల నుదురూ, వదులుగా పట్టుకుచ్చులా ప్రవహించే మెత్తని జుట్టూ, పుష్పరాగచ్ఛాయల మీద పడే చిరునవ్వు కాంతుల్లో వెలిగిపోయే సన్నటి ఎర్రని పెదిమలూ.... లోకంలో అందాలను అన్నిటినీ కలిపి దేవుడు స్వయంగా చేసిన చక్కని పిల్ల ఈ మధుబాల. దేవుడు చేసిన ఈ మధుబాలకి ఎంతో మంచి మనస్సుంటుంది. తెలివితేటలుంటాయి. పోజుకొట్టే పిచ్చివాళ్ళకీ, నిశ్శబ్దంగా నిర్మల హృదయంతో ప్రేమించే తనకీ తేడా ఆమెకి బాగా తెలుసు. తన ఉత్తరాలకి జవాబియ్యలేదనుకో.... అయినా మధుబాల తనది, తను మధుబాలవాడు. నవ్వుకున్నాడు సరిగ్గా మధుబాలను పదిగజాల దూరంలో వెంటాడుతున్న దిలీప్ శ్రీ – సరిగ్గా మధ్యాహ్నం యిదే సందర్భంలో ఇదే తప్పు వచ్చింది తనకి.

మెయిన్‌రోడ్డు సమీపించారు. మలుపు తిరుగుతూ వెనక్కి తిరిగి చూసిందను కున్నాడు దిలీప్ శ్రీ. తన పోటీదార్లు దిలీప్ ఒకటీ రెండూ, గేబిలూ, టెయిలరూ యివాళ మరాటీపిల్ల, మండేకర్ వెంటపడ్డారు. అందుకే వెనక్కి చూసింది మధు. తనంటే ఎలాగేనా మధూకి యిష్టం. పాలకీ నీళ్ళకీ తేడా హంసకి తెలిస్తే, తనకీ మిగతా చెత్తకీ ఉండుకున్న తేడా మధూకి తెలిసినట్టే. అయితే విడదీయటానికి

కొద్ది ఆలస్యం అవచ్చును. ఆలస్యం అవడమే వాస్తవికతకు లక్షణం. అంతేగాని సినిమాల్లోలాగా తొలి సీనులో చూపులూ, మలిసీనులో మాటలూ, మూడో సీనులో పురుడూ సంభవించినట్టు కాదు. మొగ్గ వికసించి పువ్వవడానికి వ్యవధి వుండదూ! ప్రేమా అంతే. తను మధూని ప్రేమించి పూజించడం మొదలుపెట్టి – దాదాపు మూడేళ్ళు అవస్తోంది.

"బాగా దిట్టమయిన పునాదే" అనుకున్నాడు దిలీప్. ఆంధ్రుల ఆరంభ శూరత్వంలాగా మొదట్లోనే మహా జోరుగా ప్రేమించేస్తే మూడో నాటికల్లా చల్లారి పోతుంది వేడి. మెల్లి మెల్లిగా, క్షణక్షణం, అంగుళం అంగుళం, అడుగడుగూ జరగాలి.....

భూతం లాంటి బస్సు భోయ్యిమని హారన్ కొడుతూ ఆగింది. తను పరాగ్గా మెల్లి మెల్లిగా అడుగులేస్తూ మెయిన్‌రోడ్డు మధ్య కొచ్చేసరికి అర్జంటు పనిమీద వెడుతున్న బస్సు ఆగిపోవాల్సి వచ్చింది తనకోసం. బస్సు కోప్పడింది. అపశ్రుతి కాదు కదా?

"ఛా" అనుకున్నాడు దిలీప్ – కంగారులో తొక్కేసిన పేడకడిలోంచి కాలు తీసుకుంటూ. మెయిన్‌రోడ్డు దాటిన మధు వెనక్కి తిరిగి పకాలున నవ్వింది. "ఎంత బాగుందీ నవ్వు" అనుకున్నాడు. పేడకాలు రోడ్డుమీద బాదుకుంటూ.

అసలు సిసలు మధుబాల యిల్లు వుండే రోడ్డులోకి వచ్చేశారు. ఈ రోడ్లో జనం తక్కువ. షోను పోను మరీ తక్కువ. బ్రిడ్జి దాటగానే కుడివేపు సందులో మొదటిల్లే మధు వుండేది. ఒక క్షణం ఆగి చుట్టూ చూశాడు – దగ్గరలో కుళాయి వుందేమోనని. మునిసిపాలిటీవారు అలాంటి ఏర్పాటేమీ చెయ్యలేదు. తను త్వరపడకపోతే మధుని అందుకోలేడు యిల్లు చేరేలోగా. అలాగే పేడకాలుని రోడ్డుమీద ఈడ్చుకుంటూ గబ గబా అడుగులు వేశాడు తెగించి.

సరిగ్గా బ్రిడ్జి మధ్యకొచ్చేసరికి కలుసుకున్నాడు మధూని.

వూాడి పడదేం మాట.... దగ్గి గొంతు సవరించుకున్నాడు.

కాళ్ళూ చేతులూ ఒణుకుతున్నట్టున్నాయి. ఇందాక బస్సు దగ్గర అదిరిపాటువల్ల కాబోలు.

"మధూ సారీ.... హిహిహి...." వెకిలిగా వుందేమో తన నవ్వు... "ఐమీన్ – సరూ ... అదే అదే.... సరోజా....." గోచీ పెట్టుకుని నూనె ఓడుతున్న ముష్టికుర్రాడు అడ్డుపడ్డాడు కాళ్ళకి – "సార్ సార్ కాలణా" అని.

సరోజ ఆగింది. ముష్టి కుర్రాడు తొడమీద పొడిచాడు. "ఛీ – ఫో" అన్నాడు దిలీప్. ఈలోగా వెనక్కి తిరిగి సూటిగా తనవేపు చూసింది సరోజ. బాబోయ్! తన కళ్ళు వాలిపోయాయి. పేడలో అలుక్కుపోయి తడితడిగా వున్న కాలు కనబడింది. ముష్టి కుర్రాడు చొక్కా కొస పట్టుకుని లాగుతున్నాడు ఓపక్క. కాలు వెనక్కి దాచేసుకుని, ముష్టికుర్రాడిని వెనకాలకి తోసేసి, బలవంతాన రెప్పలు పైకెత్తాడు – "సరూ... క్రిస్మిస్ గ్రీటింగ్సు కార్డు.... తెచ్చాను.... ఐమీన్.... నేను వేశాను" మధుబాల అనబడే సరోజ తొణకలేదు, బెణకలేదు.

వద్దనుకున్న యికిలింపు తనకి మళ్ళా వచ్చేసింది. "యిహిహి...." అసహ్యించుకున్నాడు. ఏమనుకుంటోందో ఏమిటో. కీచకుడి ఫోజు అనుకోదు కదా ఖర్మ..... చెమట్లు పోశాయి. చర్మం కంపించి పోతోంది – మలేరియా వచ్చినట్టు చేతులు

వణికాయి..... "తీసుకో దిలీప్ ఐమీన్ సరోజా నీకోసం ప్రత్యేకం...." దీని దుంపతెగ వెధవ వాక్యం – ఎంతకీ పూర్తి కాదు, ఇలాంటప్పుడు చిన్నచిన్న వాక్యాలైతే ఎంత బావుండునూ. తటిల్లత లాగ గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది మధుబాల అనబడే సరోజ ముక్కుకు సూటిగా కోపంగా చూస్తూ.

ఎదురుగుండా కొండగానీ ఎడారి గానీ – సముద్రం గానీ నదిగానీ వుంటే – ఆ సమయంలో సూర్యుడు అస్తమిస్తూ వుంటే – బరువెక్కిన గుండెతో, బాధించే గుండెతో, కారే కన్నీళ్ళతో, వేడెక్కిన బుర్రతో, ఎండిన పేడకాలుతో, పగిలిన హృదయ భాండం తాలుకు ముక్కల్ని ఏరి, చినిగిన – లేక అప్పుడు చింపుకున్న చొక్కా జేబులో వేసుకుని ప్రేయసి మధు తొక్కిన ధూళి ఓ చిటికెడు నొసట రాసుకుని, నిరాకరించబడిన గ్రీటింగ్సు కార్డును గుండెకదుముకుని అలా – అలా సూర్యాస్తమయంలోకి, లేపోతే కారుచీకట్లోకి.... అదీ కాకపోతే సినిమాలలో లాగ అనంత విశ్వంలోకి.... రెండు నెళ్ళగా క్షవరం, తలంటూ మొదలైన సంరక్షణ లేక తుప్పలా పెరిగిన తన తలని భూమాత వడిలో దాచుకునే నిమిత్తం – దిలీప్ శ్రీ వెళ్ళిపోయి వుండును.

కానీ చిక్కేమిటంటే ఆ బ్రిడ్జికి దగ్గరలో అలాంటి ఏర్పాటేం లేదు. కొంచెం పైకి పోతే మాలగూడెం వుంది. అదీగాక ఒక్కడుగు ముందుకువేసినా మధు తనని అపార్థం చేసుకుని, మధ్యాహ్నం శశిరేఖ శోభనాద్రిని కొట్టినట్టు రాళ్ళతో కొట్టవచ్చు. లేకపోతే వాళ్ళవాళ్ళని పిలవచ్చు. అందులోను వాళ్ళన్నయ్యకి కొంచెం కండపుష్టి వున్నట్టే గుర్తు... కీడెంచి మేలెంచమన్నారు.

పోనీ బ్రిడ్జిమీంచి దూకేద్దాము అంటే కింద ప్రవహించేది మురికి కాలవ. "ఎందుకులే" అని వెనక్కి తిరిగాడు.

"సార్! కాల్నా" అని ముష్టి కుర్రాడు చొక్కా పట్టుకు లాగాడు. ఈమాటు దిలీప్ మనసు ద్రవించిపోయింది. చేతిలోవున్న అందమైన గ్రీటింగ్సు కార్డు కుర్రవాడి కిచ్చేశాడు అర్ధ్రనయనాలతో.

తలవంచుకుని యింటికి బయల్దేరాడు బరువుగా అడుగులు వేసుకుంటూ.

వారం రోజులు గడిచాయి. ఈలోగా గొప్ప గొప్ప సంఘటనలు జరగలేదు. ఏ ప్రేమికుడూ తపించి కృశించి నశించిపోలేదు; రోజా బెదిరిస్తున్నా, దిలీప్ శ్రీ యథాప్రకారంగానే వున్నాడు. ఇపుడు మధుబాలని ద్విగుణీకృతమైన మొండితనంతో ప్రేమిస్తున్నాడు. ఆవేళ మధు అలా చేయడానికి కారణం సిగ్గు. తను మాట్లాడగానే ఆమెకు సిగ్గు ముంచెత్తుకు వచ్చింది.

అది బయటకు కోపంలా కనపడవచ్చు కానీ నిజానికి సిగ్గే! సిగ్గంటే సిగ్గే! అసలు సిసలు సిగ్గు. ఎలాగేనా మధు తనదే. తను మధుబాల వాడే – అని ఓదార్చుకున్నాడు దిలీప్ శ్రీ.

ఇంకోవారం గడిచింది. మైథిలి వచ్చింది వూరు నుంచి. ఉత్తగోల మనిషి. దాని హృదయంలో ఎక్కడా సున్నితత్వం, దయాదాక్షిణ్యం లేవు కాబోలు. మొగజాతిని దుమ్మెత్తి పోసేసి దూసి దులిపేస్తుంది. దిలీప్ శ్రీ బాబాయి కూతురు మైథిలి. చిన్నప్పుడిద్దరూ ఒకేచోట పెరిగారు.

"మిమ్మల్నెవర్తి నమ్ముతుంది అసలు? అసలెందుకు నమ్మాలంట?" అంది మైథిలి బీచిలో బటాణీలు నవుల్తూ.

"నీకు తెలీదే! ప్రేమనేది పవిత్రం – శాశ్వతం. అది స్వార్థం కోరదు" అన్నాడు దిలీప్ నాసా పుటలెగరేస్తూ.

"ఏడిశావ్? ప్రేమ ప్రేమంటావు గదా. మీ నాన్న రేపు 'అన్న – వెధవా – కాదు కూడదం'టే ఇవాళ ప్రేమించిన దాన్ని పెళ్ళాడగలవురా?"

"మమ్మల్నంత వెర్రి వెధవల్ని చెయ్యకు. అమ్మయ్యేది బాబయ్యేది – అమరమైన ప్రేమకన్నానా? అంతగా కావలిస్తే అడుక్కుతింటాం" అంటూ బుసలుకొట్టాడు దిలీప్.

"ఎందుకురా అలా శివమెత్తిపోతావ్? కబుర్లు చెప్పినట్టు కాదు. నువ్వు ప్రేమించే దానికి నువ్వు యిచ్చే హామీ, నువ్వు చూపించే సుఖం అడుక్కు తినడమేనా?..... ఒరేయ్! నే చెప్తా విను. మీరందరూ కవులు. స్వర్గలోకాలూ, స్వప్నలోకాలూ తప్ప మీకింకోటి తెలీదు. మీకేం! కాలు మీద కాలేసుకుని నోట్లో దుమ్మేసుకుని కూచోగలరు. నిన్ను నమ్మిన ఆడదాన్ని నోట్లో దుమ్ము కూడా వేసుకోనివ్వరు – నీలాంటి పెద్దమనుషులే రేపు."

"బావుంది బావుంది. ఎంతో బావుంది నీ ఉపన్యాసం, బటాణీలు పూర్తిగా తినేయ్."

మైథిలి పకపక నవ్వింది. "ఉడుక్కుంటావెందుకురా? ఓ కొమ్మ మీద కుదురుగా కూచున్న రెక్కల్లేని పిట్టని అక్కణ్ణించి దూకమని చెప్పి ఆ దూకవలసిన చోట కొమ్మకి బదులుగా కొమ్మ యొక్క బొమ్మని చూపిస్తే పిట్ట ఎలా వస్తుందిరా? తండ్రి చాటున వున్న ఆ అమ్మాయి అంతే! ఈ ప్రేమలూ విరాశలూ హృదయాలూ వాస్తవిక జీవితంలో...."

దిలీప్‌కి చిరాకేసింది. మత ప్రవక్తలాగా మైథిలి ఉపన్యసిస్తుంటే, "హుఁ" అన్నాడు చిరాకు ప్రకటిస్తూ.

మైథిలి వూరుకుంది.

ఒక నిముషం ఎవరూ మాట్లాడలేదు.

"ఒరేయ్ తమ్ముడూ – అదుగో ఆ తెల్లసూటు వెడుతోంది చూశావూ. ఆ సూటు మీద ఓ చిన్న మసిబారిన దీపం బుడ్డిలాంటి మొహం వుంది. దాని కథ చెప్పనా..... దానిపేరు రామదాసు".

దిలీప్ మాట్లాడలేదు. పోతున్న వ్యక్తిని చూశాడు. అతన్ని గుర్తుపట్టలేకపోయాడు. మైథిలి మాత్రం మామూలు ఉత్సాహంతోనే వాగడం మొదలుపెట్టింది:

"నేను బస్సెక్కాను. ఏడాది క్రితం. ఈ రామదాసూ అందులో ఎక్కాడు. బస్సు వెడుతుండగా కండక్టరుతో సరసం ఆడాడు. జోక్ బావుందనీ, అది వేసింది తోటి మానవుడేననీ, నేను పకాలున నవ్వాను. ఒరేయ్ అబ్బాయ్, బస్సు దిగేలోపున దాదాపు రెండు వందల జోక్సు చెప్పాడు జనాంతికంగా. అంతసేపూ నన్ను చూపుల్తో తూట్లు పొడిచేస్తూనే వున్నాడు. ఇంకో రోజు మళ్ళీ కనబడ్డాడు బస్సులో. ఆ మర్నాడు బీచిలో. మూడోనాడు సినిమాలో, నాలుగోనాటి నుంచి నేనెక్కడికెడితే అక్కడే సిద్ధమయేవాడు. నేనేదేనా వస్తువుకేసి చూడబోతే, ఆ చూడబడబోయే వస్తువుకి నా కంటికీ మధ్య నిలబడేవాడు యికిలిస్తూ..."

దిలీప్‌కి కోపం వచ్చింది వాడి మీద "ఎవడేవాడు?" అన్నాడు.

"ఏం, తంతావా వాడిని?"

"కాకపోతే ఏమిటి మరి?"

"నువ్వు మీ మధుబాల అనబడే సరోజని తరమచ్చా?" ఒళ్ళుమండింది దిలీప్‌కి.

"అదీ అలా చెప్పు. చూడబడ్డం – తరమబడ్డం నీకిష్టమే అన్నమాట!"

"చుప్ నోర్ముయ్: కథ వినరా అంటే.... ఏం? యింక చూస్కో తమాషా. తన కాలేజీ ఆఖరి పీరీడు రోజూ ఎగేసి నా కాలేజీ వదిలే టైంకి హాజరయేవాడు. మా హాస్టలు దాకా దిగబెట్టేవాడు. ఒకవేళ నాకేదేనా ఆలస్యం అయితే ఓపిగ్గా కూర్చునేవాడు పాపం."

"హరి వీడి నిస్త్రీ చెయ్యా!"

"చేద్దుగాని విను, ఓమాటు బీచిలో టైం అడిగాడు. చెప్పాను మనిషనుకుని. అంతే, కొంప మునిగింది. మరునాడు పెద్ద ఉత్తరం వచ్చింది. పెద్ద నీలంరంగు కవర్లో, చాలా ఖరీదయిన కాగితం – గుప్పుమని పరిమళాలు గుబాళించింది కవరు చింపగానే. నా పేరూ, నాన్నపేరూ మా యింటి వివరాలూ – వీడి దుంపతెగా – ఎలా సంపాదించాడో తెలియదుగానీ మొత్తానికి – నాకు తనన్ని విధాలా తగిన వాడని వక్కాణించి, తన గుర్తులు సూచించి తను నన్నెంత ప్రేమిస్తున్నాడో వివరించి నాకోసం తన హృదయం ఎంత కుమిలి పోతోందో విశదంగా వర్ణించాడు. ఇంకా నా కర్థంకాని వేవో బోల్డు రాశాడు. పోన్లే మనకెందుకని వూరుకున్నానా – మర్నాడు ఇంకో ఉత్తరం వచ్చింది. అంతే – ఇంక అక్కడినించి ధారాపాతంగా వచ్చి పడేవి గ్రీటింగ్సు కార్డులూ ఉత్తరాలూనూ. సాభిప్రాయంగా చూసేవాడు నాకేసి, తను పంపినవి అందాయా అని. నేను దొరకలేదు. ఖాతరు లేకుండా పోయేదాన్ని."

"అదే నీ తప్పు. అవునూ కాదూ అనరాదూ?" అన్నాడు దిలీప్.

"నీ బొంద!! అవునంటే కొంపలు మునిగే. కాదంటే రోడ్డు మీద వాడితో వాదన. ఎందుకీగోల అని ఊరుకున్నా. మొన్నీమధ్య ఏమనుకొన్నాడో ఏమో కార్డు తెచ్చి సొంతంగా యివ్వబోయాడు "ఇది ప్రత్యేకం నీకోసం" అంటూ. నేనో యినుప చూపు చూసి గిరుక్కున తిరిగివెళ్ళిపోయాను పుచ్చుకోకుండా. అనక జాలి పడ్డాననుకో. ఆ జాలి అప్పుడే చూపించి వుండి కార్డు తీసుకుని వుంటే అది కాస్తా ప్రేమ అనుకుని మీదబడి వుండును!"

దిగంతాల నెక్కడో పిడుగు పడ్డట్టయింది. దిలీప్ శ్రీ యొక్క తలకాయ దిమ్మెక్కి, తిరిగి చురుగ్గా పనిచేసింది.

పావునిముషం మైథిలి కళ్ళలోకి చూశాడు సూటిగా ఏదో వెతుకుతున్నట్టు.

ఆడుకునే పాపాయి కళ్ళలాగా, అమాయకంగానూ, ఆనందంగానూ ఉషఃకాలాన నేల రాలిన పారిజాత పుష్పాలవలె తెల్లగా కాంతివంతంగానూ, నీలిమాకాశం వలె నిర్మలంగానూ చిరునవ్వుతో వెలుగుతున్నాయి మైథిలి కళ్ళు.

తలవంచుకున్నాడు దిలీప్. కొంచెం ఆగి మెల్లిగా అడిగాడు:

"మధుబాల చెప్పిందా ఈ కథ?"

కిలారున నవ్వింది మైథిలి.

★ ★ ★

# ఋణ రమణీయం



## వేట

"రెడీయేనా అప్పన్నా," అన్నాడు అప్పారావు.

"రెడీయండి."

"సిగరెట్లు పట్టుకున్నావా?"

"ఆహా."

"అయిడియాలూ, వంకలూ ఏ మాత్రం వున్నట్టు?"

"నా దగ్గిర డజనున్నాయండి! మా యాడదానికి పురుడు, అత్తగారి ప్రాణగండం, మీ తమ్ముడిగారికి పరీక్ష ఫీజు, మేష్టారిల్లు వేలం, మీ బాబాయిగారి ప్రమోషనుకి అర్జెంటుగా లంచం, రెండు టెలిగ్రాపులు, టెలిగ్రాపులాంటి ఉత్తరాలు రెండు, కోపరిటివులోను మంజూరు కాయితం..."

"సర్సరే. అప్పివ్వనన్న వాళ్ళకి ఎదురిచ్చి మొహం మాడ్చెయ్యడాని కే మాత్రం జాగర్తేశావు... ఎంతా? ఎనిమిది రూపాయిలా – ఇలాతే. పావలాలుగా మార్చి నీకు సగమిస్తాను. ఎలాటివాడేనా సరే – "నేనే నిన్నడగడానికి వస్తున్నా బాబాయ్" అని ఎంతలేసి ఒట్లూ సత్యాలు పెట్టినా సరే. ఒక్క పావలా, మహా అయితే రెండు ఇయ్యి. దాటావంటే చంపేస్తా. బయల్దేరు. పదిగజాల వెనక నేనొస్తా. మళ్ళీ కిళ్ళీ బడ్డీ దగ్గిరే కలుసుకోడం. ఒకవేళ అప్పులాళ్ళెవరైనా ఎదురైతే తొరగా వొదిలించుకురాస్కీ" అన్నాడు అప్పారావు.

ఇద్దరూ బాకీ చెల్లింపు గడువులా కాస్త అటూ ఇటూగా బయల్దేరారు జనారణ్యంలోకి. లోభత్వం, పరమలోభత్వం, చీకటిలా అలుముకుంది. కన్ను పొడుచుకున్నా ఎక్కడా ఒక అప్పు కనబడడం లేదు. సంపాదించే దారి కూడా స్పష్టంగా తెలీటంలేదు. అప్పులాళ్ళు నిజరూపాల్లా దారి కిటూ అటూ మర్రిచెట్లు జాట్లు విరబోసుకుని

వికృతంగా కనిపిస్తున్నాయి. అప్పులవాళ్ళ "తే తే తే తే" కేకలు ఇలకోళ్ళలా కీచు పెడుతున్నాయి. అప్పన్నకీ అప్పారావుకీ గుండె దడదడ కొట్టుకుంటూంది.

ఏ మలుపులో ఏ కాబూలీ పీనుగున్నాడో ఎరగముగదా. కాని ఆ మలుపుల్లోనే అప్పులిచ్చే కొత్తవాళ్ళూ దొరుకుతారు. అంతా ఈశ్వరుడి లీల. గులాబీ పువ్వు చుట్టూ ముళ్ళు పెట్టాడు. అప్పులిచ్చే మంచి వాళ్ళున్న లోకంలోనే "ఇచ్చిన అప్పు తీర్చమనే" వాళ్ళని కూడా తిరగనిస్తున్నాడు. కానీ, వాళ్ళవల్లా కొంత ఉపయోగం ఉంది. అసలు కొరమాలిన వస్తువు లేదు సృష్టిలో; ఉంటే గింటే దృష్టిలోనే తప్పు. బాకీ అడిగే దుర్మార్గుడు కూడా ఒకందుకు పనికొస్తాడు.

ఇప్పుడు తమని బాకీ తీర్చమని వేధించే ఒక దుష్టుడు ఋణదరాజుగారికి బాకీ! వాడు ఆయన్నుంచి తప్పించుకోలేక తిరుగుతున్నాడు. అయినా ఇటూ తనని తీరిక వేళల్లో వేపుకు తింటూనే ఉన్నాడు. మానవుడిలో అజ్ఞాన దీపం అంటే ఇదే. త్వమేవాహం అన్న విలువైన ముక్క తెలుసుకుంటే ఇన్ని బాధలుండవు. ఏం చేస్తాం వాళ్ల ఖర్మ!

ఇప్పుడు ఋణద రాజుగారి దగ్గర అప్పారావు అప్పు వేటాడాలి. రెండుసార్లు అడగబోయి పుచ్చేసుకున్నంత పని జరిగిందిగాని అంతలోనే ఆయన పసిగట్టి పనుందని చెప్పి దుప్పిలా పారిపోయాడు. ఇవాళ చచ్చినట్టు దొరుకుతాడు. ఆయనకు బాకీపడి తప్పుకు తిరుగుతున్నవాడు పది గంటలవేళ పలానా చోట దొరుకుతాడని అప్పారావు ఆయనకు ఉప్పందించాడు, అప్పన్న తమ్ముడి ద్వారా. ఇవాళ ఋణద రాజుగారు అమ్మవారి గుడిదగ్గిర కొస్తాడు! అప్పుడు ఈయన వెంటనే వాడి మీదకి లంఘించి.....

అప్పారావు అమ్మవారి కోవెలకి ఇసింటావున్న కిళ్ళీ బడ్డీ చేరుకునే సరికి అప్పన్న ఇంకా రాలేదు. వేళైపోతోంది. రెండు సిగరెట్లు తగలడ్డాయి. టైము వేస్టనుకున్నాడు అప్పారావు. ఇదే ఇంకో వీధి అయితే ఈపాటికి పదో పరకో దొరికేదేమో....

అప్పన్న కొన ఊపిరితో, జీవచ్ఛవంలా, అప్పుడే అప్పులవాడి బారినుండి తప్పించుకున్న నిర్ధనుడిలా వచ్చాడు.

"అప్పుతప్పి రూపాయి లొట్టోయిందండి. ఇద్దరు తగులుకున్నారు దార్లో... సెట్టి దులిపేశాడు. ఒళ్ళు సచ్చి పోయిందండి" అన్నాడు అప్పన్న ఉసూరుమంటూ.

అప్పారావు జాలిగా నవ్వాడు. "అందికే చదువుకొమ్మన్నాను. విన్నావా. చదువుకుంటే పులికథ తెలిసేది" అన్నాడు.

అప్పన్న అడక్కపోయినా పులికథ చెప్పేశాడు. పెద్దపులికి ఒక అవు పెద్ద మొత్తం బకాయి పడింది. శాన్నాళ్ళు మొహం చాటుచేసుకు తిరిగినా ఒకనాడు కొమ్ముకి వందరూపాయలనోటు తగిలించుకుని మరీ దొరికిపోయింది. పులి మింగేస్తానంది. ఇదిగో ఈ వంద రూపాయలనోటు మార్చి అక్కడో చిన్న బాకీ తీర్చి – పాపం వాళ్ళు పిల్లలవాళ్ళు – మిగతా చిల్లర తొంభయీ పట్టుకొచ్చి పీకిస్తానంది అవు. ఏ కంటనుందో పులి దాని మాట నమ్మి వదిలింది. తీరా అది వాలిక్కురుచుకునేలానే అవు తిరిగొచ్చి తొంభై రూపాయలు తీసి దాని మొహాన కొట్టింది. పులి తెల్లబోయి విడిచేసి బాకీ మాఫీ చేసేసింది.

"ఈ కథ ధర్మమా అని నేనెన్నోసార్లు తప్పించుకున్నాను. తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ" అన్నాడు అప్పారావు.

అప్పన్న నమ్మలేదు. ఎంత గోప్పైనా మరీ అంత చవకరకం ఉంటుందా విడ్డూరం కాబోతే అన్నాడు. ఉన్నదంతా బాకీగా తీర్చెయ్యడం ఎలాంటి వాజమ్మా చెయ్యడన్నాడు.

అప్పారావు నవ్వాడు. "అది బాకీ తీర్చడం కాదోయ్ వాజమ్మా! బాకీ యేమిటి వెధవది టీప్ ఇచ్చినా ఇవ్వచ్చు. పులేవిటి! అవును పట్టుకు మళ్లీ వదల్డం ఏవిటి? అలాంటి మహోజ్వల అవకాశాన్ని కాపిటలైజ్ చేసుకోని గోవుంటుందా? పరమ లోభికి చెప్పినా, ఈ సంగతి వినగానే వందో యాభయ్యో పారేసి ఆపదకి అడ్డుపడతాడే.

"కథలో ఆవు ఏ నాలుగొందలో అప్పు చేసుకుంటుందనీ ఆనందంలో ఉక్కిరి బిక్కిరైపోయి కృతజ్ఞతకొద్దీ పెద్దపులి బాకీ తీర్చి పారేసుంటుందనీ నా థీసిస్" అన్నాడు.

దూరంగా నల్లకోటు కనబడింది. "ఋణదరాజుగారొస్తున్నాడు" అన్నాడు అప్పన్న. రెండు నిముషాలసేపు ఇద్దరూ ఊపిరి బిగబట్టి పొంచి కూచున్నారు. గుండెలు దడదడ కొట్టుకున్నాయి అప్పాదొరకబోయే వాడి గుండెల్లా. "నువ్విట్నించిలా వెళ్ళి అటెదుర్రా. నేను పలకరించి ఆపలేకపోతే నువ్వు కాయొచ్చు" అన్నాడు అప్పారావు. కాని అంతలో నల్లకోటు బాగా అల్లంత దూరంలోనే ఆగిపోయి ఒక తలపాగాతో మాట్లాడుతూ నిలబడిపోయింది.

"నడిరోడ్డుమీద కూడా క్లబ్బులు పెట్టేసి మాట్లాడితే ఎలా? ఎన్ని లోన్ అవర్స్ వేస్టు" అని విసుక్కున్నాడు అప్పారావు.

"కొంపదీసి మన్లాంటివాడే – ఏ అప్పల్స్వామో అడ్డుతగిలి అక్కడే అప్పు కొట్టేయటం లేదుగదా" అన్నాడు అప్పన్న.

అప్పారావు గుండె గుభేలుమంది. తలపాగా శాల్తీ అప్పల్స్వామీ కాదని తేల్చుకున్న మీదట కుదుటపడింది. ధైర్యంగా నవ్వాడు.

"వాడు కాదులేవోయ్ – వీడెవడో సాదారకం. వాగుడుకాయ. గంటల కొద్దీ వాగుతారు వీళ్ళు. చర్చిస్తారు. ఉపన్యాసాలిస్తారు. అంతా పొల్లే. అప్పు గురించి ఒక్క ముక్క మాట్లాడరు. వాళ్ళ మొహం.... అయినా అప్పల్స్వామైతే ఇంతసేపా?" అన్నాడు.

వాడు ఇవతల వాళ్ళ అవసరాలు కూడా గమనించడు. రెండు మూడుసార్లు అప్పారావు ఇద్దరు ముగ్గుర్ని మెల్లిగా మాలీసు చేసి, దువ్వి వాళ్ళ దగ్గిర అప్పు అందుకోబోతుండగా వాళ్ళు సరిగా నోట్లు తీసి ఇస్తున్న ముహూర్తంలో అప్పల్స్వామి ఎక్కణ్ణించో డేగలా వచ్చి వాలి భోరున ఏడిచేసి భళ్ళున నవ్వేసి కూచిపూడి డాన్సు ఆడేసి, అకాడెమీవాళ్ళు ఒడిస్సీనీ, కథకళినీ గుర్తించి డబ్బిచ్చారుగాని దీనికివ్వలేదని చెప్పి, ఆ డబ్బు కాస్తా పుచ్చుకు చెక్కేశాడు. శ్రమ తనదీ, ఫలం వాడిదీ అయిపోయింది. ఇలా నీతి నియమం లేకుండా చెలరేగడం బాగులేదని అప్పాడతన్ని యూనియన్‌లో పెట్టి కడిగేశాడు అప్పారావు.

పూర్వం ఇలాంటి వుండేవికాదు. ఒక్కొక్క పరగణా ఒక్కొక్క అప్పు రాయల అధీనంలో వుండేది. వాడి అనుమతి లేందే, ఇరుగు పొరుగు పరగణాలవాళ్ళు ఇందులో జొరబడి అప్పులు నొల్లుకు పోయేందుకు వీలుండేది కాదు. అవసరమై అడిగితే, ఆ పరగణా పాలకుడు ఉదారంగా హక్కులు దానం చేసేవాళ్ళు; లేదా కప్పం కట్టే పద్ధతి మీద కౌలుకిచ్చేవాళ్ళు.

"ఆ తరంవారిలో అప్పు రాయలవారు ఎంత గొప్పవారనీ! నువ్వా కథ విన్లేదు కాబోలు" అన్నారు అప్పారావు.

అప్పు రాయలు 18 పరగణాల ఏలిక. అంత సూక్ష్మబుద్ధి, వాక్పటిమ, సమయస్ఫూర్తి, ఋణ పారీణత ఈనాడు అప్పుకి కూడా దొరకవు. తన 18 పరగణాలలోనూ తనకే కాక ఇతరులక్కూడా దొరకనంత కూలంకషంగా అప్పులు చేశాడు ఆయన. పరమ ఋణాళువు. ఒకమాటు అప్పు కవిగారు ఆపదలో ఉండి ఆయన కొలువుకు వెళ్ళాడు అప్పుకోసం. అప్పుకవి మహా ఋణవంతుడు – పండితుడు. ఋణ్వేది. ఋణవ్యాకరణ ఋణతర్క మీమాంసాది శాస్త్రనిధి. అప్పుకవీయ గ్రంథకర్త.

"ఋణగ్రహణ గణాధిపా! అప్పురాయాన్ధీ! ఈ భూమ్మీద నీ అప్పులే సెలయేళ్ళై, నదులై, మహానదులై ప్రవహించి సముద్రాలయ్యాయి. భూగోళంలో "అప్పు" లన్నీ (అనగా నీళ్ళు) నీవే. అప్పులన్నిటినీ అపుపోశనం పట్టిన అగస్త్యుడివి నీవే" అన్నాడు.

అప్పురాయలు మొహం తిప్పుకున్నాడు.

అప్పుకవి చిన్నబుచ్చుకున్నాడు. తన ఋణవాక్యం రాయలవారికి దా–ఋణంగా నచ్చలేదని.

"హేఋణార్ధీ! నీ ఋణజలధిలో అప్పులకోసం తిరుగుతూ బతికే భవత్క – ఋణోపజీవులమే మేమంతా" అన్నాడు. అప్పురాయలు మొహం రెండోవేపుకు తిప్పుకున్నాడు.

"ఋణసమ్రాట్! నువ్వు అందరి దగ్గిర అప్పు తీసుకుంటావనీ తీర్చవనీ అంటారుగాని, అందరూ ఋణగ్రహణ శిల్పంలో నీకు ఎంతో ఋణపడి ఉన్నారు. తీర్చాలన్నా తీర్చలేరు" అన్నాడు అప్పుకవి.

అప్పురాయలు వెనక్కి తిరిగి కూర్చున్నాడు.

అప్పుకవికి నిరాశ కలిగింది. తన అప్సురసజ్ఞత కొరగానిదయి పోయిందనీ నొచ్చుకున్నాడు. తుది ప్రయత్నంగా మరొక్క మాట అన్నాడు:

"కఋణాపయోనిధీ! అప్పులు అడిగేవేళ నువ్వు ఆడిన సరసాలన్నీ మనోహరమైన రూపాలు ధరించి అందమైన కన్యలుగా స్వర్గంలో విహరిస్తున్నాయి. వారినే అప్సరస లంటారు" (అప్పురసాలన్నమాట భ్రష్టమై ఈ పేరు వచ్చింది) అన్నాడు.

వెంటనే అప్పురాయలు సింహాసనం మీంచి లేచి దిగి అప్పుకవి వేపు బయల్దేరాడు.

కొంపదీసి తంతాడా ఏవిటి చెప్మా అని అప్పుకవి శంకించాడు. గాని ఆ వరకే అప్పురాయలు వచ్చేసి ఆయనను గాఢాలింగనం చేసుకున్నాడు.

"మహాకవి, మీ మహాకావ్యాలు నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. నేను గద్దె దిగిపోయి, మొహం తిప్పినపుడల్లా ఆ దిశనున్న పరగణాలు మీకిస్తూ వచ్చాను. ఇపుడు నాలుగు

దిక్కులూ మీవే! దిక్కున్నచోట అప్పు తెచ్చుకోండి. దిక్కేమిటి నా రాజ్యం అంతా మీదే. ఈ రాజ్యంలో మీ చిత్తం వచ్చినవారిని, ఓపినంత అప్పు అడిగి పుచ్చుకోవచ్చు. ఆ హక్కులు ధారాదత్తం చేస్తున్నాను. వాటితోపాటు నా పాత బాకీలు కూడా మీవే. అంతేకాదు. ఇహనుండి మీరే నాకు అప్పులు ఇవ్వాలి. లేకపోతే తెచ్చి ఇవ్వాలి. ముందో రొండు పుంజీల వరహాలివ్వండి" అంటూ ఆయనను అభినందించి సత్కరించాడు అప్పురాజులు.

"ఆహా! నాటి విశాల హృదయాలు, ఆ ఔదార్యాలూ, ఆ అప్పురసజ్ఞత ఏవి – అప్పన్నా ఏవి?" అన్నాడు అప్పారావు కథలోనించి గాఢంగా నిట్టూరుస్తూ.

"కతలకేంగాని ముందర పన్నాడండి. ఇపుడు రాజుగారు ఇటేపొచ్చినా తిన్నగా అప్పుల్నరసయ్య కోసం ఎదిరింటి కెళ్ళిపోతాడు గదా, మనవెలా ఆపడం? ఆపి అడిగినా, ఆలోగా అప్పుల్నరసయ్య మన్ని చూసి తగులుకుంటే ఎలా?" అన్నాడు అప్పన్న.

అప్పారావు జాలిగా నవ్వాడు. "నీకు స్ట్రాటజీ తెలీలేదోయ్ అప్పన్నా! అప్పుల్నర సయ్యున్నది బాకీరావుగారి అరుగుమీద గదా..... బాకీరావుగారికీ మన రాజుగారికీ చూడగానే కౌగిలించుకునే అలవాటు లేదు. అప్పో బాకీయో తేలని మొత్తం ఒకటి వాళ్ళిద్దరి మధ్యా నలుగుతోంది. అంచేత రాజుగారు దూకుడుగా వచ్చినా, అరుగుమీద బాకీరావుని చూసి తగ్గి తమాయించుకుని అప్పుల నర్సయ్యకోసం బీటెయ్యడానికి వెనక్కి వెనక్కి నడుస్తూ ఈ కిళ్ళీబడ్డీ దగ్గరికే వస్తాడు – మనం ఇక్కడ మాటేశావని తెలీక. వెంటనే మనం వేటాడేస్తాం. అంథా స్ప్లిట్ సెకండ్ ఆపరేషన్. మాడర్న్ అప్పాలజీ" అన్నాడు అప్పారావు నీరసంగా నవ్వుతూ.

దూరంగా నల్లకోటు, అందులో ఋణదరాజుగారు కదలడం జరిగింది. అప్పారావూ అప్పన్నా బడ్డీచాటుకు జరిగి కాసేపు రాజుగారికేసి కాసేపు ఎదురింటి అరుగుమీది ఎరకేసి చూస్తున్నారు. లోకంలో గడియారాలన్నీ ఆగిపోయాయి. అప్పారావు గుండెలోదే దేశ సేవకుగాను ధాటీగా కొట్టుకుంటోంది.

ఋణదరాజుగారు ఈలపాట తక్కువజేసి మంచి హుషారుగా వచ్చేస్తున్నారు. అప్పుల్నరసయ్యని కళ్ళారా చూడాలని ఎన్నాళ్ళనించో ఆయన హృదయం తహతహ లాడిపోతోంది. ఇవాళ నుంచి మంచి అవకాశాలు కలిసొచ్చాయి. ఇందాక దగ్గిర్నొవచ్చి – ఆపేదాకా – గుర్తు తెలీకుండా – తలపాగా చుట్టుకు – మారువేషంలో మీదపడ్డ అప్పులస్వామి గాడిది మినహా. వెధవపీనుగ చూస్తూండగా పాతిక రూపాయలు పట్టుకుపోయాడు అరగంటలో ఇస్తానని....

ఋణదరాజుగారు కిళ్ళీబడ్డీ దాటుతూ వుండగా అప్పన్న కంగారు కొద్దీ ఆయన ఎదటపడి అటకాయించేయ బోయాడుగాని అప్పారావు సకాలంలో అతన్ని ఆపాడు. లాకాయ లూకాయ దెబ్బతగిల్తే, కథ అడ్డం తిరుగుతుంది. దెబ్బతిన్న పులిని ఆకట్టడం కష్టం – ఓపిక కావాలి. నిగ్రహం వుండాలి....

రాజుగారు కోవెలదాక ధాటీగా వెళ్ళి కొయ్యబారిపోయారు. అలా నిలబడిపోవడం లాభసాటిగాదని మళ్ళీ కోలుకొని బాకీలరావుని శపించి నెమ్మదిగా వెనక్కి వెనక్కి అడుగువేసి కిళ్ళీ బడ్డీ చేరేవరకూ.

"దండాలు బాబయ్యా.... దండాలు." "ఛీ వెధవా నువ్వా. నా దగ్గి...." "మా బుల్లికొంట్లో... బాగు".... "ఏం.... లేదు"..... "అది కాదు బా".... "బోయ్ నువ్వెక్కడ దాపురించావు...." అనే బుణగుణ ధ్వని "ఒరేయ్ అప్పన్నా, నీకేం బుద్ధిలేదూ" అన్న అప్పారావు కేకతో సర్దుకుంది.

"నమస్కారం రాజుగారూ" అన్నాడు అప్పారావు.

"నమస్కారం" అన్నాడు రాజుగారు నీరసంగా.

"ఈ వెధవకి సమయం సందర్భం మంచీ మర్యాదా తెలీవండి. అనెడ్యుకేటెడ్ బ్రూట్" అన్నాడు అప్పారావు.

"వెధవ్వేషాలు కుదరవు. నాదగ్గిరొందకాదు రెండొందలు కూడా లేదు" అన్నారు రాజుగార్లు కంగారుగా.

అప్పారావు షోగ్గా వయ్యారంగా వెనక్కి తిరిగి తనవెనకెవరో ఉన్నారన్నట్టు చూశాడు. ఇటు తిరిగి నవ్వాడు. "యూ మీన్ మీ.... నా వెనకెవరో ఉన్నారనీ, వారిని మందలిస్తున్నారనీ అనుకున్నాను..." అన్నాడు.

రాజుగారు ధుమధుమలాడుతూ ఎదురింటివేపు చూస్తున్నారు. కంగారుగా అటూ ఇటూ చూస్తున్నారు.

"డుయూనో! మీకు తెలుసా? విన్నారా?" అన్నాడు అప్పారావు.

రాజుగారు అనుమానంగా వెనక్కి చూశారు.

"మీరు క్షణం క్రితం అద్భుతమైన హాస్యపు మాటన్నారు. వన్నాఫ్‌ది ఫైనెస్ట్ జోక్సు ఎవర్. నేనే అయితే అది రాసుకొని ఎలక్షన్ ప్రాపగాండాలో వాడేద్దును" అన్నాడు అప్పారావు.

"ఈ శషభిషలు కుదరవు.... నాకు టైమైంది.... పోతున్నాను" అన్నారు రాజుగారు దశదిశలా కంగారుగా చూస్తూ.

"ఐనో ఐనో. టైము చాలా విలువైనది. ఇపుడు మీరు ఆ చందా ఇచ్చి మాటదక్కిస్తే అది ఓ ప్రాణాన్ని - ఒకటేమిటి రెండింటిని కాపాడుతుంది - ఆ రెండూ పెళ్ళాడి ఇంకో పిల్ల ప్రాణాన్ని పెడతాయి. అదేమో లక్షల్లార్జించి - వివరాలెందుకు లెండి ట్రూతీజ్ స్ట్రేంజర్ దాన్ ఫిక్షన్. నేన్నిజం చెప్పినా మీరు నమ్మరు."

రాజుగారు మళ్ళీ వీధి చివరికి తొంగిచూస్తూ "నా దగ్గిర డబ్బు లేదు" అన్నారు.

"డబ్బుదేవుందండి కుక్కన్నస్తే రాల్తుంది. మీరు ఊ అంటే దేన్నో తందాం."

"అసల్నే నెందుకివ్వాలయ్యా మీ అందరికీ?" అన్నాడు రాజుగారు కోపంగా.

"అప్పన్నా, చెప్పరా" అన్నాడు అప్పారావు.

అప్పన్న సంచిలోంచి సరంజామా తీశాడు.

"చిత్తం, మా యిద్దరి తాలూకు బంధువుల్లోను నిన్న సాయంత్రం వరకు ఇద్దరో ముగ్గురో పోయారండి. ఈపాటి కింకో ఇద్దరు పోయుంటారు. ఇంకిద్దరో ముగ్గురికో ప్రాణంమీద కొచ్చింది. ఇవిగో టెలిగ్రాములు. ఇవిగో ఈ రెండూ ఉత్తరాల్లా వున్నాయేగాని ఇవీ టెలిగ్రాముల్లాటివే. మేష్టారిల్లు వేలం వేస్తున్నారు. అప్పారావుగారి

తమ్ముడు పరీక్షకి ఫీజు... రిక్షావాని బీదబాలికకు మందు..." అంటూ చెప్పకుపోతున్న అప్పన్న అప్పారావు గావుకేక విని, తరువాత చుట్టూ చూసి కెవ్వుమన్నాడు.

అప్పారావు గావుకేక పెట్టడం నిజమే.

అప్పారావునీ అప్పన్ననీ కలుసుకోవాలనీ, వాళ్ళిద్దరిచేత కొన్ని ఋణపత్రాల మీద సమన్లమీదా ఆటోగ్రాఫులు పెట్టించుకోవాలని చాలాకాలంగా సరదాపడుతున్న అభిమానులు కొందరు హఠాత్తుగా నేలలోంచి మొలిచినట్టుగా అక్కడ సంభవించి వారిని చుట్టుముట్టడించారు. వారంతా ఋణదరాజుగారిని ఆశ్రయించగా ఆయన కనికరించి ఈ భేటీ ఏర్పాటుకు ఈ విధంగా దోహదం చేశాడు.

ఎంతో ఆప్యాయంగా, తమ తమ శిల్ప సంప్రదాయాల ప్రకారం లొట్టలు వేస్తూ ఎరని చూస్తున్న, పులిని చూస్తున్న, వేటగాణ్ణి చూస్తున్న ఎరనీ పులినీ వేటగాణ్ణీ చూస్తున్న, పులిని చూస్తున్న, వేటగాణ్ణి చూస్తున్న, ఎరని మేస్తున్న, పులిని కాస్తున్న.... ఆ యొక్క సన్నివేశం నేత్రానందంగా మహోజ్జ్వలంగా ఉంది. అయినప్పటికీ సమావేశకర్త ఋణదరాజుగారు ఎందుకో హఠాత్తుగా కదిలి, తీవిగురించి లేనిపోని పట్టింపులు పెట్టుకోకుండా సభవారి కృతజ్ఞతాభివందనాలు అందుకోకుండా రివాజైన దాని కన్న ఎక్కువ వేగంతో బయల్దేరి వెళ్ళిపోయారు. అక్కడి సభవారు చాలామంది అయ్యో మహోపకారి వెళ్ళిపోతున్నాడేల అని తెల్లబోయి చూడసాగారు.

వెనకాలవేపు నుంచి బాకీరావుగారు ఉత్సాహంతో ఋణదరాజుగారి కోసం వస్తున్న వైనం వీరు గమనించలేదు. ఆ సంరంభంలో తమకు ప్రముఖ పాత్రలేదని తలచి చిన్నబుచ్చుకున్న అప్పారావు గల్లంతై పోవడం కూడా వారు గమనించలేదు.

"హే ఋణవాన్! ఏది ఎర? ఏది పులి? ఏది గురి? ఏది బలి? అంతా నీ లీల" అనుకున్నాడు స్వామి ఋణానంద – తాను ఎంతో ఆశతో ప్రేమతో దరిచేరబోయిన ఆ మహాసభ, తనని చూడగానే వందన సమర్పణ లేకుండా ముగింపు చెందడం, జనం కకావికలై పరుగెత్తడం చూసి.

★ ★ ★

# జన రమణీయం




రామకుమారి మీ ఇళ్ళు వుందా
రత్నకుమారీ మీ ఇళ్ళు ఉందా
పేరు పేరులతల్లి మీ ఇళ్ళు వుందా
పెద్దప్ప దొరసాని మీ ఇళ్ళు వుందా
అంటూ ఇంటింటా తొంగిచూస్తూ ఇల్లాళ్ళను అడగసాగింది నరసమ్మ.
మీ ఇళ్ళు లేదమ్మ మా ఇళ్ళు లేదు అన్నారు ఇల్లాళ్ళంతా అలవాటు ప్రక

"ఇల్లిల్లు తిరిగేటి పిల్లల్ల కోడి
అల్లదుగొ చూడవే, తెల్లవారేను
మేలుకో మేలుకో ఓ సుందరమ్మా!
మేలుకోవే ఇంక బంగారు బొమ్మా"

అన్నాడు అప్పుడే నిద్ర మేలుకుంటున్న చక్రవర్తి.

చక్రవర్తి కవిత్వం చెబుతాడంటే సుందరమ్మకి చాలా భయం. చటుక్కున నిద్రలేచి, శ్రీరామ చుట్టుకుని, కుంపటి రాజేసి, కాఫీ పొడి కోసం పొరుగింటికి అప్పుకి బయలుదేరింది. పొరుగింటి పిన్నిగారు ఎదురింటి జానకమ్మ దగ్గిర వాళ్ళ నాగపూరు కప్పుతో నాగపూరు కప్పుడు పంచదార అప్పు పట్టుకొచ్చింది. జానకమ్మ పంతులమ్మ. సుందరమ్మ భర్త పనిచేసే బడిలోనే ఉద్యోగం. అందుకని సుందరమ్మ సాధారణంగా అక్కడ అప్పడగదు. ఆ మాటకొస్తే సుందరమ్మ పక్కింటి పిన్నిగారిని తప్ప ఇంకెవరినీ అప్పు అడగదు. ఇద్దరివీ ఖరీదైన కోరికలు కాబట్టి వెయ్యానికీ కయ్యానికీ ఆవిడే తగును.

తాత్కాలికంగా వచ్చిన కొన్ని ఇబ్బందుల వల్లా, ఇంతకన్నా పెద్ద ఇల్లు దొరకకా, తనూ పక్కింటి పిన్నిగారూ ఈ మధ్య తరగతి వాళ్ళకాలనీలో వనవాసం చేస్తున్నారు.

తనకి సరికొత్త జాగ్వారుకారు కొనాలని అభిలాష. పిన్నిగారికి ఒక మేడ ప్రస్తుతానికక్కనాలని ఉంది, తాపీగా ఒకటి కట్టించుకోవాలని సంకల్పం. అందులో టెలిఫోను, రేడియో, బొచ్చుకుక్క – అవీ ఉంటాయి. అప్పుడే ఆవిడ టెలిఫోను రేడియోలు పెట్టే బల్లల మీద వేసే గుడ్డలు కొనేసి, వాటికి చక్కగా ఎంబ్రాయిడరీ వేసింది. కొనబోయే బొచ్చుకుక్కకి ముచ్చటైన పటకా, గొలుసు కొని అట్టే పెట్టుకుంది.

సుందరమ్మ పెద్దపెద్ద కారుల్లో వెళ్ళినప్పుడు ఎలా ప్రవర్తించాలో చూసి, చదివి తెలుసుకుంది. డ్రైవరు వచ్చి తలుపు తీసేదాకా దిగకుండా ఉండడం, దిగినపుడు ముందర ఓ కాలు వయ్యారంగా నేల మీద మోపడం, మోపినప్పుడు కాలి ఆకుజోడు పూర్తిగా తొడుక్కుని ఉండకుండా, బొటనవేలికి సుతారంగా తగిలించి అరికాలికి, జోడు ఉపరితలానికి మధ్య కనీసం 60 డిగ్రీల కోణం ఉండేటట్లు చూసుకుని మరీ దిగడం, తలుపు వేసినపుడు చీరచెంగు ఆ సందులో పడేటట్లు వదిలి, ఆ పైన ముద్దుగా ముచ్చటగా సన్నంగా చక్కగా, 'ఓ' అని ఇంగ్లీషులో ఆశ్చర్యపడి, నాజూకైన బేజారు నటించడం మొదలైన కార్యకలాపాలన్నీ సినిమాలకు వెళ్ళినప్పుడు టాక్సీలలో ఎక్కి దిగి నేర్చుకుంది అందమైన సుందరమ్మ.

పిన్నిగారూ నిన్న ఎంత చక్కటి కారు చూశా ననుకున్నారు. పెద్దకారు. నల్లటి కారు. నా హైదరాబాదు చీరంత నల్లటిది అంది సుందరమ్మ.

ఏదీ! నువ్వు చెప్పేది రోజూ పదిన్నరకి మన వీధి మీదుగా వెళ్ళేదేనా?.... మా ఆఫీసరుగారి మేడ దగ్గిర చూశాను. అన్నట్టు నువ్వు వాళ్ళ కొత్త మేడ చూశావా? అచ్చు నేను అనుకుంటున్న మేడే అనుకో. నా ప్లాను కాపీ కొట్టారా అనిపించింది. ఎటొచ్చీ ప్రహరీగోడ బాగా పొట్టిదనుకో... అంది పిన్నిగారు.

తడకవతల పడుకున్న చక్రవర్తి వింటున్నాడు కబుర్లన్నీ. ఈ పురాణ కాలక్షేపం ప్రారంభం అయితే భోజనం వేళకి కాఫీ, నిద్రవేళకి భోజనం తెములుతాయని తెలుసు. సుందరీ అని కేకవేశాడు మొండిగా.

అన్నట్టు పిన్నిగారూ, కాఫీ పొడుం నిండుకుంది కాని....

.... అట్టే లేదనుకుంటానమ్మా అంది పిన్నిగారు- మొహం ముడుచుకోడానికి ఉపక్రమిస్తూ. సుందరమ్మ నాలిక కరుచుకుంది చేసిన పొరపాటుకి.

ఎంతో వద్దు – ఈ పూటకే, మీ నాగపూరు కప్పుతో నాగపూరు కప్పుడు చాలు అంది.

మేడ కొనేసినంత పనయింది పిన్నిగారి ప్రాణానికి. దానికేం భాగ్యం మహారాజులా పట్టికెళ్ళు అంది ఆదరంతో.

సుందరమ్మ వెళ్ళగానే నరసమ్మగారు వచ్చి పిన్నిగారిని పలకరించింది. మా చిన్న పిల్లగినా మీ ఇంటో ఆడుకుంటోందా వదినా? అంది ఆప్యాయంగా. లేదండి అంది పిన్నిగారు కాస్త ముభావంగా.

ఏమోనమ్మా. అస్తమానూ అత్తయ్యత్తయ్యంటూ ఉహూ ఇదౌతూ ఉంటుంది. మీ ఇల్లు కాస్త విశాలం కదూ. దాని ప్రాణానికి హాయిగా ఉంటుంది అంది నరసమ్మగారు.

ఏ మిల్లు లెస్తురూ వదినా. మాకు మహా ఇరకాటంగా ఉంది. పెద్ద కొంప కోసం దేవుళ్ళాడుతున్న కొద్దీ దూరం అయిపోతోంది.

ఔ గాని వదినా మీ ఇంట ఒక అర్ధశేరు బియ్యం ఉంటే ఇద్దురూ. అనక పంపించేస్తాను... ఉంటేనే సుమండీ అంది నరసమ్మగారు కాస్త గొంతుక మార్చి.

అదేమిటమ్మో! లేకపోతే ఇచ్చేదేముంది? అయినా మా ఇంట ఇటువంటి వాటికి లోటుండదమ్మో...

మరేం లేదొదినా. ఈ తోటలో ఇప్పటికి ఎనిమిది ఇళ్ళలో అడిగాను. అందరిళ్ళలోనూ బియ్యం నిండుకున్నాయట.... అప్పులు-కాబట్టి మీతో చెబుతున్నాను సుమండీ అంది నరసమ్మ.

పోన్లే ఎవరి పాపం వాళ్ళదీ. అర్ధశేరు కాదు. ఇంకో పావుశేరు కూడా పట్టుకెళ్ళు... చేట తెచ్చావా, చెంగులో పొయ్యనా?

మీ కలకత్తా వెండి గిన్నెలో పోసివ్వండి అంది నరసమ్మ.

బియ్యంతోపాటు కాసిని వంకాయలు, ఓ గుమ్మడి బద్ద కూడా ఇచ్చి పంపింది పిన్నిగారు. నరసమ్మగారు ఇంటికెళ్ళి తలుపు గొళ్ళెం తీసేవరకు, ఇంట్లోని నలుగురు పిల్లలూ బిలబిల లాడుతూ బయటకొచ్చారు – అమ్మా అన్నమే, అప్పచ్చే, కానీయే, వోణీయే అంటూ.

నరసమ్మగారు అలవాటు ప్రకారం నలుగురికీ వీపుల మీద నాలుగు రెళ్ళు ఎనిమిది వడ్డించి అవతలకి పొమ్మంది. ఐదు నిమిషాలలో ఆ తోటలోని పదకొండు ఇళ్ళలో ఉన్న యావన్మందీ నరసమ్మగారి పిల్లల గోల విని తెల్లారిందని తెలుసుకొని లేచారు.

కొన్ని వేల సంవత్సరాల క్రితం ఆ తోటలో జనాన్ని ఇప్పటికి మల్లె నరసమ్మగారి పిల్లలుకాక, కాకులు, కోళ్ళు ముచ్చటగా మేలుకొలిపేవి. అప్పట్లో కణ్వుడు, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు మొదలైన ఋషుల కోవకి చెందిన గొప్ప ఋషి కూతురు ఒకసారి బొమ్మల పెళ్ళిళ్లు చేసింది. ఆశ్రమ సీమలోని ఋషులు, వారి శిష్యులు యావన్మందీ ఆ పెళ్ళి వైభవంగా జరపడం కోసం నిజంగానే విడిది కట్టారు. తోట మధ్యన ఒక పెద్ద కుటీరం నిర్మించారు పెళ్ళికి. దానికి ఎడాపెడా నాలుగేసి పర్ణశాలలు,

వెనుకవైపు రెండు శాలలు కట్టారు విడిది కోసం. కొంతకాలానికి క్రీస్తుశకం, దరిమిలా ఇరవయ్యో శతాబ్దం వచ్చేశాయి.

నాగరికత పెరిగాక, అక్కడ ఊరు వెలిసింది. ఆ శాలలు కొన్న యజమాని వాటి ఆకులు తీయించి, పాత పెంకులు, రేకు ముక్కలూ వేయించాడు. పై కప్పుగా స్తంభాలూ తడకలూ తీసి ఇటికలూ, మట్టీ వేసి గోడలు లేపాడు. మధ్య పాక పీకి డాబా వేయించాడు. పైన గది వేశాడు.

ఆ పర్ణశాలావళి యజమానులు మారినా శాల్తీలు మారలేదు. చుట్టూ వున్న గదిన్నర వాటాలతో పదేసి రూపాయల అద్దె యిచ్చే చిన్న కుటుంబాలున్నాయి. మధ్య ఇల్లు రెండు భాగాలు. ఒక వాటాలో పెద్ద మనిషిగారూ ఆయన కుటుంబం ఉన్నారు.

రెండో దాంట్లో సుబ్బారావుగారి మావగారి కూతురూ, కూతురు మొగుడు సుబ్బారావూ ఉంటున్నారు. చుట్టూ వున్న గదిన్నర వాటాలలో చక్రవర్తి సుందరమ్మల వంటి చిలకా గోరువంకల దగ్గిర నించి, చక్రవర్తి కవిత్వానికి గురి అయిన పిల్లలకోడి నరసమ్మగారి వరకూ రకరకాల కుటుంబాలు ఉన్నాయి.

వీటిలో ఏ తరగతి క్రిందకూ రానిది, మిడిల్ స్కూలులో ఐదో తరగతి వరకూ పాఠాలు చెప్పే పంతులమ్మ జానకమ్మ – పెళ్ళి చేసుకోని బంగారు బొమ్మ.

ఇంటి యజమాని వీర్రాజు, మధ్య ఇంటి మేడ గదిలో ఉంటాడు ఒంటరిగా. వీర్రాజుకి శరత్ బాబు కథల్లో హీరో లక్షణాలు కొన్ని ఉన్నాయి. ముందూ వెనకా ఎవరూ లేరు. ఉన్నవాళ్ళెవరో చాలా దూరాన ఉన్నారు. వీర్రాజు ఆస్తి అనదగిన ఈ వాడ, వాళ్ళంతా తన్నే పట్టుకు దేవుళ్ళాడేటట్లు చేయగలిగినంత బలమైన సూదంటు రాయి కాదు. పదిమంది మధ్య ఉండాలని వీర్రాజుకి ఉబలాటం లేదు.

ఇరుగు పొరుగుల గోల పట్టించుకునేవాడు కాడు కాని, ఇరుగువారి చరిత్ర పొరుగు వారూ, వారి కథ వీరూ వంతులు వేసుకుని చెప్పి చక్కాపోతూ ఉండటంతో, అతనిలో కుతూహలం రేగింది. మేడమీది గదిలో కూర్చుని ఒడలో కప్తానులా, చుట్టూ గదిన్నర వాటాల వారు పడే అవస్థలూ, కీచులాటలూ, దోబూచులాటలూ సావకాశంగా చూస్తూ ఉండేవాడు. అతడు జాలిపడే వాడనడానికి నిదర్శనం అద్దెల బకాయిలు.

ఒక్కొక్కసారి చిరాకేసేది – చేతిలో డబ్బు బొత్తిగా ఇదైపోయినపుడు, తనకు బాకీ ఉన్నవాళ్ళు కులాసాగా సినిమాకి వెళ్తున్నపుడు ఒళ్ళు మండిపోయేది.

ఒక ఆదివారం సాయంత్రం క్రింద వాటాలో సుబ్బారావు షికారుకు వెళుతుంటే పిలిచాడు.

ఏవండీ... మరోలా అనుకోకండి. ఈ నెలయినా కాస్త అద్దె ఇచ్చేస్తే... అన్నాడు మెల్లిగా.

సుబ్బారావు తెల్లబోయాడు. మొన్న ఒకటో తారీఖునే ఇచ్చేశాం గదండి... పైగా ఈ నెలయినా అంటారేమిటి? నేను బకాయిలు పెట్టలేదే?

ఐదు నెలలయిందండి మీ వాటా అద్దె నాకు అంది అన్నాడు వీర్రాజు.

మీరు పొరపాటు పడుతున్నారు. జీతం వచ్చిన మర్నాడే మీకు అద్దె పంపిస్తున్నాను.

వాకు మాత్రం అందటం లేదండి.

వీర్రాజు తిక్క జవాబు విని సుబ్బారావు మండిపడ్డాడు. ఉండండి అదేదో ఇప్పుడే తేల్చేస్తా అన్నట్లు చరచర ఇంట్లో కెళ్ళాడు. భార్యని గదమాయించి అడిగాడు.

ఇవ్వకేం ఏ నెలకానెల నిక్షేపంలా ఇస్తున్నాం. అదేం పొయ్యే కాలం అందామె.

ఆ ముక్క అతనితో చెప్పు అన్నాడు సుబ్బారావు.

బావుందండీ. చెట్టంత మొగాడి ఎదటపడి పోట్లాడమంటారా? మీ మాట నమ్మకపోతే కాస్త అగమనండి, మా నాన్న వచ్చాక కనుక్కోమందాం. ఆయనే ఇస్తున్నారు అద్దె పట్టిగెళ్ళి అంది.

అద్దె ఇస్తున్నది మావగారు అని వినగానే సుబ్బారావు ధీమా సడలింది. కోపం చల్లారింది. సుబ్బారావు మావగారు షైరు వెళ్ళాడు. బాగా చీకటి పడ్డాక ఆయన రాచకార్యాలు చక్కబెట్టుకొని వస్తాడు. సుబ్బారావుకి వీర్రాజు దగ్గరకెళ్ళి ఏం చెప్పాలో తోచలేదు. మొహం దిగాలు పడింది. రానురాను అనుమానం ఎక్కువైంది.

కిటికీలోంచి బయటకు చూశాడు. ఎదుటి నాలుగు వాటాలలో మూడు వాటాల వాళ్ళు వసారాలో బార్లు తీరి చూస్తూ వింటూ నిలుచున్నారు గారడీవాడి ప్రేక్షకులమల్లే. జానకి మాత్రం లోపల వంట చేసుకుంటూ కూర్చుంది. సుబ్బారావు చీదరించుకుంటూ వీర్రాజు దగ్గరకెళ్ళాడు. అయ్యా రాత్రి మాట్లాడదాం అనేసి విసవిస నడిచి వెళ్ళిపోయాడు.

☆ ☆ ☆

రాత్రి ఎనిమిదయింది. సుబ్బారావు ఇంటిలో కూర్చుని పేపరు చదువుతున్నాడు.

ఏవోయ్! పెంద్రాళే వచ్చేశావ్! అంటూ హుషారుగా పలకరించాడు సుబ్బారావు మావగారు.

ముందు చొక్కా విప్పండి. భోం చేద్దాం అన్నాడు సుబ్బారావు.

మావగారు చొక్కా ఊడదీసే కార్యక్రమం సగం అమలు జరుపనిచ్చి, ఆయన తలకాయ చొక్కా ముసుగులో మునిగివున్న క్షణాన, వీర్రాజు అద్దె బకాయి పడ్డామంటున్నాడు అన్నాడు సుబ్బారావు.

మావగారు చొక్కా విప్పలేదు. దింపలేదు. తలకాయ అలా చాటునే ఉంచుకుని ఏ అద్దె – అన్నాడు.

ఏ అద్దేమిటండీ, నా తలకాయ అద్దె! మన ఇంటద్దె అన్నాడు వీర్రాజు.

మావగారు చొక్కా కిందికి దింపి, ఇవతలికి తొంగి చూశాడు.

అవునుగాని సుబ్బారావ్, ఈ డొక్కు ఇంటికి అద్దెబకాయి పెట్టకుండా వల్లకాదంటే, మనకి ఈ ఇంటిలో ఉండేటంత ఖర్మం ఏం కాలిందీ అంట అన్నాడు.

ఒకటికాదు రెండు కాదు ఐదు నెలలు ఐదు ముప్పయిలు నూట యాభయి బకాయి పెట్టారు మీరు అన్నాడు సుబ్బారావు.

మావగారు అమాంతం చొక్కా విప్పుకోడానికి మొదలు పెట్టి తల ఆ డేరాలో దాచుకున్నాడు. ఎవరు చెప్పారు నీకు. ఐదు నెలలు కాదే, ఏ మూడు నెలలో నాలుగు నెలలో అన్నాడు.



ఎందుకండీ మావగారూ ఇలా చేస్తారు. నన్నిలా బాధ పెట్టడం భావ్యమేనా? అన్నాడు సుబ్బారావు చిరాగ్గా. మావగాడు చొక్కా విప్పలేదు.

ఇంతలో సుబ్బారావుని హలో అనే మిత్రుడొకడు హఠాత్తుగా వచ్చేసి హలో అనేశాడు. అప్పు కావాలన్నాడు. ఇదివరకు అతను బాకీ వున్న ఐదూ పదీ, పదీ రెండూ పన్నెండూ, నాలుగు రోజులలో సుబ్బారావుకి ఇచ్చివేయ దలచుకున్నట్లు ప్రకటించాడు.

ఏం గిరాకీ అన్నాడు సుబ్బారావు కోపంలోనే కొంత హేళన స్ఫురింపజేస్తూ.

మనియార్డరొస్తుంది.

ఇంకేం అదేదో వచ్చాకా, సరాసరి ఇచ్చెయ్యొచ్చుగా, ఇప్పుడీ ప్రకటనలెందుకు?

ఏం లేదు ఇంకో ఎనిమిది ఇవాళ అర్జెంటుగా యిస్తే మొత్తం ఇరవై ఇచ్చేద్దామని.

ఊహ మంచిదే. నా దగ్గిర డబ్బు లేదు, ఉన్నా యివ్వను అన్నాడు సుబ్బారావు విసుగ్గా.

మావగారు చొక్కా విప్పుకోవడం మానేసి, మామూలుగా కిందికి దించి అలకిస్తున్నాడు.

పోనీ మూడు ఇవ్వండి. మొత్తం పదిహేను ఇచ్చేస్తా అన్నాడు మిత్రుడు ఆశగా.

సుబ్బారావు మందహాసం చేసి కూర్చోమన్నాడు.

అబ్బాయ్, నా ఎరకన సెంట్రల్ గవర్నమెంటులో రెండు ఉద్యోగాలున్నాయి. చూసుకోరాదూ అన్నాడు.

అబ్బే, నేను గవర్నమెంటు కింద ఉద్యోగం చెయ్యదలచుకోలేదు.

అయితే మా వంటి వాళ్ళ ప్రాణాలు తీస్తూ ఉండదలుచుకున్నావా? అన్నాడు సుబ్బారావు.

అసలు చెప్పండి, చూద్దాం.

ఈ ఉద్యోగాలు స్వతంత్రమైనవిలే. నెల జీతం కాదు, ఏ రోజు కారోజే శక్తికొద్దీ సంపాదన.

చెప్పండి ఎక్కడో.

ఒకటి తంతి తపాలా శాఖ. పని సులభం. చిన్నచిన్న పోస్టాఫీసు లుంటాయి చూడు. ఓ కలం, సిరాబుడ్డి పట్టుకు వెళ్ళడం, ఎవడైనా ఉత్తరం వ్రాసుకోడానికి వస్తే కలం, సిరాబుడ్డి చేతికిచ్చి, నువ్వు ముందుకు వంగి, వీపు మీద ఉత్తరం రాసుకోనీయడం, అదయిపోయాక తపాలా బిళ్ళలు అంటించాలిగా, మిషవ్ పద్ధతిలో నాలిక బయటికి చాచడం, అయన స్టాంపు తడి చేసుకోగానే, నాలికని ఉపసంహరించుకోవడం, స్టాంపు అంటించడానికి మళ్ళా ఒక్కసారి వీపు ఎరువియ్యడం. ఈ సహాయానికి, ఉత్తరం ఒక్కటికి అర్ధణా పుచ్చుకోవచ్చు. ఈ లెక్కన రోజుకి నీ ఆర్జన ఎంతో చూసుకో అన్నాడు సుబ్బారావు గబగబా హుషారుగా.

ఎదటి మిత్రుడుకి నోట మాట రాలేదు. సుబ్బారావు మావగారు మళ్ళీ చొక్కా విప్పబోయి, మధ్యలో ఆపేసి తల దాచుకున్నాడు. ఇదేం చూడనట్టుగానే సుబ్బారావు చెప్పుకుపోయాడు.

ఇది నచ్చకపోతే ఇంకోటుంది. ఒక హరికేన్ లాంతరు చేతబట్టుకొని కలకత్తా మెయిలుకి అరమైలు దూరాన పరిగెడుతూ ఉండాలి.

లైను సరిగా లేనపుడు వెనకాల వచ్చే రైలుని ఆపి, ఆ సంగతి చెప్పాలి. పూర్తిగా నైటు డ్యూటీ అనుకో, ఛఫ్ అన్నాడు, సుబ్బారావు మావగారు. సుబ్బారావు స్నేహితుడు చీదరించుకుని వెళ్ళిపోయాడు.

ఏమిటండీ సెలవిచ్చారు అన్నాడు సుబ్బారావు.

ఆ వెధవ నడ్డుపెట్టుక్కొని నన్ను అడ్డమైన మాటలూ అంటావూ? ఇష్టం లేకపోతే పొమ్మనరాదూ? అన్నాడాయన చొక్కాలోంచి.

మిమ్మల్ని ఇల్లరికం ఉండమని పిలిచానా? పెద్దలు కదా తండ్రి వంటివారు కదా అని గౌరవిస్తే మీరు మీ చిత్తం వచ్చినట్లు నన్ను ఉద్ధరిస్తున్నారు. పల్లెత్తు మాటన్నానా?... మీరు అద్దెలకి కూడా ఎసరు పెడితే ఎలా చావమంటారండి, అన్నాడు సుబ్బారావు.

నాన్నా నువ్వు లోపలికి రా, ఆయనతో వాదించకు అంది సుబ్బారావు భార్య.

ఉండవే, దీనంతేమిటో కనుక్కుంటాను అన్నాడు మావగారు ముసుగులోంచి.

దేంది? ఆ చొక్కాదా? అన్నాడు సుబ్బారావు.

మావగారికి బాగా కోపం వచ్చేసింది. అరి వెధవ! అంత హేళనా! అంటూ భావాలను అభినయించబోయాడు... ఆ ఉధృతానికి, పిగులుతున్న చొక్కా ఎడాపెడా ఛర్రున చిరిగి చేతులు రెండూ చెరో చిల్లిలోంచి ఇవతలకి వచ్చాయి. తల ముసుగులో ఉండిపోయింది.

ఈ శబ్దాలు విని వీర్రాజు మేడ దిగి మూడడుగులు వేసి కొయ్యబారిపోయాడు. సుబ్బారావు వాటాకి, ఇవతల వాటాకి మధ్య ఒక తలుపే అడ్డం. ఆ తలుపు దగ్గిర అతి మనోహరమైన దృశ్యం కనబడింది కిటికీలోంచి చూసిన వీర్రాజుకు. ఆ వాటాలోని పెద్దమనిషి ఒక కుర్చీలో కూర్చున్నాడు, పక్కనే ఆయన సతి మరొక కుర్చీ వేసుకుంది. కూతుళ్ళూ, కొడుకులూ, మనుమలూ ఎడా పెడా నుంచున్నారు. కొందరు పెద్దవాళ్ల కాళ్ళ దగ్గిర మఠం వేసుకు కూర్చున్నారు. ఈ బృందం అంతా సుబ్బారావు వాటా తలుపుకి ఎదురుగా, కాస్త దగ్గిరగా ఈ విధంగా ఉపవిష్టులై పొరుగింటి వారి పోట్లాటను తిలకించకపోయినా ఆలకించి, తన్మయానందం అనుభవిస్తున్నారు. గ్రూపు ఫోటో తీయించుకున్నట్టు కూర్చున్న ఆ గుంపును చూడగానే వీర్రాజు ఛీ అనుకున్నాడు. ఆ పైన జాలిపడ్డాడు. ట్యూషన్ చెప్పి ఇంటికొస్తున్న జానకి కూడా ముచ్చటైన ఈ దృశ్యం చూసి ఏవగించుకుంది. వీర్రాజు కూడా తనతో ఏకీభవించి నందుకు తృప్తిగా నవ్వి వెళ్ళిపోయింది.



మావా అల్లుళ్ళ వాదం కొనసాగుతూ ఉండగా కెనడియన్ రైలింజన్ కొండ మీద నుంచి దొర్లించిన చప్పుడయింది. ఒక్క క్షణం ఆగారు. 1928 వ సంవత్సరపు చలనహేతు శకటం ఒకటి టకటకమంటూ ధనధనమంటూ ఇంకా నానా విధాల చప్పుడు చేస్తూ, తోటలోకి వచ్చి సరాసరి సుబ్బారావు ఇంటి ఎదుట ఒక క్షణం ఆగింది.

కారు కొన్నాం, కారు కొన్నాం అంది కారులో కూర్చున్న సుందరమ్మ హుషారుగా. కారులో సుందరమ్మ ఆరిందాలా చేరబడి కూర్చుంది. పోట్లాట మధ్యలో ఉన్నందువల్ల ఎవరూ సుందరమ్మ కారు జోలికి రాలేదు. నరసమ్మగారి పిల్లలు కూడా భయపడ్డారు.

ఉత్సాహం చల్లారిపోయిన సుందరమ్మ రైట్ రైట్ అంది డ్రయివర్ వంక తిరిగి. కారు ముందుకు సాగి ఎడమకు తిరిగి మళ్ళా ఎడమకు తిరిగి సుందరమ్మ వాటావైపు వచ్చింది. హోల్డాన్ అని కేక పెట్టింది సుందరమ్మ తన ఇల్లు రాగానే.

చక్రవర్తి వసారాలో కూర్చున్నవాడల్లా తుళ్ళిపడి లేచాడు. ఏమిటిది అన్నాడు. సుందరమ్మ డ్రైవరుకు వందనాలర్పించి, ఓ రూపాయి ఇచ్చి వెళ్ళిపొమ్మంది.

మనదే, ఎలా వుందండీ, నాలుగంటే నాలుగు వందలండీ అంది సుందరమ్మ.

నీకేమైనా మతిపోయిందా? కారు కొన్నావా? నీ కసలు నాలుగు వందలెక్కడివి....? నేను బడిపంతులునని జ్ఞాపకం ఉందా? మన ఇంటి అద్దె ఎంతో తెలుసా? అన్నాడు చక్రవర్తి.

ఒక్క క్షణం ఉండండి చెబుతా, కాసిని మంచినీళ్ళు తాగాలి.

ఈ లోగా మధ్య ఇంట్లో సుబ్బారావు, ఆయన మావగార్ల వాదాలు తారస్థాయి నందుకున్నాయి.

మీకు సొదరు ఖర్చులికి వేరే ఇవ్వడం కాకుండా, వెచ్చాలన్నీ మీ చేతనే కొనిపిస్తున్నాను కదా అన్న మాటలు పై స్థాయిలో వినపడ్డాయి. సుబ్బారావు ఇంత దారుణమైన మాట అంటాడనీ, అనగలడనీ, ఆ తోటలో ఎవరూ అనుకోలేదు. అందుకని ఆ మాటలు విన్నవాళ్ళంతా విస్తుబోయారు. సుబ్బారావు మావగారు కలలో కూడా అనుకోలేదు. ఆయన కొయ్యబారిపోయాడు. పెదవులు వణికాయి. కళ్ళెర్రబడ్డాయి. మాటలు చాలా అనాలని లోపల ఉబలాటం ఉంది కాని బయటికి రావటంలేదు. ఉండు అని ఉరుములాంటి మాట మాత్రం అన్నాడు.

ఇంట్లోంచి బయటికొచ్చేశాడు. తరవాత ఆయనకి ఏం చెయ్యాలో బోధపడలేదు. ఆగి వెనక్కి చూశాడు. సుబ్బారావు లోపలికి వెళ్తున్నాడు. ఇంకో క్షణం ఆగి ఆలోచించి, సరాసరి జానకమ్మ వాటాలోకి వెళ్ళాడు సుబ్బారావు మావగారు.

అమ్మా, వింటున్నావుగా, ఇవి చేతులు కావు కాళ్ళనుకో, పెద్దముండావాణ్ణి. ఇన్నాళ్ళకీ గతి పట్టింది. ఒక్క నూట యాభయి వుంటే ఇవ్వు తల్లీ, రేపు సాయంత్రానికి తల తాకట్టు పెట్టి నీది నీకిస్తాను... ఈ తోటలో ఇస్తే నువ్వే ఇవ్వాలి అన్నాడు.

జానకి మనసు కరిగిపోయింది. కాని అంత డబ్బు లేదు. వందే ఉంది. పైగా ఆమె బుర్ర ఎక్కడో ఉన్నందువల్ల, ఈ కథ సంగతి పూర్తిగా తెలియదు.

మీరు అలా సోడా కొట్టు కెళ్ళి ఐదు నిమిషాలలో తిరిగి రండి ఇస్తాను అంది. సుబ్బారావు మావగారు వెళ్ళిపోయాడు. జానకి బయలుదేరి సరాసరి మేడ ఎక్కింది.

వీర్రాజు విచారిస్తున్నాడు తనవల్ల అంత గొడవ జరిగినందుకు. అంతలో జానకి పిలిచింది. హఠాత్తుగా ఓ యాభై రూపాయలు కావాలంది. తనతో అరుదుగా మాట్లాడే జానకి ఇంత హఠాత్తుగా, నిస్సంకోచంగా డబ్బు అడిగెయ్యడంతో, వీర్రాజు అసలు సంగతి పసికట్టేశాడు.

మీరు చాలా మంచివారు అన్నాడు ఐదు కొత్త నోట్లు జానకి చేతికందిస్తూ.

జానకి నవ్వింది. బళ్ళోకూడా చాలామంది మేష్టర్లు, హెడ్‌మాస్టర్, సెక్రటరీ తనని అడపా తడపా మెచ్చుకుంటూనే ఉంటారు. కాస్త తలనొప్పి వస్తే ఆయుర్వేదం, అలోపతి, హోమియోపతి, మొదలైన వైద్య శాస్త్రాలలో చెప్పిన మందులన్నీ ఏకరువు పెడతారు. అదే పనిగా సానుభూతి వొలకబోస్తారు.

వీర్రాజు ఆమె నవ్వులో ఈ ధోరణిని పసిగట్టాడు. ముఖస్తుతి అనుకునేరు కొంపతీసి అన్నాడు నవ్వుతూ.

మీరు నా మంచితనాన్ని మెచ్చుకున్నారు గాని, ముఖాన్ని కాదుగా అంది జానకి వెనక్కి తిరుగుతూ.

అదాండి. అలాంటి ముఖస్తుతి అయితే అనర్గళంగా మెచ్చుకోగలను. అమోఘమైన కాంపోజిషన్ వ్రాసి మీ చేతే పదికి పది మార్కులు వేయించుకోగలను అన్నాడు వీర్రాజు.

మీరు బలేవారే అంటూ జానకి గబగబ మేడ దిగిపోయింది.

సుబ్బారావు మావగారికి నూట యాభయి ఇచ్చింది జానకి. ఆయన బోలెడు దుఃఖపడి జానకి ఋణం తీర్చుకోలేనని పదేపదే చెప్పి ఇంటిలోకి వెళ్ళి సుబ్బారావు ఎదుట పడేశాడు. సుబ్బారావు మారు మాట్లాడకుండా భార్య కిచ్చాడు. భార్య మళ్ళా ఆ డబ్బుని తండ్రికే ఇచ్చింది.

నువ్వే వెళ్ళి ఇచ్చెయ్యి నాన్నా అంది.

ఆయన సుబ్బారావుకి మహోపకారం చేస్తున్నవాడిలా, మడిగట్టుకున్నట్లు మునివేళ్ళతో ఆ డబ్బుని తీసుకొని వీర్రాజు దగ్గరికి వెళ్ళాడు.

తోటలో సద్దుమణిగింది. అవతల పెడలో సుందరమ్మ వాటాలోంచి మాత్రం మాటలు వినబడుతున్నాయి. అన్ని వాటాలవాళ్ళు దీపాలార్పి పడుకొని, చల్లటి గాలి వీచినట్టుగా, ఆ మొగుడూ పెళ్ళాల వాద ప్రతివాదాలు విని ఆనందిస్తున్నారు. ఇంచుమించు అప్పటివరకూ సుబ్బారావు ఇంటిలో మావా అల్లుళ్ళ సంవాదం విన్నవాళ్ళంతా, ఒక్కరోజులో రెండు కయ్యాలు జరిగినందుకు మురిసిపోతూ, అయిపోయిన మొదటి కయ్యం చెణుకులూ మెరుగులూ నెమరువేస్తూ, కొనసాగుతున్న రెండో కయ్యం విసుర్లని లొట్టలేస్తూ నోరూరగ చవులుబుట్ట వింటూ సంతోషం పట్టలేక గింజుకుపోతున్నారు.

నీకేమైనా మతిపోయిందా అంటున్నాడు చక్రవర్తి.

ఎందుకలా కేకలు వేస్తారు? అంది సుందరమ్మ.

ఇంకో రెండు నిమిషాలకల్లా వాద ప్రతివాదాలు ఉన్నతస్థాయి నందుకున్నాయి. సుందరమ్మ వాక్యాలకి ఒక్కరవ్వ ఏడుపు రంగు వేసింది. చక్రవర్తి మాటలు కంచుగంటల్లా నిర్దాక్షిణ్యంగా ఖంగున మోగుతున్నాయి. చింతనిప్పుల్లా కణకణ మంటున్నాయి.

అసలు నీకు నాలుగు వందల లెక్కడివంటా...

నేను అడపా దడపా వెనకేసుకున్నదీ, గొలుసూ వెండి చెంబూ అమ్మగా వచ్చిందీ మూడు వందలయింది. నా ముచ్చట చూసి జాలిపడి సుబ్బారావుగారి మావయ్యగారు ఓ వంద అప్పిచ్చారు. అదీ నేనే తీర్చుకుంటా లెండి అంది సుందరమ్మ విసురుగా....

ఈ మాటలు తోటలో ప్రతి వాటాకి వెళ్ళి తలుపు తట్టి చెప్పినట్టు వినబడ్డాయి అందరికీ. సుబ్బారావుకి కూడా వినపడ్డాయి. అదా కథ అనుకున్నాడు.

మావగారు అద్దె కట్టేసి ఇంటిలో కొచ్చేసరికి దీపం తగ్గించి ఉంది.

ఆయన భోం చెయ్యరట. నువ్వు తింటే రా నాన్నా వడ్డిస్తాను అంది సుబ్బారావు భార్య.

అక్కర్లేదు అంటూ ఆయన పక్క మీద మేనువాల్చి గుడ్డిదీపంలోని దీపకళికను చూస్తూ పడుకున్నాడు. అదన్నమాట కథ అన్నాడు సుబ్బారావు.

ఇంకేం కథ, డబ్బు వాడి ఎదాన పారేశానుగా? అన్నాడు మావగారు గోడవయిపు తిరిగి పడుకుంటూ.

సుందరమ్మగారి కారు కథ లెండి. కారు బావుంది. మీరు పాపం జాలిపడ్డారటగా.... వడ్డీకయితేనేం వంద రూపాయలు అప్పిచ్చారటగా.... అన్నాడు సుబ్బారావు మెల్లిగా. మావగారు బదులు చెప్పలేదు.

ఓ పావుగంట గడిచింది. భార్యకి నిద్ర పట్టిందని గమనించి, సుబ్బారావు మళ్ళీ అందుకున్నాడు. ఎందుకండీ, మీకీ బుద్ధులు, పెద్దలు కదా అన్నాడు.

కాలిపోయిన ఇల్లు శిథిలాలలోంచి పొగ లాగా, చీకటిలో మొహం చాటు చేసుకున్న మావగారి హృదయంలోంచి నాలుగయిదు వాక్యాలు వచ్చాయి. చాలా తాపీగా, నిర్వికార స్వరంతో చెప్పాడాయన. ఆయన భార్య ఉండగా ఏ లోటూ రానివ్వలేదు. తను సంపాదించినా మానినా ఇంత వండి పడేసేది. ఈనాడు తను వంటరి పక్షి అయిపోయి ఈ అల్లుడి నీడన బతుకుతున్నాడు. మళ్ళీ తన ఇల్లు అని ఒక ఏర్పాటు చేసుకోవాలని ఆశ అంకురించింది.

అప్పుడప్పుడు నాకే సిగ్గేస్తుంది. నామీద నాకే అసహ్యం కలుగుతుంది.

అయినా, అంకురించిన ఆశ చావటంలేదు. ఇకనయినా నా కాళ్ల మీద నిలబడి ఇల్లు నిలబెట్టుకుందామన్న ఊహతోటే, డబ్బు కక్కుర్తికి పాల్పడుతున్నాను. బాబూ నీ రుణం ఎలాగైనా తీర్చుకుంటా అన్నాడు.

మావగారు ఇంత మధన పడుతున్నాడని సుబ్బారావుకి తెలియదు. అతనికి జాలి వేసింది. చీకటి ఆసరా చూసుకుని ఇటువంటి సంగతులు తనకి చెప్పినందుకు కొంత రోత కలిగింది. మాట్లాడకుండా అటు తిరిగి పడుకున్నాడు. ఒక నిమిషం ఆగి, జరిగించి మర్చిపోండి మావగారూ అన్నాడు – మెల్లిగా.

☆ ☆ ☆

తెల్లవారేసరికి నరసమ్మగారూ పిల్లలూ లేచి, ముచ్చటగా అలంకరించుకొన్నారు. నరసమ్మగారు పిన్నిగారింటికి వెళ్ళింది కాని అప్పుడగలేదు. అవతల వీధిలో పెళ్ళి జరుగుతోంది. భోజనాలకి పిలిచారు. పిన్నిగారు కూడా వస్తుందా అని అడగబోయింది. పిన్నిగారు రానంది.

నరసమ్మ బనారసు పట్టుచీర రెపరెపలాడేట్లు తిప్పుకుంటూ వెళ్ళింది. పిన్నిగారు వరండా ఊడుస్తున్న సుందరమ్మని చూసి నవ్వింది. నరసమ్మకి ఉన్న పట్టుచీర ఒక్కటే అని పిన్నిగారు ఏనాడో పసిగట్టింది. అదే పెళ్ళిళ్ళకీ, పేరంటాలకీ కట్టుకు వెళ్తుందని చాలాసార్లు సుందరమ్మకు చెప్పిందావిడ లోగడ.

తన నవ్వు చూసి సుందరమ్మ గ్రహించి ఏకీభవిస్తుందని ఆశించింది కాని సుందరమ్మ నవ్వలేదు. లోపలికి వెళ్ళి కాఫీనీళ్ళు పడేసింది. పిన్నిగారికి మనస్సు చివుక్కుమంది. ఆవిడకి క్రితం రాత్రి 9 గంటల నించి మనసు చివుక్కుమంటూనే ఉంది. ఈ తోట అంతకీ చాలా ఖరీదైన కోరికలు తమ ఇద్దరివే. తనదే ఒక్కరవ్వ ఎక్కువ. అయితే తను మేడ కొనేలోగా సుందరమ్మ కారు కొనెయ్యడంతో కారుగల

సుందరమ్మతో సరసాలాడడం అనేది హఠాత్తుగా ఆవిడ జీవిత పరమావధి అయి ఊరుకుంది.

ఏం సుందరమ్మా, కాఫీ పొడుం కావాలా? అంది లాలనగా.

నిజంగా కావలసినా కాస్త టెక్కు చూపించింది సుందరమ్మ. అబ్బే వద్దండీ. కారుందిగా. కారులో అలా పోయి ఏ హోటల్లోనో కాఫీ తాగేసి ఆ చేత్తో కూరలు కొనుక్కు చక్కా వస్తాం అంది.

కోపంగా వున్న చక్రవర్తికి ఒళ్ళు మండింది. అబ్బే ఎందుకూ కారుంది కాబట్టి, అందులో పెట్రోలు తీసుకొని చెరికాస్తా తాగేద్దాం ఈ పూటకి. అవక ఏ టైరో వండుకుని తినేద్దాం అన్నాడు మెల్లిగా.

మొత్తానికి పిన్నిగారు మళ్ళీ నాగపూరు కప్పతో నాగపూరు కప్పడు కాఫీ పొడుం ఇచ్చింది.

కాఫీ తాగి చిరాకు పడుతూనే మార్కెట్టుకి బయలుదేరాడు చక్రవర్తి. అతనికి తోటలో తలెత్తుకు తిరగడం సిగ్గుగా ఉంది — తన గదిన్నర వాటా ఎదుట కారు ఉంచుకున్నందుకు. చక్రవర్తి రోడ్డెక్కే సరికి సుబ్బారావు కనబడ్డాడు.

రాత్రి తమ తమ స్వర్గసీమలలో జరిగిన రభసలు రట్టు అయిన సంగతి ఇద్దరికీ తెలుసు. సూటిగా చూసుకుందికి ముందు సిగ్గుపడ్డారు. హఠాత్తుగా ఇద్దరూ ఒకే క్షణాన తెగించి మొహామొహాలు చూసుకున్నారు. ఒకరి మీద ఒకరికి సానుభూతి, స్వంతానికి జాలి కూడా ఆ చూపులలో స్ఫురించాయి. తక్షణం ఆగి ఫక్కున నవ్వారిద్దరూ.

నాకు మావగారు, మీకు కారు అంది సుబ్బారావు నవ్వు.

మరే, నాకు కారు, మీకు మావగారు అంది చక్రవర్తి నవ్వు.

వస్తానండి.

మంచిది.

ఇటు అల్లుడు, అటు చక్రవర్తి కూడా ఒకే సమయాన బయటకు వెళ్ళడంతో సుబ్బారావు మావగారి బుర్ర చురుకుగా పనిచేసింది.

సుందరమ్మ దగ్గరకెళ్ళి తను అప్పిచ్చిన వంద కాక ఇంకో యేభై అర్జెంటుగా ఇవ్వమన్నాడు. సుందరమ్మ లాకేత్వం ఇచ్చింది. ఆయన ఇంటికొచ్చి ఆలోచనలో పడి కొన్ని గోళ్ళు కొరుక్కునేలోగా సుబ్బారావు తిరిగి వచ్చాడు.

మామగారూ మీరు రాత్రి కోపంలో డబ్బు అప్పు తెచ్చినట్టున్నారు. జరిగిందేదో జరిగింది గాని ఈ డబ్బు తీసికెళ్ళి ఆ అప్పు తీర్చెయ్యండి అన్నాడు బ్యాంకు నుండి తెచ్చిన నూటయాభయి చేతికిస్తూ.

మావగారు విస్తుపోయి మాట్లాడేలోగా సుబ్బారావు స్నానానికి వెళ్లిపోయినందువల్ల ఆయన ఆ ప్రయత్నం మానుకొని, తను సంకల్పించిన కార్యాచరణకు ఉపక్రమించాడు.

నాందిగా పాతిక రూపాయలు వేరే తీసి మొలలో దోపుకున్నాడు. నూట పాతిక పట్టుకొని జానకి వాటాలోకి వెళ్ళాడు.

రాత్రి ఆమె చేసిన సహాయం జన్మజన్మలకు మర్చిపోనన్నాడు. నూట పాతిక చేతిలో పెట్టి ఇంక పాతిక బాకీ అని గుర్తుంచుకోవలసిందిగా హెచ్చరించాడు. మళ్ళా

కృతజ్ఞత ప్రకటించి ఆమె ఋణం తీర్చుకోలేనని చెప్పాడు. అయినా ఆ ఋణం తీర్చుకునేవరకూ నిద్రపోయేది లేదని ఉద్ఘాటించాడు.

అబ్బే దాని కోసం నిద్ర పాడుచేసుకోవడం ఎందుకండీ అంది జానకి వినయంగా.

అలా వల్లకాదు. నేను నీకు ఉపకారం చేసి తీరుతాను. చూడమ్మా.... నిక్షేపంలా వెళ్ళి ఈ పూటకి పాఠాలు చెప్పు... మధ్యాహ్నం మాత్రం సెలవుపెట్టి ఇంటికొచ్చేయి.... అబ్బే కాదనకు, నే తరవాత చెబుతానుగా. తప్పకుండా రావాలి సుమీ అంటూ హడావుడిగా వెళ్ళిపోయాడాయన. ఆ తర్వాత భోజనం కూడా చెయ్యకుండా సరాసరి అవతల వీధి కెళ్ళాడు. ఏ పెళ్ళివారి తాలూకో తెలియకుండా సందడిగా తిరుగుతున్న నరసమ్మని పిలిచాడు.

తప్పకుండా రావాలి సుమండీ! నా మీద ఒట్టే, పిల్లల్నిక్కడే ఉండనివ్వండి. సరిగ్గా ఒంటి గంటకల్లా వచ్చేయాలి అని చెప్పాడు. అలాగే అంది నరసమ్మ.

ఇంటికొచ్చి భోజనం చేశాడు. సుబ్బారావు ఆఫీసుకు వెళ్ళిపోగానే కూతుర్ని స్థిమితంగా కూర్చోబెట్టి సంగతి సందర్భాలు బోధపరిచాడు. కూతురు ఆశ్చర్యపడింది. గట్టిగా నచ్చచెప్పాడు.

ఫలహారాలు చెయ్యమని పురమాయించి, కండువా వేసుకుని రాచకార్యాలు చక్కబెట్టుకోవడానికి బయలుదేరాడు. ఒంటిగంటన్నరకి ఇంటికి వచ్చిన జానకి, సుబ్బారావు మావగారిని చూసి ముక్కు మీద వేలువేసుకుంది. పూలరంగడల్లె పెళ్ళికొడుకల్లె ముస్తాబై పోయాడాయన.

వచ్చావా.... సెలవిచ్చారన్నమాట. పది నిముషాలు కూర్చో తొందర లేదులే అన్నాడు.

తొందర దేనికి? అంది జానకి.

మరే. తొందర దేనికీ.... తొందరేం లేదు. చూడమ్మా.... కాస్త మొహం రుద్దుకొని తల దువ్వుకో.... ఏం ఇష్టం లేదా.... పోనీ వద్దులే. అలాగే బాగున్నావు. మహాలక్ష్మిలాగ అన్నాడు. జానకికేం అంతుపట్టలేదు.

జానకమ్మా.... ఇలా రామ్మా అంది నరసమ్మగారు సరికొత్త పట్టుచీర రెపరెపలాడేట్టు నడుస్తూ. జానకి జవాబిచ్చేలోగానే వచ్చి రెక్క పుచ్చుకొని సుబ్బారావు ఇంట్లోకి తీసుకు వెళ్ళిపోయిందావిడ. లోపల చిన్న జంబుఖానా పరచి ఉంది. మూడు కుర్చీలు వేసి ఉన్నాయి. జానకిని కూర్చోబెట్టి సుబ్బారావు భార్య మంచీ చెడ్డా మాట్లాడింది.

సుందరమ్మగారి కారు చూశారా అంది. చక్రవర్తిగారిని బళ్ళో హేళన చేస్తున్నారా అని అడిగింది. జానకి జాలితో నవ్వి మరేనండి అంది.

అప్పుడే బళ్ళో అందరికీ తెలిసిపోయింది. కారులో రాలేదేం అనీ, కారు కొన్నారా అనీ అంతా హేళనగా అడుగుతున్నారు. పాపం ఆయన చాలా చిరాకు పడిపోతున్నారండీ. వెధవ మనుషులు ఎవరి దారిన వాళ్ళని బతకనియ్యరు. అయినా కారు కొంటే వీళ్ళకెందుకో అని చిరాకు పడింది.

మరే మరే అన్నాడు సుబ్బారావు మావగారు. అదుగో వచ్చారు! అన్నాడు ఒక్క క్షణం ఆగి.

ఒక నిమిషం తరువాత 36 ఏళ్ళ రామారావుగారొకరు, 30 ఏళ్ళ లక్ష్మీకాంతమ్మ ఒకామె వచ్చారు. రామారావుగారు సుబ్బారావు మావగారికి ఏడాది నుంచి ఆప్తమిత్రుడు, కుడిభుజం, పంచప్రాణాలూ మొదలైనవిగా ఉంటున్నాడు. ఆయన చెల్లెలు ఈయనకి దేవతా, ప్రపంచం, జీవితం, జీవిత పరమావధి మొదలైనవిగా ఉంటోంది. జీవిత భాగస్వామినిగా ఉండాలని ఈయన ప్రగాఢ వాంఛ. ఆవిడ పెట్టే బట్టల కొట్టుని సవ్యంగా లాభసాటిగా నడపడానికి ఈయన ఒప్పుకుంటే ఆవిడా ఒప్పుకుంటుందట. అయితే మడత పేచీ ఒక్కటుంది. ఆవిడ సోదరుడైన రామారావు కూడా కొంత కాలంగా అవివాహితుడే. ఆ కొంతకాలంలోనూ ఆయన జానకిని చూసి ముమ్మరంగా ప్రేమిస్తున్నాడు. ఆవిడను వివాహం చేసుకోవాలని అహోరాత్రులు తపస్సు చేస్తున్నాడు. ఐదారుసార్లు ఒంటిపూట భోజనం చేశాడు. సుబ్బారావుగారి మావగారు అదెంతపని అన్నాడు. అదేదో సాధిస్తే మీ పెళ్ళి ఖాయం. ఇద్దరం ఇలసాటిలేని జంటలలా ఉండవచ్చును అన్నాడు రామారావు.

ప్రధానానికి ముహూర్తం పెట్టుకోవడానికే వాళ్ళు వచ్చారు. జానకికి ఈ బృహత్కథ తెలియదు. ఎవరో వచ్చారని లేచి పోబోయింది. ముగ్గురు మనుషులు ముక్తకంఠంతో ఆమెను వారించి కూర్చో పెట్టారు.

సుబ్బారావు భార్య ఫలహారాలూ కాఫీ పట్టుకొచ్చి అందరికీ ఇచ్చింది. అదీ ఇదీ, మంచీ, చెడ్డా మాట్లాడుకుంటూ తింటున్నారు. జానకి మాట్లాడటమూ లేదు, తిననూ లేదు.

నరసమ్మగారు ఇది గమనించింది. తినమ్మా సిగ్గెందుకు? అని లాలించింది. ఆ క్షణాన ఆమె జానకికి దొడ్డమ్మ భూమిక నిర్వహిస్తోంది. సుబ్బారావు మావగారు అంతకు ముందు చెప్పిన పాఠం ప్రకారం ఆవిడ జానకిని చనువుగా మందలించి తిను ఫరవాలేదు అంటూ అంది. ఆ లాలనలో ఆవిడ చేతి కాఫీగ్లాసు కాస్త కదలాడి ఓ గుక్కెడు కాఫీ ఆమె కట్టుకున్న నీలం పట్టుచీర మీద పడింది.

అయ్యో, అయ్యో! అంది నరసమ్మగారు. అంతా తుళ్ళిపడి చూశారు.

నేనేం చేతునమ్మా, పొరపాటున పడింది వెంటనే కాసిని నీళ్ళు పోసి కడిగేస్తే డాగు పోతుందమ్మా అంది సుబ్బారావు భార్య వంక భయంతో చూస్తూ.

మరేం ఫరవాలేదండీ. ఆనక కడిగెయ్యొచ్చు అంది సుబ్బారావు భార్య నిర్లక్ష్యంగా.

ఏమోనమ్మా నీ ఇష్టం నేను చెప్పడం చెప్పాను. మధ్య నాకెందుకు. పాడయ్యేది నీ చీరేగా అంది నరసమ్మగారు.

ఒక్కసారిగా అంతా ఫెళ్ళున నవ్వడం చూసి విస్తుపోయిందావిడ. సుబ్బారావుగారి మావగారు గొంతు సవరించుకున్నాడు – అసలు వ్యవహారం పరిష్కరించడానికి.

ఏమోయ్ రామారావూ నీకు నచ్చినట్టేగా. మా పిల్ల ముద్ద బంగారం అనుకో. ముల్లోకాలూ గాలించినా ఇంతటి సాత్వికురాలు నీకు దొరకదు అన్నాడు.

నిజమేనండి. మాలక్ష్మి కళ ఉట్టిపడుతోంది అంది లక్ష్మీకాంతమ్మ. జానకి తెల్లబోయి చూసింది.

జానకమ్మా! వీడు నా తమ్ముడు వంటి వాడనుకో. బహు యోగ్యుడు. నీకు అత్తమామల బెడదా, పిల్లల బెడదా ఉండదు. అడపడుచు ఉంది కాని, ఆ పిల్లకి

నేడో రేపో పెళ్ళయి అత్తారింటి కెళ్తుందనుకో.... అన్నాడు సుబ్బారావు మావగారు.

మరే, అదెంతసేపు, దానికో సంబంధం స్థిరపడిపోయినట్లే. పెళ్ళికొడుకు సిద్ధంగా ఉన్నాడు అన్నాడు రామారావు వికవిక నవ్వుతూ. సుబ్బారావు మావగారు సిగ్గుపడిపోయాడు. ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ తల వంచుకున్నాడు. జానకి లేచి నిలబడింది.

అరె, లేచిపోతున్నావేం? అంది నరసమ్మగారు – అంతా తుళ్ళిపడి చూశారు.

ఏమిటండీ ఈ గోలంతాను? ఏనుంది రమ్మన్నదిందుకా? నా కెవ్వరూ పెళ్ళి సంబంధాలు చూడనక్కరలేదు. నా ఏడుపు నేను ఏడుస్తాను అని చరచర వెళ్ళిపోయింది. వెళ్ళి తన గదిలో పడుకుని ఏడవసాగింది. కొంతసేపు యేడ్చాక మనసు తేలికపడింది. ఆలోచనలనేవి ఒక్కొక్కటి అతి నెమ్మదిగా, విశ్శబ్దంగా జంకుతున్నట్టు రావడం మొదలుపెట్టాయి. నా అన్నవాళ్ళు లేక గదా నాకీ అవస్థ అనుకుంది. పలకరించిన ప్రతి మొగాడూ పెళ్ళి చేస్తాననడమో, చేసుకుంటాననడమో తప్ప మరో రకంగా మాట్లాడడు. అదోరకంగా చూస్తాడు ప్రతివాడూ.... జానకికి భయం వేసింది. ఆలోచిస్తూ వుండగా లీలగా నిద్ర వచ్చింది. సాయంత్రం ఐదింటికి మెలకువ వచ్చి, లేచి వరండాలోకి వచ్చింది జానకి.

తోటంతా స్మశానవాటికలా నిర్జీవంగా కనబడింది. ఈ పెడ వాళ్లంతా షికార్లకి వెళ్ళినట్టున్నారు... బుర్‌మని కారు శబ్దం వినబడింది. టాపులేని పాత ఆస్టిన్ డొక్కులో బిక్కమొహం పెట్టుకున్న చక్రవర్తి, టెక్కు వొలకబోస్తున్న సుందరమ్మ షయిరుకి వెళుతున్నారు. సుందరమ్మ ఎర్రటి చీర కట్టింది. దానికి జోడుగా మహా వికృతమైన నల్లరంగు రవికను వేసుకుంది. పూలు ముడిచింది. పయిగా పెద్దపెద్ద నల్లద్దాలున్న కళ్ళజోడు తగిలించుకుంది.

జానకి సానుభూతితో నవ్వింది. కారుని భయపడుతూ నడుపుతున్న చక్రవర్తిని చూసి పాపం అనుకుంది. అంతలో ఆమె దృష్టి ఎదుట మేడ మీదికి పోయింది. పైన వీర్రాజు కిటికీ దగ్గర విచారంగా నుంచుని సిగరెట్టు కాలుస్తూ కారులో జంట వంక చూస్తున్నాడు.

పాపం అని మళ్ళీ అనుకుంది జానకి. చక్రవర్తి దురవస్థ తనకి పట్టలేదే అని వీర్రాజు బెంగ పెట్టుకున్నాడనిపించింది. అంతలో క్రితం రాత్రి అప్పు తెచ్చిన డబ్బు సంగతి జ్ఞాపకం వచ్చి, లోపలికెళ్ళి డబ్బు తీసుకుని మేడ ఎక్కింది.

వీర్రాజు కొంచెం కంగారు పడ్డాడు ముందు – ఆపైన ముగ్ధుడయి పోయాడు. జానకి ఇచ్చిన డబ్బుని పరాకుగా అందుకున్నాడు.

ఏవండీ వంట్లో బాగులేదా? అంది జానకి.

వంట్లో బాగానే ఉందండి.... మనసే బాగులేదు అన్నాడు వీర్రాజు కిటికీ వంక చూస్తూ.

అతని మనసు ఎందుకు బాగులేదో తెలుసుకోవాలని జానకికి కుతూహలం లేదు. తను యధాలాపంగా కుశలం అడిగితే అతను అలా జవాబివ్వడం జానకికి నచ్చలేదు. క్రిందకి వెళ్ళిపోబోయింది.

ఇప్పుడే ఓ పెద్ద కుట్రలోంచి బయట పడ్డానండి అన్నాడు వీర్రాజు ఆమె వంక చూడకుండానే. జానకి వెళ్ళిపోలేదు. ఏం కుట్ర? అని అడగనూ లేదు.



నాకీ నాలుగిళ్ళు ఉండడం, నా అన్నవాళ్ళు దగ్గర్లో లేకపోవడం చూసి, అడ్డమయిన వాళ్ళూ నాకు పెళ్ళి చెయ్యాలని కంకణం కట్టుకున్నారండి.... మధ్యాహ్నం ఒక పరిచితుడు పనుందని వాళ్ళింటికి తీసుకెళ్ళి ఓ రాక్షసి పిల్లని చూపించి నచ్చిందా అని అడిగాడండి. ఆడా మగా ఇరవై మంది నా వంక శ్రద్ధగా చూస్తున్నారు. చికాకు పడి లేచి వచ్చేశానండి అన్నాడు వీర్రాజు.

జానకికి ఒక్కసారి గుండె కొట్టుకుంది. సరిగ్గా ఆ వేళకే తన మీద ఇక్కడ కుట్ర జరిగిందని చెప్పబోయి, తమాయించుకుంది.

ఈ ప్రపంచంలో ఒక్కళ్ళం ఉండడం మహాకష్టమండి. ఎవరి దారిన వాళ్ళు బతకరు. ఇంకోళ్ళని బతకనివ్వరు. ఒక్కొక్కసారి భయమేస్తుంది అన్నాడు వీర్రాజు.

జానకి గుండె కొట్టుకుంది. తన భావాలని పైకి చదివేస్తున్నాడు. ఆ ముక్క చెప్పాలని అనుకుంది. క్షణంలో సగంసేపు వీర్రాజు ముఖం లోకి పరీక్షగా చూసింది. అతను హేళన చేయటం లేదు. సూటిగా తన వంక చూశాడు.

నిజమేనండి.... వస్తా అని క్రిందికి బయలుదేరింది జానకి.

జానకీ అని పిలిచాడు వీర్రాజు. కంఠస్వరం మారింది. భయపడుతూనే జానకి వెనక్కి తిరిగింది.

నా ఆత్మకథ సరదాగా చెప్పలేదండీ, నాకు మీమీద గౌరవం, నమ్మకం, గురి ఉన్నాయి. అందుకని మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటే, నేను సుఖపడతాననీ, మిమ్మల్ని సుఖ పెట్టగలననీ అనుకుంటున్నాను అన్నాడు వీర్రాజు.

అంత హఠాత్తుగా ఇటువంటి సంగతి చెప్పడంతో జానకి ఎగిరి గంతెయ్యాలో,

ఏడ్చి మొత్తుకోవాలో, ఛీత్కరించుకోవాలో చటుక్కున నిర్ధారణ చేసుకోలేకపోయింది. ఒక్క క్షణం తరువాత ఆమెకి కోపం వచ్చింది. బళ్ళో హెడ్మాష్టరు, సెక్రటరీ, కొందరు టీచర్లు, ఇక్కడ సుబ్బారావు మావగారూ అందరూ తనని ఈ సంగతి ఎత్తి వేధించారు. ఇపుడు ఇతనూ అదే చేశాడనిపించింది. మీరూ ఇంతేనా అని గొణుక్కుంటూ చరచర మేడ దిగిపోయింది.

వీర్రాజు కుర్చీలో కూలబడి ఏకబిగిని పది సిగరెట్లు కాల్చి బాధపడ్డాడు.

తెలివైన దానివనీ తూచి మాట్లాడుతానవనీ అనుకునే జానకి తొలిసారిగా తప్పు చేసినట్లు మథనపడింది....

చక్రవర్తి రథం తిరిగి తిరిగి తొమ్మిది గంటలకి కొంప చేరేసరికి తోటలో నిద్రపోతున్న కొద్దిమందికి మెలకువ వచ్చింది. చక్రవర్తి ఇంట్లోంచి నవ్వులు స్ఫుటంగా వినబడ్డాయందరికీ.



సుందరమ్మ అమాయకత్వం చూసిన కొద్దీ చక్రవర్తికి ఒక వంక కోపం తగ్గిపోయి, మరొక వంక ప్రేమ ఇనుమడిస్తోంది.

ఆ సాయంత్రం దుకాణానికి వెళ్ళి పెద్దపెద్ద చీరలన్నీ బేరమాడి ఒక జేబురుమాలు రూపాయపెట్టి కొంది. ఇంకోచోట ఏవో నాలుగు సామానులు కొని కారులో పడెయ్యమంది షాపువాడ్ని.

ఏ కారులో నండి అని అడిగాడు అతడు.

పెద్ద పెద్ద కారుల మధ్య, కాంతులీనే కారుల మధ్య ఉన్న తన చిన్న పాత కారును చూసి సిగ్గు వేసింది సుందరమ్మకి. అదుగో ఆ డొక్కు కారు లేదూ... చిన్నది, అందులో పడెయ్యండి... అంది. మళ్ళా ఏం తోచిందో... ఆ కారు మా డ్రైవరుది లెండి. మాది రిపేరుకెళ్ళింది అనేసింది.

పక్కనే ఉన్న చక్రవర్తి బలవంతాన నవ్వు ఆపుకున్నాడు. ఇంటికి వస్తూండగా చక్రవర్తి ఎత్తి పొడిచాడు. కారు డ్రైవరుదన్నావు, రేప్పొద్దున, ఈ పట్టుచీర నీ దాసీదాని దంటావు. మరి నేనో? అన్నాడు నవ్వుతూ.

అరచేతితో చక్రవర్తి నోరు మూసి ఛ ఏం మాటలండి.... అంది సుందరమ్మ....

కొంచెంసేపు తరువాత, చక్రవర్తి కారును కుడివేపు తిప్పాలనుకున్నాడు. అలవాటు ప్రకారం దైవం అన్యథా సంకల్పించాడు. స్వతంత్ర భావాలు గల కారు, మురారేః తృతీయః పంథాః అనుకుంది. అది మలుపు అయినందువల్ల చక్రవర్తి బ్రేకు వేసేలోగా ఒక చెట్టు దగ్గరకు వెళ్ళి దాన్ని కూలత్రోయ్యపోయి గట్టి ప్రయత్నం చేయకుండానే ఊరుకుంది. పది రూపాయలు ఖర్చు పెట్టాక, చక్రవర్తీ, సుందరమ్మా కారుని ఇంటికి తీసుకొచ్చారు.....

అందుకని.... అందమయిన ఓ సుందరమ్మా – ఈ కారు లేకపోతేనే మనం ఆనందంగా ఉండగలం. కాస్త డబ్బు కూడబెట్టుకున్నాక మంచి కారు కొందాం. అందాకా దీన్నే ఉంచుకుందామంటే మన ఆర్జన అంతా దీనికే అర్పించి, కడుపులో కాళ్ళు ముడుచుకొని పడుకోవాలి. బోధపడిందా? అన్నాడు చక్రవర్తి లాలనగా. అప్పటికి ఏడుపు పర్యంతం అయిన సుందరమ్మ సరే అంది.

దీన్ని అయినకాడికి అమ్మేద్దాం.... బహుశా మనింటాయన వీర్రాజు కొనవచ్చును అన్నాడు చక్రవర్తి.

☆ ☆ ☆

పీడకలలతో మధురస్వప్నాలతో అనుమానాలతో భయాలతో గడిచింది శనివారం రాత్రి. అందంగా, ఆనందంగా, వికారంగా, విచారంగా నలుగురికీ నానా రకాలుగా ఆదివారం ఆ తోటలో ఉదయించింది.

కొద్దిసేపటిలోనే, సుబ్బారావు మావగారు నరసమ్మ ఇంట్లోకి వెళ్ళాడు. నిన్న మధ్యాహ్నం పెళ్ళిచూపుల విషయం మూడో ప్రాణికి చెప్పవద్దు. చెప్పకుండా వుంటే నిన్న మా అమ్మాయి ఎరువు ఇచ్చిన పట్టుచీర అచ్చంగా మీకే ఇస్తాను అన్నాడు.

అలాగేనని తలూపింది నరసమ్మ. ఊపిందే కాని తను బ్రహ్మాండమైన రహస్యం కాపాడుతున్నదన్న ఆలోచనలో ఉక్కిరిబిక్కిరై పోయింది. కాలు నిలవటం లేదు. ఇంకో అరగంటలో ఇంకో కొత్త సంగతి వింది. వీర్రాజు వూరికెళ్ళిపోతున్నాడు. ఐదారు నెలల వరకు రాడట. అద్దె డబ్బు క్రింద వాటాలో ఉన్న పెద్దమనిషి గారికి ఇవ్వవలసిందని, ఆయన తనకు బట్వాడా చేయిస్తాడనీ అందరికీ చెప్పేశాడు. వీర్రాజు జానకి ఇంటికి వెళ్ళలేదని నరసమ్మ పసిగట్టింది.

పిల్లా పిల్లా వీర్రాజు దేశాంతరం వెళ్తున్నాడు తెలుసా? అంది గబగబా వెళ్ళి. జానకి ఆశ్చర్యపడింది. అలాగా అని, మళ్ళా తలవంచుకుని పని చేసుకొనసాగింది.

నరసమ్మగారికి ఉత్సాహం చల్లారిపోయింది. అమ్మడూ. ఓ రూపాయి అప్పిస్తావూ? అంది. జానకి జవాబివ్వకుండా లేచి రూపాయిచ్చింది. ఇలా సులువుగా రావడం నరసమ్మకి మరీ నిరుత్సాహం కలిగించింది. సరాసరి తోటలో నాలుగైదిళ్ళకు వెళ్ళి బియ్యం అప్పడిగింది. అంతా లేదన్నారు. ఇలాంటి రాక్షసులకు నేను రహస్యం ఎందుకు చెప్పాలీ అనుకుంది. ఆఖరు సారిగా సుందరమ్మ ఇంటికి వెళ్ళి అడిగింది. సుందరమ్మ ఏ కళనుందో ముందర బియ్యం ఇచ్చింది. వెంటనే నరసమ్మకి అప్పురాలై పోయింది.

ఆఖరుకి మీ పొరుగింటి పిన్నిగారికి కూడా చెప్పకేం అని మరీ మరీ హెచ్చరించి, జానకమ్మ పెళ్ళిచూపుల ముచ్చట చెప్పేసింది. పిన్నిగారు తడిక అవతల చలనం లేకుండా కూర్చుని వింది.

వరసమ్మ వెళ్ళిపోగానే సుందరమ్మ దగ్గిరికి వచ్చి తడకవతల నుండి విన్న సంగతి తనకి చిన్నప్పటి నుండి తెలిసినట్లుగా చెప్పి, జానకి మీద జాలి వొలకబోసింది.

జానకి వీర్రాజును చేసుకుంటే బాగుండును అనేసింది చటుక్కున. అంతలోనే వాలిక్కరుచుకుంది. వీర్రాజు ఊరెళ్ళబోతున్నట్లు తెలిసిన మరుక్షణంలో అతనున్న వాటా తన కివ్వమని అడిగి మాట తీసుకుంది. మేడ కట్టకపోయినా, కనీసం కొనకపోయినా, ఈనాటికి మేడింటిలో అద్దె కయినా దిగే అదృష్టం పట్టింది గదా అని మురిసిపోయింది. అందులో నిన్నగాక మొన్న కారు కొన్న సుందరమ్మ కళ్ళ ఎదుట తను మేడలోకి మారడం అంటే మజాకా కాదు. ఆవిడ మాటలకి భర్త ఎన్నడూ కాదనలేదు. సుబ్బారావు మావగారిని పేరు లేకుండా సుబ్బారావుగారి మావగారని చెప్పుకున్నట్టే, పిన్నిగారి భర్తని పిన్నిగారి భర్తే అని చెప్పుకోడం పరిపాటి.

ఇప్పుడు వీర్రాజుకీ జానకికీ పెళ్ళయితే మేడ మీద వాటా ఖాళీ అవదు. అందుకని పిన్నిగారు తూనా బొడ్డు అనుకుని వెళ్ళిపోయింది. సుందరమ్మకి మాత్రం పిన్నిగారి సూచన ఆలోచనలు రేపింది. జానకీ వీర్రాజూ పెళ్ళి చేసుకుంటే తన కారు వాళ్ళకే అమ్మెయ్యవచ్చు. అప్పుడు అది తన కళ్ళ ఎదుట పడి ఉంటుంది. అడపా దడపా అడిగి తీసుకుంటూ ఉండవచ్చు.... అదీగాక, జానకి పెళ్ళిచూపుల ఉదంతం విన్న తరువాత, ఆవిడకి జానకి మీద ఒక విధమైన వాత్సల్యం కలిగింది....

ఆదివారం కాబట్టి ఆ రోజు మధ్యాహ్నం సుందరమ్మ చక్రవర్తికి ఇష్టమైన ఫలహారం చేసింది. మీగడ తరకయినా పడకుండా బహు జాగ్రత్తగా కాఫీ చేసింది. సిగరెట్టు అందించింది. అగ్గిపుల్ల వెలిగించింది.

ఏవండీ, కారుండే ఆఖరి ఆదివారం యిదే. మళ్ళా ఆదివారం నాటికి కారెలాగా అమ్మేస్తాం. అందుకని సినిమా కెళదాం అంది. భార్య పూర్తిగా దారికి వచ్చినందుకు ఆనందిస్తున్న చక్రవర్తి సరేనన్నాడు.

తనకి రహస్యం చెప్పి, అప్తురాలైన నరసమ్మనీ, ఖరీదైన కోరికలు గల పొరుగింటి పిన్నిగారినీ, బ్రతిమాలి బామాలి జానకమ్మనీ వెంటబెట్టుకుని ఐదున్నరకల్లా కారులో కూర్చుంది సుందరమ్మ. వీర్రాజు వెళ్ళే వేళకి అక్కడే వుండి బాధపడటంకన్నా ఇంకెక్కడికి పోయినా నయమేనని ఒప్పుకుంది జానకమ్మ.

కారు బయలుదేరుతూ వుండగా సుబ్బారావుగారి మావగారు ఎదురొచ్చాడు. జానకిని ఎవరేనా ఎక్కడికేనా తీసుకెళ్తున్నారంటే ఆయనకి భయం. నేడు కాకపోతే రేపైనా తన మాటకి ఒప్పించవచ్చునని గట్టి నమ్మకం ఉంది. అందుకని జానకిని వదలడం ఇష్టంలేదు.

షికారుకా? అన్నాడు.

కాదండి సినిమాకి అన్నాడు చక్రవర్తి.

దేనికి?

చక్రవర్తి చెప్పాడు.



నేనూ వస్తా, చూడాలనుకుంటున్నా అన్నాడు సుబ్బారావు మావగారు. తప్పనిసరిగా ఆయన్ని ఎక్కించుకున్నారు కారులో.

సినిమా మొదలు కావడానికి కొంచెం సేపుందనగా సుందరమ్మ జానకిని ఒకప్రక్కకి తీసుకెళ్ళింది.

జానకమ్మా, మీ అక్కవంటిదాన్ని నేను. ఒక్క సంగతి అడుగుతాను. మర్మం లేకుండా చెప్పు. వీర్రాజుని చేసుకోవడం నీకిష్టమేనా? అంది. జానకికి నోట మాట రాలేదు.

చెప్పు ఫరవాలేదు: నిన్న పెళ్ళిచూపుల ముచ్చట విన్నానులే అమ్మాయ్. ఒంటరిగా ఉన్నంతకాలం మనుషులకి తుంటరి ఊహలు వస్తూనే ఉంటాయి. నా మాట విని, నీకు అతను నచ్చితే చేసుకో... అంది సుందరమ్మ.

ఆయన మిమ్మల్ని కూడా అడగమన్నారా? అంది జానకి తల వంచుకుని.

ఇదివరకోసారి అడిగాడా ఏమిటి? నువ్వేమన్నావు? ఒద్దన్నావా?.... అయ్యో పిచ్చి పిల్లా.... ఎంతవెర్రి పని..... అందుకే నన్నమాట అతను ఊరెళ్ళిపోతున్నాడు..... ఇప్పుడు చప్పున చెప్పు జానకీ. వేళ మించిపోతోంది అంది సుందరమ్మ తొందరపడుతూ.

ఔనక్కయ్యా అంది జానకి చెంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ.

ఇక్కడ ఏడిస్తే నవ్వుతారు. ఏడవకు. వెంటనే ఇంటికెళ్ళిపోదాం ఉండు అంటూ సుందరమ్మ హాలులోకి వెళ్ళి చక్రవర్తిని పిలిచి సంగతి చెప్పింది. మంచి పని చేస్తున్నారండీ మీరు. అతను యోగ్యుడు మీరు సుఖపడతారు అన్నాడు చక్రవర్తి.

నాలుగు నిమిషాలలో అంతా సినిమా మానుకుని కారులో ఎక్కారు. సుబ్బారావుగారి మావగారు జానకి కోసం వచ్చాడు కాబట్టి ఆయనకి సినిమా పట్టింపు లేదు. నరసమ్మకి సుందరమ్మ మాట ప్రస్తుతం వేదం. పిన్నిగారు ఒక్కర్తీ ఎలా ఉంటుంది – అందుకని అంతా బయలుదేరారు.

జానకి వీర్రాజుని పెళ్ళి చేసుకుంటోంది అనేసింది సుందరమ్మ పట్టలేక.

ఆశ్చర్యం సంతోషం కోపం మొదలైన రసాలతో నిండిన మాటలు ఒక్కసారి చెలరేగాయి. సుబ్బారావు మావగారికి ఇదేం సయించలేదు. పిన్నిగారికి నచ్చలేదు – మేడ మీద వాటా ఖాళీ కాదన్న ఆలోచన వల్ల. ఇరుకుగా ఉన్న ఆ కారులో కూర్చున్న అందరి ఆలోచనలూ, ఆశలూ వారి విశ్వాసాల్తో నిండి బయటకు వచ్చి కలగాపులగంగా కలిసిపోతున్నాయి. హోరున కురుస్తున్న వానలో కారు కంగారుగా పరిగెడుతోంది – రైలుకి బయలుదేరేలోగా వీర్రాజుని అందుకోవాలని.

కారు నడపడంలో అలవాటు, చాకచక్యం లేని చక్రవర్తి ఒక మలుపులో బ్రేకు నొక్కి, సకాలంలో క్లచ్ వెయ్యలేకపోవడంతో ఇంజను ఆగింది. దరిమిలా కారు ఆగింది. తొయ్యాలి అన్నాడు చక్రవర్తి.

ఎవరు తోసేది? నలుగు రాడవాళ్ళు, ఇద్దరు మొగాళ్ళు. బయట చూస్తే కుండపోతగా వర్షం. హోరు గాలి. జల్లు లోపలికి కొడుతోంది.

నాకసలే నీరసం. పైగా జ్వరం. కష్టపడలేను అన్నాడు – కారు కదలి వీర్రాజు వుండగా ఇల్లు చేరడం ఇష్టంలేని సుబ్బారావు మావగారు.

ఎవరూ మాట్లాడలేదు. పెద్దపెద్ద కారులు, ఖరీదయిన కారులు – తడిసిన తారు రోడ్డు మీద హంసలా జారిపోతున్నట్టు ప్రవహిస్తున్నాయి. కారులో ఉన్న ఆరుగురూ ఆలోచనలో పడ్డారు. అందరిలోనూ కోరికలు చెలరేగాయి.

సుబ్బారావు మావగారికి సుతరామూ ఇష్టం లేదు – కారు కదలడం. వీర్రాజు వెళ్ళిపోతే జానకిని ఎలాగేనా ఒప్పించవచ్చు. జానకిని ఒప్పిస్తే రామారావు చెల్లెలు కాంతను తన కులకాంతను చేసుకుని, ఇల్లు నిలబెట్టుకోవచ్చు. ఇదంతా జరిగి తీరాలి అని ఘోషించింది ఆయన హృదయం.

కారు చప్పున కదలాలని జానకి శరీరంలో ప్రత్యణువూ ప్రతి రక్తబిందువూ దృఢంగా ఆకాంక్షిస్తున్నాయి. వీర్రాజుని చేసుకుంటే అతని నీడలో తను నిశ్చింతగా ఉండవచ్చు అని ఆమె ఊహించింది. ఊహలు సాగిన కొద్దీ ఆకాంక్ష ప్రబలమవుతోంది. ఆశలు చెలరేగిన కొద్దీ భయం ఆవరిస్తోంది.

కారు తొందరగా వెళ్ళాలనీ, ఒక ఇల్లు నిలబెట్టిన అదృష్టం పట్టాలనీ సుందరమ్మ మనసు తొందరపడుతోంది. అప్పుడు కారు వాళ్ళకి అమ్మవచ్చు. అది తన కళ్ళ ఎదుటే ఉంటుంది. తను కొనుక్కోకపోయినా ఫరవాలేదు. భార్య బుద్ధి మళ్ళా అడ్డదారి పట్టేలోగా కారును వదిలించుకోవాలని చక్రవర్తి మనసు మహా ఆరాటపడుతోంది.

కారు కదిలి, వీర్రాజు బయలుదేరేలోగా ఇల్లు చేరితే జానకి పెళ్ళి ఖాయం. అప్పుడు తనకి మేడ మీద వాటా అద్దెకివ్వరు. వాళ్ళే ఉంటారు. తన కోరిక తీరదు. అందుకే కారు కదలకూడదు దైవమా అని పిన్నిగారు పరిపరి విధాలా దేవుణ్ణే బ్రతిమాలుతోంది.

కారులో కూర్చున్న నరసమ్మ పట్టుచీర వాన జల్లుకి తడిసిపోతుంది. ఈ కారు కదిలి, త్వరగా  ఇంటికి పోతే బావుండును భగవంతుడా అని ఆవిడ శతవిధాల పరమాత్ముడిని కోరుకుంటోంది.

ఆకాశంలో మెరుపు మెరిసింది. చక్రవర్తి మనసులో ఆలోచన మెరిసింది. బ్రేకు వదలి పెట్టాడు. గాలి హోరున వచ్చింది. కోరికలతో కిటకిటలాడుతున్న మనుష్యులతో కిటకిటలాడుతున్న జనతా  ఎక్స్‌ప్రెస్ కదిలింది.



★ ★ ★

# మహారాజా యువరాజా



ఇరువదవ శతాబ్దపు ఉత్తరార్ధంలో ఒకరోజు ఉదయం ఏడుగంటల వేళ విశాల భారతదేశంలోని ఒకానొక ఇరుకైన పెంకుటింటి గుమ్మంలో మధ్యతరగతి మహారాజా, యువరాజా నిలబడి పెద్దమ్మా అని ఏకగ్రీవంగా కేకవేశారు.

పెరట్లో చెంబులు తోముకుంటున్న పేదరాసి పెద్దమ్మ వచ్చి తలుపు బార్లా తీసింది. మహారాజా, యువరాజా లోపలకి వెళ్ళారు. పెద్దమ్మకి చెరో పక్కా చేరి చెరో చెవిలో చెరో రహస్యం చెప్పారు. పెద్దమ్మ ఇద్దరికీ చెరో చిరునవ్వూ ఇచ్చింది.

తరవాత మహారాజు ఇచ్చిన ఇత్తడి చెంబులో యువరాజు ఇచ్చిన ఫౌంటెన్ పెన్ పడేసి లోపలికి చక్కాపోయింది. మహారాజా యువరాజా ఎడమొహం పెడమొహం పెట్టి ఏదురెదురు గోడలు చూస్తూ నిలుచున్నారు.

మహారాజు పేరు ఎన్.జి.ఓ. యువరాజు పేరు పి.హెచ్.డి – అంటే ప్లాట్‌ఫారం హీరో డిజిగ్నేట్. ఈ సంక్షిప్త సంకేతాన్ని యువరాజు స్వయంగా కల్పించి తగిలించుకున్నాడు. దీనికి అతనే గర్వంగా వివరణ చెబుతాడు. అతని హితాభిలాషులూ, మిత్రులూ, పరిచితులూ, బంధువులూ, దూరపు బంధువులూ, తీరిక వేళలలో రోజూ ఈ మనిషిని చేరబిలిచి అతని దరిద్రాన్ని, దాన్ని పదిలంగా కాపాడుకుంటున్న అవివేకాన్ని జ్ఞాపకం చేస్తూ వుంటారు. అతన్ని ఎరగని కొత్తవాళ్ళ దగ్గిర, అతడు భోజనం చేసి ఎన్నాళ్ళయిందో అడిగి చెప్పించి అవతల వాడిని హడలకొడుతూ వుంటారు. ఈ బాధ తప్పించుకోడానికీ, దాన్ని నవ్వుగా పరిమార్చుకోడానికీ యువరాజు ఈ బిరుదు కనిపెట్టి, తనూ నవ్వుతూ ఉంటాడు శాయశక్తులా.

ఎన్.జి.వో. మహారాజు ధోరణి వేరు. గుట్టుగా వేదాంతం సాధన చేస్తూ ఉంటాడు. గిట్టినాటికి ముమ్మూరల నేల కోసం. ఈ యాతనలు ఎలాగా తప్పవు. చేతికి మానె రాసుకోకుండా అప్పడాల పిండితో ఆటలాడబోతే సంసారం ఇలా అంటుకుంది. అంచేత ఆ పిండి వదలదు. కాబట్టి, ఇహ దాని కోసం పట్టికున దుఃఖపడక తప్పకపోయినా, చాటున మటుకు – అసలు పిండే కాదు చేతులే లేవనుకుని విరగబడి నవ్వుకుని తృప్తి పడడానికి తిప్పలు పడతాడు. ఈ మహారాజా

పూర్వాశ్రమంలో యువరాజే. విధివశాత్తూ ఐదేళ్ళ క్రితం పట్టాభిషేకం జరుపబడింది

☆ ☆ ☆

పేదరాశి పెద్దమ్మ ఇంటి సావడిలో ఈ విధంగా నిలబడ్డ ఎన్.జి.వో ని చూసి పి.హెచ్.డి. నేరం చేసినట్టు బాధపడుతున్నాడు.

పెద్దమ్మ నడ్డి తిప్పుకుంటూ నవ్వుకుంటూ చక్కా వచ్చేవరకూ మహారాజా, ఈ యువరాజా గుడ్లు మిటకరించి చెరో పక్కా చేరారు. గుట్టుగా చెరో చేతా చెరో రూపాయి ఉంచి గుప్పిళ్ళు మూసింది పెద్దమ్మ.

కళ్ళతో సాష్టాంగ నమస్కారం చేసిన ఎన్.జి.వో. ను చూసి తనే జాలిపడ్డాడు పి.హెచ్.డి. ఎన్.జి.వో. మహారాజా, పి.హెచ్.డి. యువరాజా విశ్శబ్దంగా నడిచి బజారు రోడ్డుకి వచ్చారు. గంట స్తంభం దగ్గిర ఆగారు. యువరాజే ముందు మాట్లాడాడు. అయ్యా తమరు ఎటు వెళ్తారో చెప్పండి. నేను రెండోవేపు పోతాను అంది అతని మొహం. మహారాజు అర్థం చేసుకున్నాడు. కృతజ్ఞతను అవలీలగా అభినయించాడు. అబ్బే మీ యిష్టం. మీరే నిర్ణయించుకోండి. భావి పౌరులు. దారి చూపాల్సిన వారు. మీరు దారి తియ్యండి. నేనే రెండో వేపు పోతాను అంది అతని వాలకం.

అబ్బెబ్బే – తమరు పెద్దలు, తమరే దారి చూపాలి.

అయితే సరే, నేనలా పెద్ద బజారు వేపు వెళ్ళొస్తా అన్నాడు మహారాజు సిగ్గుపడుతూ.

చిత్తం, నేనిలా చిన్న చెరువువేపు పోతా. సెలవండి.

సెలవు.

ఒకరి నొకరు మెచ్చుకుంటూ ఇద్దరూ చెరో వేపూ బయల్దేరారు.

యువరాజు యెకాయెకిని కాఫీ హోటలుకు వెళ్లాడు. దర్జాగా ఇడ్లీ, కాఫీ పుచ్చుకున్నాడు. ప్రొప్రయిటరు ముందు బిల్లు పడేసి అరువు చెప్పాడు ధీమాగా. కథ బెడిస్తే జేబులో రూపాయుందిగా.

అసలు జేబులో రూపాయి ఉంది కాబట్టే కథ అక్కడా ఇక్కడా కూడా అడ్డం తిరగకపోయింది అనుకున్నాడు యువరాజు. హోటలు దాటి వచ్చి ఇచ్చట అరిచి చచ్చినా అరువు ఇవ్వబడని రావ్స్ స్పెషల్ హైక్లాసు కిళ్ళీషాపులోంచి వడేసి పుచ్చుకున్న అరువు కిళ్ళీ నములుతూ, అరువు సిగరెట్టు పీలుస్తూ... తావేదులు అంటే ఈ రూ॥లే. కోర్టులో జయమూ, ప్రేయసి వలలో పడుట, పరీక్షలో విజయమూ, తలనొప్పి తగ్గుట....

యువరాజుకు తట్టుకోలేనంత హుషారుగా వుంది. ప్రపంచంలో పురుషులు మంచివాళ్ళే పాపం అనుకున్నాడు. ఝామ్మని రామమోహన గ్రంథాలయానికి వెళ్ళి ఓ మూల కుర్చీ చూసుకుని పంచవర్ష ప్రణాళికల మీద పడి నిద్రపోయాడు.

మహారాజు కథ:

ఇక కుడివేపు బయల్దేరిన మహారాజు ఇలాంటి పనులేమి చెయ్యలేదు. చెయ్యడు కూడా. 'అతనికేం ఒంటరి పక్షి. విచ్చలవిడిగా తిరుగుతాడు. ఉంటే తింటాడు.

లేకపోతే మానేస్తాడు పోయిగా. నాకైతే బోలెడు మందీ మార్బలమూ ఉందాయె. అతనిలా నాకెలా చెల్లుతుందీ' అనుకున్నాడు మహారాజు – పెద్దపెద్ద అంగలు వేసి, ఈల పాటకి అడుగులు లయ కలుపుతూ.

ఎన్.జి.ఓ. మహారాజు ఎప్పుడు పడితే అప్పుడు ఈల వెయ్యడు. వేసినా అది రాదు. ఆయన సగటున నెలకోసారి ఈలవేసి పాట పాడతాడు మహా ఆనందంతో. ఇది జరిగేది జీవితం మళ్ళీ ఓ జీతపు మజిలీ మీదికి వచ్చిన రోజున: ఆఫీసు నుండి ఇంటికి వెళ్ళేవరకే.

ఆ తరువాత నెల మధ్యలో ఒకటీ రెండూ అప్పు దొరికినప్పుడు. నిజానికి ఒకటో తారీఖున జీతం కన్నా పద్దెనిమిదో తేదీన ఒక్క రూపాయి అప్పు – ఇచ్చే ఆనందం ఈ లోకంలో మరేదీ ఇవ్వలేదని ఆయనకు తెలుసు. అయితే పుట్టి మునిగించేటన్ని అప్పులు చుట్టుముట్టి ఉన్నాయి. కొత్తవి ఓ పట్టాన పుట్టడంలేదు. అందువల్ల పావలా అప్పు పలికినా సంప్రదాయం చెడకుండా మాట వరస కన్నట్టు లీలగా ఈల అనిపించే లాటిది వేస్తాడు.

మహారాజు ఈల వేస్తూనే ఆలోచిస్తున్నాడు. ముందర యీ పూటకి బియ్యం చూడాలి. చూడడానికేముంది డబ్బుందిగా. పనిలో పని ఓ పదలం బంగాళా దుంపలు కూడా పట్టుకు పోతే మంచిది. పిల్లలు మొహంవాచి ఉన్నారు. పాపం ఓ ముద్దూ ముచ్చటా ఎరుగరు. వెర్రికుంకలు, కుర్రకుంకలు, వెర్రికుర్రకుంకలు, కుర్రవెర్రికుంకలు, కుర్రవెర్రులు, వెర్రికుర్రలు.... ఇంకో నిమిషం ఉంటే పాట పాడేవాడే, ఇంకా నయం. ఎంత అరిష్టం ముచ్చటవునూ....

అందుకని బియ్యం కొట్టు ఎదరపడి అతని చుట్టూ నిలబడింది.

అక్కడ వెర్రి, కుర్రపదాల మీద క్రాస్‌వర్డు పజిల్‌లా కాంబినేషన్‌లు వల్లిస్తే, వాళ్ళేమంత మెచ్చుకోరు. తేరుకుని కర్తవ్యం గ్రహించి అక్కుళ్ళలా ఇచ్చారండి అన్నాడు మహారాజు.

శేర్రూపాయన్నర జేసి అంది బియ్యం కొట్టు టూకీగా, ఏమంత పట్టించుకోకుండా.

మహారాజు మనసు చివుక్కుమంది. ఛాతీనిండా ఊపిరి నింపి మోర పైకెత్తి ఠీవిగా నవ్వాడు.

శేరు సర్లెండి. బస్తా ఎలాగంట!

షావుకారు తొలిసారి ఇటు తిరిగి తేరి చూసింది. చూసి చెప్పింది.

అబ్బే మీరు బొత్తిగా తెలీని వాళ్ళకిలా చెప్తున్నారు.

సర్లేండి. తమకెంత కావాల్చెప్పండి. ప్రత్యేకం తగ్గిస్తాం.

అబ్బే నాకోసం ప్రత్యేకం తగ్గించడమేల – నా ముక్కూ మొహం ఎరుగరు గదా అన్నాడు మహారాజు చురుగ్గా కరుగ్గా. గొప్పవాళ్ళు షావుకార్ల మొహాలిలాగే మాడ్చిపారేస్తారు.

చిత్తం తవరలా పరాచికాలాడితే ఏం చెప్పనండి! – ఏదో బేరం సారం అన్నాడు.

ధర చెప్పారు కారు అన్నాడు మహారాజు మహారాజులా.

షావుకారు ప్రత్యేకమైన ధర చెప్పాడు.

సరే కృష్ణ కాటుక లెలా చెప్పండి?

మీకెంత కావాలో చెప్పండి బాబూ అంది దుకాణం చిరాగ్గా.

మీరలా ధుమధుమలాడితే ఎలా. ప్రస్తుతానికో అర్ధశేరిస్తే శాంపిల్ చూసి బావుంటే ఓ బస్తా పుచ్చుకుంటాం – తాపీ మీద అన్నాడు మహారాజు తటపటాయించి.

ఒరేయ్ ఈన బేరం సూడరా – అంటూ అటు తిరిగింది దుకాణం.

ఏమిటయ్యా అంత చిరాకూ. మహా పుట్లో పందువులూ అమ్మేవాళ్ళలా.

చాల్లేవయ్యా నువ్వు మహా బస్తాలూ అరబస్తాలూ కొనేవోళ్ళాగా చేశావు బేరం.

ఏం. కొనే తాహతు లేదనుకున్నావా? అంతరం తెలిసి మాటాడు అంటూ చరచర బయటికొచ్చేశాడు మహారాజు. లేనిపోని గొడవ పెట్టుకున్నాడు తను. ఎన్నిసార్లొద్దనుకున్నా తనకీ అలవాటు పోలేదు. చిరాకేసింది బజారు చేయడం చేతకానందుకు. ఇంకో కొట్లో కెళ్ళాడు. ఏవండీ. అక్కుళ్ళు శేరెలా ఇచ్చారండీ.

రూపాయిన్నర. షావుకారు చెప్పాడు. పది నిమిషాల వరకూ విసుగు లేకుండా చెప్పాడు.

వీడెలాగయినా మర్యాదస్తుడే అనుకున్నాడు మహారాజు. కనీసం ఒక శేరు బియ్యం కొనేద్దామనుకున్నాడు. కాని రూపాయే ఉంది కదా! ఇంత మర్యాదస్తుడి దగ్గర అర్ధశేరు కొంటే బావుండదు; చిన్నబుచ్చుకుంటాడు. మళ్ళీ వస్తానండి – ఆపైన కనుక్కుని.

మహారాజులా రండి.

మహారాజు నవ్వుకున్నాడు.

సరేలే. ఈ రూపాయిలో బియ్యం కొనేదేమిటి? సిగ్గుచేటు. ఎవరేనా చూసినా బావుండదు. ఈ పూటకి ఆవి డేఅప్పో సప్పో చేస్తుంది. సంతలో కెళ్ళాడు.

ఏం చామాలూ కులాసా? బంగాళా దుంపలెలా?

రండి బాబు రండి. ఇయి ముప్పాలా, ఇయి రూపాయణా. వంకాయలు ముప్పాలాండి. ఎన్నముద్దలు.

సరేలే. దుంపలిచ్చే ధర చెప్పు.

రూపాయి చేస్కోండి బాబూ. అయినా నువ్వోనాడు కొన్నావేటి బేరమాడ్డవే కాని.

అందరూ కొనేవాళ్ళయితే నీవంటి వాళ్ళెందుకే అమ్మడానికి. నీ మనవడు చాలు.

వెకిలిగా నవ్వుతూ బయల్దేరాడు. మళ్ళా బజారు రోడ్డున పడ్డాడు మహారాజు. కాస్త కాఫీ తాగితే!... ఛీ! ఇంటి కోసం అని చెంబు తాకట్టెట్టి రూపాయి తెచ్చి అది కాస్తా హోటలు వాళ్ళ ఎదాన పొయ్యడమా? మూడు కిరాణా కొట్లలో 30 నిమిషాలసేపు బేరం ఆడి బయటపడ్డాడు. ధరలు మండిపోతున్నాయి.... ఏవిటో తనొక్కనాడు కూడా బేరమాడినంత జోరుగా సరుకు కొనలేకపోయాడు. ధరలు మండితేనేం మండకపోతేనేం – ఏబులంనూనీ సవాశేరు చింతపండూ కొనడానికి.

అభిమానం ముంచెత్తుకొచ్చింది. ఛీ! మరీ చవట ఆలోచన లొస్తున్నాయి. వెధవది – కోపరేటివ్ బ్యాంకు వాళ్ళు అప్పేదో తొరగా తగలేస్తే ఈ ఉన్న అప్పులన్నీ ఒక్కసారి తీర్చిపారేసి రెణ్నెల్ల గ్రాసం కొని పడేసుకోవచ్చు. నాలుగు రాళ్ళు కంటికాన్తాయి. కుర్ర వెధవ మూడు చక్రాల సైకిలో అని గోల పెడుతున్నాడు.

ఒకటి కొనాలి. జేబులో రూపాయుంది కదా అన్న ధీమాలో బుచ్చిరాజుగారి ధనరాజు ఇనపకొట్లో కెళ్ళాడు.

ఏమండీ. మూడు చక్రాల సైకిలు చూపించండి.

అదుగో చూడండి.

కాస్త దిట్టంగా ఉండే బండేదో మీరే చెప్పండి బాబూ. మా రెండోవాడు రాక్షసి వెధవలెండి. చేతికిచ్చిందల్లా విరిచి అక్కడ పెడతాడు.

బుచ్చిరాజుగారి ధనరాజు ఫెళఫెళ నవ్వాడు – పెద్దవాళ్ళు నవ్వుకొనే నవ్వది; మేనేజర్లూ మేనేజర్లూ నవ్వుకొనే నవ్వది.

అంతేలెండి. అలాంటి కొడుకే ఉండాలి. అయినా సైకిళ్ళు పిల్లలు విరవకపోతే డబ్బిచ్చికొన్న మీరు విరుస్తారటండీ.

మహారాజుకి వళ్ళు పులకరించింది. మీకేవిటండీ కబుర్లు చెప్తారు. చెన్నపట్నం నుంచి ఆ మధ్య రెండు సైకిళ్ళు తెప్పించా, రెండూ విరిచి పెరట్లో పడేశాడు.

నయమే కదండీ – ప్రయోజకుడే. మావాడు విరవకుండానే వీధిలో పారేస్తాడండి. పైగా మా బాబు కొట్లో వున్నాయిగా అంటాడు. అది చూశారో లేదో.

ఇద్దరూ ఫెళ్ళున నవ్వారు మళ్ళా. పక్కన నుంచున్న కొట్టు గుమాస్తా జంకుతూ సన్నంగా నవ్వాడు. అది మేనేజర్లు మేనేజర్లు నవ్వుకునేటప్పుడు అచ్చంగా తను నవ్వే నవ్వులాంటిది. ఇప్పుడు తనూ షావుకారూ సమాన ఫాయాలో నవ్వుతున్నారు. నవ్వు పూర్తయేసరికి మహారాజుకి కళ్ళు చెమ్మగిల్లాయి. నిజంగానే సైకిలు కొనేయబుద్ధేసింది. జేబులో చూస్తే ఓ రూపాయే ఉంది. కోపరేటివ్ అప్పు పదిరోజుల్దాకా రాదు. సరదా చల్లారిపోయింది.

సరేలెండి. సాయంత్రం వాడినే తీసుకొస్తా. వాడే ఏరుకుంటాడు.

తక్షణం పదిరూపాయలేనా సంపాదించి జేబులో వేసుకు తిరగాలని మహారాజు మనసు ఉవ్విళ్ళూరింది. ఒకటో తారీఖు ఇరవైరోజు లుందనగా ఎవడిస్తాడు అప్పు. ఘోరాతి ఘోరంగా చితక్కొట్టిన ధరలకి గుడ్డలు అమ్మేస్తున్న శిల్కు ప్యాలెసులో కోరా మల్లు దగ్గరనుంచి గాబర్డిన్ వరకూ బేరమాడి బయటకు తేలేసరికి పది గంటలయింది. మహారాజుకి విపరీతంగా ఆకలి వేస్తోంది. తర్జన భర్జన లేకుండా తెగించి హోటలుకి వెళ్ళిపోయాడు.

పది గంటలయినా ఇడ్లీ సాంబారు ఇంకా ఉండడం చూసి బోలెడు ఆశ్చర్యపడి, ఇడ్లీ తెమ్మన్నాడు – ఉత్త కాఫీ తాగుదామనుకున్నవాడల్లా. తీరా ఇడ్లీ తినడం మొదలు పెట్టేసరికి పక్కాయన ప్లేటులో వడలు మహా అందంగా కనపడ్డాయి. సరే పెరుగు వడలు ఆర్డరు చేసేసరికి, సర్వరుకి మహారాజు మీద గౌరవం హెచ్చింది. ఆనియన్ పెసరట్టు రోస్టు స్పెషలు వేస్తానండి అంటూ సరదా పడ్డాడు. సర్వరు సరదా చూస్తే మహారాజుకి ముచ్చట వేసింది. వాడి ముచ్చట తీర్చకపోతే చిన్నపుచ్చుకుంటాడు.

సరే పట్రా అన్నాడు కాస్త హుషారుగా. ఈ ఉషారు చూసి పెసరట్టులో ఉప్మావేసి తెచ్చాడు వాడు. ఈ రెండూ జాయింటుటు. పదకొండణాలు బిల్లు చెల్లించి చల్లగా ఇవతలకొచ్చాక ఇల్లు జ్ఞాపకం వచ్చింది, హోటలు వాడు కొల్లగొట్టాడు. ఇంట్లో బియ్యపుగింజా బొగ్గుముక్కా లేవన్న విషయం మరపించి తనని మేపారు వెధవలు.

ఛీ అనుకున్నాడు మహారాజు. ఇంక ఐదణాలు మిగిలింది. అయినదెలాగా అయింది. వచ్చిన కష్టం రానే వచ్చింది. అందుకని ఓ అణా పెట్టి స్పెషల్ మిఠాయి కిళ్ళీ, అణాన్నర పెట్టి స్పెషల్ హైక్లాసు సిగరెట్టు ఒకటే కొన్నాడు. పక్క కొట్లోకి వెళ్ళి అణాన్నరకి దక్కను పెట్టె, అర్ధణా అగ్గిపెట్టె కొనేశాడు. మిగతా అర్ధణా ముష్టివేశాడు.

సిగరెట్టు తాగుతూండగా అతనికి ఇల్లు జ్ఞాపకం వచ్చింది. ఇంటి దగ్గర ఏమైపోతోందో, బహుశా తన కోసం చూసి చూసి ఆవిడ అప్పు తెచ్చి ఉంటుంది. దొరికిందో లేదో! చెంబు తాకట్టు పెడితేగాని తనకే దొరకలేదు అప్పు. మహారాజుకి రోత పుట్టింది – సంసారం మీదా, తన మీదా కూడా. ఉత్తర క్షణాన పౌరుషం వేసింది. పట్టుదల హెచ్చింది. పది రూపాయిలు కళ్ళ చూడందే కొంప చూడకూడదనుకున్నాడు. పొరుగూళ్ళో మిత్రులున్నారు. కాళ్ళావేళ్ళాపడి అయినా అప్పు సంపాదించాలనే పట్టుదలతో ట్రంకురోడ్డు ఎక్కాడు మహారాజు. పదకొండు గంటలు కొట్టింది.

యువరాజు కథ:

పదకొండు గంటలు కొట్టింది గడియారం. గ్రంథాలయం గుమాస్తా తలుపులు మూస్తున్నాడు. నిద్రపోతున్న యువరాజును లేపి ఇంటికెళ్ళమన్నాడు.

ఎవరింటికి? అన్నాడు యువరాజు ఆవలిస్తూ, బయటికొస్తూ, కళ్ళు తెరుస్తూ, జేబులోని రూపాయి బిళ్ళ గరుకులని ఆప్యాయంగా ప్రగాఢంగా అదిమాడు.

నీ జుట్టు చిందరవందరగా ఉన్నా, నీ కళ్ళు లోతుకుపోయినా నీ బుగ్గలు గుంటలు పడినా మవ్వు బాగున్నావోయ్ అంది – కిళ్ళీకొట్టు అద్దం. ఘాటైన చార్‌మినార్ దమ్ము లాగాడు యువరాజు. బాగా మెలకువ వచ్చింది. మనస్సు తేలికగా ఉంది. ధీమాగా అడుగు సాగించాడు బజారు వేపు. ఈ రూపాయి ఖర్చు అయిపోయేలోగా ఏదేనా పెద్ద పని చేసెయ్యాలని మనసు ఉబలాటపడుతోంది. వంద రూపాయిలు కళ్ళ చూడాలి అనుకున్నాడు పెదిమలు బిగించి పళ్ళు కొరుక్కుంటూ.

మనసు కులాసాగా, జేబు దిలాసాగా ఇలా ఉన్నప్పుడే నలుగురినీ చూసి ఉద్యోగాలు అడిగెయ్యాలి. ఇప్పుడు ధీమాగా అడగొచ్చు. వాళ్ళు ఉద్యోగం ఇవ్వకపోయినా దర్జాగా హోటలుకి పోయి ఒకటికి రెండు కప్పులు కాఫీ తాగేసి నాలుగు సిగరెట్లు కాల్చియ్యొచ్చు. రూపాయి బిళ్ళ అంచుని చూపుడు వేలితో తడిమాడు.

శక్తి విజృంభించింది. ఆలోచనలు ఇనుమడించాయి. గుమాస్తా ఉద్యోగాలకి ప్రయత్నాలు నెమరువేశాడు. ఒక కంపెనీ ఉంది, దాని మేనేజరు సారస్వత ప్రియుడట. కాస్త కథలు రాసేవాళ్ళంటే సరదాట. తనకి కథ రాయటం రాదు. రాదని కాదుగాని ఇంతవరకు రాయలేదు. ఇప్పుడు రాసి... ఎందుకూ ఎవరి చేతన్నా రాయించి.... ఛీఛీ.... మంచి ఇంగ్లీషుది కాపీ కొట్టి.... అంతకన్న అనువదిస్తే మేలు – వాడిపేరు గిరాకీతో తన కథ పడుతుంది. అది చూపిస్తే కథలు రాసే మేనేజరుకి అభిమానం పుట్టుకొస్తుంది. తోటి సోదరుడని ఉద్యోగం పారెయ్యొచ్చు సానుభూతితో.

దూసుకుపోయిన కారు వెంటబడ్డ తన కళ్ళు, కారులో అమెరికన్ ఇంజనీరునీ అతని తాలూకు కూతుర్నీ చూశాయి. చేతిలో వున్న చార్మినార్ పీకె వంక దీక్షగా

చూశాడు. అప్రయత్నంగానే ఇంజనీరు కూతురితో ఇంటర్వ్యూ వూహించాడు.

రంగు రంగుల దృశ్యం కనబడుతోంది. తను హై హై యాంకీ యాసతో మాట్లాడేస్తున్నాడు. ఇంజనీరు కూతురూ, ఆ పిల్ల నాన్నా ముందర ముచ్చటపడి ఆపైన విస్తుపోయారు.

మీకిదంతా ఎలా పట్టుబడిందండీ!

నాకు అమెరికా అంటే చాలా అభిమానం. నేను మీ సినిమాలు తెగ చూస్తా. నేను కథ రాశా - అమెరికాకి పంపుదామని.

మా కివ్వండి - మేం దాని సంగతి చూస్తాం.

ఇంజనీరు కూతురుకి తను రాసిన కథ అందిస్తూండగా చేతులు తగిలినందుకు ఒళ్ళు జలదరించింది యువరాజుకి. ఆ కులుకుతో రోడ్డుమీది మామిడి టెంకని విలాసంగా తన్నబోయి కంకర్రాయిని తన్నేశాడు.

ఇంజనీరు కూతురితో ఇంటర్వ్యూ నించి హఠాత్తుగా మేలుకొన్నాడు. భూపాల రాగంలో 'అబ్బా!' అని బొటనవేలు రక్తం చూసుకుంటూ. దెబ్బకి తలలో నరాలు కంపించాయి. ప్రాణం జిల్లార్చుకపోయింది. నడక ఆపి ఓ చెట్టుకి చేరగిలి నిలబడ్డాడు.

మండే మధ్యాహ్నం మధ్య నించున్న ఎండిన మోడు మీద నించున్న రెండు కాకులు కావుకావుమన్నాయి - అవి అక్కా చెల్లెళ్ళు.

అక్కా అక్కా చూశావే?

చూశా చెల్లీ.

అక్కా ఎవరే ఈ చిన్నవాడు? అంది కాకి చిన్నది.

వీడు తెలీదు? ఈ జాతి వాళ్ళని మనం బోల్డుమందిని చూశాం. మొండికెత్తిన నిరుద్యోగి. గెలుపు గ్యారంటీ అనే రకం.

మొహం చూస్తే అలా వుందేం?

భుక్తాయాసం. దండయాత్రకి ఉపక్రమణం. బాదం హల్వా తింటుంటే, ఇంగువ ముక్క పంటికిందకొచ్చింది - చూడలే. ఇప్పుడే ఓ ఇంజనీరు కూతురితో ఇంటర్వ్యూ భోంచేశాడు. కడుపు నిండేలా భోంచేసిన మత్తులో కంకర్రాయిని తిన్నాడు. వేలు బద్దలై మేలుకొన్నాడు. మళ్ళా - బద్దలైంది వేలు కాదూ, వేలు బద్దలు కాలేదూ అని నచ్చచెప్పుకుని మొండికెత్తుతాడు. ఇలా ఇంటర్వ్యూలూ, ఆశలూ భోంచేస్తూ ఉంటాడులే.

చిన్నకాకికి సరదా పుట్టింది - రెట్టవేస్తే? అంది ఉత్సాహంతో. వేసి చూడు అంది అక్క అనుభవశాలిలా. చిన్నకాకి రెట్ట వేసింది. యువరాజుకి నెత్తి తడుముకోవాలో రక్తం కారుతూన్న వేలుని ఓదార్చాలో తెలియలేదు. ఒక్క క్షణం ఆలోచించి రెండూ మానేశాడు. తిన్నగా పది గజాల దూరంలో ఉన్న పంపు దగ్గరకెళ్ళాడు. వేలు కడిగేశాడు, ఆపైన మెల్లిగా రెట్ట తుడిచేశాడు. మొహం తోమేసుకున్నాడు. ఎండిన ఎర్రజుట్టుకి నీళ్ళు పట్టించాడు. జేబులోని చిన్న దువ్వెన తీసి అక్కడే తల నున్నగా దువ్వేసుకున్నాడు. దువ్వుతూండగానే ఈలపాట మొదలెట్టాడు - బాధను మరిచిపోడానికి. కాఫీ తాగాలనుకున్నాడు కూడా. తిన్నగా ఇంగ్లీషు హోటలుకెళ్ళాడు బాధ అణుచుకొని, హొయలు ఒలకపోస్తూ.

వీడి దుంపతెగ – పైకేనా చూడలేదే అంది చిన్నకాకి.

నే చెప్పలే అంది అక్క చిరునవ్వుతో.

కాఫీ ఆర్డరు చేసి హాయిగా దేశవాళీ హోటలుకెళ్ళి మసాలాదోశ తినవలసింది అనుకున్నాడు యువరాజు. రోటిలో తలపెట్టి రోకటి.... చల్లని మంచినీళ్ళు తాగి, కాఫీ కలుపుకుంటూ – సిగరెట్టుతే అన్నాడు. వెయిటరు అణారకం సిగరెట్లు నాలుగూ అణా అగ్గిపెట్టె ఒకటీ పళ్ళెంలో తెచ్చి మహా వినయంగా పెట్టాడు బల్ల మీద.

కాఫీ మూణ్ణాలు – ఇవి అయిదణాలు మొత్తం అర్ధరూపాయి! బిల్లు ప్లేటులో పెట్టి, ప్లేటు ట్రేలో పెట్టి తల బిల్లుకి తగిలేటంతగా వంచి, బిల్లు బల్ల మీద ఉంచాడు వెయిటరు. నిర్లక్ష్యంగా పొగ వదుల్తూ, రూపాయి ప్లేటులో ఉంచాడు యువరాజు. వెయిటరు రెండు పావలా కాసులు తెచ్చాడు చిల్లర.

యువరాజు గొంతులో వెలక్కాయ పడింది. వీడికి టిప్ ఇవ్వకపోతే పరువు తక్కువ. బేవార్సుగా డనుకుంటాడు. కానీ అణా బేడా ఇద్దామనుకుంటే, దొంగపీనుగ రెండూ పావలా కాసులు తెచ్చాడు. గోహోవిందా అనుకుంటూ ఓ పావలా కాసు అతి నిర్లక్ష్యంగా తీసి జేబులో వేసుకున్నాడు. స్స్ (థాంక్సుకి సంక్షిప్తం) అంటూ అంతకన్నా నిర్లక్ష్యంగా ఆ పావలా తీసుకున్నాడు వెయిటరు.

మండే మధ్యాహ్నం మీదకి మళ్ళీ ఒచ్చేశాడు యువరాజు. ఎండ మండుతోంది. ఆకలి వేస్తోంది. బస్సెక్కితే? అమ్మో ఉన్నది పావలా. ఇందులో బస్సా.... చెట్టుమీది చెల్లి కాకికి జాలివేసింది. పాపం ఎలాగే అంది. అనుభవశాలిని అయిన అక్క కాకి మందహాసం చేసింది.

దిక్కులేనివారికి దేముడే దిక్కు. వీడికి నేనే దిక్కు, బస్సు కాదు. విమానం ఎక్కించేస్తా చూడు అంది గంభీరంగా.

యువరాజు నడుస్తున్నాడు – భోంచేసి ఎన్నాళ్ళయిందో లెక్క పెట్టుకుంటూ. ఎదురుగుండా వయ్యారిభామ ఒకతె వస్తోంది. వెడల్పాటి నల్లటి అంచుగల పసుపు పచ్చటి చీరెకట్టింది. నల్లటి పొట్టి రవిక తొడిగింది. ఎర్రటి ముఖమల్ చెప్పులు వేసింది. ఆ ఎండలోనే యధాశక్తి విలాసం ఒలికిస్తూ నడుస్తోంది.

ఇంగ్లీషు హోటలుకి వెళ్తుంది కాబోలు అనుకున్నాడు యువరాజు. ఇరవై క్షణాలపాటు ఆమెని శాయశక్తులా చూశాడు యువరాజు. ఇరవయ్యొకటో క్షణానికి కొత్త అనుభూతి – అమడ దూరాన ఉన్నది వచ్చి అతని మీద వాలింది, లోపల వ్యాపించింది. క్షణంలో ఇముడ్చుకుని పొదువుకుంది.... ఇటువంటి పిల్ల అనుకున్నాడే కాని, నిజానికి ఎటువంటిదో అతనికి నిర్ధారణగా తెలియదు. ఎందుకంటే ఆ అమ్మాయి ప్రత్యంగ సౌందర్యమూ అతడిని ఉక్కిరి బిక్కిరి చేసింది. ఆమె ముఖం కూడా సరిగ్గా చూడలేదు. బహుశా పచ్చచీర, నల్ల అంచు వుండవచ్చు. నల్ల రవిక మాత్రం కచ్చితంగా చూశాడు.

ఆ ఒప్పులకుప్ప, ఒయ్యారి భామ ఐదు గజాల దూరానికి వచ్చేసింది. ఏదో మహత్కార్యం చేసెయ్యాలనే ఉద్వేగం ప్రకోపించింది యువరాజుకి. యువరాజుని విమానం ఎక్కిస్తానని శపథం పట్టిన వాయస రాజము ఈ క్షణాన రంగభూమికి దిగింది. ఎడారివలె పరుచుకున్న ఆ మధ్యాహ్న వేళ, మగతగా ఉన్న చెట్లు మినహా

సాక్షులు లేని ఆ రోడ్డుమీద, నడుస్తున్న వయారి భామ మీదికి వాయసాంగన చెంగున ఎగిరింది. కావుమంది. ఇంచుమించు ఆ పడుచు నెత్తిన నిలచి రెక్కలు టపటప లాడించింది మళ్ళీ కావుకావు మంది.

బావురుమంది వయారిభామ. వెంటనే యువరాజు దుష్యంతుడి పద్ధతిలో ముందు కురికాడు. హోహోఁ అంటూ కాకిని బెదిరించి తరిమేశాడు. పమిట సర్దుకుంటున్న వయారిభామ వంపుల సొంపులు క్షణంలో సగంసేపు చూసిన యువరాజులో కొన్ని సున్నితమైన నరాలు - ఫ్యూజువైరులా భగ్గున మండి భస్మం అయిపోయాయి.

వయారి భామ వయారన్నరగా థాంక్యూ అంది. వయ్యారమ్ముప్పావుగా రోడ్డు మీద పడి వున్న చేతిసంచీ తీసుకుంది. జనం ఎవ్వరూ లేరన్న సంతోషంతో రెట్టింపు వయారం ఒలకబోస్తూ వెళ్ళిపోయింది. వెడలుచున్న భామ సోయగాన్ని వెనుక నుంచి అరనిముషం సేపు శ్రద్ధగా చూసిన యువరాజు పది అడుగులు నడిచేలోగా హాయిలోకి, గాలిలోకి, కలలలోకి తేలిపోయి, శ్రమలేకుండా విమానం ఎక్కి విహారానికి బయలుదేరాడు. ఒంటిగంటంపావుకి, ఒక పెద్ద భోజన కాఫీ హోటలు పెరటిగుమ్మం వున్న వీధిలో చిన్న కిళ్ళీకొట్టు దగ్గర విమానం దిగిపోయాడు యువరాజు.... ఆకలి విపరీతంగా వేస్తోంది. నీరసంగా ఉంది. కిళ్ళీకొట్టులో వేరుశనగ ఉండలు ఉన్నాయి. రెండు కొనుక్కు తిని, కాసిని మంచినీళ్ళు తాగితే కడుపు చల్లబడుతుంది.... కాని ఎవరేనా చూస్తే?

తెగించి కొనేశాడు రెండు వుండలు. స్టయిలిష్‌గా వేరుశనగ ఉండల పరిశ్రమను ఉద్ధరించేవాడి పోజులో తినడం మొదలెట్టాడు. గజం దూరంలో ఒక హైక్లాసు ముష్టివాడూ, పెద్ద హోటల్లో క్లీనరూ బేరాలాడి ఒప్పందం కుదుర్చుకుంటున్నారు.

వారానికి అర్ధరూపాయి ఇస్తే భోజనపు హోటలు ఎంగిలాకులన్నీ నువ్వొచ్చేవరకూ వుంచి నువు రాగానే నీకు పడేస్తా అంటున్నాడు క్లీనరు.

అరణాలు చేసుకో అన్నాడు ముష్టివాడు.

ఇది ఏ క్లాసు హోటలు తెలుసా! అర్ధరూపాయిస్తే అయిదు రూపాయలు గిడుతాయి. ఇష్టం వుంటే చెప్పు.

సరేనంటున్నాడు ముష్టివాడు.

యువరాజు తనమీద తనే జాలిపడ్డాడు. తనని తనే యాచగించుకున్నాడు. ఈ ఆర్థిక పతనానికి తనే బాధ్యుడననుకున్నాడు. ముష్టివాడిని వెళ్ళిపోనిచ్చి క్లీనరుని పిలిచి తమలపాకులు వేసుకోమంటూ అర్ధణా ఇచ్చాడు. విస్తుపోయిన క్లీనరు ఒద్దనే లోగానే మెయిన్ రోడ్డు మీద నడుస్తున్నాడు యువరాజు. డబ్బులు మూడణాలున్నాయి.

గుండె గతుక్కుమంది హఠాత్తుగా. ఇరవై గజాల దూరంలో తన ఇంటి ఓనరుడు వస్తున్నాడు. కనపడితే దుంప తెంపి ధూపమేస్తాడు. యువరాజు చటుక్కున వెనక్కి తిరిగి బయలుదేరాడు. మూడడుగులు వేసేసరికి అల్లంత దూరంలో నాయర్ టీకొట్టు.

ఈ యువరాజు ఇప్పుడు డెన్మార్క్ యువరాజు పరిస్థితిలో పడ్డాడు. కొద్ది తేడాతో - అటు ఇంటివాడిని వరించడమా - ఇటు నాయరు మావనా? అటుకీ ఇటుకీ మధ్య ఒకటి ఎప్పుడూ ఉంటుంది. లేపోతే ఇటూ అటూ అనే ప్రస్తావనే

లేదు. యువరాజుకి కూడా అటు ఇంటివాడికీ, ఇటు నాయరుకీ మధ్య ఒక దారి దొరికింది. మధ్యనున్న కాఫీ హోటలులోకి దూరాడు.

హామ్లెట్ కూడా ఉండడమా ఊడ్డమా అని మధనపడకుండా, చేతికి అందివ డబ్బు తీసుకుని ఒఫీలియాని లేవదీసుకుని దేశాంతరం పోయి ఉండవచ్చు. తాపీగా దేముడే సమస్య పరిష్కరించును – అనుకున్నాడు యువరాజు తన తెలివితేటలకి ఉప్పొంగిపోతూ.

గండం గడిచింది గాని కంపు కాఫీ తాగి రెండణాలు హోటలు వాడి ఎదాన పోయాల్సి వచ్చింది. బయటికొచ్చి సిగరెట్టు ముట్టించాడు యువరాజు. జేబులో ఇంకొక్కణా ఉంది. చరచర పెద్ద పుస్తకాల కొట్లో కెళ్ళాడు. విజ్ఞాన సముద్రం అణువు నుంచి బ్రహ్మాండం వరకూ, సిగరెట్టెలా మానవచ్చో మూడు సులభ పాఠాల్లో నేర్పే అమెరికా పుస్తకం నుంచి ఆత్మసాక్షాత్కారానుభూతి సిద్ధించడానికి మార్గదర్శిని వరకూ పుస్తకాలున్నాయి. మానవుడు చూసిన వేల సంవత్సరాల ఘడియల విఘడియల చరిత్ర గంభీరంగా పరచుకొని ఉంది.

మానవుడు సృష్టించిన ఈ మహా విజ్ఞాన సాగరం మధ్య మానవుడు ఒక చిన్న చేపలా అంతా ఒక్కసారి జీర్ణం చేసుకోవాలనే ఆరాటంతో తిరుగుతున్నాడు. ఈ దేవాలయంలో వున్నంతసేపూ, మహోద్వేగంతో ఆలోచిస్తాడు. ఉత్తేజితుడవుతాడు. యువరాజు అయితే ఉక్కిరిబిక్కిరే అయిపోయాడు. చాలా పుస్తకాలు కొనాలనిపించింది. చదవాలనిపించింది. కొనబోయినంత పని చేశాడు. జేబులో అణాకాసు గామోసు గావుకేక వేసింది నే నొక్కర్తనే ఉన్నానోయ్, నా మొహం చూస్తే పుస్తకాలివ్వరు సుమీ అంటూ.

నాకు తెలుసులే. నువ్వు ఎత్తి పొడవక్కరలే అన్నాడు యువరాజు. చదువుకుందామని బుద్ధిపుట్టి పుస్తకాలు కొనే తాహతు లేని యువరాజుకి అసహ్యం వేసింది. కనీసం ఒక్క పుస్తకం దొంగిలిస్తే – అన్న ఆలోచన దాకా వచ్చింది. బయటికొచ్చేశాడు అక్కడితో.

గుమ్మం దాటుతూ పెద్ద బ్రహ్మాండమైన కథ రాయడానికి నిశ్చయించాడు. తిన్నగా అమెరికా పంపేస్తే ఒక్కసారిగా ఏ పాతికవేలో వస్తుంది. ఝాంమని చక్కని ఇల్లూ, లైబ్రరీ, పెరట్లో స్విమ్మింగ్ పూలు, చక్కని పెళ్ళాం, మంచి రేడియో, లైబ్రరీ పుస్తకాలు, బుల్లి జర్మన్ కారూ, ఉంగరాల జుత్తుగల నల్లటి తీగలాటి డ్రయివరూ, బొచ్చుకుక్కా, తోలు పటకా ఏర్పాటు చేయవచ్చు. ఈ లోగా వరుసగా పజిల్సు కట్టేస్తే మళ్ళా ఏ లక్షో వచ్చి పడుతుంది.

యువరాజు కింకో తీయని అనుమానం ఉంది. అది అస్తమానూ పైకి తీయడు. అది వచ్చినప్పుడు అతని కెన్ని దృశ్యాలో స్ఫురిస్తాయి.

ఎక్కడో, ఎవరో, తన పేరుగలవాడు ఒక పజిల్ కడతాడు.

ఈలోగా తన దరిద్రం, క్షోభా భారీగా పెరిగి బ్రతుకు భారం అవుతుంది.

ప్రేమించిన పడతి వరించదు. డబ్బులేదని వాళ్ళ నాన్న అంతకన్నా వరించడు – బికారి వెధవ – అని అవమానితుడై ఆత్మహత్యకి మర్నాడు ముహూర్తం నిశ్చయించుకుంటాడు. ఇంకో గంట టైముందనగా, తన జీవిత పరిధిలోకి తొంగి

చూసిన అడా, మగా, పిల్లా, జెల్లా తన మరణానంతరం తన మీద ఎలా జాలిపడతారో టెక్నికలర్లో వూహించుకుంటూ వుంటాడు. అంతలో హఠాత్తుగా పజిలు కంపెనీ వాళ్ళు నానా హడావిడిగా వచ్చి తనకి ఫస్టు ప్రయిజు వచ్చిందని చెప్పి, తన ఆశ్చర్యం గమనించకుండా తన మాట వినకుండా బంపర్ ఆఫరు లక్షరూపాయలూ అంటగట్టి పదివేల రూపాయలు తన దగ్గర టిప్ తీసుకుని చక్కా పోతారు. అప్పుడు తనంటే కసివున్న వాళ్ళంతా ఉక్కిరిబిక్కిరయ్యేట్టుగా తన ప్రయిజు వెల్లడిస్తాడు. తనను నిన్న బికారి అన్న వుడ్ హోప్ బీన్ మావగారూ, ఆయన కూతురూ అన్నన్నా అనుకుని తనని శ్రీకరుడని పొగిడి పెళ్ళికి తయారవమంటారు. ఈలోగా ఎవరి ప్రయిజు తనకి పొరపాటుగా వచ్చేసిందో అతన్ని వెతికి పట్టుకుంటాడు తను. నిజం చెప్పి డబ్బు తీసుకోమనేసరికి వాడు భోరున ఏడ్చి సొమ్మసిలి తెప్పరిలి, సగం నీకే అని ఇచ్చేస్తాడు. న్యాయంగా ఆర్జించుకున్న ఈ డబ్బుతో... యువరాజు ఇక్కడితో కల ఆపేస్తాడు.

ఈ అనుమానం అతనికి చాలాకాలం నించి ఉంది. ఈసారి మాత్రం కాస్త ఇంకాస్త మెరుగైన ఆలోచన వచ్చింది – ఆ పజిలేదో తనూ కడితే మంచిదని. ఆ వెంటనే రోడ్డు మీద అర్ధరూపాయి కాసు దొరికేసరికి, విధి వైచిత్రి గురించి బోలెడు ఆశ్చర్యంతో గుండెలు బాదుకుని శుభస్య శీఘ్రమనుకున్నాడు. మళ్ళా మనసు మారకుండానే కిళ్ళీకొట్లో పజిలు కాయితం అడిగి పుచ్చుకుని పోస్టాఫీసువారి కలం సిరాబుడ్డీ సహాయంతో, నాలుగు బేడ ఎంట్రీలు నింపాడు. అంతకన్న ఎక్కువ అనవసరం, ఆత్మ విశ్వాసం కలవాడికి. అదృష్టం అర్ధరూపాయ బిళ్ళ వేషంతో వచ్చి హలో అంటున్న వాడికి ఠారున వచ్చి పడాలి ప్రయిజు. అర్ధరూపాయి పెట్టి పోస్టలార్డరు కొన్నాక కవరుకి డబ్బులు చాలవన్న జ్ఞాపకం వచ్చింది. ఉన్న అణా పెట్టి బుక్‌పోస్టులో పంపితే పోస్టల్ ఆర్డర్‌కి రెక్కలు మొలుస్తాయి. పోనీ మూడు ఎంట్రీలు పంపుదామంటే మనసొప్పలేదు. మూడు కీడుమూడే నంబరు. ముత్యం మూడన్న సామెత సయించలేదు. పైగా ఆ నాలుగోదే తనకి 70 వేలు తెచ్చే ఎంట్రీ కావచ్చు. ఆనక జుట్టు పీక్కుని చాలా ఇదిగా ఏడవాలి.

అణాకాసు, పోస్టలార్డరూ, పజిలు కాయితం జేబులో వేసుకుని వేటకెళ్ళాడు యువరాజు. కనీసం అణా దొరికితే చాలు. తిండి రేపు చూసుకోవచ్చు. ఎనిమిది గంటలయింది. అప్పిచ్చువాడు ఎవడూ కనబడలేదు. కనబడ్డవాడు ఎవడూ అప్పివ్వలేదు.

నీరసం ఎక్కువైపోతోంది. కళ్ళు చీకట్లు కమ్ముతున్నాయి. పసుప్పచ్చా, ఆకుపచ్చా, ముదర నీలి రంగులు కనబడుతున్నాయి. కళ్ళు నులుపుకుంటేగానీ రోడ్డూ మనుషులూ కంటికానడంలేదు. తలలో నరాలు ఉండుండి కంపిస్తున్నాయి. పళ్ళు పటపట కొరికి దవడలు పీకుతున్నాయి. శరీరంలోని ప్రత్యంగమూ యథాశక్తిని బాధపెడుతోంది. విపరీతమైన చలిగాలి వీస్తోంది. పైగా వాన మొదలెట్టింది. ఇదే హోల్‌సేల్ బాధ. అంటే లోపల బయటా కూడా హింస అనుకున్నాడు యువరాజు. పోస్టలార్డర్నీ పజిలు ఎంట్రీని చొక్కా కింద పెట్టి కాపాడుతూ.

అందమైన అమ్మాయిలు విలాసంగా వెళుతున్నారు. కుర్రవాళ్ళు ఈల వేస్తున్నారు. యువరాజు లేని ఉత్సాహం తెచ్చుకుని ఈల వెయ్యబోయాడు కాని పెదిమలు మండాయి. గొంతుకలో గులకరాయి అడ్డు నిలిచినట్లు నొప్పి పుట్టింది. ఈల రాలేదు.

కాఫీ తాగినా బాగుండును. అణాకి టీ వస్తుంది. సిగరెట్లు లేవు. గడ్డం పెరిగింది. పజిలు కట్టాలి. కాళ్ళు పీకుతున్నాయి. రూముకి నడవడం అసంభవం... ఇంటివాడి అద్దె... తల అడ్డంగా తాటించాడు. ఎదురుగా ఒక చిన్న హోటలుంది. జనం అట్టే లేరు. చరచర నడిచి వెళ్ళాడు డబ్బుల బల్ల దగ్గరికి.... చూడండి. నేను డబ్బు పారేసుకున్నా. మా ఇల్లు దూరం. మీకేం అభ్యంతరం లేకపోతే యీ పోస్టలార్డరు తీసుకుని అర్ధరూపాయిచ్చెయ్యండి.

నాదేముందండి – ప్రొప్రయిటర్ని అడగండి. అదిగో ఆయనే అన్నాడు వాడు గట్టిగా.

ఒళ్ళు చచ్చిపోయినట్టయింది. ఎవరూ వినలేదు గదా! తెగించాడు – కాఫీ తాగుతున్న ప్రొప్రయిటరుతో దగ్గరచేరి మెల్లిగా చెప్పాడు.

మా కెందుకండి ఇది – అయినా ఆరణాలు తీసుకోండి అన్నాడు.

ఆలోచించడం మానేసి సరే అన్నాడు యువరాజు. కృతజ్ఞతా పూర్వకంగా పోస్టలార్డర్‌తోపాటు తను నింపిన ఎంట్రీ కాయితము – ఆల్ కరెక్టు వస్తుందని హామీ ఇచ్చాడు.

ఆరణాల్లో రెండణాలు కాఫీ తాగాడు. ఇందాక అణాతో కలిసి ఇంకా అయిదణాలుంది. చార్‌మినారు సిగరెట్టు పెట్టె అగ్గిపెట్టె కొనేశాడు. మూడణాలు మిగిలింది. బస్సుకి బేడవుతుంది. మాసిన గడ్డంతో అంత కంటె మాసిన బట్టలతో ఒక్క పెద్దమనిషి సమీపించాడు.

ఇంగ్లీషులో ఆరంభించి తెలుగులో ముగించిన అతడి అభ్యర్థన సారం ఇది. అతని పర్సు పోయిందట. ఇల్లు చాలా దూరం. చప్పున వెళ్ళాలి. తన దగ్గర అణా స్టాంపు ఉంది. అది తీసుకుని అణా ఇస్తే....

యువరాజుకి ఏడుపు పొంగుకొచ్చింది. ఎటువేపు బస్సెక్కుతారు? అన్నాడు. నయమే. తూర్పువేపు వెళ్ళే బస్సు. తను వెళ్ళేది పడమటికి. స్టాంపు తీసుకుని అణా ఇచ్చాడు. ఆయన మళ్ళీ ఇంగ్లీషులో బాధపడి వెళ్ళిపోయాడు.

నేషనల్ సేవింగ్సు సర్టిఫికేటును కొనండి అంది బస్సు మీది బోర్డు. ఆ! ఆ! కొన్నామండి. ఇపుడే – అనుకుంటూ అణా స్టాంపు చూసి నవ్వాడు యువరాజు. బస్సెక్కి కిటికీ దగ్గర కూచున్నాడు. అమ్మయ్య అని.

బస్సులో కూచుని పది నిమిషాల సేపు మరణించాడు యువరాజు. మెల్లిగా తిప్పి ప్రారంభమయింది. మరో మూడు నిమిషాలకి భరింపరానంతగా తిప్పసాగింది; కణతలు వేడెక్కాయి. ఒళ్ళు కాలిపోతోంది. కళ్ళు భగ్గుమంటున్నాయి. పళ్ళు గిట్టకరుచుకుని చలి తట్టుకుంటున్నాడు. తను దిగాల్సిన చోటు వచ్చింది. బస్సు దిగుతూనే భళ్ళున వాంతి అయింది. జనం చుట్టూ చేరి జాలిపడి సోడా తాగమని సలహా ఇచ్చారు.

లేచి సోడాకొట్టు కెళ్ళాడు. స్టాంపు బయటకు తీసి మళ్ళా పాఠం వప్పజెప్పబో యాడు.... ఈ అణా స్టాంపు తీసుకుని... మతిపోయింది. కళ్ళు పెద్దవి చేసి మళ్ళీ పరిశీలించాడు. అది వాడిన స్టాంపు. దాని మీద ముద్ర ఉంది....

కొంచెం మంచినీళ్ళు ఇస్తావోయ్ వాంతి అయింది అన్నాడు.

మొహం కడుక్కుని బయల్దేరాడు రూముకి. పది దాటింది. ఇంటివాడు నిద్రపోయి ఉంటాడు. మెల్లిగా రూము చేరితే హాయిగా దుప్పటి కప్పుకుని కమ్మగా ఆలోచించుకుంటూ ఆశపడుతూ పడుకోవచ్చు. తెల్లారకట్టే మళ్ళీ వాడు లేచేలోగా వెళ్ళిపోవాలి.

కోళ్ళ దొంగ పద్ధతిలో ఉంది అనుకున్నాడు యువరాజు మేడ మెట్లెక్కుతూ. రెండు నిమిషాల అనంతరం వెచ్చగా దుప్పటి కప్పుకుని పడుకున్న యువరాజుకి పొద్దుటి మహరాజు జ్ఞాపకం వచ్చాడు.

☆ ☆ ☆

పది గంటలకి రోడ్డు కుళాయి దగ్గర పూటుగా నీళ్ళు తాగిన మహరాజుకి పులక మారింది. బాకీ వాళ్ళు తల్చుకుంటున్నారు అనుకున్నాడు. రాత్రి తొమ్మిది వరకూ, కాలికి బలపం కట్టుకు తిరిగిన మహారాజుకి కానీ అప్పు పుట్టలేదు.

దాదాపు తనకి తెలిసిన పదిమంది స్నేహితులూ ఎన్ని బాధలు పడుతున్నారో వాళ్ళ దగ్గర ఇవాళ మధ్యాన్నందాకా ఉన్న రెండు రూపాయలు ఎలా ఎలా ఖర్చు పెట్టి యాతనలు పడ్డారో సవివరంగా విన్నాడు. సానుభూతి చూపాడు. కొందరి కోసం కన్నీళ్ళు కూడా కార్చి తన తల తాకట్టు పెట్టేనా వాళ్ళకి అప్పు పెడతానని హామీలు ఇచ్చాడు.

తొమ్మిదిన్నరకి వానలో నడుస్తూ తన పెళ్ళాం బిడ్డల మీద జాలిపడడానికీ, తనని తనే ఏవగించుకోవటానికీ ఉపక్రమించాడు. తనకి పట్టాభిషేకం చేసిన పెద్దల్నీ, ఆనాడు చందన తాంబూలాది సత్కారంబులందుకుని ఆశీర్వదించిన పెద్దల్నీ తిట్టుకున్నాడు. కొంప చేరేసరికి పెళ్ళాం బిడ్డలు మేలుకుంటే బావుండదు. మొహం చెల్లదు. ఇత్తడి చెంబేదని పెళ్ళాం అడిగితే ఏం చెప్తాడు?

అప్పు దొరకడం లేదు – పిల్లలు పస్తున్నారంటే ఏమనాలి? అందుకే వాళ్ళు నిద్రపోయేక తను నిశ్శబ్దంగా వెళ్ళి అరుగు మీద పడుకుంటే మంచిది. పొద్దున్నే లేచి గట్టిగా ప్రయత్నించి – లేపోతే పెద్దమ్మ కాళ్ళే పట్టుకుని మరో రూపాయి సంపాదించి ఇంటి మొహం చూడొచ్చు. మహరాజుకి ఆకలేసింది. తిరిగి తిరిగి వున్న మీదట ఒళ్ళు తూలుతోంది. కోటూ పంచా తడిశాయి.

మంచినీళ్ళు తాగడానికి రోడ్డు కుళాయి దగ్గర ఆగాడు. ఎవరో మహరాజు విలాసంగా పాడుకుంటూ సైకిలు మీద వస్తున్నాడు. తెలిసినవాడేమో.... సైకిలు వెళ్ళేవరకూ ఆగి కుళాయి నొక్కాడు. నోరు తెరిచాడు – వంగి.

ఒక్కసారిగా ఏడుపు పెల్లుబికింది. గట్టిగా ఏడవాలనిపించింది. చుట్టూ చూశాడు. దగ్గరలో ఎవరూ లేరు. కుళాయి గట్టు మీద కూచున్నాడు. రెండు చేతుల్తో మొహం మూసుకుని, భోరున గుండెలవిసేలా నరనరాలు కదిలిపోయి నాభి కంపించేలా ఏడిచాడు. నిముషంసేపు తన ఏడుపు తనే విన్నాక కొంచెం

బరువు తగ్గింది. మరో కెరటం పొంగింది – కుమిలి కుమిలి ఏడిచాడు. వేడి కన్నీళ్ళు ధారాపాతంగా ప్రవహించాయి. ఎంతో హాయినిచ్చింది ఆ ప్రవాహం. అప్పుడు, అంతకన్నా భగవంతుడు చెంపలు నిమిరినట్లయింది.



చాలారోజుల తరువాత ఈనాడు దేముడు జ్ఞాపకం వచ్చాడు. అప్రయత్నంగా ఆకాశానికి నమస్కరించాడు. వెంటనే యిటూ అటూ చూశాడు – ఎవరేనా చూశారేమోనని. నవ్వుకోబుద్ధేసింది. కానీ నవ్వు రాలేదు. కాస్త తేలికబడిన మనసుతో చల్లని నీళ్ళు పెట్టి మొహం కడుక్కున్నాడు. పొట్టపూటుగా నీళ్ల తాగేశాడు. పలక మారింది. ఎవరో తలచుకుంటున్నారు గాబోలు అనుకున్నాడు చొక్కాతో మొహం తుడుచుకుని ఇంటికి బయలుదేరుతూ....

స్వస్తి: .

వెచ్చగా దుప్పటి కప్పుకుని విప్పారిన కళ్ళతో చీకటి చూస్తూ వెల్లకిలా పడుకున్న యువరాజు మహారాజును గుర్తుకు తెచ్చుకుని అతనిదే జీవితమనుకున్నాడు. ఎక్కడెక్కడ తిరిగినా కొంప చేరేసరికి వచ్చారా అనడానికి భార్యా, నాన్నా అండానికి పిల్లలు....

ఎన్ని కష్టాలున్నా కలోగంజో తాగుతూ ఆనందాన్వేషణలో వున్న సుఖాన్నో, సౌఖ్యాన్వేషణలో వుండే ఆనందాన్నో పొందవచ్చు. నా అన్న వాళ్ళుంటారు. గృహమే కదా స్వర్గసీమా....

సరిగ్గా అదే సమయానికి ఓరగిలా వేసివున్న తలుపును మెల్లిగా తీసి లోపలికెళ్ళి

పెళ్ళాంబిడ్డలు నిద్రపోతున్నందుకు దేవుడికో దణ్ణం పెట్టుకుని, నిశ్శబ్దంగా మంచం కదలకుండా శయనించి కోడిగుడ్డు దీపాన్ని చూస్తున్న మహారాజుకి యువరాజు గుర్తుకొచ్చాడు.

ఏ సంసార తాపత్రయం లేని స్వేచ్ఛాజీవి. పక్షిలా విహరిస్తాడు. ఉంటే తింటాడు, లేకపోతే గుక్కెడు నీళ్ళు తాగి కడుపులో కాళ్ళెట్టుకు పడుకుంటాడు. బెంగా బెడదా ఉండదు. అతని పనే హాయి....

నిద్ర కుపక్రమిస్తున్న మహారాజూ యువరాజూ కూడా ఆకారం ఏర్పడని, తమకే అర్థంకాని ఈ కోరికలని నెరవేర్చవలసిందని పరమేశ్వరుణ్ణే ప్రార్థిస్తూ ఒకే ముహూర్తాన చేతులు జోడించి మనసారా నమస్కరించారు.

★ ★ ★

# అర్థాన్వేషణం

అనగనగా ఒక భావి భారత పౌరనిర్మాత. శివాజీ గురువుకి జీతం ఎంత ఇచ్చేవారో తెలియదుగానీ, ఆయన నెలజీతం....

అందువల్ల ఒక నరసన్న మాస్టారి జీతం ఎంతో పబ్లీకువ చెప్పకోకపోయినా రూపాయికి రెండర్ధరూపాయల బదులు, కనీసం మూడు ఇప్పిస్తే, ఈపూటా ఆపూటా ఇబ్బంది ఆటే లేకుండా కాలక్షేపం చెయ్యవచ్చునంటే సరిపోవచ్చు.

నరసయ్య మేస్టారికి ఈ మూడో అర్ధరూపాయే సమస్య. పెద్ద సమస్య. గంపెడు పిల్లలు 'తల్లి – సమస్య'. సర్కారు వారు మూడో అర్ధరూపాయికి బదులు మూడు వందల సలహాలూ, ముప్పై హామీలూ, కొల్లలుగా కన్నీళ్ళూ చదివించారు. అవన్నీ కూడి, గుణించి, భాగించీ, అవస్థపడి జీర్ణించుకున్న తరవాత బెంగపడే మేస్టారు, బాధపడే భార్యా, వేధించే కుమారరత్నం, కుమారీమణీ, దొరకని మూడో అర్ధరూపాయి, దానికోసం నోరు తెరుచుకు కూర్చున్న బియ్యపు డబ్బా, బొగ్గుల బస్తా, పోపుల పెట్టి, బాకీ లిస్టు, కొశ్చన్ మార్కూ శేషం వచ్చాయి.

ఈ కూడని శేషం రాకూడదని ఆయన ఆశ. అందుకు నరసన్నగారికి తెలిసినదారి ఒకటే. పట్టాభిషేకం అయి బడిపంతులు ఉద్యోగం చేపట్టిన నాటినుండి ఆయన ఆ దారినే నడుస్తున్నాడు......

☆ ☆ ☆

ఒక ఆదివారం ఉదయం ఆయన, దొరకని మూడో అర్ధరూపాయి కోసం రోడ్డెక్కడానికి ముస్తాబయ్యాడు. అప్పటికి ఆయన జీతం అంది కొంతకాలమే అయినా ఇంకొంతకాలంలోనే అందెయ్యబోతోందని రూఢిగా వార్తలు అందడంతో కొంత హుషారు యింకొంత ధైర్యం వచ్చాయి. దానికితోడు అటు మొన్నటి వార్తాపత్రికలో పెద్దల ఉపన్యాసాలు బోలెడు ధైర్యం చెప్పాయి. అందరికన్నా నువ్వే గొప్పవాడివి సుమీ అన్నాయి. వెధవది డబ్బు ముఖ్యమా అని అడిగాయి. కాదు సుమా అని అవే జవాబు చెప్పాయి. భారత భాగ్యవిధాతలను రూపొందించి, తీర్చిదిద్దడంలో నరసన్నగారు మహత్తర భూమిక నిర్వహిస్తున్నట్లు వెల్లడించి, అది ఎంత మహత్తరమో విడిగా ఎలుగెత్తి చాటాయి. నరసన్నగారు సగర్వంగా తల తాటించాడు. ఆ దేవతా వస్త్రాలు ధరించి ఒకసారి వంటింటోకి తొంగి చూసాడు. 'జానే' .... అని పిలిచాడు. "నేనేం చేస్తున్నానో తెలుసా?" అన్నాడు దర్జాగా.

"ఏముంది అప్పకి బయల్దేరుతున్నారు" అందావిడ; చారు పోపులో వేసే మిరపకాయలని రెండుతో భాగించవలసి వచ్చినందుకు విచారిస్తూ.

నరసన్నగారు ఫకాలున నవ్వి "అది మామూలు కథే. నేను చేస్తున్న మహత్తరమైన పని ఏమిటి?" అన్నాడు. ఆవిడ మాట్లాడలేదు.



"భావి భారత భాగ్యవిధాతలను తీర్చి దిద్దుతున్నానుట."

ఆవిడ నవ్వింది. "ఉద్ధరిస్తున్నారు లెండి. కాని...."

"షరే. అది కూడా చేస్తున్నానుట. ఆ ముక్క కూడా పత్రికలో రాశారనుకో."

"ఇప్పటికి అయింది చాలుగాని శేషయ్యగారొచ్చి కూర్చుంటాడు పీకెలమీద. త్వరగా వెళ్ళి ఆ యాభై పుట్టించుకురండి. లేకపోతే చెంబూ తపేలా వేలం వేస్తాడు" అందావిడ.

"వెళ్తున్నానుగా. నాకు మాత్రం ఏ రోడ్డు తొక్కినా ఎవడో ఓ ఋణదనాధం అమాంతం మీద వాల్తాడని భయంగా ఉంది" అంటూనే ఆయన గుమ్మం దాటి వీధిలో కాలు పెట్టాడు. పెడుతూనే ఓ పెద్దసైజు ఋణదరాజు సుడిగాలిలా వచ్చి, వరసన్నగారిని నానామాటలూ అనేసి ఉక్కిరిబిక్కిరి చేసేసి హాట్ హూట్ అనేసి హడలకొట్టేసి రివ్వున వెళ్ళిపోయాడు.

ఆరోజు సాయంత్రానికల్లా బాకీ చెల్లించకపోతే మర్నాడు సోమవారం బళ్ళోకొచ్చేసి ఒంటిగంటలోగా పరువుని నట్టేట, సాయంత్రానికల్లా ఉద్యోగాన్ని గంగలోనూ కలిపేస్తానని ధైర్యం చెప్పి మరీ వెళ్ళాడు ఋణదుడు.

వరసన్నగారు సగం చచ్చిపోయారు. మిగతా సగంతోటే అర్థాన్వేషణకి బయల్దేరాడు. అడుగడుగునా ఒక సుడిగాలి వచ్చి పడేది. ఒక్కొక్కసారి అది వడగాలిలా వచ్చి గూబ

వాయగొట్టేది. ఎక్కడికక్కడ సంజాయిషీ ఇచ్చుకుంటూ వాయిదా వేదుకుంటూ అడుగులు వేస్తున్నాడు నరసన్నగారు.

సుడిగాలికీ సుడిగాలికీ మధ్య, అప్పులు, మిత్రులు, పరిచితులు, శిష్యుల తండ్రులూ అక్కడక్కడ కనబడ్డపుడు ఆకాశానికెగిరాడు నరసన్నగారు. ఎక్కడికక్కడ తన కథ చెప్పుకుంటూ, బ్రతిమాలుతూ, బామాలుతూ, తనకి వారం రోజుల్లో రావలసిన మొత్తాలూ, పదిరోజుల్లో వచ్చే తేదీ మనియార్డర్లు, పదిహేను రోజులు తిరిగేసరికి ఒరిగిపడే పెద్ద మొత్తాలు, వాళ్ళకి వివరిస్తూ, వాళ్ళకి హామీ ఇస్తూ, తనని నమ్మించుకుంటూ, ఓదార్చుకుంటూ, ఆశ పెట్టుకుంటూ, ఒట్టు పెట్టుకుంటూ అడుగులు వేశాడు నరసన్నగారు.

☆ ☆ ☆

హఠాత్తుగా వీధిలో సంచలనం రేగింది. దీర్ఘదర్శులు అయినవాళ్ళంతా అందు బాటులో ఉన్న సైకిళ్ళూ, బళ్ళూ ఎక్కి హడావుడిగా వెళ్ళిపోతున్నారు. వాహనాలు లేనివాళ్ళంతా 'వాకింగ్‌రేస్' వేసుకున్నట్లు చకచక నడచివెళ్ళిపోతున్నారు ఎక్కడి పనులు అక్కడ వదిలేసి.

ఇందరిని ఇంత హడలేసిన ఆ ఉత్పాతం ఏమిటా అని నరసన్నగారు కొంచెం ఆగి పరకాయించి చూశాడు.

నల్లనివాడు, నాలుగే అడుగుల పొడుగువాడు, దడదడ అడుగులు వేసుకుంటూ వచ్చేస్తున్నాడు. అతని సన్నని, నల్లని కళ్ళు రెండూ అతి బహిరంగంగా సిగ్గూ – లజ్జా, డాబూ దర్పం లేకుండా నవ్వేస్తున్నాయి. పారిపోయిన వాళ్ళకి పగ్గాలు తగిలించి, బిగించి, నిలేసి, కుదేసి, నువ్వు నవ్వితీరాలంటున్నాయి. అవి నవ్వుతున్నాయి. అవి నవ్వాక అతను కూడా నవ్వుతున్నాడు. ఆపైన అప్పు అడిగేసి పుచ్చేసుకుంటున్నాడు.




పారిపోయిన దీర్ఘదర్శులు పారిపోగా, మిగిలిపోయిన ప్రాప్తకాలజ్ఞులంతా అతని చూపులు గుచ్చుకోకుండా మొహాలు ఎటో తిప్పేసుకుంటున్నారు; కొందరు చేతికి దొరికిన పుస్తకాలు, పేపర్లు, అవీ లేకపోతే జేబులో పద్దుబుక్కులు, విజిటింగ్ కార్డులు, కొట్ల మీద బోర్డులూ విపరీతమైన శ్రద్ధతో చదివేస్తున్నారు. ఈశ్వరేచ్ఛవల్ల ఇంకొంచెం సమయస్ఫూర్తిగలవాళ్ళు 'ఆ బేడా యిచ్చి, భారతీయ వర్తక వాణిజ్య రంగాల పురోభివృద్ధికీ, తద్వారా పంచవర్ష ప్రణాళిక సర్వతోముఖ విజయానికీ యథాశక్తిగా ఎందుకు తోడ్పడరా'దన్న ఊహతో దగ్గర్లో ఉన్న కాఫీ హోటల్లోకి దూరిపోతున్నారు. ఆ మాత్రం ఊహకూడా లేనివారు అతనికి దొరికిపోతున్నారు. కానీ ఉండడానికి ఆస్కారం లేదని నిదర్శనాలు చూపి మరీ నిరూపించబోయిన జేబులోంచి గూడా అతను అర్ధోపర్ధో అప్పుపుట్టిస్తూనే ఉన్నాడు.

అర్జంటుగా ఎక్స్‌రే ఫోటోలు తీస్తున్న అతని కళ్ళు క్షణంలో సగంసేపు నరసన్నగారి మీద వాలాయి. అతను ఆయనకు తెలుసు. నరసన్నగారి కళ్ళు ఆ సంగతి మర్చిపోయినట్టుగాని, జ్ఞాపకం లేనట్టుగాని, తెలియనట్టుగాని అభినయించలేదు. నిజం చెప్పి ప్రతిపోసం విసిరాయి. ఎక్స్‌రే ఫలితాలు చూచుకొని, ఆయనవంక జాలిగా ఓ చూపు చూసి ఆయన తరువాత కాతాదారు మీదకు ఉరికాడు.

☆ ☆ ☆

దొరకని మూడో అర్థరూపాయి కోసం వేట కొనసాగించారు నరసన్న మాస్టారు. పది, పదకొండు, పదకొండున్నర, ముప్పావు, యాభై, యాభైఐదు, ఆరు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, తొమ్మిదిన్నర, 12 అయ్యాయి.

ఎండ, గాడుపు, ఆకలి, అవమానం మండుతున్నాయి; గూబలు వాయగొడుతున్నాయి. నిస్త్రాణ, బెంగ క్షణక్షణం..... పెరుగుతున్నాయి.

"అయ్యా నరసన్నగారూ ఇంటికి దయచెయ్యండి: కాస్త ఎంగిలి పడదాం" అన్నాడు కడుపులో కాముడు.

"ఏడిశావు లేవోయ్. పూర్తిగా తగ్గిపోవోయ్. ఇవాళ ఈ యాభై అప్పు పుట్టించకుండా ఇంటికి వెళ్ళడానికి వల్లకాదు" అన్నాడు నరసన్నగారు.

"మీ ఇష్టం అఘోరించండి"

"చిత్తం మీరు కాస్సేపు నోరు మూసుకోండి".

"పోనీ కలర్.... కనీసం ఒకసోడా కొనిపెట్టండి."

నరసన్నగారికి ఒళ్ళు మండిపోయింది. పెంకెభడవా హన్నా అనుకున్నాడు. తిన్నగా వీధి కుళాయి దగ్గిరికెళ్ళి పొట్టపూటుగా నీళ్ళెక్కించేశాడు. అక్కడితో కడుపులో కాముడు ఊపిరి సలపక ఉక్కిరిబిక్కిరై నోరు మూసుకున్నాడు.

మూడుగంటలు వేశారు. ఇంకో అరగంట కూడా గడచింది. నరసన్నగారికి దమ్మిడీ పలకలేదు. అరగంటలు తిరిగిన కొర్డీ సోమవారం దగ్గర కొచ్చేస్తోందన్న భయం ఎక్కువ కాసాగింది.

అప్పులవాళ్ళు పీకలమీద కత్తిలా ఉన్నారు. ఉదయం బెదిరించిన ఆసామి అన్నంతపనీ చేసి తీరతాడు. మధ్యాహ్నానికల్లా పరువు సాయంత్రానికి ఉద్యోగం నాశనం చేస్తాడు. ఆ తరువాత?

"ఆకలి" అన్నాడు అప్పుడే నిద్రమేలుకున్న కడుపులో కామేశం.

నరసన్నగారు సమాధానం చెప్పలేదు.

"ఆ చెట్టున మామిడిపండుంది. ఈ సందులో ఎవరూ లేరు. చటుక్కున అది కొయ్యరాదూ" అన్నాడు కామేశ్వరరావు.

"తప్పు" అన్నాడు నరసన్నగారు కాస్త గంభీరంగా. అన్నాక, కొంచెం సంతోషం, ఒక్కరవ్వ గర్వం కలిగాయి. కలిగాక కొంచెం సత్తా వచ్చింది.

ఈ కాస్తకీ మహాపురుషుడవనుకుంటున్నావా అన్నారెవరో సన్నగా.

"లేదనుకో. అయితేనేం...."

సందు మలుపు తిరిగిన నరసన్నగారికి అల్లంతదూరాన, తప్పకుండా అప్పిచ్చేటంత

మంచి మనిషి కనబడ్డాడు. ఉత్తర క్షణంలో అల్లంత దూరానికి, ఇల్లివతలగా నిలబడ్డ ఓ వడ్డీబాబు కనబడ్డాడు.

నరసన్నగారికి ప్రాణం లేచొచ్చి మళ్లాపోయింది.

ఇతణ్ణి దాటివెళ్తేగాని అతడందదు; అప్పు దొరకదు. ఇతణ్ణి దాటడం సుఖాంతం బొత్తిగా కాదు. ఇతగాడికి ఈయనగారు పాతిక వరకూ బాకీ. ఈయన ఇచ్చుకోలేదు. ఆయన ఊరుకోలేదు.

'జేసన్ అండ్ ది గోల్డెన్ ఫ్లీస్' పాఠం జ్ఞాపకం వచ్చింది నరసన్న మేష్టారుకి. 'డ్రాగన్' అనుకున్నాడు కసిగా.

ఆయనకి దారి పాలుపోని ముహూర్తాన హఠాత్తుగా, నల్లనివాడు, నాలుగే అడుగుల పొడుగువాడు, పొద్దున్న కనపడ్డవాడు రివ్వున దూసుకుపోయాడు. ఆ ఊపుకి, ఆ జోరుకి 'డ్రాగన్' కూడా అదిరిపోయి సైకిలెక్కి ఉడాయించేసాడు. నరసన్నగారు ఎగిరి గంతేసి అల్లంత దూరాన ఉన్న అప్పిచ్చేమంచాయన కోసం బయల్దేరాడు కానీ, ఆయన కూడా చూపుమేరలో పత్తా లేకుండా పోయాడు.

"హోరి నీయిల్లు బంగారంగాను" అనుకున్నాడు నరసయ్యగారు.

పూర్తిగా మతిపోయి, నిరాశపడిపోయి, దిగులుగా తాలుకాఫీసు వీధి తూముకి ఒక్కక్షణం జేరబడ్డ నరసన్నగారికి హఠాత్తుగా నల్లనివాడు నాలుగే అడుగుల పొడుగువాడు మళ్ళీ తటస్థపడ్డాడు. ఈసారి ఆగి పలకరించాడు.

"ఎంతకోసం?" అన్నాడు.

"నీకెందుకు నాగోల? నువ్వేం ఆర్చేవాడివా తీర్చేవాడివా?" అన్నట్టు చూశాడు నరసన్నగారు.

"అలాటివాడు ఉంటేగింటే, ఉన్నవాళ్ళలో ఎవడేనా అయితే గియితే నేనే" అన్నట్టు కాస్త దర్జాగా, కొంచెం లాలనగా చూసి నవ్వాడు అతను.

నరసన్నగారు చెప్పాడు.

"దాందుంపతెగా నా దగ్గిర లేదండి... అంటే దొరకలేదన్నమాట. అయితేనేం నేను చెప్పినట్టు చెయ్యండి. మిమ్మల్ని ఆదుకుంటే నాలాటివాడే 'కోవాలి'. నేను 'కోవడం' లేదు. కాబట్టి 'కునే' వాణ్ణి మీకు చూపిస్తా, వెళ్తారా?"

నిరాశయ్యగారికి ప్రాణం లేచొచ్చింది.

"బాబ్బాబు మీమేలు మర్చిపోను."

"మరేం ఫర్వాలేదు. తిన్నగా వెళ్ళి కుడివేపు తిరగండి. ఆ వీధి చివర ఎడంవేపు సందులోంచి వెళ్ళొచ్చుగాని, అందులోని ఇద్దరికి మీరు బాకీ ఉన్నారు. అందుకని, పరాసరి వెళ్ళి, ఇంకో సందుదాటి, ఆ మైదాంట్లోంచి చెరువుగట్టు మీదుగా సినిమా హాలు దగ్గరికి వెళ్ళండి. అక్కడ రావు కిళ్ళీ బడ్డీ దగ్గర బల్లమీద బొద్దుగా, పొట్టిగా ఉండే ఒక ఆసామి కనబడతాడు. అతను మీకు తెలుసు. మిమ్మల్ని అతను ఎరుగును. వెళ్ళండి. వెళ్ళి అడగండి. మీ కష్టం ఆదుకునేవాడు అతనొక్కడే. అప్పాలకు పెట్టింది పేరు. నన్ను మించినవాడు. గురువంటివాడు. పేరు తెలుసుగా అప్పన్న."

నరసన్న మేష్టారు ఆశ్చర్య సంభ్రమ సంతోషాలు వెలిబుచ్చి, సరాసరి తన శ్రేయోభిలాషి చెప్పిన మార్గాన బయల్దేరాడు. మజిలీలు, దాగుడు మూతలూ

లేకుండానే అక్కడికి చేరుకున్నాడు. అప్పన్న ఆయనకి కొద్దిగా తెలుసు. అతని పూర్తిపేరు అప్పలస్వామి. ఉద్యోగం బెడద లేకుండానే ఓ మోస్తరు దర్జాగా కాలం గడుపుతున్నాడు.

నరసన్నగారు అతన్ని చూచి నవ్వారు. గంభీరంగా బీడీ కాలుస్తున్న అప్పన్న ఒకసారి ఆయనని నఖశిఖ పర్యంతం చదువుకుని, కూర్చోమన్నాడు. కుశలం అడుగుతూ బల్లమీద కూర్చున్నారు నరసన్నగారు.

"మీ దయవల్ల బాగానే ఉన్నా గాని...."

"కానీ ఏమిటి?"

అప్పన్న హుందాగా నవ్వాడు.

"బాబూ మీరు చెప్పక్కరలేదు. నాకు తెలుసులెండి. ఒక్కమాట చెప్పనా?"

యాభై అప్పిస్తే ఒకటి కాదు వందమాటలు వినడానికి సిద్ధంగా ఉన్నారు నరసన్నగారు.

"నాక్కూడా కొంచెం ఇబ్బంది వచ్చిందండి. నేనుకూడా రెండు రోజుల్నించి రెండొందల యాభై కోసం ప్రయత్నిస్తున్నాను."

"నిజమే. అయితే చూశావూ ఈ సాయంత్రం దీపాలు పెట్టే వేళకి నేను యాభై జతపరచకపోతే పీకలమీద కొచ్చేనే" అన్నారు నరసన్నగారు బాధగా.

అప్పన్న మందహాసం చేశాడు. "హు" అన్నాడు మృదువుగా, లోకం తీరును ధ్వనిస్తూ. క్షణం ఆలోచించాడు. ఓ బీడీ తీసి ముట్టించాడు.

"భ్రమండి. అంతా భ్రమ. ఇబ్బంది కొద్దీ మీరలా అనుకుంటున్నారుగాని పీకల మీద కొచ్చేదేముంది నా బొంద."

నరసన్నగారికి గుండె గుభేలుమంది, కొంపదీసి ఇవ్వనంటాడేమోనని.

"నీకు మళ్ళీ వారంలోగా ఫిరాయించేస్తా ఈసారికి ఆదుకో. మంచివాడివి. లేకపోతే పీకెలమీదికి..."

"పెద్దలు తమరే అలా అంటే నే చెప్పేదేముందండి. మీ భయమే కాని.... అయినా కాపోయినా ఒక్కమాట చెబుతా వినండి బాబూ. మనవంటి వాళ్ళకి అసలు పీకెలమీదికి రానిదెప్పుడు? మీకివాళ యాభైరాళ్ళు అప్పు పీకెలమీద కూర్చుంది. నేనిచ్చానే మీరు తీర్చారే పీకెల మీది ముప్పు తప్పించుకున్నారే అనుకోండి. మళ్ళా రేపు సాయంత్రానికే ఇంకో ఉప్పెన వచ్చిపడుతుంది. అది గడిస్తే, ఇవాళ డబ్బు సర్దిన నేనే ఎల్లుండి సాయంత్రం పీకెలమీద కత్తినౌతాను చూశారూ....."

నరసన్నగారి నాలుక పిడచ కట్టుకుపోయింది. మాట రావటంలేదు. "ఇపుడు లేదంటావా ఏమిటి... చచ్చానే...." అన్నాడు.

అప్పన్న నవ్వాడు. "బాబూ! మీరూ నేనూ మనవంటివాళ్ళం అంతా రోజూ గండాలు దాటుతూనే ఉంటాం. పీకెలమీది కత్తులూ, గండాలూ మన్నేం చెయ్యవు. మీకివాళ డబ్బు దొరకదనుకోండి. అప్పులాడికేదో చెప్పకుంటారు. వాడు ధాంధూం అంటాడు. అని?.... ఏముంది సరే మళ్ళీ వస్తానంటాడు. ఎల్లుండి ఇచ్చేస్తారు. మళ్ళా ఆవలెల్లుండి ఎక్కడో పుచ్చుకుంటారు. ఆ మర్నాడు మళ్ళా గండమే కదా? అదే మన కథ. మీరు చెప్పినట్టే అయితే నాకు రెండొందల ఋణం మూలంగా మొన్న

సాయంత్రం ఐదు గంటలకి పీకె తెగిపోయి ఉండాలి.... అక్కడికీ తిరిగా. ఇప్పుడు విసుగేసి గంటాయి ఇక్కడే కూలబడున్నా. చూశారూ.... అందరం ఇంతే....."

నరసన్నగారు తల వంచుకున్నాడు ఏం తోచక. ఉదయం పదినుండి తిరిగిన తిరుగుళ్ళు, అడిగిన అప్పులు, పుచ్చుకున్న జవాబులు, సలహాలూ, విన్న ఏడుపులూ గిర్రున తిరిగాయి.

ఒక పిసరు జ్ఞానోదయం కలిగినట్టై ఎండిన చిరునవ్వొక్కటి సందేహిస్తూ పెదిమల మీదకు వచ్చింది.

"అర్థదీ. అలా ఉండాలి. అందుకని ఇంక ఆటే శ్రమపడకుండా ఆ అప్పులాణ్ణే సముదాయించి, బతిమాలుకుని...." నరసన్నగారికి అప్పన్న మాటలు వినబడలేదు.

దొరకని అర్థరూపాయిని తనని తిట్టుకున్నాడు. "నువ్వన్నది నిజమేలే" అన్నాడు రెండు నిముషాల క్రితం అప్పన్న ప్రవచించిన సత్యానికి జవాబుగా.

"వస్తానోయ్" అని బయల్దేరాడు నరసన్నగారు. అప్పటికి ఆయన మనసు తేలికపడింది. ప్రశాంతత ఆయనలో పరుచుకొనడానికి ఉపక్రమించింది... మెల్లిగా అడుగులు వేస్తూ ఇంటికి బయలుదేరారు....

☆ ☆ ☆

అన్వేషణ విరమించుకున్న నరసన్నగారు ఐదడుగులు వేసేవరకు "బాబూ నరసన్నగారూ" అన్న పిలుపు వినబడింది.

అప్పన్న బల్లదిగి రెండు అడుగులు ముందుకు వేశాడు.

"బాబూ చిన్న మనవి.... ఏం లేదు ఈ కిళ్ళీకొట్టు వాడికీ నాకు ఆ మధ్య కొంత బెడిసింది. అయినా ఇవాళ తిరిగి తిరిగి నోరెండి, గతిలేక వీడి దగ్గరే కలరు పుచ్చుకుని తాగేసి అరువు పెట్టాను. నాకు చూస్తే రాత్రి ఎనిమిదికల్లా రెండొందలు దొరక్కపోతే, యములాళ్ళు వచ్చి పడతారు. వీడు చూస్తే కలరు డబ్బులు ముందిక్కడ పెట్టిగాని కదలడానికి వల్లకాదంటాడు. వెధవ అక్కసూ వాడూను. అంచేత నేను ముందిక్కణ్నుంచి బయటపడితే, ఇంకో నాలుగు వీధులు తిరగొచ్చు. చూశారూ.... అంచేత ఒక్క బేడా అర్దణా సర్దితిరా...."

★ ★ ★

బాల రమణీయం

# భోగిమంట

ఒరేయ్ అసలిదేం భోగిమంట లేరా. పూర్వకాలంలో జనార్దన స్వామి రథమంత ఎత్తు భోగిమంటలు వేసుకొనేవారు. దానిముందు ఇదెంతరా. పాత తాటాకుబుట్టలూ, కోళ్ళగంపలూ, పిడకలదండలూ, ఇచ్చినమ్మది పుణ్యం ఇవ్వనమ్మది పాపం అని నిన్న సాయంత్రం మనం బెల్లించి దండుకొచ్చిన కర్రపేళ్ళూనూ... అయినా మనకి పదేళ్ళే కాబట్టి ఇవి చాలుననుకో, నాకూ పెదవాళ్ళ గ్యాంగులో వెళ్ళి తిరగాలనుంది. కాని ఇల్లు కదిల్తే పేకావారి వమ్మాయి నిచ్చి పెళ్ళి చేస్తారు.

– ఒరేయ్ మరేం, మా చిన్నన్నయ్యా వాళ్ళు ఇప్పుడేం చేస్తూ వుంటారో తెలుసా? ముత్యాలమ్మ గుడి దగ్గర శేషయ్యగారి వకీలు బోర్డు భోగిమంటలో వేసి ఝామ్మని తగలబెడుతూ ఉంటారులే. అవాలిలే అలాంటి శాస్తి – వాళ్ళ కూతురు లేదూ – శేషయ్యగారి కూతురు సుభద్ర? అదేం చేసిందో తెలుసా? అయితే మినపట్టుగాడి అన్నయ్య మంచివాడు కాడనుకో, వాడసలే రౌడీ, పైగా రౌడీలతో స్నేహంచేసి, బీడీలు తాగుతాడు. అప్పలసామి బడ్డీ వెనకావతల మొన్న పొద్దున్నేమో శేషయ్యగారి సుబ్బి గుమ్మంలో గొబ్బిళ్ళు పెడుతోందట. వీడు సైకిలు మీద రయ్‌మని వచ్చేసి ఆ గొబ్బిళ్ళమీది నుంచి సైకిలు పోనిచ్చాడుట. అప్పుడు పారిపోయాడనుకో. మళ్ళీనేమో సాయంత్రం వాడూనూ మా చిన్నన్నయ్యానూ గోదారొడ్డున అరుగుమీద నుంచుని ఉండగా ఈ సుబ్బి నీళ్ళకొచ్చి వీళ్ళని చూసి ఇలా మెటికలు విరిచేసుకుని "వెధవ చచ్చినోడా" అనేసి చక్కా పోయిందిట. అందుకనే ఇవాళ మా చిన్నన్నయ్యా వాడూ కలిసి శేషయ్యగారి వకీలుబోర్డు ఎత్తుకుపోయి భోగిమంట వేస్తున్నారు. రాత్రి బోర్డు తెచ్చేశారుట. మళ్ళీనేం శేషయ్యగారింటికి బోర్డు లేకపోతే బోడిగా బోసిపోయి నట్టుంటుంది కదా అని జాలిపడి, మంగలి వీరాసామి బోర్డులేదూ? "సుక్కక్షవర భవనము, ఇక్కడ, బ్యాండు మేళములు అద్దెకు రాబడును" అని ఉంటుందీ, ఆ బోర్డునేమో ఈ శేషయ్యగారింటికి తగిలిస్తారుటలే. పాపం వీరాసామి బీదవాడు కదా బోర్డు లేకపోతే ఎలా అని "ఇక్కడ శుచిగా భోజనము పెట్టబడును, బ్రాహ్మణ భోజన హోటలు" అని రాసి ఉన్న బోర్డుని వీరాసామి దుకాణానికి తగిలిస్తారుట. మా చిన్నన్నయ్య మంచివాడు కాబట్టే మినపట్టుగాడి అన్నయ్యకి ఇంత సాయం చేస్తున్నాడు. ఒరేయ్ మా చిన్నన్నయ్య గ్యాంగు లీడరు తెలుసా?

ఒరేయ్ బాబీ! మీఇంట్లోకి పరిగెత్తుకెళ్ళి ఇంకో రెండు తాటాకు బుట్టలూ, నాలుగు బైండు బుక్కుల అట్టలు పట్రారా. మంట అయిపోతోందీ – వెధవది నేనే తెద్దును కాని మా యింట్లో బైండు బుక్కులు లేవు. పైగా మా పెద్దన్నయ్య తలంటిపోసుకుంటున్నాడు. చూశాడంటే ఇప్పుడు నాకు తలంటి పారేస్తాడు. అందుకని

నువ్వు పట్రా – పరవాలేదులే బైండు బుక్కు అట్టలేం సరస్వతి కాదులే – పాపం కాదు ఒట్టురా మా చిన్నన్నయ్య కూడా చెప్పాడు. అట్టలు సరస్వతి కాదవి. పట్రా మంటారి పోతోంది. బాగా తెల్లారితేకానీ మనని వీధి దాటి వెళ్ళనియ్యరు. ఏరోయ్ సీవీ! నువ్వెళ్ళి మీ పాకలోంచి కొంచెం గడ్డీ, రెండు తాటాకులూ పట్టుకురా – తెల్లారే దాకా సరిపోతాయి.

– ఒరేయ్ ఒక రహస్యం చెబుతాను, కాని ఎవరితో చెప్పనని ఒట్టెయ్యండి నలుగురూ. ఎంత ఒట్టుపడితే అంత ఒట్టుకదూ? – ఇది కనక మనం చేస్తే వందలకొద్దీ, లక్షలకొద్దీ, కోట్లకొద్దీ రూపాయలు, మనకెన్ని కావాలంటే అన్ని ఎప్పుడు కావాలంటే అప్పుడు వచ్చేస్తాయి. దానికి ఒక చిన్నపని చెయ్యాలి. చాలా సులభంలే – ఏం చెప్పనా? ఎవరితో చెప్పనని ఒట్టేగా. ఇదివరకు కోదండం గాడికి చెబితే వాడు చెడగొట్టేశాడు. లేపోతే మేం ఎప్పుడో ధనవంతులం అయిపోయేవాళ్ళం.

ఇదంతా ఎలా జరిగిందంటే –

ఒకరోజునేమో సరిగ్గా కిందటేడు, సంక్రాంతికి రెండు మూడు రోజుల ముందన్నమాట. ఏం? ఆవేళ నేనూ, కోదండం, బడి ఎగేసి గోదార్లో ఈత నేర్చుకుని వస్తున్నాం. అక్కడ రాంపాదాల అరుగుమీద ఒక సాధువు కూర్చున్నాడు. వాడేమో – కాదు ఆయనేమో మమ్మల్ని పిలిచాడు. "అబ్బాయిలూ మీ జనార్దన స్వామి కొండమీద గోపాలస్వామి గుడి ఉంది తెలుసా?" అన్నాడు. "తెలుసండీ" అన్నాం. "చీకటిగా ఉంటుంది కదూ?" అన్నాడు. "ఔనండీ అది పాతాళలోకానికి సొరంగం అండీ" అని మేం చెప్పాం. 'కాదబ్బాయిలూ! అది కాశీకి వెళ్ళేదారి. అందులో చాలా దూరంపోతే ఓ కొలనుంది. దాన్నిండా కోట్లకొద్దీ రూపాయలున్నాయి. అవి ఎన్ని తీసినా అయిపోవు. మళ్ళా కొత్తవి పుడతాయి. మరి మీక్కావాలా?' అని అడిగాడు. "కావాలండీ కావాలన్నాం" మేము. అప్పుడు ఆ సాధువేం చెప్పాడంటే. "అబ్బాయిలూ ఆ కొలనులో రూపాయిలు ఎవరన్నా ముట్టుకుంటే తలపగిలి చచ్చిపోతారు. అది ఒక భూతం తీసి ఇస్తే ఫరవాలేదు, ఆ భూతాన్ని వశపరచుకునే ఉపాయం చెబుతా నాకేమిస్తారూ?" అని అడిగాడు. "ఏదేనా సరేనండీ" అన్నాం.

"అయితే సరే. ఓ మరచెంబు, మీ నాన్నగారి కంబళీ ఎవరూ చూడకుండా ఎవరికీ చెప్పకుండా తే" అన్నాడు. అప్పుడు కోదండంగాణ్ణి మా యింటికి తీసుకొచ్చి పెరటిగుమ్మం గేటుమీద నుండి మరచెంబు, కంబళీ వాడికి అందించి నేను వీధి గుమ్మం వెంట బయట కొచ్చాను. సరే అపుడు ఆ సాధువుకి అవి ఇచ్చేశాక ఆయన వెళ్తూవెళ్తూ మాకు ఆ ఉపాయం చెప్పాడు. మంత్రాలూ అవీ ఏమీ లేవు తెలుసా? 'భూతం కనక అల్లరి చేస్తే ఆంజనేయ దండకం చదువు కోండని' చెప్పాడు – అదేమిటో తెలుసా? భోగినాడు సాయంత్రం చిన్న పిల్లలకి భోగిపళ్ళు పోస్తాంకాదా, అపుడు ఇంటింటికీ వెళ్ళి దమ్మిడీలూ, అవీ – దొరక్కపోతే కానులూ పోగుచెయ్యాలి. ఆ డబ్బులు పెట్టి, ఒక బేడ వేరుశనగ కాయలు కొనాలి. భూతాన్ని ప్రత్యక్షం చేసుకోవాలనుకొనే వారు ఆ వేరుశనక్కాయల పప్పు తినకూడదు. అంతా అవతల పారెయ్యాలి. లేకపోతే ఎవరేనా సాధువుకి దానం చెయ్యాలి. వేరుశనగ

డొలకలుంటాయి చూడండి. ఆ డొలకలన్నీ తీసుకుని ఓ కుంపటీ బొగ్గులూ పట్టుకుని అర్ధరాత్రివేళ, భయమేస్తే సాయంత్రం అయినా ఫరవాలేదుట – ఏం? – డాబా మీదకి వెళ్ళి నిప్పు రాజేసి ఆ వేరుశనగ డొలకల్ని బాగా బొగ్గులయ్యేదాకా కాల్చి మాడ్చెయ్యాలి. అపుడు ఆ మాడిపోయిన డొలకల్ని మెత్తగా చూర్ణంగా నూరాలి. అందులో కొంచెం నీళ్ళు కలిపి ఉండలుచేసి రెండు చేతుల్లోనూ దూరంగా పట్టుకుని గుడ్లెర్రచేసి వాటికేసి చూసి "ఓ భూతమా రమ్మ్మ" అనాలి. అపుడు భూతం వచ్చి "ఏమి స్వామీ" అంటుంది. "నాకు ఓ పది రూపాయలు తెమ్మ్మ" అంటే ఠపీమని యిస్తుంది. కిందటి భోగిపండగనాడు నేనూ కోదండం ఇళ్లిల్లూ తిరిగి దమ్మిడీలు పోగుచేసి చచ్చిచెడి తిప్పలుపడి మా డాబామీద అంతా చేశాం. నీళ్ళెక్కువైపోయి వందువల్ల ఉండలు కుదరలేదు. అప్పుడు మళ్లీ ఇంకొన్ని వేరుశ నగ డొలకలు తెచ్చి మాడ్చి చేశాం. భూతం ఎంతకీ రాలేదు ఎన్నిసార్లు పిలిచినా. కోదండంగాడు నవ్వేసి 'బైరాగాడు మనకి టోపీ వేశా డురా భూతం లేదు గీతం లేదురా' అని వెక్కిరించాడు. అయితే నాకు ఠపీమని జ్ఞాపకం వచ్చిందొకటి. వీడులేడూ? ఈ కోదండం గాడు – వీడు శ్రీ అంజనేయ స్వామివారికి



పదివేల రెండొందల కొబ్బరికాయలు బాకీ ఉన్నాడు. ఎక్కాలు రాకుండా బడి కొచ్చినపుడల్లా చెవిటి పంతులుగారు కొట్టకుండా చేస్తే రెండొందల కొబ్బరికాయలు కొడతాను స్వామీ అని దణ్ణం పెట్టుకునేవాడు. ఓసారి వాళ్ళనాన్న జేబులో రెండు పావలా కాసులు కొట్టేసి హంటరువాలీకీ బేటీకీ, ఖజాంచీ సినిమాకి వెళ్ళాడు. సాయంత్రం దెబ్బలు తప్పిస్తే లక్ష కొబ్బరికాయలు కొడతానని శ్రీ అంజనేయస్వామి వారికి మొక్కాడు. అవన్నీ ఎగేసినందుకు శ్రీ అంజనేయస్వామి వారికి కోపం వచ్చింది. వచ్చి – మేం వేరుశనగ ఉండలు పట్టుకుని ఎంత పిలిచినా భూతాన్ని రాకుండా చేశాడు. కోదండంగాడి మూలానే అపుడంతా చెడిపోయింది. దొంగవెధవ, ఇప్పుడింకా నవ్వుతాడు సిగ్గులేకుండా అన్నీ అబద్ధాలేనంటాడు –

ఒరేయ్ వాడు పచ్చి కేడీనంబరు వన్ తెలుసా? వాళ్ళింటోనే కాదు మాయింట్లో పుస్తకాలు కూడా చెక్కేస్తాడు. ఓసారి నేను వాడి పెనసలు దాచేశా. మళ్ళా నాకు తెలీకుండా దాన్ని వాడు దొంగతనం చేశాడు. అప్పట్నించీ వాడితో మాటాడ్డం మానేశా. మళ్ళా భోగి ఎప్పుడొస్తుందా! ఉండలు చేసి భూతాన్ని పిలుద్దామా అని కూచున్నా."

– "వోరి వెధవా కిందటి భోగి ముందు కంబళీ, మరచెంబూ కాజేసింది నువ్వేనట్రా!" అని వెనకాలనుంచి ఎవరో ఉరమడంతో డబ్బారేకుల సుబ్బారావు డబడబలు ఠపీమని ఆగిపోయాయి. గుండె గుభేలుమంది. ఇంకో క్షణం సేపట్లో వీపు ఫెడేల్ మంది.

'బాబోయ్' అంటూ డబ్బారేకుల సుబ్బారావు వెనక్కి తిరిగాడు. వెనకాల వాళ్ళ పెద్దన్నయ్య నించున్నాడు. 'హాఁ' అన్నాడు వాళ్ళ పెద్దన్నయ్య కోపంగా, అమాంతం చలిమంట కాచుకుంటున్న శాస్త్రీ, సీవీ, బాచీ తోక ఝాడించి పరుగో పరుగు. "వెధవా! ఇవాళ పండుగకదా అని ఒక్క దెబ్బతో వదిలేశాను. లేపోతే పది దెబ్బలు కొట్టేవాణ్ణి. నడు లోపలికి నడు. నాన్నగారూ అమ్మా భోగిపళ్ళు పోస్తారు. నేను పేకావారమ్మాయి నిచ్చి పెళ్ళి చేస్తా – " అన్నాడు పెద్దన్నయ్య.

"ఒద్దన్నయ్యా పేకావారమ్మాయినిచ్చి పెళ్ళి చెయ్యకు ఇవాళ భోగిగా. సాయంత్రం ఉండలు చేసి భూతాన్నడిగి పధ్నాలుగు రూపాయలు తెచ్చి కంబళీ, మరచెంబూ మళ్ళీ కొనేస్తానన్నయ్యా" అన్నాడు డబ్బారేకుల సుబ్బారావు గునుస్తూ.

వాళ్ళ పెద్దన్నయ్య పకపకానవ్వి, సుబ్బారావు నెత్తిమీద తేలికగా మొట్టికాయ వేశాడు.

★ ★ ★

# లోకాభి రమణీయం



తొమ్మిదయింది. సెంట్రల్ రైల్వేస్టేషన్ మెర్క్యూరీ లైట్ల కాంతిలో చాలా అందంగా కనపడాలని ప్రయత్నిస్తోంది కాని, నాలుగడుగుల నుంచి ఐదుముప్పావడుగులలోగా అనేక రకాల పొడుగులతో చెదిరిపోయిన పుట్టలోని కండచీమల్లాగ ఇటూ అటూ కంగారుగా తిరుగుతున్నారు మనుష్యులు. కొంతమంది లావాటివాళ్ళు ఓ మాదిరి పెద్దసైజు ఉండల్లాగ దొర్లిపోతున్నారు. సన్నగా, పొడుగ్గా చారల సూటేసుకున్నవాళ్ళు గజంబద్ద మింగేసినట్టు నడుస్తూ, వున్న ఠీవంతా ఒలకబోసేస్తున్నారు. పైన ఎగిరే పురుగులు మిగిలి, కింద నుండే మనుష్యులు స్టేషను లేకపోతే చాలా బాగుండేది.

స్టేషను హాలులో అడుగుపెట్టగానే సుబ్రహ్మణ్యంలో వుండే కవికి కనబడిన స్టేషను తీరు ఇది.

సుబ్రహ్మణ్యం చీదరించుకున్నాడు కవిని చూసి. "ఏమిటోయ్! మన తలకాయ! మా తమ్ముడు పారిపోయాడని నే నేడుస్తుంటే నీ కవిత్వం ఏమిటీ మధ్య? బొత్తిగా సమయం సందర్భం లేవు నీకు!" మన సినిమాల్లో 'మనస్సు' బయటికొచ్చి తన తాలుకు ఆసామితో మంచీ చెడ్డా మాట్లాడినట్లు, తనలో వుండే కవి వ్యుత్పత్తి శరీరంతో ఎదురుగా వుంటే, సుబ్రహ్మణ్యం 'ఏమిటోయ్ మన తలకాయ' అంటూ మొదలెట్టి, 'సందర్భం లేదు నీకు' అంటూ ముగించి చీవాట్లు పెట్టివుండును.

పది నిమిషాల పాటు ఓ ప్రక్కగా నుంచుని, వెళ్ళిపోతున్న జనాన్ని జాగర్తగా చూశాడు తమ్ముడు దొరుకుతాడేమోనని, ఇంచుమించు తొమ్మిదింబావుకి అంతా ఖాళీ అయిపోయింది. ఈ మాటు కవి ఖాళీఐన , సెంట్రల్ ని వర్ణించడానికి ప్రయత్నించబోయాడు. సుబ్రహ్మణ్యానికి కొంచెం కోపం వచ్చింది. కవిని చూచి పళ్లు కొరుక్కుని అప్పుడే విరుచుకొన్న వేళ్లని ఇంకొకమాటు (అవి చప్పుడు

చేయకపోయినా) కొంచెం నొప్పి పెట్టేలాగ విరుచుకొని, గట్టిగా ఊపిరిపీల్చి, వేగంగా వదిలివేసి కథలకి సామాను ఏరే ఆశ వదిలేసి మామూలు సుబ్రహ్మణ్యం అయిపోయి ఊరుకున్నాడు. ఊరుకోలేదు. వెంటనే పారిపోయిన తన తమ్ముణ్ణి వెతకటానికి నిశ్చయించుకొని, ఆ ప్రయత్నానికి ఉపక్రమించాడు.

వాడుగాని తనని ఏ మూలనించైనా చూశాడా, క్షణ అడ్డం తిరిగినట్టే! ఇట్టే పారిపోతాడు. అక్కడనుంచి వాడివాళ దొరక్కపోయాడా, ఎత్తుకొచ్చిన పాతిక రూపాయలు తగలేసి కాని ఇంటికి రాడు. తను తెలివితేటలుపయోగించాలి. అన్ని పక్కలా ఒకేమాటు చూడగలగాలి... "పూర్వం ఇంద్రుడికి కామోసు వెయ్యి కళ్లుండేవి."

సుబ్రహ్మణ్యంలో కవి బయటికొచ్చాడు. ఈ కవి శుద్ధనాస్తికుడు.... దేవుళ్ళంటే బొత్తిగా నమ్మకం లేదు... "ఆ, 'వట్టి నాన్సెన్స్' వెయ్యి కళ్ళేమిటోయి? ఉత్త అబ్సర్డ్... ఇంపాసిబుల్... అబ్ నార్మల్" అంటూ అరచి నోరు మూసుకున్నాడు.

.... సుబ్రహ్మణ్యం విసుక్కున్నాడు. తను కాస్త దేముడి మీద గురి కుదుర్చుకుంటున్నాడు. ఇంకొంచెం వుంటే ఆ ఆర్తత్రాణ పరాయణుడు ఏదో సాయం చేసునేమో. ఇంతలో ఈ నాస్తిక కవి అడ్డొచ్చి వ్యవహారం చెడగొట్టాడు. ఈ రంధి ఇలా సాగుతూవుంటే ఈ సందట్లో తమ్ముడు ఏ పక్కనుంచో వుడాయించేస్తాడు. తొమ్మిదీ పదిహేడు నిమిషాలకి రంధి పూర్తి అయింది...

సుబ్రహ్మణ్యం చాలా ఇంగ్లీషు సినిమాలుచూశాడు. అమెరికా నుంచి వచ్చే క్రైమ్ పిక్చర్లు జ్ఞాపకం వచ్చాయి. అక్కడ డిటెక్టివ్‌ల తెలివితేటల్ని తలదన్నే నేర్పుతో దొంగలు తిరుగుతారు. దొంగల నేర్పుని మించి వీళ్లు తిరుగుతారు. అది ఒక కళ. ఆ కళలో అమెరికన్లు మనని తరిఫీదు చేస్తున్నారు. క్రైమ్ పిక్చర్ల ద్వారా ఇంగ్లీషు సినిమాలకు ఖర్చుపెట్టిన డబ్బులు దండుగ కాదనిపించింది సుబ్రహ్మణ్యానికి.

డిటెక్టివ్ సుబ్రహ్మణ్యం బుర్రవేడిగా పని చేసింది. సెంట్రల్ హాల్లోంచి మహావేగంతో పక్కనున్న చిన్న హాల్లో ప్రవేశించాడు. అదొక చిన్న వసారాలా ఉంది. అక్కడే టిక్కెట్లు అమ్ముతారు. అక్కడున్న బెంచీల మీద పనిలేనివాళ్లు, ఇళ్లులేనివాళ్లు, ఇల్లు వుండి పని లేని ఇతర బాపతుల వాళ్ళూ కూచున్నారు. బీడీ దమ్ములు లాగుతూ కునికిపాట్లు పడుతున్నారు. పావునిమిషంలో క్షుణ్ణంగా వెతికేసి తమ్ముడు తప్ప తక్కిన వాళ్ళందరూ ఉన్నారని అనుకుంటూనే వరండా చివరికి చకచకా నడుస్తున్నాడు. లోపల కవి కదిలాడు. "ఈ పని లేని అనాథలూ, అభాగ్యులూ అయిన భారతీయులు..." సుబ్రహ్మణ్యం వినలేదు. తన సంగతి ఏదో తేలలేదు; ఇంక భారతీయుల గొడవెందుకో పైగా?

వరండా చివరికి చేరగానే కాంపౌండ్ అంతా కలియచూశాడు. వరండా రెండో చివర కాంటీన్ వుంది. అక్కడ తన తమ్ముడు గాని టిఫిన్ పుచ్చుకుంటున్నాడేమో! .... 'టిఫిన్‌కి తెలుగు అల్పాహారం' అన్నాడు కవి. "హుఁ" అంటూ నిట్టూర్చాడు సుబ్రహ్మణ్యం.

ఈమాటు సెంట్రల్‌హాలు పూర్తిగా చూడాలి. అప్పటికీ తమ్ముడు కనబడకపోతే పోలీసు రిపోర్టు యిస్తాడు సుబ్రహ్మణ్యం. అతనికి చాలా మంచిదీ, సిసలైనదీ అయిన ఇంగ్లీషు భాష 'యాంకీ స్టయిల్' లో ధారాళంగా మాట్లాడే సత్తా వుంది.

అఖరిమాటు వరండా కలయజూచాడు. కవి మెదిలాడు. "ఈ పని లేని అనాథలూ, అభాగ్యులూ అయిన భారతీయులు తిన తిండీ, నిలువ నీడా, కట్టుకోడానికి..." సుబ్రహ్మణ్యానికేడుపొచ్చింది. బాధ, ఆవేదన, జాలి, దైన్యాలతో నిండి పొంగిపొర్లిపోయే చూపులతో కవిని చూశాడు. "నువ్వు దయచేసి ఊరుకుంటే బయటికెళ్లాక సిగరెట్టు కాల్చుకుందాం." అని ఆశ పెద్తూ.

సెంట్రల్ హాల్లోకి ప్రవేశించి ఐదడుగులు వేసేలోగా తమ్ముడక్కడ లేడనే నిర్ధారణ కొచ్చాడు. అంతా ఖాళీగా వుంది..... అక్కడక్కడ ఓ పోర్టరు, ఒక ఆంగ్లో ఇండియన్ లేడీ, బరువు తూచుకునే మిషన్‌లోకి తొంగి చూస్తున్న ఒక భారతీయ కార్మికుడూ తప్ప తన తమ్ముడు మాత్రం లేడు. 'వాడొక్కడూ వుండి ఈ వెధవలందరూ లేకపోతేనేం' అనుకుంటూ పై నుంచి వేళ్లాడే పెద్ద గడియారంలో 9 గంటల 18 నిమిషాలు టైము చూసి, ఆంగ్లో ఇండియన్ అమ్మాయి వంపులు బాగా పరిశీలించబోయాడు. పరిశీలించును కాని, కవి ఊరుకోవటం లేదు. పోర్టరు గాథ, కార్మికుడి బాధ ఏకరువు పెట్టి గేయం కట్టబోయాడు. గేయం కట్టేవాడే కాని సుబ్రహ్మణ్యం తన తమ్ముడిని గురించి ఆలోచించబోయాడు. ఆలోచించును గాని, 'డేయ్' (అంటే తెలుగులో ఒరేయ్) అని ఎవడో ఎవణ్నో పిల్చాడు.

సుబ్రహ్మణ్యం "ప్చ్" అని పెదిమలు, నాలిక, పళ్లూ, బలవంతాన విడదీసి, చిన్న చప్పుడు చేసుకున్నాడు. "ఒరేయ్" అని పిల్చుకోవడం ఇద్దరు మనుష్యుల స్నేహంలోని దగ్గరదనాన్ని చూపుతుంది కామోసు... బాగా స్నేహం వున్న జంతువులు ఏమని పిల్చుకుంటాయో! వెంటనే సుబ్రహ్మణ్యం ఆలోచన భగవంతుడి సృష్టి వైచిత్ర్యం మీదికి పోయింది.

"డేయ్! వున్నెదాండా" (ఒరేయ్ నిన్నేరా) సుబ్రహ్మణ్యం త్రుళ్లిపడ్డాడు. ఎందుకంటే, కేక తన వెనుక నుంచి వస్తోంది. తన ముందు పోయేవాళ్లెవరూ లేరు. అర్థం కాని కుతూహలంతో వెనక్కి తిరిగాడు.

"ఒరేయ్! నిన్నేరా! ఇలా రారా!" గుండె గతుక్కుమంది. తన కవి హృదయం ఈ అనుకోని అవమానంతో దెబ్బతింది. ఎందుకంటే, ఆ అరిచేవాడు పిలిచేది తననే. వాడు చూస్తే ఓ రౌడీలా వున్నాడు – ఓ గూడకట్టూ, చొక్కాపైన స్వెట్టరూ, నెత్తి మీద మఫ్లరుతో.

ఈ మాటు మాత్రం ఈ పని లేని అనాథలూ, అభాగ్యులూ అయిన భారతీయుల మీద కవికి కూడా సుబ్రహ్మణ్యాని కొచ్చినంత కోపమూ వచ్చింది. వాళ్ళకి బొత్తిగా మర్యాద తెలియదనుకున్నాడు సుబ్రహ్మణ్యం.

"థామస్ కోసం కదూ, నువ్వు వెతికేది?"

సుబ్రహ్మణ్యం నవ్వాడు. ఆ నవ్వు వెనకాల చాలా భావముంది – వీడెవడో తనని తెలిసున్నవాడిలా వచ్చేసి థామస్ గీమస్ అంటూ ఏదో చెప్పి తనని డబాయించి డబ్బులు కొట్టెయ్యడానికి చూస్తున్నాడు. సుబ్రహ్మణ్యం ఆలోచించాడు. మనసులో తోచిన అభిప్రాయాల్ని ఆలోచించకుండా బయటపెడితే పర్యవసానం చాలా భయంకరంగా ఉంటుంది. తన ఎదురుగా నిల్చున్నవాడు చూస్తే మొండిరకం రౌడీలా వున్నాడు. పది తిన్నా ఒకటి కొట్టగలడు. తనేమో పది తినాలేడు; ఒకటి

కొట్టాలేడు. సుబ్రహ్మణ్యానికి జబ్బుపుష్టి లేనివాళ్లందరి మీదా హఠాత్తుగా జాలేసింది. వాళ్లెంత తెలివున్నవాళ్లయితే నేమి? పలుకుబడి, కీర్తి, డబ్బు ఉన్నవాళ్ళయితేనేమి? ఇలాటి సమయంలో తన ఎదురుగా వున్న రౌడీ వెధవ ముందు పనికిరారు.

ఈ రౌడీ తననిలా అవమానించి పిల్చి ఇలాటి ప్రశ్నలడగటంలో వాడి ఆంతర్యం మీద తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాడంటే వాడు మరుక్షణంలో తనని మహా అవమానం చేసెయ్యొచ్చు - అంటే కొంచెం చెయ్యి తొందరతో చెంపకాయ వెయ్యొచ్చు. అంచేత తనకు ఎంత కోపం వచ్చినా దాన్ని అణచుకుని ఓ చిన్న అర్థం కాని నవ్వుతో దాన్ని కప్పెట్టి తనని సమర్థించుకునేలాగా, ఎదుటివాడిని చాలా మర్యాదగా అణచేలాగా తన మొగతవం చూపుకునేలాగా మాట్లాడడానికి సిద్ధమయ్యాడు.

"ఏమిటయ్యా! అలా మాట్లాడతావు? థామస్ ఎవడో నాకేం తెలుసు? వాడికోసం నే రావడమేమిటి? నేను మైలాపూర్ నుంచి వచ్చా" - తమ్ముడు కోసం వెతుకుతున్నానంటే అదేం హోనో అని అది చెప్పలేదు.

"ఆఁ! మైలాపూరు నుంచా? .... మీ ఎడ్రసు?"

సుబ్రహ్మణ్యం ధైర్యంగా ఎడ్రస్ చెప్పాడు. అంతేకాదు. ఈ దెబ్బతో వాణ్ణి ఇంప్రెస్ చేసి పారెయ్యాలి అని తాను చదివే క్లాసూ కాలేజీ పేరు కూడా చెప్పాడు. చెప్పి ఈ మాటు వాడికేసి మహా ధీమాగా చూశాడు. కాని వాడు మాత్రం అణుమాత్రం కూడా చలించినట్లు కనబడలేదు. నమ్మలేదేమో, పైగా వాడి 'ఒరేయ్' అనే సంబోధన ఏమాత్రం మారలేదు. ఇంతలోకే పోర్టర్ వచ్చాడు. ఈమాటు సుబ్రహ్మణ్యంలో ఎక్కడలేని ధైర్యం ఉద్భవించింది. ఇప్పుడు తనేం వాగినా ఈ రౌడీ చెయ్యి చొరవ చూపలేడు. ఎందుకంటే, ఇప్పుడు తమ దగ్గర ఓ పెద్దమనిషి ఉన్నాడాయె.

ఇంకో ఇంకో సమయంలో పోర్టరు మామూలు పోర్టరులాగే కనబడతాడు. తను వాడికేసి చూడ్డానికి కూడా లెక్క చెయ్యడు. పైగా ఎప్పుడైనా తను సామాన్లు మొయ్యటానికి అలాంటి పోర్టర్ని పిలిచినా, వాడిమీద తను అధికారం చెలాయించగలడు. దబాయించగలడు. కూలి డబ్బులికి ఏడిపించి, వాడిచేత "సామీ" అనీ "సార్" అనీ అనిపించుకొని, తర్వాత కొంచెం జాలి కూడా ఒలకపోసి, వాడికో అర్ధణా ఎక్కువిచ్చి, తను మహా పెద్దమనిషిలా పోజు పెట్టగలడు కూడా. అంతగా కావలసివస్తే, "కూలీలు కూడా తోటిమానవులే, మనకి సోదరులే" అని ఒప్పుకొని, వీళ్ల తరపున గేయం రాసి "అయ్యయ్యో! ఈ ఇలలో, అందరి గుండెలు శిలలో!" అని ఆనందించి వుండును.

కాని ఇప్పుడు పరిస్థితులు తారుమారయ్యాయి. ఆ పోర్టరే ఇప్పుడు పెద్దమనిషి హోదాలో వున్నాడు. ఓ రౌడీ లాంటి వెధవ, తనని రౌడీ అనుకుని దబాయించి, అవమానించి తన్నబోయే సమయంలో ఈ పోర్టరు న్యాయం చెప్పి, ఈ రౌడీ వెధవ పొగరణచగల పెద్దమనిషయ్యాడు.

సుబ్రహ్మణ్యం నిస్సందేహంగానూ, ధారాళంగానూ ఆ పెద్దమనిషి హోదాలో వున్న పోర్టరుతో ఏకరువు పెట్టాడు - తనెవరో, ఎక్కడినుండొచ్చాడో, ఎందుకొచ్చాడో,

మధ్యలో ఈ రౌడీ లాంటి 'ఆయన' (పైకి వెధవంటే ప్రమాదం!) తనని ఎలా డబాయిస్తున్నాడో చెప్పి, న్యాయం అడిగినట్టు చూచాడు...

పోర్టరు ఒక పెద్ద వేదాంతిలా మొహం పెట్టాడు. సుబ్రహ్మణ్యంలో కవి, పోర్టరు 'సైకాలజీ' ఎనలైజ్ చేసునుగాని, ఆ పోర్టరు ఈ లోగానే చిరునవ్వుతో తల వూపి, చిన్న కెరటంలా వెళ్ళిపోతున్నాడు. సుబ్రహ్మణ్యం నిరాశతో కూలిపోయి వాణ్ణి తిట్టుకుందుకు సిద్ధమయ్యాడు. కాని ఈ లోగానే రౌడీవెధవ దిగ్విజయం చేసొచ్చిన చక్రవర్తిలా నవ్వుతూ ఉపన్యాస ధోరణిలో మాట్లాడాడు.

"ఒరేయ్! జాగ్రత్త, చెబుతున్నా. రౌడీలాగ వచ్చి రాత్రి తొమ్మిది గంటలకి కొంప మునిగిపోయినట్లు సెంట్రల్ అంతా పరవళ్లు తొక్కుతూ, అనుమానం పుట్టించేటట్లు తిరిగితే పోలీసులేమనుకోవాలిరా?.... నువ్వు దొంగతనం చేశావో, ఖూనీ చేశావో, ఎవడికి తెల్సు? ఇంటికెళ్ళు... నువ్వు చెప్పిన ఎడ్రస్‌కు వచ్చి చూస్తా తర్వాత. ఆపైన నీ పని చెప్తా. ఊఁ నడు!" అని

సుబ్రహ్మణ్యం అమాంతంగా తన గూడకట్టూ, స్టయిలిష్‌గా మడత పెట్టిన పొడుగుచేతుల చొక్కా, కాలర్ కింద జేబురుమాలు, తన హైరోడ్డు క్రాపూ పూర్తిగా జ్ఞాపకం చేసుకుని, కొంతసేపు తను రౌడీ అనుకున్నాడు సి.ఐ.డి. అని ఊహించి వెలాఖరురోజుల్లో ఎలాగో ఓలాగు కేసులు పట్టాలని చూసే పోలీసు కళ్లలో, తను అప్పుడు వేసుకున్న బట్టల్లో తనకెంత కల్చర్ ఉన్నా, తెలివితేటలున్నా, తను ఎటువంటి పోకిరీవాడనబడడానికి అవకాశాలున్నాయో ఊహించుకుని ఆ కారణాల వల్ల వాడు తనకి అప్పుడు చేసిన మర్యాద బహుశా సమంజసమేమో అనే నిర్ధారణకి వచ్చేసరికి స్టేషన్ వదలి ట్రామ్ రోడ్డు దాటి బస్సుస్టాండులో ఒణుకుతున్న కాళ్ళతో, ఉధృతంగా కొట్టుకునే గుండెల్తో, బెదిరే చూపుల్తో నిల్చున్నట్టు తెల్సుకున్నాడు. టైము తొమ్మిది గంటల ఇరవై నిమిషాలయింది.

మెలాపూరు ట్రాములు అయిపోయాయి. ఇక బస్సులు మాత్రమేట. వాటికీ రద్దీగానే ఉంది.

సుబ్రహ్మణ్యానికి మంచి దూరాలోచన వుంది.

తనకి బస్సులో చోటు దొరికేసరికి ఆలస్యం అవొచ్చు. రద్దీలో తోసుకుంటూ ఎక్కితే, ఇందాక తన్ను రౌడీ అనుకున్న పోలీసు గాని తన్ను చూస్తే పిక్‌పాకెట్ ప్రయత్నాలు చేస్తున్నావని పట్టుకొని కసి తీరా రెండు తగిలించొచ్చు. లేదా తను చోటు దొరికేదాకా బస్సుకోసం వెయిట్ చేశాడా, "ఇక్కడే కాసుకున్నావుట్రా! థామస్ కోసం. దొంగవె..." అని మళ్ళా వ్యవహారం మొదటికి తెచ్చి పోలీసువారి ఆఫీసులో నైట్‌డ్యూటీ వెయ్యొచ్చు.

అంచేత వాడు ఈ ఏర్పాట్లు చేయడానికి వచ్చేలోగా తను నడక సాగించి బ్రిడ్జి దాటిపోతే ఫరవాలేదు. జనం నడుస్తూనే వున్నారు.

సుబ్రహ్మణ్యం నడుస్తున్నాడు. కాని బ్రిడ్జి ఎక్కి దిగేవరకూ కూడా తన వెనకాలే వచ్చి బాగా పొడుగ్గా అయిపోయి ఫేడవుటయిపోయే ప్రతినీడా ఇందాకటి పోలీసు వెధవదే అనుకున్నవాడై తల ప్రక్కలకి తిప్పడానికి కూడా జంకుతున్నాడు.

ఇలాంటప్పుడు పాటపాడ్డం బెస్టుకాని, మంచిది ఒకటీ జ్ఞాపకం రాదు. ఒకటి వచ్చినా దాని వరస జ్ఞాపకం రావటంలే. అసలు ధ్వనే బయటకు రావటంలే.

పాట రాని సందర్భంలో ఈలవేస్తే బాగానే ఉంటుందని తోచి వుండవచ్చు. నోరు ముందుకుపెట్టి ఈల వెయ్యబోయేంత పని చెయ్యబోయాడు. కాని, వెనకాల తరిమే సీక్రెట్ పోలీసువాడిదయ్యుంటే వాడు తన్ని, బహుశా అనుమానించి డబాయించవచ్చు – థామస్‌ని పిలిచేందుకు ఈ ఈల ఒక గుర్తని. వెంటనే ఈలవేసే కార్యక్రమం పూర్తిగా ఉపసంహరించుకుని, ఏం చేయాలో తోచని పరిస్థితిలోకి వచ్చేశాడు సుబ్రహ్మణ్యం....

ఇంతలో "మిలియన్స్ యూజ్ ఇట్ డెయిలీ" అని భూగోళం బద్దలు గొట్టేట్టరిచింది, ఎదురుగుండా సబ్బు ఎడ్వర్‌టైజ్‌మెంట్ బోర్డు. సుబ్రహ్మణ్యం, ఆగి నవ్వాడో, నవ్వి ఆగాడో గాని, మొత్తానికి ఆగాడు. "అయితే, ఇంత పెద్ద అరుపులెందుకోయ్! మిగిలిన కొంచెంమంది కోసం" అనుకొన్నాడు.

ఈలోగా, ఇందాకటినుంచీ తన వెనకాలే తరుముతున్న నీడ తాలూకు అసామి దాటిపోయాడు. ఇదే సుబ్రహ్మణ్యం కోరింది. ఇందుకే అతను ఆగడం, నవ్వడం, విమర్శించడం .... అన్నీని. తను 'రౌడీ' అనుకున్న పోలీసువాడు తనను తరమటం లేదన్నమాట. ఈ మాటు వెనక్కి ధైర్యంగా చూశాడు.

పది అడుగులు వేసేసరికి ధైర్యం ఎక్కువయింది. ఎందుకంటే తనకన్నా రౌడీల్లా కనబడే వాళ్ళంతా వస్తూపోతూ వున్నారు. ఇప్పుడు గాని ఆ పోలీసువచ్చి డబాయించాడా, సుబ్రహ్మణ్యం చెయ్యబోయే మొదటిపని – వాణ్ణి ఈడ్చి లెంపకాయ కొట్టడమే.

సుబ్రహ్మణ్యం నడక సాగించాడు ముందుకి.

మనస్సు వెనక్కెళ్ళింది సెంట్రల్‌కి....

☆ ☆ ☆

తొమ్మిదిగంటలవుతూ వుంటుంది. సుబ్రహ్మణ్యం పారిపోయిన తమ్ముడి కోసం గబగబా, కంగారుగా సెంట్రల్‌లో పరవళ్లు తొక్కుతుంటాడు.

"డేయ్"

సుబ్రహ్మణ్యం వెంటనే వెనక్కి తిరుగుతాడు.

"థామస్ కోసమేనా నువ్వు వెతికేది?"

సుబ్రహ్మణ్యం జవాబివ్వడు. పైగా తన్ని 'ఒరేయ్' అని పిలిచినవాణ్ణి ఎగాదిగా చూస్తాడు. 'నీకేమన్నా ఒళ్లూపై తెలుస్తోందా?' అంటూ.

వాడు సుబ్రహ్మణ్యం చొక్కా కాలర్ పట్టుకొని గుంజుతాడు, అరవంలో ఏదో వాగుతూ....

'ఠప్'మని లెంపకాయ కొడ్తాడు సుబ్రహ్మణ్యం వాణ్ణి. వాడు పడిపోతూవుంటే, వాడి కాలర్ పట్టుకుని ఆపి, మళ్లా రిపబ్లిక్ సీరియల్స్‌లో హీరోలాగ గడ్డం కింద ఒక్క 'నాకౌట్' ఇస్తాడు. వాడు దూరంగా వున్న స్తంభానికి కొట్టుకుని కింద పడతాడు. ఎడాపెడా ఇంకో నాలుగు వాయించి, జుట్టు సర్దుకుంటాడు సుబ్రహ్మణ్యం. జనం గుంపుగా చేరి చూస్తూ వుంటారు.

సుబ్రహ్మణ్యం, తన కారుడ్రైవర్ని పిల్చి, అప్పుడే అక్కడికొచ్చిన పోలీసువాణ్ణి చూపించి అవసరమైతే తన యింటికి రమ్మని చెప్పి రక్తంలో పడివున్న మొదటి పోలీసుని చూచి, తలాడించి కారు డ్రైవ్ చేసుకుని ఇంటికి పోతాడు.

☆ ☆ ☆

త్రుళ్లిపడ్డాడు సుబ్రహ్మణ్యం. సరిగ్గా అరక్షణం క్రితం భూతం లాంటి బస్సు తన్ని దూసుకుపోయింది. పెద్ద అరుపుతో. రోడ్డు మధ్యనుంచి పేవ్‌మెంటు పైకి వచ్చాడు....

ఎలాగైనా మరీ ఇంత కఠినశిక్ష అనవసరమనిపించింది. తనని వాడెంత అవమానించినా తను అలా కొట్టి వుండకూడదు వాణ్ణి. సుబ్రహ్మణ్యానికి పోలీసువాడి మీద చాలా జాలేసింది.... అబ్బే! ఈ శిక్ష బాగులే...

సినిమా ఎడ్వర్‌టైజ్‌మెంట్ బండి తోసే కుర్రాడు బండినో పక్కగా ఆపి, దాంట్లో దూరి కూచుని బీడీ కాలుస్తున్నాడు.

నవ్వొచ్చింది. ఈ కుర్రవెధవలు పగలూ ఇంతే. ఓ మూల ఆపేసి దాంట్లో పడుకుంటారు... అయినా థియేటర్ వాళ్లిచ్చే కూలికి చాలీ సేవ....

హఠాత్తుగా మిస్టర్ సుబ్రహ్మణ్యం దృష్టి ఆ బండిమీది పోస్టర్ మీద వున్న హీరోయిన్ బొమ్మమీద, ఇంకా కరెక్టుగా కావాలంటే ఆ బొమ్మలో ఉద్రేకజనకంగా డిజైన్ చేసిన వక్షోజాల మీద పడింది. సుబ్రహ్మణ్యంలో కవి సినిమాల వారు సెక్సుని ఎంత ఘోరంగా ఎక్స్ప్లాయిట్ చేస్తున్నారో, ఎంత అవినీతిని రేపుతున్నారో ఆలోచించి విమర్శించునుకాని, క్షణంలో అతని శరీరం స్వతంత్రం తీసుకుంది. నరాలు స్వాధీనం తప్పాయి. మనస్సు మత్తెక్కింది. ఒళ్ళంతా ఒక తీయటి తలపుతో జలదరించి, వెంటనే బిగుసుకుపోయింది. దృష్టి కొంచెం మందగించింది. వెంటనే నోరు బిగించుకపోయి నాలుక బెరడు కట్టింది. గుండెలో ఒక శూలం గుచ్చుకొని ఆ తియ్యని నొప్పి ఒక కెరటంలా వెన్నెముక చివరకంటా విరిగింది.

ఈసరికి అతడు సరిగ్గా సినిమాపోస్టర్ ప్రక్కనే నిలిచాడు. ఒక్కమాటుగా అతనిలో వున్న కామ ప్రవృత్తి ఉవ్వెత్తున మహోన్నత కెరటంలా లేచింది. సముద్రోద్భూత జ్వాల వలె ఒక అగ్ని ప్రజ్వరిల్లింది. కాని అది ఎంతటి చల్లటిమంట! సుబ్రహ్మణ్యం ఇటూ అటూ చూశాడు. దగ్గర్లో ఎవరూ లేరు, బండి కుర్రాడు కునుకుతున్నాడు. వెంటనే అతను ఎడం చెయ్యి వేళ్లు పోస్టర్ మీద బొమ్మ వక్షోజాల మీదుగా పోనిచ్చి చెయ్యి అలా బండి చివర వరకూ రాసుకుంటూనే నడిచాడు. మూడు క్షణాల్లో బండి దాటిపోయాడు. తుపాను చల్లారింది.... ఈ ప్రశాంతతలో అతను చల్లగా నడిచాడు.

రాత్రి పదకొండప్పుడు – అంటే రోడ్డుమీద జనం లేనప్పుడు, అటూ ఇటూ ఎలక్ట్రిక్ దీపాలు బద్ధకంగా నిల్చుని మత్తుగా కళ్ళు కిందికి దించి రోడ్డుని చూస్తున్నప్పుడు, ఇలాంటి పిల్ల ఒంటరిగా ఎదురొస్తే... సుబ్రహ్మణ్యం గుటకలు మింగాడు. ఆ పిల్లని దగ్గరగా రానిచ్చి గబుక్కున కావలించుకుని గట్టిగా ముద్దెట్టుకుని తిరిగి హఠాత్తుగా వదిలేసి పరిగెత్తుకుని పోవచ్చు తను... ఆ! తనకా ధైర్యం వుంది. బహూశా ఇష్టం కూడా వుండొచ్చు. కాని, పైకి చెప్తే నలుగురూ చీవాట్లు కూడా

వెయ్యొచ్చు. మామూలుగా మనిషైన ప్రతివాడూ అంతేనేమో. అధమం, అంత పనిచేసే ధైర్యంలేకపోయినా ఆ ఆలోచన తప్పకుండా వస్తుంది. కాని, నిజం ఒప్పుకోడు. ఒప్పుకుంటే వాడు వెధవ, పోకిరి, రౌడీ.

తనిలాగ మహా 'సైకో ఎనలిస్ట్' లాగా ప్రజా బాహుళ్యపు నైతిక విలువలు కొలవడం, ప్రజల మనస్తత్వ పరిశీలనకు పూనుకోవడం, అందులో ముఖ్యంగా ఇలాంటప్పుడు ఏమీ బాగా లేదనిపించింది. ఏదో కమ్మగా ఆలోచించుకుంటూ పోతే కాళ్ల నొప్పి తెలియదు.... అసలు – అంటే ఒకవేళ ఆవిధంగా ఒక అమ్మాయే అలాంటి సమయంలో ఎదురవడం తటస్థిస్తే....

వెంటనే ఇంకో ఆలోచన కూడా సుబ్రహ్మణ్యం బుర్రలో మెరిసింది. అంతా కలిసొచ్చి, అమ్మాయి ఎదురొచ్చి, తను ధైర్యం చేయబోయే సమయంలో ఇందాకటి (స్టేషన్లో) పోలీసువాడు అక్కడ ప్రత్యక్షమవడం తటస్థిస్తే....

"ఛీ 'రొమాన్స్' అంతా పాడైపోయిం" దనుకున్నాడు సుబ్రహ్మణ్యం. ఆ కోపంలో శ్మాష్డ్, డిస్ట్రాయిడ్, క్రష్డ్ అనే మూడు ఇంగ్లీషు పదాలు జ్ఞాపకం వొచ్చాయి. ఈ మూడు 'ఎమ్ఫాటికల్'గా తనలో తానే ఉచ్చరించుకున్నాడు. ఈ గొడవలో ఎదురుగా ఉన్న 'కీప్ లెఫ్ట్' బోర్డుని పరాకుగా చదివేసి, ఆ ఆజ్ఞని మన్నిస్తూ మలుపు తిరిగాడు. మలుపు తిరుగుతూ తను చేసిన పొరపాటు గ్రహించుకుని వెకిలిగా నవ్వుకున్నాడు. ఎవరైనా చూసారేమో అని అటూ ఇటూ చూశాడు...

హిందూ దినపత్రిక ఆఫీసు దగ్గరికి చేరుతుండగా పోలీసు కారు నలభై మైళ్ళ స్పీడులో పోతూంది సెంట్రల్ వేపు. అందులో సర్కిల్ గారూ, ఓ పోలీసూ ఉన్నారు. సుబ్రహ్మణ్యం ఆగాడు. "హుఁ! వీళ్ళు మట్టుకు ఇంత వేగంగా పోవచ్చు గామోసు?"

సుబ్రహ్మణ్యం నడక ఇంటివేపు సాగించాడు. హఠాత్తుగా మనసు సెంట్రల్ కేసి వెళ్తున్న పోలీసు కారును అందుకుంది.

☆ ☆ ☆

తొమ్మిదవుతుంది. మీస్టర్ సుబ్రహ్మణ్యం సెంట్రల్ స్టేషన్లో పారిపోయిన తమ్ముని కోసం హడావుడిగా వెతుకుతూ వుంటాడు.

"థామస్ కోసమేనా నువ్వు వెతికేది?" అని పోలీసు రౌడీ దబాయిస్తాడు. సుబ్రహ్మణ్యం మర్యాదగా మాట్లాడతాడు కాని, వాడు మాత్రం సుబ్రహ్మణ్యం ఎడ్రసు తీసుకుని కూడా నమ్మక అవమానించి పొమ్మంటాడు.

మిస్టర్ సుబ్రహ్మణ్యం అవమానించబడిన హృదయంతో ఇంటి కొస్తుంటాడు.

మౌంటు రోడ్డులో పోలీసు కారు ఎదురై ఆగుతుంది. "హలో గుడ్ ఈవినింగ్ మిస్టర్ సుబ్రహ్మణ్యం" అంటూ కారులోనుంచి సర్కిల్ ఇన్స్పెక్టరు దిగుతాడు కాని, సుబ్రహ్మణ్యం కొంచెం చిరాగ్గా మాట్లాడతాడు "ఏమిటి సార్? మీ పోలీసుల కేమీ మర్యాద తెలియదు. నేనిందాకా సెంట్రల్ కెళ్తే ఎవడో సిఐడి తగులుకుని నన్ను రౌడీ అంటూ దబాయించాడు. బొత్తిగా అంత తేడా తెలియదండీ వాళ్ళకి?"

సర్కిల్ చాలా ఆశ్చర్యపోతాడు. "మిమ్మల్నా సార్! వాడు రౌడీ అంటాడా? పదండి సెంట్రల్‌కి, వాడి సంగతి కనుక్కుందాం."

సుబ్రహ్మణ్యమే కారు నడిపాడు. దారిలో తనో ప్లాను చెప్పాడు సర్కిల్‌కి. అలాగైతే వాడిని "రెడ్‌హేండెడ్"గా పట్టుకోవచ్చు. సుబ్రహ్మణ్యం ప్లాను విని సర్కిల్ ఆశ్చర్యపడ్డాడు. అందుకు నిదర్శనం – అతడు గట్టిగా 'వండర్‌ఫుల్, సూపర్బ్, మార్వలెస్' అనే మూడూ, ఇంచుమించు అంతే అర్థం సూచించేవి ఇంకో రెండూ చేరశి మొత్తం ఐదు ఇంగ్లీషు మాటలు ఉపయోగించటమే.

కారాపి సుబ్రహ్మణ్యం ఒక్కడూ ముందర వెళ్ళి హోల్లో ప్రవేశిస్తాడు.

(ఇక్కణ్ణించి జరగబోయేది సర్కిల్ దాక్కుని చూస్తాడన్న మాట)

ఇందాకటి 'రౌడీ' మళ్ళా వస్తాడు. సుబ్రహ్మణ్యం చొక్కా పట్టుకుని, "ఏరా మళ్లీ వచ్చావ్? నువ్వసలు వచ్చిన పని వేరు. ఏదో అడ్రసిచ్చి దబాయిస్తావూ? దొంగ వెధవా...."

సుబ్రహ్మణ్యం హఠాత్తుగా వాడి చెయ్యి విసిరికొట్టేస్తాడు. పైగా యిలా అంటాడు. "ఏమిటోయ్, నా కిష్టం వచ్చినన్ని మాట్లు నేను సెంట్రల్‌కి వస్తా. నువ్వేమిటి? వెధవ డబాయింపూ నువ్వూను... మీ సర్కిల్‌కి రిపోర్టు చేస్తా, జాగ్రత్త"

'రౌడీ' లేక సి.ఐ.డి. చిన్న సైజు విలన్‌లాగ నవ్వుతాడు. "ఏడిశావ్! నువ్వు రిపోర్టు యివ్వడం, సర్కిల్ నమ్మటం.... దిక్కున్న చోట చెప్పుకో. సర్కిల్‌కాదు వాడి బాబుతో చెప్పుకో"

హఠాత్తుగా స్తంభం చీల్చుకొచ్చిన నరసింహావతారంలాగ సర్కిల్ స్తంభం చాటునుంచి బయటికొస్తాడు – ""డేయ్ షణ్ముగం"" అంటూ.

షణ్ముగం (సి.ఐ.డి) వెనక్కి తిరిగి నీరుకారిపోతాడు. సుబ్రహ్మణ్యం గుండె ఆనందంతో ఈల వేస్తుంది. ఒక్కమాటుగా షణ్ముగం, సుబ్రహ్మణ్యం ఇద్దరూ ఏదో చెప్పబోతారు. సర్కిల్ నవ్వుతూ "ఇంకేం చెప్పనక్కర్లేదు. అంతా నే చూశాను. షణ్ముగం, నీ ఉద్యోగం నిలబడాలంటే నువ్వు ఏ పనేనా ఆలోచించి చెయ్యాలి. ఆయన రౌడీయో, పెద్దమనిషో తెలుసుకోలేని నువ్వు 'సి.ఐ.డి' పనికి పనికిరావు. నిన్ను రేపట్నుంచి సస్పెండ్ చేస్తా"

షణ్ముగం కొయ్యబారిపోయి దీనంగా సుబ్రహ్మణ్యం కేసి చూసి క్షమార్పణ కోరుతాడు. తన దగ్గర సిద్ధంగా వున్న కొద్దిపాటి మర్యాద వాచకాల్ని ఉపయోగించి.

సుబ్రహ్మణ్యం అమాంతం దయా స్వరూపుడు అయిపోయి శిబిదధీచులను జ్ఞప్తికి తెచ్చుకుని, "పోన్లెండి, ఈ మాటు కొదిలేయండి" అంటాడు సర్కిల్‌తో. "సరే; ఈయనే ఊరుకున్నాడు కాబట్టి కాని...." అంటూ సర్కిల్ ఓ చూపు చూసి, "రండి సార్, మిమ్మల్ని ఇంటి దగ్గర వదిలేస్తాను" అంటూ సుబ్రహ్మణ్యాన్ని కారులో ఎక్కించుకుపోతాడు.

☆ ☆ ☆

పెద్దగోల, హడావుడికి సుబ్రహ్మణ్యం మనస్సు సెంట్రల్‌నుంచి ఎగిరి వెనక్కి చేసింది....

ఎదురుగా 'ఎల్ఫిన్స్టన్' హాలు దగ్గర పావలా అర్ధణా టిక్కెట్టు దగ్గర పోలీసులు లాఠీచార్జి చేస్తున్నారు, జనాన్ని అణచలేక, మళ్లా కోపం వచ్చింది సుబ్రహ్మణ్యానికి, పోలీసుల మీద. ఇందాకా వాడిని వ్యూహాలో కూడా క్షమించడం తప్పనిపించింది. అంతలోనే ఇంతసేపూ తను శత్రువును శిక్షించింది తన ఊహా ప్రపంచంలోనే అని గ్రహించుకుని, తన అశక్తతని తల్చుకునే సరికి అతనికి కంట నీరు తిరిగింది.

ఎదురుగా థియేటరు కప్పుమీద నుంచున్న 'రెండాల్ఫ్ స్కాట్' రెండు రివాల్వర్లు పట్టుకుని, అమోఘమైన ఫోజులో చూస్తున్నాడు కిందికి.

రూపాయి పావలా టిక్కెట్టు కొని సుబ్రహ్మణ్యం ఆ సినిమాకి వెళ్ళాడు. తన పాత శత్రువుకు కొత్త శిక్ష ఎలా వెయ్యాలో సినిమా చూస్తూ ఆలోచిద్దామని. ఇంకో కారణం కూడా వుండొచ్చు. తన తమ్ముడిని వెతికేందుకు ఉపాయాలు ఆలోచించడానికి... బహుశా ఇంకో ముఖ్య కారణమూ వుండొచ్చు. అతడది మీకూ నాకూ ఏనాటికీ చెప్పడు.... తను పొందిన ఇన్ని అవమానాలకన్నా సెంట్రల్ స్టేషన్లో ఒకే ఒక క్షణంపాటు తను చూసి, క్షుణ్ణంగా చదువుకున్న ఆంగ్లో ఇండియన్ అమ్మాయి వంపులు, రోడ్డుపక్కగా చూసిన పోస్టర్ హీరోయిన్ వంపులు అతని బుర్రనిండా ఆలోచనల్ని కల్పించి, తీరని కోరికల్ని రేకెత్తించాయి. ఇప్పుడీ సినిమా హీరోయిన్ వంపులు గంటన్నర చూసి, ఇంటికెళ్ళినప్పుడతడు తిరిగి ఇంకో రంగురంగుల ఊహాలోకంలో ప్రవేశించవచ్చు, తీరని కోరికల్ని తృప్తిపరచుకుందుకు.....

★ ★ ★



# ఆచేతి చేత

బామ్మ వంటచేస్తూ ఉండగానే అక్కడ తారట్లాడి, ఆవిడ కన్ను మరగేసి వత్తులపెట్లో డబ్బులు చెక్కెయ్యడంలో భీమశంకరంగారు చిన్నపుడు సిద్ధహస్తుడు. ఆ రోజుల్లో వెనకబడ్డ స్నేహితులకు ఈ విద్య కిటుకులు ఉపదేశించి గురువనిపించుకున్నాడు. బడి ఎగేసి కాలవగట్ల వెంట బీడీలు కాలుస్తూ రోజులతరబడి తిరిగినా గోడ కట్టినట్టు అబద్ధాలు చెప్పి ఎవరికీ అందకుండా నిభాయించుకోగలిగిన సాటిలేని మేటి మొనగాడు. దరిమిలా పెద్దవాడయ్యాక, చెప్పిన జబ్బు చెప్పకుండా ఆఫీసుకు సెలవు పెట్టి నెగ్గుకొచ్చిన ధీశాలి. అమెరికన్ పుస్తకాల సలహాలతో ఇంకా ఎన్నో పరిస్థితులకు తట్టుకోవడం, సమస్యలను ఎదుర్కోవడం, ఎదిర్చి నిలబడడం, నిలచి పరిష్కరించడం నేర్చుకున్నాడు. చిన్నప్పుడు కంఠతా వచ్చిన పదమూడో ఎక్కంలాగే ఇదీ క్రమేపీ రూపుమాసింది. ఆ రోజులు వెళ్ళిపోయాయి.

అంతటి భీమశంకరంగారు ఏభయ్యో పడిలో పడ్డాక, ఒక ఆదివారంనాడు, ఎదుట గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్న పాతికేళ్ళ కుమారరత్నం వంక బాధగా చూస్తూ పడక కుర్చీలో పడుకుని సతమతమవుతున్నాడు.

"చలేస్తోందని చెప్పి చూడరా నాయనా" అన్నాడు చివరికి.

"శాలువా కప్పుకోమందండి. లేపోతే సావిట్లోకొచ్చి పడుకోమంటోందండి" అన్నాడు కుమారుడు వినయంగా.

"అఘోరించకపోయింది..... అయినా కాపోయినా ఏం మహిళలురా అబ్బాయి. ప్రాణాలు తోడేస్తున్నారనుకో. మొగుడు వెధవ ఆదివారం పూట కాస్త ఊళ్ళో కెళ్ళాలంటే విఘ్న ఏమిట్రా" అన్నాడు భీమశంకరం ప్రాణం విసుగెత్తిపోయి.

కొడుకు తలవంచుకున్నాడు మాట్లాడకుండా.

"టైమెంతయిందిరా?"

"మూడున్నరండి"

"అయ్య బాబోయ్! రైలుకింకా గంటన్నరే ఉందన్నమాట" అన్నాడు భీమశంకరంగారు.

ఆయన ఆ ఉదయం 9 గంటలనుంచి మూడున్నరవరకూ పదిసార్లు టైమడిగి తొమ్మిదిసార్లు అయ్యబాబోయ్ అన్నాడు. ఒకసారి అబ్బా అపుడే రెండయిందిరా అన్నాడు. క్రితం రాత్రి తొమ్మిదినుండి రోజు ఉదయం 7 గంటల వరకూ కొడుక్కి డబ్బివ్వమనీ, 7 నుండి 9 వరకు తన పంచె, చొక్కా కండువా తన ముఖాన తగలెయ్యమనీ భార్యను పరిపరివిధాల బ్రతిమాలుతూ వచ్చాడు.

ఆరు మూడయేది మూడు ఆరయేది "ఆ యాభై" మాత్రం ఇచ్చేద లేదని ఆవిడ ఖరారుగా చెప్పేసింది. "కట్నం లేకుండా పిల్లని చేసుకున్నాం కదా; ఆ మాత్రం అల్లుడు గదా అని ఓ నూటపదహార్లు పండుగ పేరు చెప్పి వాళ్ళివ్వరాదా! మన వెధవాయ పెళ్ళాంచేత అడిగించరాదా" అని ఆవిడ రాత్రి గట్టిగా అనేసింది.

'మెల్లిగా వెధవా అంటే గట్టిగా ముండా' అనే తరహా మనిషి భీమశంకరంగారి భార్య.

పండక్కి అత్తారింటికి వెళ్ళి మళ్ళా పట్నం వెళ్తూ కొడుకూ కోడలూ ఇక్కడ దిగారు. ఓ నెల జీతం ముందే తీసుకుని ప్రయాణాలకు ఖర్చు పెట్టేసినందువల్ల, పట్నంలో కొంప చేరగానే ఆవగింజ దగ్గర్నుంచి తడుముకోవాలని బండి దిగిన గంటలో కొడుకు విన్నవించుకున్నాడు. ఉన్న డబ్బు రైలుకి కటాకటిగా సరిపోతుందని కూడా చెప్పకున్నాడు. భీమశంకరంగారి గుండె కరిగిపోయింది. ఆయన భార్య కానీ ఇవ్వడానికి ససేమిరా వల్లకాదంది. ఆపాటి జాలి తనకీ ఉందని కూడా చెప్పింది. అవతల కొడుకూ కోడలూ విని ఏమనుకుంటారో అని భీమశంకరంగారి బెంగ.

"సరేలే. నువ్వు ఇవ్వద్దు, పొద్దున నేనే చూసుకుంటా" అన్నాడు చాలా గంభీరంగా.

ఆదివారం ఉదయం ఆయన లేచి అప్పకు వెళ్ళబోయేసరికి చొక్కా, పంచె, కండువా కనబడలేదు. పెట్టె తాళం వేసుంది.

"ఛానే. నాచొక్కా ఏదీ?" అంటూ వంటింట్లోకి వెళ్ళాడు.

"ముందు స్నానం చెయ్యండి" అందామె.

శంకరంగారు స్నానంచేసి కట్టుకున్న పంచె తడిపేశాడు. ఓ అంగవస్త్రం, తువ్వాలూ అందించిందావిడ. అవి కట్టుకుని, దేవుడికి దీపం వెలిగించి, ఓ పువ్వు పడేసి లేచాడు. ఉట్టి వెనుక చిలకకొయ్యకి తగిలించి ఉన్నాయి తన ఆఫీసు దుస్తులు. కాస్త ఆశ్చర్యపడుతూ తీసుకోబోయేసరికి "ఆగండి. ఆదివారం పూట ఎక్కడి కెళ్తారు? పనుంది." అందామె.

"నాకు తెలుసు ఆ రాచకార్యం. మీరేం వాడికి డబ్బు తెచ్చివ్వక్కర్లేదు. అంత అవసరమయితే ఇక్కడింకొక రోజు ఉండి, అత్తారింటి నించి తీగె టపా మీద తెప్పించుకోమనండి."

"అది కాదే...."

"మీరు ముందు వీధరుగు మీద కెళ్ళి కూర్చుని పేపరు చదువుకోండి, నాకు పనుంది. పాలకాయలూ జంతికలూ చెయ్యాలి."

శంకరంగారు నోరు మూసుకుని వీధరుగు మీద కెళ్ళిపోయాడు.

కొడుకు అక్కడ కూర్చుని ఆలోచిస్తున్నాడు.

ఎన్నడూ నోరెత్తి అడగనివాడు ఇన్నాళ్ళకి తనని అడగడం, తను ఇవ్వలేని పరిస్థితిలో పడడం చాలా బాధ కలిగించింది శంకరంగారికి.

"బాబూ, ఇవ్వాల్టికాగి, రేపు వెళ్ళరాదురా. ఇవాళ ఆదివారం, రొఖ్ఖం జతపడింది కాదు" అన్నాడు ఎంతో లాలనగా.

"లేదండీ నాన్నగారూ, రేపే జాయినయిపోవాలి."

శంకరంగారు దిగాలుగా కూలబడ్డాడు కుర్చీలో. తను ఒక్కడుగు అలా వెళ్ళొస్తే ఎవడి నెత్తో కొట్టి యాభైకాదు వందైనా పుట్టించవచ్చునని ఆశ ఉంది. కాని, ఇంట్లో ఆడది మొండికెత్తిపోయి, తన చొక్కా పంచె వంటింట్లో పెట్టుకుని ఇవ్వను పొమ్మంటే ఎలా చావడం?.... తాలూకా ఆఫీసులో కాషియర్ గిరి అఘోరిస్తూ అంగోస్త్రం కట్టుకు ఊరేగడం అంటే ఒళ్ళు చచ్చిపోయినట్లుంది. అబ్బాయికే చీటీ రాసిచ్చి పంపుదామంటే మనసొప్పలేదు. వాడిప్పటికే ఎంతో మధనపడి, "డబ్బు వద్దులెండి నాన్నగారూ" అంటున్నాడు.

కన్నకొడుకుకి కానీ డబ్బివ్వలేని వాడినా అనుకుని ఒక్కసారిగా తెగించి, వంటింట్లో కెళ్ళి "నాకు పనుంది. ఆ గుడ్డలిలా పారెయ్" అన్నాడు గంభీరంగా. ఆవిడ వల్లకాదు పొమ్మంది అంతకన్న గంభీరంగా. ఆ తరువాత, శంకరంగారికి చిన్నప్పటి విద్యలు జ్ఞాపకం వచ్చాయి. అక్కడే కాసేపు తారట్లాడి చూశాడు. లాభం లేకపోయింది. ఆవిడ వెయ్యి కళ్ళు పెట్టుకుని చూస్తు ఉందాయె.

తన చిన్ననాటి కళావైదగ్ధ్యం ఈనాడు ఎందుకూ కొరగాకుండా పోయిందని విచారించాడు శంకరంగారు. ఏడెనిమిదేళ్ళ కొడుకున్నా, కాస్త తరఫీదు ఇచ్చి, ఇలాటి సమస్యలను చులాగ్గా ఎదుర్కోవచ్చు. ఉన్నవాడు పాతికేళ్ళవాడాయె, వాడికి ఇప్పుడు టోకరా విద్య ఎలా నేర్పడం?

కాసేపు ఆలోచించి కొత్తరకం ఎత్తువేశాడు ఆయన. వీధరుగుమీద కూర్చుని కోడలుపిల్లని పిల్చాడు. "అమ్మాయ్! వంటింటి చిలక్కొయ్యని నా చొక్కా పంచా ఉన్నాయిగాని, కాస్త పట్రా అమ్మా" అన్నాడు.

కోడలు మళ్ళా రాలేదు. ఆవిడే వచ్చింది. "మీక్కాదూ చెప్పింది. ఏమిటా కుట్రచేష్టలు?" అని కూకలేసి వెళ్ళిపోయింది. కోడలు విస్తుపోయింది.

భోజనాలయ్యాయి. పదకొండయింది. పన్నెండయింది. ఒంటిగంట కూడా అయినా, ఆవిడగారు కునుకుతీసేటట్లు కనబడలేదు. మళ్ళా నిప్పంటించి, పిండి వంటలు ప్రారంభించింది – కొడుకూ కోడలూ సాయంత్రం వెళ్ళిపోతున్నారుగదా అని.

శంకరంగారికి నిద్ర రాలేదు. కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. కొడుకు నిద్రపోతున్నాడు.

ఆయనకో ఊహ తోచింది. వాడిచొక్కా.... వేసుకుంటే?.... పంచెలేదాయె పొడుగు పంట్లాంలే ఉన్నాయి.

శంకరంగారికి సిగ్గేసింది. అయినా సరే ఓ పంట్లాం తొడుక్కున్నాడు. చొక్కాలన్నీ చిత్రంగా ఉన్నాయి. పట్నం చొక్కాలు కాబోలు ఒకటి బొడ్డు దిగదు. రవికెల్లా ఉన్నాయి.

అద్దంలో చూచుకున్నాడు. నవ్వొచ్చింది. తను నవ్వేలోగానే ఇంకో రెండు గొంతులు, ఒకటి కిలకిల, ఇంకొకటి ఫెళఫెళ నవ్వాయి. ఆ నవ్వుకి లేచిన కొడుకు కూడా పకపక నవ్వాడు.

శంకరంగారికి ఒళ్ళు చచ్చిపోయినట్లయింది. దొంగతనం చేస్తూ పట్టుబడ్డట్టనిపించింది. బీరువాకిందకి చూశాడు, దూరిపోదామని. కోడిగుడ్డు దీపం ఉండే గూట్లోకి చూశాడు. అందులో ముడుచుకు కూర్చుందామని.... ఒక్క క్షణం ఆగి ముగ్గురివంక చూశాడు. ఒక్క పెట్టున తనూ నవ్వెయ్యడం ప్రారంభించాడు.

"మీకేం మతిపోయిందా?" అందామె.

మళ్ళా అంగవస్త్రం – తువ్వాలు కట్టుకుని, అరుగుమీద కుర్చీలో చేరాడు శంకరంగారు – సృష్ట్యాది నుండి ఏ పురుషుడూ దేనికీ పడనంతగా విరహతాపం పడుతూ.

మూడున్నర అయింది. రైలుకింక గంటన్నర టైముంది. ఎలా డబ్బు పుట్టించడం?

వీధి వెంట ఓ కుర్రాడు వస్తున్నాడు అట్టపెట్టెని తన్నుకుంటూ. వాడు తెలుసు శంకరంగారికి. పెద్ద ఊహ పోయింది. కుర్రాణ్ణి పిలిచాడు. తెగించాడు. "ఒరేయ్ బాబు, నువ్వు సుబ్బారావు గారింటికెళ్ళి అర్జంటుగా.... అహకాదు, మా ఆఫీసు జవాను నాగన్నింటికెళ్ళి ఇక్కడున్నట్లుగా చిటికెలో కేకేసుకురా, నీకు రేపు గాలిపడగ కొనిస్తా" అన్నాడు.

ఏకళ నున్నాడో వాడు సరేనని వెళ్ళాడు. మూడున్నర నుండి నాలుగు దాకా శంకరంగారి గుండెకాయ నిమిషానికి మూడువందలసార్లు కొట్టుకుంది.

నాలుగింటికి నాగన్న వచ్చి ఏంబాబూ అనగానే స్థిమితపడింది.

"ఏవోయ్ నాగన్నా! నీకు పుణ్యం వస్తుంది. రేపు రూపాయొస్తుంది కాని, వెంటనే సుబ్బారావు గారింటికెళ్ళి అర్జెంటుగా అమాంతంగా ఒక్క యాభైరూపాయలు అడిగి తెచ్చిపెట్టు. రేపు ఆఫీసుకు రాగానే ఇస్తానని చెప్పు" అన్నారు.

నాగన్న కళ్ళు పెద్దవిచేసి. "అంత డబ్బు నాకిత్తారా బాబయ్యా, తవరే ఒక్కడు గెల్లరాదూ?" అన్నాడు.

"వెళ్దునుకాని పంచె చొక్కా.... దానికేంలే. నేచెప్పానని చెబుదూ.... ఇస్తాడు."

"పోనీ సీటీ ముక్క రాసియ్యండి బాబు"

"చీటీ! చీటీ కదూ. మరే చీటీ.... అవును చీటీ.... కాని కాని వీల్లేదే మా యింట్లో.... నా కర్జెంటు పనుంది నువ్వెళ్ళి చెప్పు. కావాలంటే అయన్నే పట్రమ్మను" అన్నాడు శంకరంగారు కంగారుగా. లోపలికి తొంగి చూశాడు. భార్య దగ్గర్లో లేదు.

పుణ్యం ఉంటుందనీ, జన్మలో మేలు మర్చిపోడనీ, డబ్బు మర్నాడే ఫిరాయించేస్తాడనీ, సంగతి తాపీగా చెప్తాడనీ, పుణ్యం ఉంటుందనీ, జన్మలో మేలు మర్చిపోలేడనీ పదే పదే మరీ మరీ సుబ్బారావుకు చెప్పి ఎలాగేనా రొఖం జతపరచి పట్రావలసిందని నాగన్నకి చెప్పి పంపాడు.

వాగన్న వెళ్ళిన క్షణం నుండి నాలుగూ నలభై ఐదు వరకూ ఆయన గుండె నిమిషానికి నాలుగువందలసార్లు చొప్పున కొట్టుకుంది.

ఇంట్లో పిండివంటలు పూర్తి అయిపోయాయి. మూట కట్టేసి, కొడుకూ కోడలూ ప్రయాణానికి సిద్ధమైపోయారు. భార్య పట్టుచీర కట్టేసుకుంది. కొడుకు బండి తీసుకురావడానికెళ్ళాడు. ఇంకో పదినిమిషాలలో అంతా రైలుకి బయల్దేరుతారు.

వాగన్న సుబ్బారావు ఇంటికి వెళ్తాడా? వెళ్తే ఆయన ఉంటాడా? ఉంటే డబ్బిస్తాడా? ఇచ్చినా, అది వేళకి అందుతుందా? అందినా భార్య కంటపడకుండా ఉంటుందా? కొడుకు కష్టం అదుకుని శంకరంగారు ఆదర్శపితగా నిరూపించుకుంటాడా?

గుమ్మంలోకి బండి వచ్చేసింది. సామాను పెట్టేస్తున్నారు టైము చూసుకుని. శంకరంగారి భార్య ఆయన పంచె చొక్కా కండువా ఇచ్చేసి కట్టుకోమంది. శంకరంగారు కదల్లేదు. తను లోపలికి వెళ్తే ఈ లోగా కొంప మునుగుతుందని భయం. భార్య గదమాయిస్తోంది.

"మెడ బెణికింది. అర్జెంటుగా కాసిని నీళ్ళు కాచు. కాపడం పెట్టాలి" అన్నారాయన హఠాత్తుగా బాధపడుతూ.

ఆవిడకి జాలేసింది. "పొద్దుట్నుంచి ఒక్కలా ఆ పడక కుర్చీలోనే కూర్చున్నారాయె, బెణకదూ మరి." అంటూ లోపలికి వెళ్ళి కుంపటి రాజేసింది.

ఈలోగా వాగన్న సుబ్బారావింటికి వెళ్ళాడు. సందేశం అందజేశాడు. కాషియర్ గారికి అప్పిచ్చినా పువ్వుల్లోపెట్టి మళ్ళీ ఇవ్వగలరన్న ధీమాతో సుబ్బారావుగారు ఏభై రూపాయలూ నాగన్నకిచ్చి పంపాడు. నాగన్న వాయువేగ మనోవేగాలతో వచ్చి, శంకరంగారికి రొఖ్ఖం అందించాడు. "నా కిత్తానన్న రూపాయేది బాబూ?" అన్నాడు.

"రేపు రేపు రేపు. లేదు లేదు చిల్లర లేదు. రేపు రెండు. రేపు రెండిస్తా – పద పద పద" అంటూ శంకరంగారు ఆదరాబాదరా ఆ డబ్బూ పంచె, చొక్కా పట్టుకుని పడమటింట్లో కెళ్ళిపోయి తలుపేసుకున్నాడు.

☆ ☆ ☆

రైలొచ్చింది. నలుగురూ ఎక్కి కూర్చున్నారు – అక్కడకూడా శంకరంగారికి స్వేచ్ఛ లేకపోయింది – భార్య ఒకపక్క కోడలికి నీతులు నూరిపోస్తూనే తనని ఓ కంట కనిపెడుతోంది.

"అత్తయ్యా! మా అమ్మలేని కొరత తీర్చారు మీరు ఈ ఒక్క రోజులోనూ. మా పిన్ని ఇంత ఆప్యాయంగా నన్నెన్నడూ చూడలేదత్తయ్యా. మీరు మా వూరు రావాలి. నెల్లాళ్ళపాటు ఉండాలి" అంది కోడలు హఠాత్తుగా.

శంకరంగారి భార్య ఉక్కిరి బిక్కిరైపోయింది. కోడలి శిర్సాన్ని ఆఘ్రాణించింది. మెటికలు విరుచుకు "నాతల్లే" అంది ఉప్పొంగే ప్రేమతో, ఒక్క క్షణం ఆగి "ఏవండీ, కోడలుకి పువ్వులు కొనిద్దామనేనా లేదు గదా. వేళైనట్లుంది. చటుక్కున వెళ్ళి కాస్త దవనం మరువం నాలుగు చేమంతి పువ్వులూ పట్రండి." అంటూ ఓ పావలా తీసి ఇచ్చింది.

శంకరంగారు ఎగిరి గంతేశాడు.

"నువ్వుకూడా వెళ్ళరా – ఆయన బేరంచేస్తే వాడిన పువ్వులే వచ్చేది" అందావిడ.

"దారా నాన్నా" అన్నాడు శంకరం విడుదల అయిన ఖైదీలా.

పువ్వులు కొన్నాక, అంగీ జేబులోనుంచి ఏభై రూపాయలూ తీసి కొడుకు జేబులో పెట్టాడు. "భద్రం వాయనా, కోడలికి చెప్పకు. అవసరానికుంచుకో, ఇంతకన్న ఏం చేయలేకపోయాను. తాపీగా పంపుతానులే" అనేసి కొడుకు జవాబు వినకుండానే రెక్కపట్టుకొని రైలుపెట్టె దగ్గరికి ఈడ్చుకొచ్చేశాడు.

రైలు కదిలింది.

రతీ మన్మథులు చెన్నపట్నానికి, పార్వతీ పరమేశ్వరులు స్వగృహానికి బయల్దేరారు.

ఒంటెద్దుబండిలో జేరగిలబడి కూర్చుని "అబ్బాయి మొహం అదాయిడ్డైనంతయింది. బయల్దేరినపుడు వెనకనించి డబ్బు పంపుతా 'నన్నారు కాబోలు. అదేం వల్లకాదు" అందావిడ హేళనగా.

శంకరంగారు ధీమాగా నవ్వాడు. "కోడలు పిల్ల మొహం కలకలలాడుతూ కనబడింది. ఏమిటి సంగతి? తెగించి ఓ పావలా చేతిలో పెట్టి గుప్పిట మూసి, జంతికలు కొనుక్కోమన్నావా?" అన్నాడు.

"పిల్లలు అవస్థపడతారని నాకూ తెలుసు. అక్కడికి మీకే ప్రేమ ఉన్నట్లు నిన్నా ఇవాళా నా ప్రాణం తీశారు కాని, పావలా ఏం కర్మం, నిన్న మీరడిగిన యాభైరూపాయలూ, మిమ్మల్ని పువ్వులికి పంపినపుడు పిల్లచేతిలో పెట్టి గుట్టుగా దాచుకోమని చెప్పాను. అబ్బాయికి ఈ సంగతి రాయబోకండి. రేపే తగలేస్తాడు" అందావిడ విలాసంగా.

"అబ్బే. నేను రాసినా వాడలా అడగడులే." అన్నాడు శంకరంగారు గుంభనగా.

★ ★ ★

# స్వయంవరం



అనగనగా ఒక జమీందారు. ఆయనకు లేకలేక ఒక కొడుకు. ఆ కొడుకు విద్యాభివృద్ధికై జమీందారు గారు విపరీతంగా కృషిచేసిచేసి, కొన్నాళ్ల తర్వాత ఆ బాధ్యతను భార్య బంగారమ్మకు ఒప్పగిస్తూ విల్లురాసి వెళ్ళిపోయాడు. భర్త కోరిక తీర్చాలన్న సంకల్పంతో ఆవిడ బస్తీ నుంచి పల్లెకు తరలివచ్చింది. అక్కడున్న చిన్న డాబా గోడలు ఎత్తు చేయించి, ఆమధ్య ఒక చిట్టి గది కట్టించి "నిరాఘాటంగా చదువుకొని మీ నాన్న ముద్దు చెల్లించు, బంగారు తండ్రీ" అవటాని కుమారరత్నాన్ని అందులో కూర్చోబెట్టింది. ఒక వయోవృద్ధుని గురువుగా నియమించింది. ఆ యిద్దరూ కాలు కదపనవసరం లేకుండా, భోజనాది వసతులన్నీ సమకూర్చి పెట్టింది.

ఏడాది తిరిగింది. అబ్బాయికి ఆయేటికాయేడు పైబడుతూందన్నారు బంధుకోటి. బంగారమ్మ గారి కొడుకు విషయంలో మాత్రం విద్యకి వివాహం వినాశనకారి కాజాలదంటే కాజాలదన్నారు పెళ్లీడు పిల్లలున్న అమ్మలక్కలు. పిల్లని తను ఏరితే పిల్లవాడి చదువుకి పిసరంత కూడా ఢోకా వుండదని బంగారమ్మ గారికి గట్టి నమ్మకం కుదిరింది. సరే అంది.

'ఊఁ' అన్నారు ఊళ్ళో చాలా మంది. బంగారమ్మ గారు గుమ్మం దిగే ఘటం కాదు. కొడుకును మేడ దిగనివ్వదు. అందుకని, మోజుగలవాళ్ళంతా పిల్లలను వాళ్లింటికే తీసుకువెళ్ళేవారు. ఈమాట ఆనోటా ఆనోటా ఊరూర పాకింది. బస్తీ కాలేజీలో చదువుతున్న చండిక, కాంచనమాల అనే యిద్దరమ్మాయిలు బంగారమ్మ గారి బంగారు పిచ్చిక సంగతి విని విస్తుపోయారు. కుతూహలం కలిగింది. చండిక, కాంచనమాల వాళ్ళ అసలు పేర్లు కావు. రూపురేఖా విలాసాల వల్ల ఇతరులు ఇచ్చిన బిరుదులు. చండిక విచ్చు రూపాయల్లె ఖంగున మోగుతూ వుంటుంది. రూపాయి అంచు గరుకుల్లా ఆమె మొహం మార్దవం లేకుండా వుంటుంది. కాంచనమాల సన్నగా పొడుగ్గా బక్కగా వుంటుంది. ఇద్దరూ పంతం వేసుకుని, ఆపైన కూడబలుక్కుని ఒకరోజు ఎవరికీ చెప్పకుండా బంగారమ్మగారి ఊరు బయలుదేరారు.

బంగారమ్మగారి ఇంటి గుమ్మంలోనే ఇంకో అమ్మాయి కూడా వాళ్ళకు తారసపడింది. ఆ అమ్మాయి పేరు శ్రీదేవి. చక్కగా ఉంటుంది. మంచివాళ్ళకి నెమ్మదస్తురాలు గాను, చెడ్డవాళ్ళకి వాజమ్మగాను కనబడుతుంది.

ముగ్గురూ చాపమీద కూర్చున్నారు. బంగారమ్మగారు వాళ్ళ పేరు, పుట్టు పూర్వాలు కనుక్కుంది. రెండు నిముషాలు ఆలోచించింది.

"ఓ పిల్లలూ మీ ముగ్గురుకీ మూడు పనులు చెబుతాను. పది నిముషాలో పూర్తిచెయ్యాలి. అప్పుడు మా ఇంటి కోడల్ని ఎన్నుకుంటాను" అంది.

సరేనన్నారు ముగ్గురు.

"ఓ చండికా! వసారాలో ఒక గడ్డపాయన ఉంటాడు. పేరు గడ్డంరాజు. మొండి. దేనికీ ఖాతరు లేదు. నువ్వు వెళ్ళి అతగాణ్ణి లేవగొట్టాలి. పొలానికి పంపి ఒక బండెడు తాటాకు తెప్పించాలి అతగాడిచేత." అంది బంగారమ్మ.

"ఓ అదెంత పని" అని ఎగిరి గంతేసింది చండిక.

"పిల్లా నీ పేరేమిటన్నావు? కాంచనమాల కదూ? పడకటింట్లో నా తమ్ముడి షడ్డకుడున్నాడు. మహా దొడ్డవాడు చదువులో. ఒఖ అడుగు అలా కరణం గారింటికెళ్ళి బస్తీలో ఇపుడు ఆడుతున్న బైస్కోపులేమిటో వాళ్ళ అబ్బాయిని కనుక్కుని వచ్చి చెప్పమను" అంది బంగారమ్మగారు.

"ఓ! ఇంతేకదా" అంది కాంచనమాల విలాసం ఒలకబోస్తూ.

"చిన్నదానా నీ పేరేమిటి?"

"శ్రీదేవి అంటారండి."

"సరే. పెరట్లో గడ్డివాము దగ్గర బొంత, దిండు వేసుకు కూర్చుని ఏగబిగిన రావుల కొద్దీ ఏదో రాసేస్తున్న జానపాల కవి ఒకడున్నాడు కవిత్వం రాయించడానికి మా తమ్ముడి షడ్డకుడు వాణ్ణి తీసుకొచ్చాడు. ఇదిగో ఈ దస్తావేజు పట్టికెళ్ళి కాస్త సాపు రాసి పెట్టమను. నిమిషం పని అని చెప్పు. కాస్త ముక్కోపి జాగ్రత్త" అంది బంగారమ్మ.

☆ ☆ ☆

ముందు బయలుదేరిన చండిక చరచర నడిచి, సరాసరి వసారాలోకి వెళ్ళింది. కుక్కి మంచం మీద కూర్చుని గడ్డం దువ్వుకుంటున్న గడ్డం రాజు కన్నెత్తి చూడలేదు. పన్నెత్తి పలకలేదు.

"ఏవయ్యోయ్, గెడ్డపాయనా, అలా పొలానికెళ్ళి ఓ బండి తాటాకులు పట్టించుకురా" అంది చండిక ధీమాగా. గెడ్డంరాజు కదలలేదు మెదలలేదు.

"ఈ ఇంటికి కాబోయే కోడల్ని నేను తెలుసా?"

గెడ్డంరాజు ఉలకలేదు, పలకలేదు. నిర్లక్ష్యంగా కూర్చున్నాడు.

చండికకు ఒళ్ళు మండిపోయి పెరట్లోకెళ్ళి పచ్చడిబండ పట్టుకొచ్చి, హూంకరించింది.

గడ్డంరాజు కన్నెత్తి చూచి, "మంచిదమ్మా వెళ్తున్నాను. గంటలో పట్టించుకొస్తా." అన్నాడు.

విలాసం ఒలకబోస్తూ బయలుదేరిన కాంచనమాల పడమటింట్లోకి వెళ్ళి బంగారమ్మ తమ్ముడి బావమరిదిని పలకరించి, ఇంటికి కాబోయే కోడల్ని అని చెప్పింది. 'ఓహో అలాగా' అని తలవంచుకు చదువు కొనసాగించబోయాడు.

కాంచనమాల, తను వచ్చిన పని చెప్పింది. బ్రతిమాలింది. బామాలింది.

బంగారుతండ్రి, బాచాల కొండ అంది. తనకన్న చిన్నది తనని అలా పిలవడంతో అతడు తలెత్తి కళ్ళు విప్పార్చి, సావకాశంగా చూశాడు కాంచనమాలను. కాస్త వెళ్ళి కనుక్కొరమ్మంది కాంచనమాల. ఎప్పుడూ ఉండే చదువుకి అంతలో ముప్పేమీ ఉండదని హామీ ఇచ్చింది. ఎవరి మాటా వినని విద్యానిధి కాంచనమాల మాట కాదనలేక కరణంగారింటికి బయల్దేరాడు బైస్కోపు సమాచారం కోసం. దస్తావేజు కాగితం చేత పట్టుకొని, చిన్నచిన్న అడుగులు వేస్తూ బయలుదేరిన శ్రీదేవి, గడ్డివాము నీడలో హోరాహోరీగా కవిత్వం రాసేస్తున్న కవిని నెమ్మదిగా పలకరించింది.

'ఎవరవు తన్వీ, దివి నుండి భువికి దిగితివో భువినుండి దివి కేగుచుంటివో' అన్నాడు భావకవి. అంటూనే నాలిక కరుచుకున్నాడు.

"ఈ దస్తావేజు కాస్త సాపు రాసి పెట్టాలండి" అంది శ్రీదేవి వినయంగా. మన్నూ మిన్నుల మధ్య ఉన్నదంతా అదిరిపడేటంత కేకపెట్టాడు కవి. కొంతసేపు తెలుగులోనూ, ఆ తరువాత ఇంగ్లీషులోనూ కోప్పడ్డాడు. 'ఇన్సల్ట్' అనేశాడు. శ్రీదేవి హడలిపోయి కంటనీరెట్టుకుని సరాసరి ఇంట్లోకెళ్ళిపోయి బిక్కమొకం పెట్టుకూర్చుంది.

బంగారమ్మగారు సావిట్లోకి రాగానే చండిక గర్వంగా లేచి నిల్చొని, 'గెడ్డపాయన్ని పొలానికి పంపేశానమ్మా' అంది.

"మీ తమ్ముడి బావమరిది ముందు గునిసినా, చివరికి కరిగిపోయి కరణం గారింటికెళ్ళేరత్తయా" అంది కాంచనమాల.

"నువ్వేం చేశావు పిల్లా" అంది బంగారమ్మ.

శ్రీదేవి బావురుమంటూ, "ఆయన గసిరికొట్టారండి. దస్తావేజుకు సాపు రాయలేదు" అంది.

"నాతల్లే మాయింటి మాలక్ష్మి. నువ్వే నా యింటికి కోడలు కాదగ్గదానివి" అంది బంగారమ్మగారు శ్రీదేవిని ఆప్యాయంగా దగ్గరకు తీసికొని. చండిక మండిపడి హుంకరించింది.

"అదుగో అందుకే నువ్వు నా కోడలు కావడానికి పనికి రావన్నది. గెడ్డంరాజుని హడలేసిన ఆడదానివి రేప్పొద్దున్న నా కొడుకుని నీచేతిలో కీలుబొమ్మ చేసుకోవూ! ఓ కాంచనమాలా! నువ్వూ పనికిరావు. నీ హొయలు నీ సొగసు చూస్తే మావాడి చదువు, నా ప్రతిజ్ఞ, ఆ మారాజు కోరిక బుగ్గిపాలయిపోతాయి. మాకు అన్ని విధాలా తగింది శ్రీదేవే. బంగారుతల్లి" అంది బంగారమ్మ గారు.

ఆ ఊళ్లోనే ఆకాశమంత పందిరేసి, భూదేవంత అరుగేసి అందుమీద ముత్యాల ముగ్గులూ, రత్నాల రంగవల్లులూ తీర్చిదిద్ది, తన కుమార రత్నానికీ శ్రీదేవికీ పెళ్ళి చేసింది బంగారమ్మగారు. శ్రీదేవివంటి వెర్రిబాగుల పిల్ల దొరికింది కాబట్టి, తన కొడుకు చదువు నిరాఘాటంగా సాగుతుందనీ, తన లక్ష్యం సిద్ధిస్తుందనీ మురిసిపోయిందావిడ.

ఇలా కొంతకాలం సాఫీగా సాగిపోయేసరికి ఒక ఏడాది జూన్ 18న బంగారమ్మ గారి కుమారుడు మెట్రిక్యులేషన్ ప్యాసై ఊరుకున్నాడు.

★ ★ ★

# సన్మానభంగం



కాంగో రాజకీయాల్లా సభ గందరగోళంగా వుంది. ఇరవయ్యో శతాబ్ది జీవితంలా చీకాకుగా వుంది. చేతకానివాడి చేతిలో ఆర్కెస్ట్రా వాద్యాలలా ఈలలు, కేకలు తలో అపశ్రుతిలాగ పలుకుతున్నాయి. పలకరింపులూ, చీత్కారాలూ, స్వగతాలూ, జనాంతికాలూ, ఆహోలు, ఈహీలు, ఉహూలు, (అప్పులడిగినవాళ్ళకి) ఓహోలు, హిహీలు, విమర్శలు, పరామర్శలు, హేళనలు, హేషలు, ఘీంకారాలు, కిచకిచలు, కిలకిలలు, రంకెలు, కేరింతలు వగైరాలతో శబ్దం శతసహస్ర ముఖాలుగా ధ్వనించి ప్రతిధ్వనించి క్రమంగా సరిహద్దుదాటి నిశ్శబ్దం స్థాయికి చేరుకుంటోంది. టాపు లేచిపోతే తాము కూలిపోతామన్న భయంకొద్దీ పంకాలు విపరీతమైన వేగంతో తిరుగుతూ శబ్దాన్ని తొక్కేస్తున్నాయి కిందకి. నిన్న సాయంకాలం సభ తాలూకు నిర్వాహకులు, నేటి సమావేశకర్తలు నిన్న పెట్టిన అల్లరిని తలచుకొని అక్కసుకొద్దీ అల్లరిలో యివాళ బాకీ తీర్చేయడమే కాక అప్పు కూడా యిస్తున్నారు. సభ సాయంకాలం ఐదున్నర కొట్టి ఆరున్నరకి సగమేనా కాకపోతుందా అన్న ధీమాతో వచ్చి మొదలైనా కాకపోవడంతో చిన్నపుచ్చుకున్న పెద్దలు ఏడు కాగానే మండిపడడం మొదలెట్టారు. జన్మలో యెప్పుడూ ఇలా పెందరాళే తగలళ్ళేదు. ఇన్నాళ్ళకిక్కడ అవమానమయిందని తిడుతున్నారు. ఇండియన్ పంక్చువాలిటీ సార్ అని ఆ పెద్దల దృష్టిలో పడబోయిన సన్నకారు జనం పాత పాత విట్లతో సెటైర్ ప్రయోగిస్తున్నారు. మరికొందరు పాత సెటైర్లని 'రీట్రేడ్' చేయించుకొచ్చి సభంతా దొర్లిస్తున్నారు. పాటలూ, పద్యాలూ, కంప్లెయింట్లూ వగయిరా లలితకళలు కూడా వర్ధిల్లుతున్నాయి.

విసుగెత్తిన ప్రయాణీకుడు యీలవేస్తే, అది కండక్టరు ప్రజ్ఞే అనుకొని బస్సు కదిపిన డ్రైవరులా, ప్రార్థన పద్యాలాయన మూడోమాటు మైకు ముందుకొచ్చి పద్యం మొదలెట్టి కరతాళధ్వనుల మధ్య అర్ధాంతరంగా వెనక్కెళ్ళిపోయి తూనాబొడ్డు అనుకుంటున్నాడు.

అంతానాటకంలా వుంది అన్నాడు ప్రస్తుతానికి మసిబారిన చిమ్నీలా కూర్చున్న ఒక తెలుగు దీపకళిక నిశితంగా.

హిందీ నాటకం పోలేనా అసలూ అన్నాడు సాటివెలుగు కసుక్కున నవ్వి చటుక్కున తనముందున్న గడ్డపాయన వెనక తల దాచుకుంటూ.

☆ ☆ ☆

అది నాటకం పోలే. పెద్దరకం సభలకి అది పుచ్చుకుంటూ ఉంటారు. అవతలివాడు యే మంత్రో అయితే మరీను. నాటకరంగం వెనకనే ఉన్న గ్రీన్ రూమ్‌లో ఒక కాబోతున్న మంత్రిగారూ, సభ నిర్వాహణలో ఆ పూటకొచ్చిన వక్తలూ చేరి చాలా ఖంగారుపడుతున్నారు.

ఎబ్బే లాభం లేదండి. మనవెంత పూలతో కప్పేసినా కనిపిస్తాయి. ఎబ్బెట్టుగా ఉంటుంది అన్నాడు ఒక వక్త.

అందరూ సన్మానితుడికేసి జాలిగా, భయంగా చూశారు. ఆయన పేరు సుబ్బన్న గారట. మహాభక్తుడు. వినయభూషణుడు. దారుణమైన వినయంట. పొరుగూరునుంచి ఒక పెద్ద మనిషీయన్నిక్కడకు పంపి సన్మానం చేయించమని చీటీ రాసిచ్చాడు.

కాబోతున్న మంత్రిగారికి పబ్లిసిటీ కాంపెయిన్ కార్యక్రమంలో ఒక సన్మానసభ కూడా ఉంది. సరే యీాయన వేళకొచ్చాడని ఆయన బలగం సన్మానాని కీయన్ని బుక్ చేసి పబ్లిసిటీ ఇచ్చారు. ఇంత విపరీతమైన వినమ్రుడు ఈయనేనని అసలు లోకంలో వినయం నిండుకోడానిక్కారణం ఉన్నదంతా పోగై ఈయనగా కరడుకట్టుకు పోవడమేననీ వెల్లడించారు: ఈ చమత్కారమే ప్రధానంగా మంత్రిగారి అధ్యక్షోపన్యాసం, ముఖ్య వక్త ఉపన్యాస భాగంగా యేర్పాటు అయ్యాయి. తీరా సభవేళకి వినయభూషణుడు సుబ్బన్నగారికి తనంత వినయశీలుడు లేడన్న గర్వం గంటకి బోలెడు చొప్పున పెరిగిపోయింది. ఇష్టాగోష్టి జరుగుతుండగానే కణతలపైన దురద వేసినట్టయి రెండు మూడుసార్లు తడుముకున్నాడు. తరవాత రెండు చిన్న బొడిపెలు వచ్చాయి.

సెగ్గడ్డలా? అన్నాడు కొంచెం లేటుగా వచ్చినాయన అవిచూసి, మీ అహంకారపు వేడివి కంట్రోలు చేసే ధర్మాస్ బొడిపెలు అన్నాడొక ఆధునిక కవి. సుబ్బన్నగారు వినయంగానే నవ్వారుగానీ ఆ బొడిపెలు రెండు హఠాత్తుగా బారెడు కొమ్ములుగా పెరిగి చివర సుడి తిరిగాయి. అంతా ఖంగారుపడ్డారు.

కాబోయే మంత్రిగారు ఇలాంటి సన్మానసభలో అధ్యక్షతకి సుతరామూ ఒప్పుకోలేదు.

ఈనగురించి మనకేం తెలీదు. వినయం ఉందన్న పరువు తప్ప, తీరా అది కాస్తా ఇలా తగలబడింది. ఏంజూసి మాటాడమంటావయ్యా అన్నారు కా. మంత్రిగారు సుబ్బన్న కొమ్ములకేసి చూస్తూ.

ఎవరో తలుపు తీశారు. అవతల సభామందిరంలోంచి హాహాకారాలూ ఈలలూ హోరెత్తాయి.

కొమ్ములు కొట్టించేద్దాం లెండి అన్నాడు పెద్ద, తలుపు మూశాక.

మళ్ళీ మొలుస్తాయి.

అయినా నేను ఇంక ఈయనమీద ఉపన్యసించటం కల్ల అన్నాడు ఒక వక్త.

పోనీ ఇంకెవరినైనా కేకేద్దామా?

ఇంకోడిమీద నేను చస్తే మాటాడను. అమాటకొస్తే మాటాళ్లేను. ఈయనమీద ఫస్టాస్ ఫ్యామరస్ స్పీచ్ ప్రిపేరు చేసుకొచ్చాను అన్నాడు మరోవక్త.

దానికేముందండి, ఆ వచ్చేవాడిమీదే ప్రయోగించండి.

అంత బతిమాలడమేల? అరుగో వారున్నారు; నేనున్నాను. ఇద్దరం చాలమా?

ఇప్పటికే కాలాతీతం అయిందికూడా, వక్తలు తక్కువైతేనే మంచిది అన్నారు

ఆయనకి సన్మానితుడు ఎవడైనా, సభ యేదైనా ఫరవాలేదు. నన్నయ్య తగలేసిన పజ్జాలన్నీ యెర్రన్న నెత్తిన రుద్దేస్తున్నారన్నది ఆయన జెండా. దానిమీద ఉపన్యసిస్తూ తన శత్రువుకి దైవసమానుడైన తిక్కన్నని ఉతికెయ్యడం ఆయన పరమార్థం. వేరుశనక్కాయలసభలో నైనాసరే ఆయన ఈ ఉపన్యాసాన్ని అన్వయించి మాటాడేసి, కాబట్టి వేరుశనగకు వాగన్లు త్వరగా సప్లయి చెయ్యాలి అని ముగించగలడు.

ఇది అందరికీ తెలుసు.

పోనీ ఈ ప్రజ్ఞను పట్టుకొని, ఈ కంకణశాస్త్రులవారికి సన్మానం చేసేస్తే? అన్నాడు నిర్వాహకుడు.

ఒక ఉత్సాహి గబుక్కున తలుపుతీసి అవతలకెళ్ళాడు; కేకల కెరటం గదిని ఊపేసింది. వెళ్ళినవాడు వేదికమీదకెక్కి "ఆర్యులారా! చిన్నమార్పు.... సన్మానితుడు సుబ్బనగారు కాదు శాస్త్రులవారు. కారణం నేలమీద నిలబడ్డం" అని టూకీగా ప్రకటించాడు.

☆ ☆ ☆

కా. మంత్రిగారి కార్యదర్శి ఉత్సాహంతో ఎగిరి గంతువేశాడు. ఔను. ఔనౌను. బెస్టుఔను మరొహాడైతే ఇంత రీసెర్చి చేసినందుకు పట్టపగ్గాల్లేకుండా ఉండేవాడు కాదని, నేలమీద నిల్చేవాడు గాడని, ఈయన నేలమీద ఉండడంవల్ల మహా వినయశీలుడనీ కూడా బయటపడి పోతూాందవీ....

అనుకోకుండా శాస్త్రులవారి పాదాలకేసి చూసిన ఆ ఉపసభ వారంతా ఏకగ్రీవంతో కేరింతకొట్టారు.

శాస్త్రులవారు నేలమీదలేరు. పాదాలు నేలకి బాగా ఆరంగుళాల ఎత్తున ఉన్నాయి. శ్రీవారుకూడా సంస్కృతంలో బావురుమన్నారు. మందః కవియశః పార్థ అని చూశారు గద్గదస్వరంతో గర్వం అణిగిపోతుందేమో నన్న దురాశతో.

బాబోయ్ ఆ కాళిదాసు ఊసెత్తకు. వాడలా అన్నాడు గాని వాడికి మహాలావు అహం అన్నాడాయన బావమరిది.

ఒక మహానటుడు తలుపు తీసుకొచ్చాడు. ఈలలతో కేకలతో గది అదిరిపోయింది.

ఛీ. ఎంత అహంకారం. ఏవి గర్వం. మాటవరుసకి నువ్వా గొప్పవాడవే లేవయ్యా అంటే ఔననుకుంటాడూ, ఎంత గొప్పవాడైతే మటుకు ఒప్పేసుకుంటాడూ, అలాటివాడికి సన్మానం చేస్తే మన గొప్పేవిటి? అన్నాడు మహానటుడు.

ఆయన పూర్వాశ్రమంలో కవి. ఒక తాత్కాలిక యుగకర్త. దరిమిలాను వినయం యెక్కువై తాను కవిత్వానికి అనర్హుణ్నని, ఇన్నాళ్ళు కవిగా అభినయించ గలిగినట్టు ఈ మధ్యనే పసిగట్టి తన ప్రజ్ఞ నటనలో ఉందని గ్రహించి ఇందులో జొరపడ్డారు.

ఈ నాలుగు పాయింట్లు జోడించి, మనం అవతల పోటీదార్ని చితగ్గొట్టెయ్యొచ్చు. వారు దేశ సేవకులుగా చేస్తున్న అభినయం అద్భుతమనీ అందువల్ల వారు ఫిరాయించి రాజకీయాల్నించి కళారాజకీయాలకు దయచెయ్యటం మంచిదనీ మీరు స్పీచికొట్టి వాణ్ణి చిత్తుచెయ్యొచ్చు. అందుచేత ఆ సన్మానం వీరికే చేస్తే బాగుంటుంది.

నిమిషంలో రాయించుకొస్తాను. శ్రీకాలం హెడ్డింగుతో వస్తుంది రేప్పేపర్లో అన్నాడు కార్యదర్శి.

మీరంతా బలాత్కరిస్తే నాదేముంది అన్నాడు నటుడు సవినయంగా పైకి చూడబోయి.

వలంటీరు తలుపుతీసుకు బయటికి వెళ్ళాడు. గది గోలెత్తిపోయింది. వలంటీరు మైకులోంచి మళ్ళీ మార్పు ప్రకటించాడు. 'ఆర్యులారా ఇందాక చిన్న పొరపాటు, వక్తగారి పేరును పరాకున సన్మానితుడిదిగా ప్రకటించితిమి. ఇపుడు సన్మానం జరిగేది సుప్రసిద్ధ మహానటుడుగారికి, కారణం కళ్ళు నెత్తికెక్కక పోవటం' అన్నాడు ముక్తసరిగా.

☆ ☆ ☆

పైకి చూడబోయిన మహానటుడు అదిరిపడి చేత్తో మొహం తడుము కున్నాడు. అయనకి ఆ గది పైభాగం అంతా బర్మాలో వెదురు పొదల అడవిలా కనబడింది. మళ్ళీ మొహం తడుముకున్నాడు. కళ్ళు రివాజైన చోట లేవు. బాగా పైకి జరిగి నెత్తిమీద జులపాల మాటున వున్నాయి. రెప్పలార్చి కంగారుగా చూస్తున్నాడు భయంతో.

హే రామచంద్రా రక్షకా అన్నారు శాస్త్రులవారు.

హోరుమంటున్న చప్పుడుతో, వలంటీరు లోనికి వచ్చేసరికి అందరికీ చెవులు గళ్లు పడ్డాయి. "ఏడున్నరయింది. జనంగోల కంట్రాక్టు నాటకాల అడియన్సు కన్న కనాకష్టంగా ఉంది." అన్నమాట ఎవరికీ వినబడలేదు. కాని ఒక నిమిషం తరవాత.... అందరికీ తుమ్మెద ఝుంకారం లాంటిది మంద్రస్వరంలో శ్రుతిపేయంగా వినబడింది. ఐదు, పది అనే మాటలు వినిపిస్తున్నాయి. చేతులు జేబుల్లోకి వెళ్లొచ్చి మంత్రముగ్ధులు అయినట్లుగా ఐదూ పదీ, అర్ధా పర్ధా ఇచ్చేస్తున్నాయి.

"చాలా థాంక్సు, ఇంతమంది సహృదయులు ఒక్కచోట పోగడ్డం చూసి చాలాకాలం అయింది. మీ అప్పులన్నీ నెల్లాళ్ళలో ఇచ్చేస్తాను" అన్నాడు అప్పారావు సర్వజన మనోహరంగా నవ్వుతూ.

నల్లగా, పొట్టిగా, నవ్వుతూ ముద్దొస్తున్న ఆ మనిషిని అందరి కళ్ళూ విప్పారచూశాయి. అందరిలోనూ ఒకేమారు స్నేహం, ప్రేమ, గౌరవం పెల్లుబికాయి.

సభ పెద్ద, పెద్దబ్బాయిగారి చిన్న అమ్మాయి ఋణసుందరి హఠాత్తుగా తలుపుతోసుకు లోపలికొచ్చి అప్పారావుని చూసి క్షణం సిగ్గుపడి, వీరే నాన్నా వీరే అంది. తరువాత ధైర్యం తెచ్చుకుని జీనియస్ నాన్నా. అప్పులమీద ఇంత అథారటీని నేనెక్కడా చూళ్లేదు. ఎంత షోగ్గా అప్పు చేస్తాడో తెలుసా! ఎన్నో చెప్తాడు. నాన్నోయ్ మరే రూమ్మేటికి మనియార్డర్రాగానే అప్పుచేస్తాం చూడూ, అప్పుడేమో అస్సలు ఒక్క అరనిమిషం కూడా ఆగకూడదట. పోస్టుమాన్ ఇలా ఇచ్చీ ఇవ్వగానే ఆ వేడిలో లాగేసుకుంటే అవతలి వాళ్ళకి నొప్పి తెలీదట. మనం ఇన్నాళ్ళూ రాంగ్ మెథడ్ రైటనుకున్నాం –

పెద్దబ్బాయిగారు అమ్మాయిమాట వినలేదు. అమాంతం అప్పారావుని కౌగిలించుకొని "ధన్యుణ్ణి, ఇన్నాళ్లూ మీకీర్తి వినడమేగాని చూడ్డం పళ్ళేదు. ఇప్పుడు

వెదకబోయిన ఋణదాతలా ఎదురయ్యారు. మీకన్న గొప్ప కళాకారుడు మాకు దొరకడు. మీకు కాస్సేపు సన్మానం చేసుకుంటాం. టైము వేస్టని తెలుసుననుకోండి, కాని కాదనకండి" అన్నాడు.

కా. మంత్రిగారు ఆలోచించకుండా తల తాటించి, ప్రాధేయపూర్వకంగా చూశారు.

కళ్ళజోడు వక్తకి ఒళ్ళు మండింది. ఏవిటిసార్. ఏవిటి వీరి గొప్ప? అప్పులెవరు చెయ్యరు? తెల్లార్లేచింది లగాయితు అడ్డమైనవాడూ చేస్తూనే ఉండె. లక్షసార్లు చేశాం. ఇంకా లక్షసార్లు చేస్తాం. అవసరం ఉండకా తప్పదు. అప్పు చెయ్యకా తప్పదు అన్నాడు తీవ్రంగా.

అప్పారావు చప్పట్లు కొట్టాడు. తల పైకెత్తాడు. విలాసంగా నవ్వాడు. జాలిగా చూశాడు.

నేను అవసరముంటేనే అప్పు చెయ్యాలనుకోను. పువ్వులెందుకు పూస్తాయి? పిల్లలెందుకు నవ్వుతారు? నేను అందుకే అప్పు చేస్తాను – కోకిలలెందుకు కూస్తాయి.... నే అందుకేనూ – సెలయేళ్ళెందుకు గలగల మంటాయి – అందుకే. కృష్ణశాస్త్రి మరెందుకు కవిత్వం చెబుతారు? – డిటో.... రామాయణం మళ్ళీ ఎందుకు రాస్తారు? సేమ్.... చాలామంది ఎందుకు కవిత్వం చెప్పరు?

అలాగే జలదం ఎందుకు వర్షిస్తుంది – చంద్రుడు ఎందుకు వెన్నెల కాస్తాడు? మీవంటి సహృదయులు ఇప్పుడో ఐదు రూపాయలు నాకెందుకు అప్పిస్తున్నారు? అందుకే....

చూశారా? సూర్యుడు సముద్రుడి దగ్గిర అప్పుతీసుకున్నట్లు, తేటి పూబోటినుంచి తేనె గ్రహించినట్లు, అమ్మాయి పూలు వాసన చూసినట్లు, నేను సహజంగా, మృదువుగా, నొప్పిలేకుండా, తెలియకుండా, ఇలా ఋణగ్రహణం చేస్తాను అన్నాడు. అని వినయంగా తలవంచుకొని వక్త చేతులోంచి అందుకున్న రూపాయినోట్లు ఐదూ ఉన్నాయా లేదా అని లెక్కచూసుకున్నాడు.

కా. మంత్రిగారుప్పొంగిపోయి, దగ్గిర్లోవున్న దండ ఒకటి అప్పారావు మెడలో వేసి కావలించుకున్నాడు.

శాస్త్రులువారి కళ్ళు చెమర్చాయి. ఋగ్వేదంలో కూడా ఋణాల గురించి వుంది. ఆ యొక్క ఉషస్సు అనేది అప్పులనే చీకటి పారద్రోలే ఋణంలా భాసించిందని ఒక వేదర్షి వ్రాశారు అన్నారాయన బొంగురుపోయిన గొంతుతో....

"కదలండి కాలాతీత మయింది" అన్నారు మంత్రిగారు. అందరూ వేదికపక్క సైడు కర్టెన్లో నిలిచారు చెవులు రెండు చేతుల్తో మూసుకుని.

వలంటీరు మైకు వాల్యూము పెద్దది చేయించి, "ఈమాటు సభ నిజంగా బిగినైపోతుంది" అని గావుకేక పెట్టాడు. హాలు దద్దరిల్లిపోయింది. అంతా నిశ్శబ్దం. అప్పారావు ఓ గులాబీ రేకు తీసి కింద పడేశాడు. ధన్‌మని చప్పుడయింది.

"ఇప్పుడు ఇందాక ప్రకటించిన ప్రకారం ఆ మహానటుడుగారికి కాక అప్పారావుగారికి సన్మానం జరుగుతుంది" అన్నాడు వాలంటీరు. అప్పారావు తొంగిచూసి సభలో నలుగురైదుగురు నిలబడ్డం గమనించి వలంటీర్ని వెనక్కి పిలిచాడు. ఐదు నిమిషాలు గుసగుసలాడాడు.

.. మైకు ముందుకు వెళ్ళి "కాదు. నరసింహారావు గారికి సన్మానం"
..ప్పరావు పేరువిని నిల్చినవాళ్ళు కూర్చున్నారు. గాని మరి పదిమంది
. అబ్బే సుబ్బారావుగారికి అన్నాడు వలంటీరు. వాళ్ళు కూర్చున్నా ఇంకో ఆయిగురు లేచారు ఆశగా.

"కాదు వీరపరెడ్డిగారికి" అన్నాడు వలంటీరు.

ఇలా పొరపాట్లు సవరించుకుంటూ, జలాలుద్దీన్, చమన్‌లాల్, హీరాచంద్ సితానీ, జాన్ హారిసన్, వెంకటేశ్వర్లు అనే పేర్లు ప్రకటించి చూసి చివరికి భద్రయ్య అన్నాడు. వీరభద్రయ్యా అని సభ అడిగింది. రాంభద్రయ్య అంటే కొందరూ, వీరభద్రయ్యంటే కొందరూ లేచారు.

పర్లేండి ఉత్తభద్రయ్య అన్నాడు వలంటీరు. సభ తటపటాయించింది. ఓ నిమిషంలో ఎవరోకాని భద్రయ్య నాకు బాకీ పాతికివ్వాలి పత్తాలేడు అన్నారు. సభ గొల్లుమంది.

మంత్రిగారికి నీరసం వచ్చేసింది.

పోనీ ఓ పనిచేద్దాం. సన్మానితుడు కారణాంతరాలవల్ల రాలేదనీ, వారి తరఫున తరుణానికి తోటి పెళ్ళికొడుకులా ఒకర్ని కూచోబెడతా మనీ ప్రకటన చేసి ఈయన్నే కూచోబెట్టి కాండ సాగించేద్దాం అన్నాడు శాస్త్రిగారు. కాండేవిటండి, ఇదేం తద్దినమా మన శార్థం అన్నాడు కా. మంత్రి.

అలాగే వుంది అన్నాడు ఒక వక్త.

ఋణాగ్రేసర చక్రవర్తి, సన్మానం చేస్తున్నప్పుడున్నూ గైరుహాజరు కావడమే సహజమును, సముచితమును అన్నాడు వెనకనించి ఇది చూస్తున్న ఒక పెద్దమనిషి.

అసలా పాయింటుమీద సభని పొట్టచెక్కలయ్యేలా నవ్వించవచ్చు. అసలే విసుగేసి ఉన్నారు. వాళ్ళకి విట్లు, వినోదం కావాలి అన్నాడు ఒక వక్త.

మిగతా వక్తలంతా నాలుగోసారి సన్మానం జరుగబోతున్న ఆసామి గురించి ఉపన్యాసా లల్లేసుకుంటున్నారు చకచకా.

వాళ్ళ మొహం. వాళ్లకేం తెలుసు. తెలిస్తే ఈ అఘోరింపు లెందుకు. అయినా వాళ్లక్కావలసింది చెప్పడానిక్కాదిది. మన క్కావలసింది చెప్పకుందికి. నడవండి స్టేజీమీదికి అన్నారు మంత్రిగారు.

మీ అసలు పేరేమిటిసార్? అన్నాడు కళ్లజోడు వక్త అప్పారావుని చూసి.

వాటీజినే నేమ్. మీరు కొన్ని అడగరాదు. దేవుడి అసలు పేరేమిటి? అన్నాడు అప్పారావు.

పక్కన బుట్టలో వున్న దండలు లావుపాటివి మూడు తీసుకుని మొహం కప్పడిపోయేలా వేసుకు స్టేజీమీద కెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు దూరం ఆలోచించి.

స్టేజీమీద కూర్చున్నవారిలో ఇద్దరికి దండలు తక్కువైనందువల్ల ఒక వలంటీరు అప్పారావు దగ్గరకొచ్చి మీరిన్ని మొయ్యలేరు అన్నట్టు మొహంపెట్టి బలవంతాన అవి లాక్కుని లోపలికి వెళ్ళి మళ్ళీ తెచ్చి మిగతా యిద్దరికీ వేశాడు.

అధ్యక్షులు పరాకుతో, ఆ రోజు నిజంగా సన్మానం జరగాల్సిన సుబ్బన్న తాలూకు వినయం గురించి స్పీచి ఆరంభించి నాలిక్కరచుకుని అప్పారావుకేసి చూసి "వీరు" అనేసరికి "వారు" అక్కడ లేరు.

తన మూడు హారాలలో రెండు పోగానే, ముఖారవిందాన్ని సభలో ఎవరో శ్రద్ధగా చూస్తున్నట్లు పసిగట్టి అప్పారావు తెరవెనుకకు వెళ్ళారు అర్జంటు పనున్నట్టు.

పూలమాల లేవీలేవు. వెంటనే గ్రీన్‌రూమ్ కెళ్ళి అక్కడ తన సంచి తీసుకుని వచ్చాడు. అందులోంచి పెద్ద బుర్రమీసం తీసి అంటించుకొని తిరిగి స్టేజిమీదకు వచ్చి కూర్చున్నాడు.

కా. మంత్రిగారు, త్వరలో పెట్టబోయే పార్టీ గొప్పతనం, అందులో పుట్టబోయే గ్రూపు విశిష్టత వివరించి, దాని షాడో కాబినెట్‌లో మొదటి మంత్రి గిరీ ఎవరికి దక్కాలో · చెబుతున్నారు.

అప్పారావుకి మళ్ళీ అనుమానం వచ్చింది, ఎవరో తనకేసి పరకాయించి చూస్తున్నట్టు. లేచి వింగులోకి పరుగెత్తి బవిరిగడ్డం తగిలించుకుని ముసిముసి నవ్వులు నవ్వుతూ వచ్చి కూర్చున్నాడు.

జనం గొల్లున నవ్వారు.

వెంటనే మంత్రిగారు తన పొరపాటు గ్రహించారు. ఆవేశంలో అవతలవాణ్ని తిట్టడంలో ఆగక, తనకు తనే పట్లికున పొగిడేసుకుంటున్నట్టు అప్పుడే ఆయనకు తెలిసింది. స్వపర భేదం కాననందుకు చింతించి తరువాత వాక్యం ఆలోచిస్తూ అప్పారావుకేసి తిరిగి మీసం చూసి గతుక్కుమన్నాడు. కాని అంతలోనే తళుక్కున ఆలోచన మెరిసింది. టైము ఎనిమిదిన్నర అవుతూంది. జనం వెళ్ళబోతున్నారు. ఇపుడు రాబందుల్లా కాసుకున్న వక్తగాళ్లని వదిలేస్తే ఓ పట్టాన మైకుని వదల్రు, జిడ్డులా పట్టుకుంటారు. ఈ అప్పారావు గాడిమీద విట్లు వేస్తూ కూచుంటారు. అందుకని తన పని తనే చూసుకోవాలి. చెప్పాల్సిన నాలుగూ తనే చెప్పాలి ఏదో విధంగా....

ఒక్క నిమిషం క్షమించాలి అంటూ ఆయన వొక్క అంగలో స్టేజీమాటుకెళ్ళి అక్కడ అప్పారావు గడ్డం పెట్టుకుంటూ వదిలేసిన మీసం తగిలించుకుని కోటు విప్పేసి స్టేజిమీద కొచ్చేసి, ఇపుడు శ్రీ నరసింహారావుగారు మాట్లాడుతారు అని ప్రకటించి వెంటనే పెట్టబోయే పార్టీ, పుట్టబోయే గ్రూపు అందులో తన ఆశయం వివరించాడు.

ఆయన ముగించేసరికి – అరుగురేనా ఉపన్యసించాలి గాబట్టే ఎవరికీ ఐదు నిముషాలకు మించి వ్యవధి ఇవ్వదల్చుకోలేదు – అప్పారావు హడావిడిగా వింగులోకి వెళ్ళి గడ్డం వదిలేసి పెద్ద విక్రమార్కుడి మార్కు జుట్టు విగ్గు పెట్టుకొని చొక్కా విప్పేసి ఉత్తరీయం వేసుకుని కూర్చున్నాడు. పక్కనున్న వక్త మీకెన్ని రూపాలో? నిజరూపం ఏది అని అడగబోయి దేవుణ్ణి తలుచుకున్నాడు.

తక్షణం "నరసింహారావుగారు" వింగులోకి పరిగెత్తి అప్పారావు వదిలేసిన గడ్డం తగిలించుకొచ్చి ఇపుడు శ్రీ నరసయ్యగారు ఉపన్యసిస్తారు అని ప్రకటించి పెట్టబోయే పార్టీ, పుట్టబోయే గ్రూపు అందులో తన.....

అప్పారావుకి స్తిమితం తగ్గిపోతోంది. ఇపుడు ఎవడో తనకేసి అనుమానంగా చూస్తున్నాడు. వెంటనే వింగులోకెళ్ళి స్టేజి మేనేజర్ని బతిమాలుకొని కిరీటం, కత్తి, భుజకీర్తులున్న ధర్మరాజు చొక్కా, పంచె, చడావులు, అడిగి పుచ్చుకుని అవి ధరించి స్టేజిమీదకొచ్చి వినయంగా నవ్వి కూర్చున్నాడు, పూలలో రేకులు లెక్కపెడుతూ.

'నరసయ్యగారు' స్పీచి ముగించగానే, వెళ్ళి విగ్గు పెట్టుకొని వచ్చి '(శ్రీ) నయనప్ప మాట్లాడెదరు' అని ప్రకటించి మూడో లెక్చరు అరంభించాడు.

అప్పారావు ఈసారి రెండు నిముషాలలోనే లోపలికి పరుగెత్తి కీచకుడి కాస్ట్యూము వేసుకువచ్చాడు. అప్పలాళ్లు ఝుడుసుకుంటారన్న ఆశతో.

నయనప్పగారు లోపలికి పరుగెత్తి ధర్మరాజు వేషం వేసుకుని కత్తి ఝుళిపిస్తూ ఇప్పుడు (శ్రీ) జాన్ హారిసన్‌గారు మాట్లాడుతారు అంటూ నాలుగో విడత ఆరంభించాడు.

అప్పారావుకి కీచకుడి డ్రెస్సు నప్పక ద్రౌపది వేషం వేసేలోగా సభలో సంరంభం, గంద్రగోళం చెలరేగింది.

పక్కవీధిలో జరుగుతున్న మీటింగులో, పెట్టబోయే పార్టీ (ఇదే) లోని పుట్టబోయే గ్రూపుకి నాయకుడిగా అక్కడి పెద్దమనిషినే ఏకగ్రీవంగా ఎన్నేసుకున్నారనీ, మినిస్ట్రీలో ఆ గ్రూపుకి రిప్రజంటేషన్ సీటిచ్చినప్పుడు ఆయనకే ఇవ్వాలని తీర్మానం పెట్టేశారనీ కబురు వచ్చింది. ఆ గ్రూపు ఊరేగింపుకూడా జరుగుతోంది. వాళ్ళు కాసేపు గుమ్మంలో నుంచి కేకలు వేసి, ఇక్కడెలాగా జనం రెడీగా ఉన్నారు కాబట్టి ఇక్కడో సన్మానసభ చేయాలని నిశ్చయించారు.

'సన్మానం సన్మానం' అని ప్రకటన చేశారు. ముఖ్యులంతా గ్రీన్ రూమ్‌లో దొరబడ్డారు. కాబోయిన మంత్రిగారు కూడా అందులో కలిసిపోయి ప్రముఖ పాత్ర వహించారు.

ఎవరికి సన్మానం చెయ్యాలన్న ప్రశ్నతో గదిలో జనం వాదించుకుంటున్నారు. అవతల హాలులో జనం ఆలస్యాన్ని సహించలేక కేకలు ఈలలు వేస్తున్నారు.

కాబోయి మానివేసిన మంత్రిగారికే – కానందుకు సన్మానం చేస్తే – అద్భుతంగా ఉంటుందనీ, తద్వారా పార్టీలో ఐకమత్యం సిమెంటులా గట్టిపడిూరుకుంటుందనీ కా. మంత్రిగారి కార్యదర్శి సూచించాడు.

ఔనౌను. తాము ఉట్టి వెధవలన్న ముక్కను వినయంతో అంగీకరించి మంత్రిగారిని త్యాగంచేసిన స్వార్థజీవి అన్నాడొక ఉద్రేకి.

కా. మంత్రిగారు సగర్వంగా వినయం నటించారు.

గదిలో అందరూ హాహాకారాలు చేశారు.

ఆయనకి నెత్తిమీద హఠాత్తుగా రెండు కొమ్ములు మొలిచాయి.

రెండోసారి అప్పను నొల్లుకోడాని కొచ్చిన అప్పారావు ఆ గది తలుపు తెరిచి మళ్ళీ మొదలా అవి నిర్ఘాంతపోయి తలుపలాగే వదిలేశాడు. ఇవతల గదిలో యీ అఘాయిత్యానికి చెలరేగిన హాహాకారాలు కలిసి హోరెత్తిపోయేసరికి 'ఆ భవనభువనం' దద్దరిల్లిపోయింది.

★ ★ ★

# ఈశ్వరేచ్ఛ



అంతా ఈశ్వరేచ్ఛ అన్నారు గజపతిగారు ఉన్న గాంభీర్యం అంతా పోగేసి చూపిస్తూ.

☆ ☆ ☆

అల వైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దాపల.... కూర్చుని చదరంగం ఆడుకుంటున్న విష్ణుమూర్తి తుళ్ళిపడి లేచి నించున్నాడు. లక్ష్మీదేవి కళ్ళు విప్పార్చి చూసింది.

వాడు చేసే వెధవ పనులన్నిటికీ నా ఇష్టం అంటాడేవిటీ.... అంటూ బయలుదేరాడు.

ఇదెక్కడి గోలయ్యా స్వామీ – వాడేం గజేంద్రుడు కాదుగా – తొందరలేదు. ఈ ఆట కానివ్వండి అంది లక్ష్మి.

వాడు గజేంద్రుడు కాడు. గజపతి – అంటూ విష్ణుమూర్తి బయలుదేరాడు.

సరే స్వామీ – నా చెంగుముడి అయినా విప్పి వెళ్ళు. నేను కూడా ఎందుకు అంది లక్ష్మి నవ్వుతూ.

☆ ☆ ☆

అంతా ఈశ్వరేచ్ఛ అన్నాడు గజపతి గంభీరంగా. గురునాధరావు గుండె గుభేలుమంది.

అయితే నా నలభై నాకిచ్చెయ్యండి అన్నాడు నీరసంగా.

నలభై ఏమిటి? ఆ పప్పులుడకవు. ఆ నలభయ్యీ సిఫార్సు ఉత్తరం తెచ్చివ్వటానికి అయింది – ఉద్యోగం దొరక్కపోతే నేనేం చేస్తా? అన్నాడు గజపతి.

ఆ నలభై నాకెలా వచ్చాయో తెలుసాండి? మావయ్య వాచీ తాకట్టు పెట్టి తెచ్చానండి. మా మావయ్య ఊరినించి రాగానే వాచీ అడుగుతాడండి. నేను లేదంటే – నాకు అలవాటే గాని – మీరు వినలేని మాటలతో తిట్టిపోస్తాడండి. నేను పేకాటకి పోశానంటాడండి. లేదని రుజువు చెయ్యడానికి నేను నిజం చెబుతానండి. అపుడేమో నాకు టోకరా ఇచ్చిన వాళ్ళని మావయ్య ముక్కలు విరగ్గొడతాడండి. అందుకని నాకు మీరు ఉద్యోగం ఇప్పించలేదు కాబట్టి లంచం తీసుకున్న నలభై నా మొహాన పారెయ్యండి అన్నాడు గురునాథం వినయంగా.

చాలాసేపు బతిమాలాక లాభంలేదని తేల్చుకున్నాడు. గజపతికిచ్చిన లంచం గోడకు రాసిన సున్నం అని ఖరారు చేసుకున్నాడు.

సరే అప్పయినా అఘోరించండి అని అతి జాగ్రత్తగా అడిగాడు. మా మావయ్య వచ్చేసరికి వాచీ విడిపించకపోతే నన్ను తిట్టిపోస్తాడండి. ఇటు ఉద్యోగం రాకపోగా, అటు ఆయన నా కోసం అద్దెకి తీసుకుందా మనుకుంటున్న కిళ్ళీబడ్డీ కూడా నాక్కాకుండా పోతుందండి అన్నాడు.

గజపతి అదిరిపడ్డాడు.

అప్పా! అప్పే! – అప్పా? నీకా! – ఆయన ఎన్నడూ ఎవరికీ అప్పాలివ్వడు.

అందరూ తనంత మంచివారే అని ఆయనకు సదభిప్రాయం ఉంది. అందుకని అప్పాలివ్వడు. గురునాథం రాప్మని అంత మాట అనేసరికి ఆయన ఇవ్వననడానికి బదులు ఆశ్చర్యపోయాడు.

గురునాథరావు శతవిధాల బతిమాలాడు. చివరకు ప్రాణం విసుగెత్తింది. పైన కూర్చున్న పరమేశ్వరుడు మీకు తగ్గశాస్తి చేస్తాడు లెండి అని కొత్తపంథా ప్రారంభించాడు. పోనీ నేను పెట్టబోయే కిళ్ళీబడ్డీ తాకట్టు పెట్టుకోండి అని కొత్తరకం నమ్మకం కూడా చూపించాడు.

మీ మావ రావాలి, సరుకులు తేవాలి, బడ్డీ తెరవాలి, నువ్వందులో ఎక్కాలి – ఇప్పుడా సోమలింగం తల తాకట్టు పెట్టుకు అప్పివ్వమంటావా అన్నాడు గజపతిగారు.

ఉత్తపుణ్యానికి నలభై రూపాయలు లంచం కొట్టేసి అప్పయినా ఇవ్వనంటే ఎలాగయ్యా. నలభై కాకపోతే ఇరవై – కాకపోతే పది – ఆఖరికి నాలుగయినా పారెయ్యవయ్యా అన్నాడు గురునాథరావు తోసుకు వస్తున్న ఏడుపును ఆపుకుంటూ.

మెత్తని వాళ్ళని చూస్తే మొత్తబుద్దేసిందట. నన్ను పట్టుకున్నావేవిటోయ్ పొద్దున్నే అన్నాడు గజపతి విసుగ్గా.

మీరు అప్పివ్వకపోతే ఆ బుద్దే వేస్తుంది. మీరిస్తేగాని, నేను కదలదల్చుకోలేదు అన్నాడు.

గజపతికి విసుగేసింది – అందుకని గంభీరంగా నవ్వాడు. గంభీరంగా నవ్వడం ఆయనకి పుట్టుకతో వచ్చిన విద్య. గిట్టుబాటవుతున్న విద్య. సరదా కూడ. గజపతిగారికి గంభీరంగా నవ్వటం మాత్రమే కాదు, గంభీరంగా టోకరాలు ఇవ్వటం, బొత్తిగా మనసు కులాసాగా వుంటే గంభీరంగా హాస్యం ఆడడం కూడా చేతనవును.

మన వూరి మధ్య గంట స్తంభం చూశావోయ్ అన్నాడు.

గురునాధం ఊ కొట్టాడు. ఆ స్తంభం పైకి ఎక్కడానికి దారి వుంది తెలుసా? ఎక్కి ఏం చెయ్యవచ్చునో తెలుసా?

పైన కూర్చుని భోరున ఏడవచ్చు అన్నాడు గురునాధం.

అదీ పాయింటే అనుకో. ఇంతకన్న ఉపయోగమైనది ఇంకోటుంది – దాని మీద ఎక్కి అక్కణ్ణించి యేం చెయ్యవచ్చో తెలుసా? భూమికి దూకెయ్యవచ్చు. చెప్పొచ్చిందేమిటంటే దెబ్బల బాధ పడనవసరం లేకుండానే మధ్య దారిలోనే గుండె ఆగి రాప్‌మని చావచ్చు – నీక్కావాలంటే దానిమీద ఎక్కనివ్వమని వాచ్‌మన్‌కి సిఫార్సు రాసిస్తా.

గురునాధానికి వళ్ళు భగభగ మండింది. అతనికి కూడా బొత్తిగా కోపం వస్తే బోలెడు హాస్యంగా మాట్లాడ్డం సరదా.

మా మావయ్య వచ్చాక లంచం ఇస్తాడు. అపుడు రాసిద్దురుగాని సిఫార్సు అంటూ విసవిస నడచి వెళ్ళిపోయాడు.

☆ ☆ ☆

గురునాధరావు వేటకు బయలుదేరాడు. వాళ్ళ మావయ్య వచ్చేలోగా వాచిని విడిపించడానికి.

గురునాధరావు ప్రాప్తకాలజ్ఞుడూ ఇంకోడూ కాదు – కేవలం దూరదర్శి – బోలెడు దూరదర్శి. ఈ సిద్ధాంతం పేకాట దగ్గర మాత్రం వర్తించదు. వాళ్ళ మావకి పంచప్రాణాలూ అయిన వాచి ఖాయిలా పడితే ఆయన దాన్ని వైద్యుడికిచ్చి ఊరెళ్ళాడు. దాన్ని మళ్లీ పట్టుకొచ్చి జాగ్రత్తగా వుంచే బాధ్యత గురునాధరావు భుజస్కంధాలపై ఉంచాడు.

గురునాధరావుకి మామూలు బాధ్యతకాక, గురుతరమైన బాధ్యతలు నెత్తిన వేసుకోవడం సరదా, అలవాటు. అందుకని వాళ్ళ మావయ్య వచ్చేలోగా మరమ్మత్తైన వాచీని విడిపించి ఓ మార్వాడి వద్ద తాకట్టు పెట్టాడు. ఇందులో అతనికి దుష్టసంకల్పం ఏమీ లేదు. ఎలాగో అలా ఉద్యోగం సంపాదించుకుని మావయ్యకి తనవల్ల భారం లేకుండా చేద్దామనే. అయితే ఉద్యోగం అన్నది అతని దృష్టిలో దీర్ఘకాలిక పథకం. వాళ్ళ మావయ్య దృష్టిలో శాశ్వత పథకం.

ఈ వెధవకి ఉద్యోగం ఎలాగా రాసిపెట్టిలేదు. అందువల్ల ఓ కిళ్ళీబడ్డీ పెట్టి, అందులో కూలేస్తే సరి. కుదురుగా ఉంటాడు అని వాళ్ళ మావయ్య గట్టిగా అభిప్రాయపడి సినిమా హాలు దగ్గరలో బడ్డీ మాట్లాడాడు.

గుమస్తా ఉద్యోగం ఎలాగైనా సాధించాలని గురునాధం అభిలాష. ఈలోగా కిళ్ళీ దుకాణంలో కూర్చునే అవసరం రాకుండా రాప్‌మని ఎంతో కొంత డబ్బు సంపాదించి వాళ్ళ మావకి చూపించాలని బోలెడు ఉత్సాహం ఉబలాటమూను. అందుకని గుట్టుగా ట్యూషన్ పెట్టించుకుని రన్‌మోరు లేక ఢంకాపలాసు ఆట నేర్చుకున్నాడు.

కొద్దిరోజుల్లోనే ఇంత ఘటికుడైన వాడిని ఢంకాపలాసు చరిత్రలో కనీవినీ ఎరగం అని అతని తోటి ఆటగాళ్ళు ఘంటాపథంగా చెప్పారు చాలాసార్లు. గురునాధం డబ్బు ఓడిపోతున్నా, అతని ఆటలో టెక్నిక్ ఆదర్శప్రాయమన్నారు. గురునాధరావు

మెరమెచ్చు మాటలకి ఉబ్బితబ్బిబ్బయ్యే రకం కాదు. తనకీ ఆట బాగా తెలిసిపోయిందని స్వంతానికి గట్టి నమ్మకం కుదిరింది. కనకనే అతడు ఓడిపోతున్నా ఆడేస్తూనే ఉన్నాడు.

వాచీని మరమ్మత్తుకిచ్చిన గురునాధరావు మావయ్య ఊరెళ్తూ గురునాధం చేతికి పది రూపాయలిచ్చాడు. దుకాణం వాడికి ఈ పదీ ఇచ్చి నా వాచీ తెచ్చి మీ అత్తయ్యకియ్యి. వెధవ్వేషాలెయ్యకు అని చెప్పి మరీ వెళ్ళాడు.

ఆ మర్నాడు గురునాధం చెయ్యి చూసిన ఒక జ్యోతిష్కుడు ధనరేఖ జెర్రిపోతులా ఉందని ఉద్ఘాటించాడు. అవకాశాలు ఏమిటో తెలుసుకుని సద్వినియోగం చేసుకోకపోతే మాత్రం అంత జెర్రిపోతూ జబ్బుచేసి వానపాములా చిక్కి శల్యమై చస్తుందని హెచ్చరించాడు. గురునాధానికి గుండె గుభేలుమంది. ఆ మర్నాడే పజిలు కట్టడానికి ఆఖరు తేదీ. అదే అవకాశం. ఇది కట్టకపోతే అరచేతిలో ధనరేఖ ధ్వంసం అయిపోతుంది. చేతిలో మావయ్య డబ్బు పది రూపాయలుంది. కాని వాడితే ఎలా? వాడకపోతే ఇంకెలా?

పజిళ్ళలో ఫస్టు సెకండు ప్రైజులు కొట్టేసిన వాళ్ళ సంగ్రహ చరిత్రలు గురునాధరావుకి కంఠతా వచ్చు. అటూ, ఇటూ, ఇటూ, అటూ అనే సందిగ్ధ సమస్యలో పడి తెగించి కట్టేసిన వాళ్ళూ, గెలిచి బాగుపడ్డవాళ్ళూ ఎందరో ఉన్నారు.

అతడి అంతర్వాణి ఏమి చెప్పినది? (పజిలు కట్టమన్నది) ఆ వృద్ధుని మందహాసములో అంత ధీమా ఎందుకూ? (పజిలు గెలవడం తప్పదన్న సుదృఢమైన ఆత్మ విశ్వాసము వల్ల) ఆ యువతి గాలిమేడలన్నీ గట్టి మేడలయినవి. ఏల? (పజిలు కట్టినందువల్ల)

ఈ తరహా కథలన్నీ గురునాధరావుకి నాలుక చివర నుంటాయి. ఈ గెల్చిన వాళ్ళలో తవెవరికీ తీసిపోలేదు. ఇవన్నీ అతనికి 'సముజ్జ్వల భవిష్యత్తు' పట్ల ప్రగాఢ విశ్వాసం కలిగించాయి. సరాసరి పజిలు కట్టేశాడు. పజిలు ప్రయిజు చేతికందేలోగా మావయ్య వస్తాడు. అందుకని అర్జెంటుగా కాస్త డబ్బు సంపాదించాలి.

పేకాట పసందయిన దారి. అణా బేడా పట్టికెళ్ళి ఐదొందలు సంపాదించే వాళ్ళ కథలు కూడా అతను విన్నాడు. కాని, ఎలాగేనా ఇది పజిలు లాంటిది కాదు. పిండికొద్దీ రొట్టె అన్నారు. చేతిలోని రొక్కం రూపాయల లెక్కలోలా ఉంది కాబట్టి గెలుపు ఖాయం అని అంతర్వాణి శతసహస్ర కంఠాలతో ఘోషించింది.

చెప్పేవాడు మాటలు విని చెడేవాడు కాడు కాబట్టి మనసుకు తోచినట్టు ముక్కుకు సూటిగా పోయేవాడు కాబట్టి గురునాధరావు సరాసరి పేకాటవికి వేట కెళ్ళాడు – చేతిలో జెర్రిపోతు లాంటి ధనరేఖ గుర్రుపెట్టి నిద్ర పోయింది కాబోలు. జేబులో అయిదారు రూపాయలూ ఖాయిలాపడి క్షణాల మీద చిక్కి సగమై మళ్ళీ సగమై శల్యమై హారతి కర్పూరంలా హరించిపోయాయి. వంటి మీదికి తెలివి వచ్చేసరికి గురునాధరావు ఇంకో కురునాధ కుమారుడికి పది రూపాయలు బాకీ తేలాడు. ఈ ధార్తరాష్ట్రుడు మహాధూర్తుడు.

తే, నా పదీ తే అన్నాడు. లేకపోతే చావగొడతానన్న భావం స్ఫురింపజేస్తూ. గురునాధరావు అట్టే ఆలోచించలేదు. తను బాకీపడ్డ ధూర్తుణ్నే వెంటబెట్టుకుని

బజారుకెళ్ళాడు. ఇంకో పది అప్పు తీసుకుని వాళ్ళ మావయ్య వాచీ పుచ్చుకున్నాడు. సరాసరి ఒక మార్వాడీ వాడి దగ్గర తాకట్టు పెట్టి అరవై తీసుకున్నాడు. వెంటనే వ్యవహార దక్షుడల్లే జూదరికి ఇరవై ఇచ్చేశాడు. ఆపైన ఒక్కడూ హోటలుకెళ్ళి కాఫీతాగి, పార్కుకెళ్ళి సిగరెట్టు ముట్టించి గురునాథరావల్లే ఏడుపు సినిమా పాట ఒకటి పాడుకున్నాడు.

తన చేతిలో నలభై ఉన్నాయి. మార్వాడీ వాడి చేతిలో తన మావయ్య వాచీ ఉంది. ఆ వాచీ తన చేతి మీదుగా మావయ్య చేతికి మర్యాదగా చేరాలంటే మరో పెద్ద మనిషి చేతిలోనించి గురునాథరావు చేతిలోకి మరో ఇరవై రూపాయలు రావాలి. ఊరు అంతటి పెద్దమనుషులతో కిటకిటలాడటం లేదు.

టోకరాసురుడని ఒకాయన ఉన్నాడు. పెద్దమనిషి కాడు కానీ పెద్దసైజు మనిషి. ఆయన్ని కొందరు టోకు రాక్షసుడని కూడా పిల్చుకుంటారు. టోకరాసురుడు పుట్టిన కొత్తల్లో వాళ్ళ అమ్మానాన్నా గజపతి అని పేరు పెట్టారు. కానీ, అది ప్రజాబాహుళ్యానికి నచ్చనందువల్ల అతనికి నప్పిన పేరు టోకరాసురుడే ప్రసిద్ధి కెక్కింది. కొత్తల్లో ఇష్టులు కొందరు టోకరాస్యుడు అని పిలిచేవారు. నా తండ్రే – పొట్టనిండా పుట్టెడు టోకరా బుద్ధులు గదే అని ముచ్చటపడేవారు. ఈ గజపతి పరోపకార పరాయణుడు. మామూలుగా బ్రోకరేజి ఇతని వృత్తి. సందర్భోచితంగా టోకరేజి.

ఈ టోకరాసురుడు గురునాథరావుని ఓదార్చాడు. భయపడొద్దన్నాడు. వాళ్ళ మావయ్య వచ్చేసరికి ఉద్యోగం వేయించే భారం తన దన్నాడు. డబ్బు రూపంలో సాయం చేయలేకపోయినందుకు అహోరాత్రులు రాత్రిళ్ళు టీ తాగి మరీ విచారపడ్డాడు. గురునాథరావుకు గజపతి కొద్దిగా తెలుసు. రెండు మూడు సందర్భాలలో అతనికి ఇతడు చిన్నచిన్న పనులు చేసి పెట్టి – మెప్పు సంపాదించాడు. డబ్బు కాకపోయినా.

ఉద్యోగం ఎలా దొరుకుతుందండీ అని అడిగాడు గురునాథరావు ఆశగా, ఆశ్చర్యంగా.

గజపతిగారు గంభీరంగా నవ్వారు. ఒక పెద్ద కంపెనీలో ఉద్యోగం ఖాళీయైంది. ఎనభై ఇస్తారు. ఊళ్ళో అనాథ శరణాలయం ట్రస్టీగారు కనక సిఫార్సు రాసిస్తే ఆ ఉద్యోగం అమాంతం దొరుకుతుంది అన్నాడు.

మీరు ఇప్పిస్తారా?

నాదేముందోయ్. ఆ సిఫార్సు రాసే ఆయన మామూలు రేటే ఏభై. అది కనక నువ్విస్తే ఉద్యోగం గ్యారంటీ అన్నాడు.

గురునాథరావు తటపటాయించాడు. ఉద్యోగం నిజంగా దొరికితే అట్టే. ఫరవాలేదు. మావయ్య వచ్చాక వాచీ ఏదిరా అని అడిగితే తాకట్టెట్టేసి ఉద్యోగం కోసం లంచం పెట్టానని ధీమాగా చెప్పవచ్చు. అయితే నిజంగా వస్తుందా అనేదే అనుమానం.

నిజంగా దొరుకుతుందంటారా?

అందుకు సందేహమా? అన్నాడు గజపతి.

మరి నా దగ్గర నలభై రూపాయలే ఉన్నాయండి.

ఈశ్వరేచ్ఛ! ఇలా తే అన్నాడు గజపతి. మర్నాడు సాయంత్రానికి ఆ ఫలానా ఉద్యోగం ఇంకెవరికో వెళ్ళిపోయింది. గురునాథరావు నలభై రూపాయలిచ్చి

కొనుక్కున్న ఆ సిఫార్సుత్తరం చెల్లలేదు. పొద్దుటే గజపతి ఇంటికి పరిగెత్తాడు గురునాథరావు.

ఈశ్వరేచ్ఛ అన్నాడు గజపతి – ఉన్న గాంభీర్యమంతా పోగేసి చూపిస్తూ.

ఇదేమిటండీ, నాకు ఉద్యోగమూ లేకపోయి మావయ్యా వాచీ లేకపోతే పుట్టగతులుండవండి.

ఈశ్వరేచ్ఛ నాయనా అన్నాడు గజపతి.



నా వలభై నాకు పారెయ్యండి అని గురునాథరావు మొత్తుకున్నా టోకరాసురుడు ఈశ్వరేచ్ఛ అంటూనే ఉన్నాడు.

సిఫార్సు రాయించేవరకే నా పని. దానికి వలభై ఇచ్చావు కాబోలు. నా పని నేను పూర్తి చేశాను అని నిష్కర్షగా చెప్పేశాడు.

☆ ☆ ☆

వీదీ గతీ నాకు – అని పాట పాడుకుంటూ వేటకెళ్ళాడు గురునాథం. పది గంటలయింది. పది డబ్బులు కూడా దొరకలేదు. అప్పగా బేడ దొరికినా బావుండును. కాఫీ తాగుదును అనుకున్నాడు. బేడ దొరకలేదు కానీ దొంగబాబు దొరికాడు.

హలో, గుడ్ మార్నింగ్ అన్నాడు గురునాథం.

నమస్కారమండి.

క్షామమూ?

మీ దయవల్ల లేదు.

ఏడిశారు కానీ మామూలుగా అఘోరించండి అన్నాడు గురునాథం.
ఎక్కడికి బయల్దేరావ్? వేటకా?
మరే.
ఎన్ని చేపలు పట్టావ్?
ఏం లేదు.
నా దగ్గర కాసిని రొయ్యలున్నాయి అన్నాడు దొంగబాబు.
నాకే మాత్రం ఇస్తావ్?
మూడణాలు.
సరే హోటలుకి పద.
కాస్త కాఫీ తాగాక గుర్నాథం మనస్సు కుదుట పడింది.
అదృష్టవంతుడ్ని చెరిచేవాడూ, దురదృష్టవంతుడ్ని బాగుచేసేవాడూ లేడురా అన్నాడు.
ఎవడన్నా నీ కప్పివ్వడానికి సిద్ధపడ్డాడా? అన్నాడు దొంగబాబు.
కాదులే. నలభయి రూపాయలకు టోకరా తిన్నాను. మావయ్య వాచీ తాకట్టు పెట్టి తెచ్చినదది. ఉద్యోగం ఇప్పిస్తాడంటే గజపతికి లంచం పెట్టాను.
దొంగబాబు విరగబడి నవ్వాడు.
వాడా? టోకు రాక్షసుడా? నీకు టోకరా ఇచ్చాడు.
అంటే నీ కిదంతా తెలుసా!
ఇదంతా తెలియదు గాని మిగతాదంతా తెలుసు. నీకు కాకుండా పోయిన ఉద్యోగం మా అన్నయ్య సుబ్బారావు (ఉరఫ్ బండబాబు) కి అయిందిలే, రేటు తేడా వచ్చింది. నీది నలభై, వాడి దరవై.
గురునాథం ఆశ్చర్యపోయాడు. దొంగబాబు సంగతి సందర్భాలు చెప్పాడు. ఆ ఉదంతం ప్రకారం ఈశ్వరేచ్ఛ ఈ కింది విధంగా ఉన్నట్టు తేలింది.

1. గురవయ్య అండ్ గురవయ్య కంపెనీలో ఖాళీగా ఉన్న ఉద్యోగం గురునాథరావుకి కాకుండా సుబ్బారావు ఉరఫ్ బండబాబుకి లభించాలి. ఇందుకు కారణం గజపతికి గురునాథం ఇచ్చిన 40 కాగా, సుబ్బారావు లంచం 60 కావడం.
2. గజపతి కోరిన ప్రకారం అనాథ శరణాలయం ట్రస్టీ మొదట గురునాథానికి సిఫార్సు ఉత్తరం రాసిచ్చినా, కొద్ది సేపటిలోనే గజపతి రెండవ కోరిక ప్రకారం గురవయ్య కంపెనీకి స్వయంగా వెళ్ళి తను సిఫార్సు చేసిన గురునాథానికి ఉద్యోగం ఇవ్వద్దనీ, సుబ్బారావు ఉరఫ్ బండబాబుకి ఇవ్వాలని ఘట్టిగా సిఫార్సు చేసి గజపతి ముద్దు చెల్లించాలి. ఇందుకు ప్రతిగా గజపతి ట్రస్టీగారికి 30 రూపాయలు ముడుపు చెల్లించాలి.
3. గురవయ్య కంపెనీలో వారు ట్రస్టీగారి సిఫార్సు ఉత్తరం త్రోసిపుచ్చి, ఆయన నోటి సిఫార్సునే కోటి వరాల మూటగా ఎంచి బండబాబుకా ఉద్యోగం ఇవ్వాలి. (పదిరోజులు పోయాక బర్తరఫ్ చేసినా ఫరవాలేదు)
4. సదరు కంపెనీవారు తన మాటను వరాల మూటగా ఎంచి మన్నించినందుకు కృతజ్ఞతా పూర్వకంగా ట్రస్టీగారు, తన చేతిలోని కమిటీ చేతిలోని అనాథ

శరణాలయంలో రెండు నెలలకు కావలసిన గ్రాసాన్ని సదరు కంపెనీ ద్వారా కొనాలి.

5. ట్రస్టీగారు బేరం ఇచ్చారు గదా, ఇది అనాథ శరణాలయం కాబట్టి అడిగేవారు లేరు కదా అని భావించక, సదరు కంపెనీవారు అరబస్తా మూటలను బస్తా మూటలు అని చెప్పి రవాణా చేయరాదు. అవసరమైతే కేవలం బియ్యంలో కలపడానికే ప్రత్యేకంగా ఉత్పత్తిచేసే నల్లపూసలంతటి మట్టిబెడ్డలను శేరు కానీ చొప్పున కొని అయినా సరే ముప్పావు బస్తాడు పంపాలి. దొరికిందే ఛాన్సు కదా అని నెయ్యి పేరిట కల్తీలేని కోకోజం పంపడం సబబు కాదు. అందులో కాస్తో కూస్తో నెయ్యి కలిపి మరీ పంపాలి.

సంగ్రహంగా ఈశ్వరేచ్ఛ స్వరూప స్వభావాలను విన్న తరువాత గురునాథరావు ఓ క్షణం ఆగి, ఆలోచించి భోరున ఏడవబోయి ఫక్కున నవ్వాడు.

నవ్వకు నవ్వకు చిటిపాపా - రేపే మీ మామ వచ్చేను అన్నాడు దొంగబాబు. ముక్కుపొడుం పీల్చిన పసిపిల్లవాడిలా ఒక్కసారిగా ఉక్కిరిబిక్కిరయిపోయాడు గురునాథం ఈ మాట వినగానే.

మా మావ ఇంకా నాలుగు రోజులదాకా రానన్నాడే - అయినా నీకెలా తెలిసింది? అన్నాడు తమాయించుకుని.

చెప్పను.

చెప్పవయ్యా నాయనా!

ఇందాక మెయిల్ వేళకి స్టేషన్ కెళ్ళాను. ఎవళ్ళో ఇద్దరు మీ మావయ్య పేరు చెప్పుకుని రేపు వస్తాడనుకుంటూంటే విన్నాను.

ఇలాటి పీడ మాటలు విని మోసుకు రాకపోతే నా వంటివాడి మంచి మాటలు వినరాదూ?

ఏమిటి నువ్వు చెప్పే మంచిమాట? అప్పేనా? లేదు.

బాబ్బాబు, మావయ్యొస్తే చంపేస్తాడు. ముందు ఆయన వాచీ ఆయనకి ఇచ్చేశాక, నా తల తాకట్టు పెట్టి నీ అప్పు తీరుస్తా.

నీ తల తాకట్టేసుకునే తలమాసినవాడెవడులే. కానీ....

చెప్పు చెప్పు. ఎక్కడేనా ఇప్పించినా సరే. వడ్డీ ఇస్తా -

ఏడిశావు అసలొకటి ఇస్తే -

అలాగేలే చెప్పు -

అయితే ఒక్క సందేహం. మరి నేను దొంగని కదా, నా వంటి వాడి దగ్గర మీ వంటివాడు అప్పు తీసుకోవచ్చా? అన్నాడు దొంగబాబు.

గురునాథానికి జవాబు తోచలేదు. దొంగబాబు అతనికి బాల్య స్నేహితుడు. ఫోర్తుఫారంలో అతడు చదువు మానేసి దొంగతనం మొదలెట్టాడు. గురునాథం పేకాట నేర్చుకుంటూనే ఫిఫ్తుఫారం పాసవగలిగాడు. దొంగబాబు దొంగ అని కాస్త నలుగురికీ తెలియడంతో, అంత చనువుగా తిరగడం మానేశాడు. అయినా అడపాదడపా దొంగబాబు ఇతనిని ఆదుకునేవాడు.

ఒక నిమిషం ఆలోచించి వసుదేవుడంతటివాడు – అని సామెత చెప్పబోయాడు గురునాథం. సగంలో ఆగి, నాలిక్కొరుచుకుని, సారీ ఈ సామెత ఇక్కడ చెప్పరు కాబోలు అన్నాడు. దొంగబాబు మందహాసం చేశాడు.

సరే. మా బాబాయి వాళ్లున్న ఊరెళ్ళు. అక్కడ వీరన్న అని మా నేస్తం ఉన్నాడు. అతనికి ఉత్తరం రాసిస్తా. పోయి తెచ్చుకో అన్నాడు.

ఉత్తరంతోపాటు, ఆ అర్ధరూపాయి బస్సు డబ్బులు కూడా పుచ్చుకుని, గురునాథం వెంటనే అడంగికి బయలుదేరాడు. బస్సు దిగిన చోట నుండి మట్టిరోడ్డు మీద నాలుగు మైళ్ళు నడచి పన్నెండు గంటలకి, వెళ్ళాల్సిన పల్లెటూరు చేరుకున్నాడు.

☆ ☆ ☆

గురునాథరావు వాకబు చేసి, వీరన్న ఇంటికి వెళ్ళాడు. వీరన్న ఇంటో లేడు. తను ఎవరో, ఎవరి దగ్గిర్నించి వచ్చాడో చెప్పాడు.

ఈరన్న కాంపెల్లాడండి అంది భార్య.

ఎక్కడికి?

ఇయ్యాల కొత్త సినీమా ఏత్తారుగదండి బత్తీవోళ్ళు. మీకు తెల్దేటి. ఏయన్నా నాలుగు డబ్బులు గిడతయ్యని ఎల్లినాడు అంది.

గురునాథరావు ప్రాణం వుసూరుమంది – ఇంత దూరం వచ్చి ఉత్త చేతులతో ఈసురోమని పోవాల్సి వస్తున్నందుకు. చేతిలో బస్సు డబ్బులు కూడా లేవు. ఇక్కడెవరూ తెలీదు. అతనికేం పాలుపోలేదు. రచ్చబండ వయిపుకి బయలుదేరాడు.

చిర్రుబుర్రులాడుతూ చిందులు తొక్కుతున్న ఒక నల్లకోటు శాల్తీ కనబడింది. కొంపతీసి గజపతి కాదు గదా అనుకున్నాడు గురునాథం.

కొంపలు తీసే గజపతి కూడా గురునాథాన్ని చూశాడు దూరాన్నుంచి. కొంపదీసి వాడే కాదు గదా అనుకున్నాడు. గజపతికి చత్వారం సమృద్ధిగా ఉంది. ఆయన సోడాబుడ్డి అద్దాల కళ్ళజోడు ఏమంత ఆట్టే సహాయం చేసింది కాదు.

నువ్వెందుకొచ్చావ్? నేనసలు వచ్చినట్లు నీకెవరు చెప్పారు? అని మండిపడ్డాడాయన గురునాథాన్ని ఖరారుగా గుర్తించగానే.

గురునాథానికి కొత్త ఊహ పోయింది వెంటనే.

ఎవరో చెప్పేదేమిటి. ఈశ్వరేచ్ఛ – మా మావయ్యగారు వస్తున్నారు. మీరు నలభయి ఇవ్వండి. లేకపోతే యాభయి అప్పివ్వండి. లేకపోతే మావయ్యతో చెబుతా, ఆయన అసలే కోపిష్టి అన్నాడు గురునాథం.

ఈ వెధవ్వేషాలు పనికిరావు. నేను కానీ ఇవ్వను.

మీ కోసం ఇంత దూరం వచ్చాక ఇప్పుడు ఇలా అంటే ఎలా? ఆఖరికి నా దగ్గిర బండి డబ్బులు కూడా లేవు అన్నాడు గురునాథం.

గజపతి దూరం ఆలోచించాడు. బస్తీ వెళ్ళేదాకా వీడిని మంచి చేసుకుని ఉండటం మంచిది – ఎటు నుంచి ఎటొచ్చినా – అనుకున్నాడు. సరే – నేను అర్జెంటుగా వెళ్ళిపోవాలి. బండి కట్టించుకున్నాను. కావలిస్తే అందులో రా అన్నాడు.

ఈశ్వరేచ్ఛ అన్యథా ఉంది. ఊళ్ళో బండి పట్నం వెళ్ళింది. ఇంకో బండి వుంది కాని అది పాతది. టాపే లేదు. బండి యజమానికి కడుపునొప్పి.

ఈ కబురు చెప్పిన పాలేరు కుర్రాడిని గజపతిగారు ప్రాధేయపడి ఆ టాపులేని బండే తగలేయించమని కోరాడు. పొరుగూరు బళ్ళవాళ్ళకి దీన్ని ఒప్పగించి అక్కడినించి ఇంకో బండి కట్టించుకు వెళ్ళే పద్ధతి మీద బండివాడు వాళ్ళకి బండి ఎరువిచ్చాడు మూడు రూపాయల అద్దెకి. ఇంకో రూపాయి ఎక్కువిచ్చినా తను మటుకు రాలేనన్నాడు.

గజపతిగారికి గుర్రబ్బండీ తోలడం చేతకాదు. తన పని చూస్తే అర్జంటు. రొఖ్ఖం జతపరచుకోవడానికి వచ్చి ఇక్కడ చిక్కడిపోతే ఇదంతా దండగే.

నీకు బండి తోలడం వచ్చా? అన్నాడు గురునాధరావుని చూసి.

ఆఁ

అయితే పద.

కిరాయి యాభయి రూపాయలు అన్నాడు గురునాధం.

ఈ బెదిరింపులకి నేను ఖాతరు చెయ్యను. నువ్వు బండి తోలకపోతే నేను తోలుకుంటా. లేపోతే నడిచిపోతాను. అంతేగాని, నీకు యాభయి ఠోలీలు కూడా ఇవ్వను అన్నాడు గజపతిగారు తలపాగా సర్దుకుంటూ.

మరీ బెట్టుచేస్తే బండెక్కే ఛాన్సు కొండెక్కి పోతుందని భయపడ్డాడు గురునాధం. సరే అన్నాడు.

టాపులేని గుర్రబ్బండి తయారయి వచ్చింది. బండి జాగర్త బాబూ, అక్కడోళ్ళకి నా పేరు చెప్పి ఒప్పగించండి అన్నాడు బండి యజమాని వీడ్కోలు చెబుతూ.

ఎండ నిప్పులు చెరుగుతోంది. మంచి నీళ్ళు తాగి బయల్దేరవలసింది స్మీ అనిపించింది బండి గుర్రానికి కొంతదూరం వెళ్ళాక.

కాస్త తటపటాయించి ఆగి వెనక్కెళ్ళబోయింది.

జాగర్త జాగర్త – పొగరుమోతు గుర్రం కాబోలు ఖర్మం! అన్నాడు బండిలో కూచున్న గజపతి.

వెధవ గుక్కెడు ప్రాణం ఉంటేనేం, ఊడితేనేం అంత భయమెందుకండి అన్నాడు శకట సారధి గురునాధం.

బండి ఇంకొంత దూరం వెళ్ళాక గుర్రానికి బాగా దాహం వేస్తున్నట్లనిపించింది. ఇంటికెళ్ళిపోదాం అని మళ్ళా అనుకుంది.

ఇలా అయితే అడంగు చేరినట్టే అన్నాడు గజపతి.

బండి అరమైలు దూరం వెళ్ళేసరికి గజపతికి దాహం వేసింది. ఇంకో ఫర్లాంగు వెళ్ళేసరికి పేట్రేగిపోయింది.

గుర్రానికి కూడా నోరెండిపోయింది. నడవడమా మానడమా అని ఆలోచనలో పడి ఆగిపోయింది.

చెరువులేం లేవోయ్? దగ్గిరలో అన్నాడు గజపతి.

చెరువులేం ఖర్మం, సెలయేళ్ళు, సోడా కొట్టులు కూడా ఉన్నాయి. కనబడలే? అన్నాడు గురునాధం విసుగ్గా.

గజపతి టాపులేని బండి మీద లేచి నుంచున్నాడు. అదిగో చెరువు అన్నాడు హుషారుగా.

అది ఎండమావి. ఇంగ్లీషులో మైరేజ్ అంటారు గాని అసలు మిరాజ్ అనాలిట. ఎవరన్నా వచ్చి మైరేజ్ అని గుట్టుగా చెప్పినా నమ్మకండి.... ఏం? ఐతే ఎడారిలో నీళ్ళయిపోయినప్పుడు కనపడతాయి. అది కనబడితే కాసేపటిలో దివగంతులవుతారు అన్నాడు గురునాథం తొణక్కుండా.

అంత బాధలోనూ గజపతిగారికి నవ్వొచ్చింది గురునాథం అజ్ఞానానికి. దివగంతులు కాదు దివంగతులు అన్నాడు.

కాదు గంతులే అన్నాడు గురునాథం.

పోనీ గంతులే కాని, కాసిని మంచినీళ్ళు దొరికే దారి చూడు బాబూ ప్రాణం పోతూంది.

పోనీండి. పోతా పోతా అన్నవాళ్ళని మనం ఆపలేం. అయినా నా ప్రాణం మా మావయ్య తీసేస్తానంటే మీరు కనికరించారా? నలభయి రూపాయలు కాజేసి టోకరా ఇచ్చారు అన్నాడు గురునాథం నవ్వుతూ. ఒక్క క్షణం ఆగి పంట్లాం జేబులోంచి చిన్నపొట్లాం తీశాడు.

గజపతిగారూ నా దగ్గిర స్ట్రాంగు పిప్పరమెంటు బిళ్ళలు ఉన్నాయి, కావాలా అన్నాడు.

ఏవీ తేతే అన్నాడు గజపతి ఆశగా.

మొత్తం అయిదున్నాయండి. ఒక్కొక్కటి పది రూపాయలు అయిదు పదులు యాభయి.

ఏవిటోయ్ – నువ్వూ నీ హాస్యాలూనూ –

హాస్యం కాదు, నిజం.

ఛస్తూంటే సంధి మంత్రం చదువుతావా, నాలుక పిడచ కట్టుకపోతోంది.

ఈశ్వరేచ్ఛ అన్నాడు గురునాథం నవ్వుతూ.

ఏడిసినట్లుంది – ఏమిటీ దారుణం? కానీ కొకటిచ్చే బిళ్ళ పది రూపాయలా?

మీరు యుద్ధకాలంలో బియ్యపు గింజల నుంచి పాల డబ్బాల వరకూ అమ్మినవి ఏ రేటునండీ? ఉత్తుత్తి ఉద్యోగాలకి ఉల్టా సిఫార్సులు నావంటి వాళ్ళకి అమ్మేది ఏ రేటండీ?

సరే. ఓ పావలా ఇస్తా. నాకు ఒక్క రెండు బిళ్ళలియ్యి అన్నాడు గజపతి.

లాభం లే! – చిల్లరగా అమ్మను. టోకున కొనాల్సిందే. బండి లాగడానికి గుర్రం తోలడానికి నేనూ, ఇల్లు చేరి ఇంకో పదిమంది నెత్తి కొట్టడానికి మీరూ బతికి వుండటం అవసరం. కాబట్టి అయిదూ కొనండి. వెల యాభయి మాత్రమే అన్నాడు గురునాథం.

గజపతి మాటాడలేదు. గురునాథం నవ్వి పిడికిలి తెరిచాడు – రెండు తీసుకోండి అంటూ – గజపతి అమాంతం అయిదు లాక్కొని నోటిలో వేసుకుని పరపర నమిలేసి అమ్మయ్య అన్నాడు.

గురునాథం నివ్వెరపోయి నవ్వాడు. అతనికి గజపతి మీద గౌరవం కాస్తా హరించిపోయింది.
మొత్తానికి బుద్ధి పోనిచ్చుకున్నావు గాదయ్యా అన్నాడు ఏకవచన ప్రయోగం ప్రారంభిస్తూ.
మాటలు జాగర్తగా రానియ్ అన్నాడు గజపతి కోపంగా.
గురునాథానికి ఒళ్ళు మండిపోయి గుర్రాన్ని లగాయించాడు.
బండి జాగ్రత్తగా పోనీయ్, ప్రమాదం అన్నాడు గజపతి.
ఈశ్వరేచ్ఛ. మహా అయితే ప్రాణం పోతుంది అంతేగా అన్నాడు గురునాథం.
గుర్రానికి ప్రాణం మీద చాలా మోజుగా వున్నందువల్ల ఆగిపోయింది. రొప్పసాగింది. ఎండ ఘుండిపోతోంది.
గజపతి దిక్కు మొహం వేశాడు మళ్ళా దాహం వేసి. దిళ్ళలు ఏ మూలకీ అనలేదు. చుట్టూ పరకాయించి చూశాడు. అదుగో బావి! బావి! దిగుడుబావి అన్నాడు.
నువ్వెళ్ళి తాగు అన్నాడు గురునాథం.
అమ్మో నాకు దిగడం భయం. అయినా ఈలోగా నువ్వు బండితో ఉడాయిస్తే?
నీకు ఇంక బండెందుకు. దిగితే ఎలాగా రావు. అయినా అది తవ్వించింది నీ వంటి వాళ్ళకోసమే అన్నాడు గురునాథం కసిగా.
మాటలు జాగర్త.
గురునాథం ఖాతరు చేయలేదు. ఈ బావి ఎందుకు కట్టించారో తెలుసా? మన వూళ్ళో ఘంటస్తంభం లాటిదే ఇదిన్నీ. నీవంటివాళ్ళు గభీమని దూకి ఠపీమని దివగంతులయిపోవడానికి. గ్యారంటీలే – నువ్వు దూకుతానంటే, నేను సిఫార్సు చేస్తా. సిఫార్సుత్తరం ఖరీదు యాభయి మాత్రమే – డబ్బు తీసుకుని అనక టోకరా ఇవ్వను. నువ్వు నన్ను అన్నట్లు ఈశ్వరేచ్ఛ అనను. దూకితే ఫలితం గ్యారంటీ అన్నాడు.
గజపతికి కోపం వచ్చి బండి మీది నించి కిందకి దూకేశాడు.
మాటలో దూకడం కూడా ఇంతే అన్నాడు గురునాథం మెచ్చుకుంటూ, గజపతి సరాసరి బావి దగ్గరకెళ్ళాడు. తొంగిచూసి సరాసరి వొచ్చేశాడు.
ఏం వచ్చేశావ్! తాబేళ్ళున్నాయని భయమా – కరవ్వులే.
గజపతికి ఏడుపు వచ్చింది. బాబూ! పరాచికాలు మానెయ్. కాసిని మంచినీళ్ళు చూపించు నీకు నమస్కారం అన్నాడు.
నాకు నీ నమస్కారాలొద్దు. మీకెలాగైనా నీళ్ళు సంపాదిస్తా. కానీ నా మనవి విని నా డబ్బు నా కిచ్చెయ్యండి. నా బతుకు ధ్వంసం చెయ్యకండి అన్నాడు గురునాథం గద్గద స్వరంతో.
టోకరాసురుడాలోచించాడు. సరే మంచినీళ్ళు పట్రా అన్నాడు.
మీ మేలు మరవను, ఉండండి నీళ్ళు వెతికిస్తా.
పది నిమిషాల తరవాత రొప్పుతూ పరిగెత్తుకొచ్చాడు గురునాథం.
అయ్యా! బండెక్కండి. ఫర్లాంగు దూరంలో చెరువుంది అన్నాడు సంతోషంగా.

దగ్గర్లో వున్న ఓ తోట దగ్గర మలుపు తిరిగి ఫర్లాంగు దూరం వెళ్ళేసరికి దుబ్బుల మధ్య ఒక చెరువు నిజంగానే ఉంది. దాన్ని చూడగానే గజపతికి హృదయం ఉప్పొంగినా మొహం మాడిపోయింది. ఉత్తర క్షణంలో పెట్రోమాక్సు లైటులా వెలిగింది. ఉన్న సత్తువంతా పోగేసుకుని ఫెళ్ళున నవ్వాడు.

హారినీ! ఈ చెరువా నీక్కనబడింది! నే ననుమానపడుతూనే ఉన్నాన్లే. ఇదెవర్దో తెలుసా? స్వయానా మా వియ్యంకుడి మేనల్లుడిది. నేనీ తోటలోకి లక్షసార్లు వచ్చి, ఈ చెరువు నీరు లక్షసార్లు తాగాను అన్నాడు.

పోన్లెండి ఏదయితేనేం దాహం తీర్తుంది. రండి నీళ్ళు తాగండి అన్నాడు గురునాథం.

ఆ సంగతి నువ్వు చెప్పేదేమిటోయ్. ఇది మావాళ్ళ చెరువు. నువ్వు ఏదో ప్రయోజకత్వం వెలిగిస్తావనుకుంటే ఏమో కాబోలనుకుని ఏదో ఏదో అన్నా. ఈ చెరువు నాకు బాగా తెలుసు అన్నాడు.

అంటే – అన్నాడు గురునాథం అనుమానంగా.

అంటే లేదు ఇంటే లేదు. ఇందులో నువ్వు ఉద్ధరించి ఊడబొడిచిందేం లేదు. మా చెరువు మాకు చూపావు. అందుకని నీకు సాయపడనక్కర్లేదు అన్నాడు కటువుగా.

గురునాథానికి ఒళ్ళు మండింది. మీరు నన్ను ఉద్ధరించొద్దు. నా డబ్బే నాకు పారెయ్యమన్నా. మాది పారేస్తే మడి మాన్యా లిచ్చినట్టే. నే నిపుడు మీ చెరువు మీకు చూపి ప్రాణం కాపాడినట్టు అన్నాడు.

కానీ విదల్చను. దిక్కున్నచోట చెప్పుకో. నీ మాట ఎవరూ నమ్మరు. అప్పు అంతకన్నా ఇవ్వరు అన్నాడు గజపతి విసవిస చెరువు వంక నడుస్తూ.

ఇదే కథ ముగింపు.

మిగిలింది ముక్తాయింపు.

☆ ☆ ☆

మామూలుగా గురునాథరావు కొయ్యబారిపోయాడు – ఈ నికార్సయిన దగుల్బాజీ బుద్ధికి. గజపతి రుసరుసలాడుతూ విసవిస వెళ్ళి అర్జెంటు పని ఉన్నవాడిలా అలవాటయిన వాడిలా చెరువు గట్టున ఉన్న ఊబిలో మోకాళ్ళ లోతున ఖస్సున దిగబడి ముందుకు పడబోయి వద్దనుకుని వెనక్కు తూలి మొత్తానికి నిలదొక్కుకున్నాడు. ఆ ఊపులో మల్లెపువ్వల్లె తెల్లగా ఉన్న తలపాగ తుళ్ళి కిందపడింది. ఒడ్డున మంచినీళ్ళు తాగేశాడు. అలాగే కాస్త మొహం కడుక్కుని, తలపాగా తీసి చూసుకున్నాడు. పైన అణా ఇడ్డెనంత నల్లటి బురద డాగు ఉండడం గమనించి ఉసూరున ఏడిచాడు. గట్టెక్కేసరికి చెట్టుకింద నించున్న గురునాథం నవ్వుతున్నాడు.

త్వరగా వెళ్ళి మంచినీళ్ళు తాగిరా. టైమైపోతోంది అన్నాడు గజపతి.

ఇదెక్కడి చుట్టరికం? మన ఋణానుబంధం రద్దయిందిగా. నేను బండి తోలను. తోలినందుకు కూలి 50 రూపాయలిస్తే వస్తా అన్నాడు గురునాథం.

ఒద్దులే. ఇక్కడే అఘోరించు. నేనే నిక్షేపంలా తోలుకుంటా. ఎవరి కర్మ కెవరు కర్తలు? అన్నాడు గజపతి.

ఈశ్వరేచ్ఛ అన్నాడు గురునాథం చీమలపుట్ట మీద కాలు పెట్టి నించున్న గజపతి పాదాల వంక చూస్తూ. గజపతి పాదాలనీ, పిక్కలవరకూ కాళ్ళనీ కొన్ని వందల ఎర్రచీమలు ముట్టడించి సిద్ధంగా ఉన్నాయి.

శివుడాజ్ఞ అయింది. ఒక్క పెట్టున ఆయన ఉత్తర్వులను అవి అమలు జరిపాయి.

గజపతి కెవ్వుమన్నాడు. గొల్లుమన్నాడు. రెండు చేతుల్తోటీ పిక్కలు పాదాలు రుద్దేసుకున్నాడు. వాళ్ళ అమ్మనీ నాన్ననీ ఎలుగెత్తి పిలుస్తూ పరిగెత్తాడు. ఆలోచించకుండా అడుగడుక్కీ ఆగి అడుగెత్తుకు ఎగిరిపడి, పరిగెట్టసాగాడు, గురునాథరావు పగలబడి నవ్వసాగాడు కసితీరా.

☆ ☆ ☆

పొరుగూరు సంతలో పకోడీ పొట్లాలు గుట్రా ఆరగించి గగన వీధిలో హుషారుగా వెళ్తున్న ఖగపతి ఒకడు, నేలమీద మంబాసాంబా తరహాలలో నాట్యం ఆడిపోతున్న నల్లకోటు గజపతి నెత్తి మీద తెల్లటి పాగాను, దాని మీద నల్లటి బురద డాగునూ చూశాడు. అదేమిటో ఆ ముచ్చట అని విలాసంగా రెండు చక్రాలు చుట్టి, రివ్వున కిందవాలి గజపతి తలపాగాను ఒక్క తన్ను తన్ని పైకి వెళ్ళిపోయాడు.

ఈ దెబ్బకీ, ఖగపతి రెక్కల హడావుడికీ గజపతి బెంబేలెక్కిపోయి బొరుమని గంభీరస్వరంతో ఏడ్చి తూలి నాలుగడుగులు పరిగెట్టాడు. గడ్డి కొంత భోం చేశాం కాబట్టి మంచి నీళ్ళు తాగి నీడన కూర్చోవడమా, ఇంకాస్త ఇప్పుడే తినేసి ఏకంగా నీళ్ళు తాగేసి, ఆపైన బజ్జోడమా అన్న సంగతి గురించి అర్ధనిమీలిత నేత్రయై ఆలోచిస్తున్న ఖరపతి యొకరిత హడావుడిగా తనమీదికి వస్తున్న గజపతినీ, నల్లకోటునీ చూసి జడుసుకుంది. వెంటనే వాటం చూసుకుని నిలబడి, వెనక్కి వస్తున్న గజపతిని, రెండు కాళ్ళతోనూ శక్తికొద్దీ ఫెడేలున తన్నింది.

ఈసారి దెబ్బకి గజపతి నోట మాట లేదు కానీ, చాలా అర్జంటు పనులున్నట్లు ముందరికి పరుగెత్తాడు. పడకుండా సరాసరి రోడ్డు పట్టినట్లయితే, గజపతి బండి అవసరం లేకుండా పది నిమిషాల్లో బస్తీ చేరిపోయేవాడు. ఈశ్వరేచ్ఛ అన్యథా ఉంది కనుకనే పదడుగులు వేసేసరికి కాలు మడతపడి బోర్లగిలా పడ్డాడు.

అతని సోడాబుడ్డి అద్దాల కళ్ళజోడు మరో అయిదడుగులు పురోగమించింది. చట్రం అక్కడ ఆగిపోయినా అందులోని అద్దాలు రెండూ ఇంకో రెండడుగులు ముందుకు వెళ్ళి ఆగాయి.

కసితీరా, కంట నీరు తిరిగేదాకా నవ్వేసిన గురునాథరావుకు గుండె కరిగిపోయింది. గబాగబా వెళ్ళి గజపతిని లేవదీసి కూర్చోపెట్టాడు. మొహం అదీ తుడిచాడు. ఓ పిప్పరమెంటు బిళ్ళను నోట్లో వేశాడు. కాస్త కుదుటపడ్డాక గజపతిగారు జేబు గడియారం తీసి చూసుకున్నారు. టైము సరికదా, గడియారం, చెయ్యి కూడా కనపడలేదు.

కళ్ళజోడు తే.... తే కళ్ళజోడు పోయింది పోయింది అన్నాడు.

గురునాథం కదలలేదు. టైము చూసి ఎంతయిందో చెప్పాడు. హమ్మయ్యో కటాకటిగా రెండు గంటల టైముంది టెండరు బయానా కట్టడానికి. లేటయితే కొంప మునిగేనే – కళ్ళజోడు పట్రావయ్యా వెళ్ళాలి అన్నాడు గజపతి.

నేను పట్రానండి, మీకు లేటయితే నా పుట్టేం మునిగింది?

ఓ ఐదు రూపాయిలిస్తా కళ్ళజోడు తే బాబూ ఆలస్యం అయితే ఎనిమిది వేల రూపాయల టెండరు పోతుంది. గురునాధం మాట్లాడలేదు.

ఇవాళ బయానా చెల్లించాలయ్యా. నీక్కాదూ చెప్పేది అన్నాడు గజపతి మళ్ళీ.

మావయ్య వస్తున్నాడయ్యా. వాచీ విడిపించి ఇయ్యాలయ్యా, నా నలభై నాకు పారెయ్యవయ్యా నీక్కాదు చెప్పేది అన్నాడు గురునాధం వెక్కిరిస్తూ.

దమ్మిడీ విదల్చను. నేనే వెతుక్కుంటా కళ్ళజోడు అన్నాడు గజపతి.

అంగుళం కదలను. నువ్వే వెతుక్కో అన్నాడు గురునాధం.

ఆయన కళ్ళజోడు పవర్ మైనస్ బోలెడు. అది లేకపోతే ఆయనకి ఏదీ ఆనదు. గురునాధరావు గుట్టుగా వెళ్ళి కిందపడ్డ కళ్ళజోడు చట్రం, అద్దాలూ తీసి జేబులో వేసుకున్నాడు. గజపతి అక్కడే వెతుక్కుంటూ ఉండగా గురునాధం ఆయన్ని హెచ్చరించాడు.

అక్కడున్నది చీమలపుట్ట, ఇటు గాడిద ఉంది. ఆ పక్కన తేలు పిల్లలు ఆడుకుంటున్నాయి. ఇటువేపు ముళ్ళకంచె ఉంది ఆవటాని. ఐదు నిమిషాలు వెతికి కూలబడ్డాడు గజపతి ఈశ్వరా ఎంత ట్రబులిచ్చావయ్యా అంటూ.

దానికేముంది ఇవాళ పొద్దున్న మీరన్నట్లు ఈశ్వరేచ్ఛ అన్నాడు గురునాధం.

టైము గడుస్తున్నకొద్దీ గజపతికి ఒళ్ళు కంపరమెక్కి పోతూంది. ఎనిమిది వేల టెండరు బేరం తగిలే ఛాన్సు ఉంది. వెంటనే వెళ్ళి ఖజానాలో రెండువేలు బయానా కట్టాలి.

సరే నా కళ్ళజోడు ఇలా తగలెయ్యి. నీ నలభై నీ ఎదాన కొడతా అన్నాడు చివరికి.

దానికేముంది లెండి. మీమొహాన కళ్ళజోడు తగిలిస్తే నా మొహాన 40 తగలేస్తారు. ఎటొచ్చీ ఇప్పుడు రేటు కాస్త పెరిగింది. బేరం ఆడుతారా? ఇప్పుడు కళ్ళజోడు చట్రం తెచ్చివ్వడానికి ముప్పయి రూపాయలు అవుతుంది. అద్దాలు చచ్చు సంభావన చెరి పదిహేను చేస్తాయి అన్నాడు గురునాధం.

విరగ్గొట్టావా ఏమిటి?

మీకు తెలియందేముంది. ఇందాక ఖగపతీ, ఖరసతీ అల్లరి చేసిన సందర్భంలో మీరు కింద పడ్డప్పుడు అద్దాలు వేరే వెళ్ళిపోయాయి.

సరే అన్నీ అతికి ఇలా ఇయ్యి.

బంగారు తండ్రే. కళ్ళజోడు మీ చేతికిచ్చాక మీరు నాకు డబ్బిస్తారా టోకరాసురుడు గారూ? డబ్బే ముందివ్వండి.

నాకు కనబడి చావదు గదయ్యా నా ప్రాణం తీస్తున్నావు.

మరేం ఫరవాలేదు. నేను తెగించి సాహసించి ముందర కుడికంటి అద్దం ఇస్తా. దాని సాయంతో నాకు ముందర ఓ పదిహేను. ఆ తర్వాత ఓ పదిహేను ఇవ్వండి. మిగతాది తర్వాత మాట్లాడుకుందాం అన్నాడు గురునాధం.

ఈ పథకం ప్రకారం గురునాధానికి 30 రూపాయలు గజపతికి రెండు కళ్ళద్దాలూ అందినాయి.

ఇప్పుడు రెండద్దాలూ పెట్టి చూసుకుని ఇంకో 30 ఇవ్వండి చక్రం ఇస్తా. అంటే గజపతి ఉసూరుమంటూ ఇచ్చాడు. గురునాథం చక్రం ఇచ్చాడు.

నా అరవై నాకూ, కళ్ళజోడు భాగాలు మీకూ దక్కాయి వస్తానండి – సెలవు పనుంది అని బయల్దేరాడు గురునాథం.

గజపతి గోల పెట్టాడు. ఈ అద్దాలు నాకు బిగించడం రాదయ్యోయ్ అమర్చి పెట్టాలి అన్నాడు.

ఫీజు పది రూపాయలండి. అద్దానికి ఐదు అవుతుంది.

ఆ పది కూడా ముందుగా చేతిలో వేయించుకుని, అద్దాలు అమర్చి పెట్టాడు గురునాథం.

మరి సెలవా. అదిగో మీ బండి అన్నాడు. గజపతి టైము చూసుకున్నాడు.

బాబ్బాబు. గంటన్నర టైముంది. బస్సు రోడ్డుకు ఇంకా రెండు మైళ్ళ దూరం వెళ్ళాలి. నీకు పుణ్యం ఉంటుంది. కాస్త బండి తోలిపెట్టు అన్నాడు. బండి తోలితే కూలి పది రూపాయలండి. లేకపోతే నాకు నిద్దరొస్తుంది అన్నాడు గురునాథం.

అఘోరించు. ఇంద అని బెట్టు చేయకుండా ఇచ్చుకున్నాడు గజపతిగారు.

ఈశ్వరేచ్ఛ అన్నాడు గురునాథం బండిని హుషారుగా పోనిస్తూ.



★ ★ ★



# అహోరకం ముచ్చట

"చిత్రంగా ఉందే.... ఒక్క నిముషం ఉండండి. కోటు జేబులో ఉందేమో చూస్తాను" అన్నాడు అప్పారావు తొట్రుపడుతూ.

"అబ్బే తొందరేం లేదు. తాపీగా చూడండి" అన్నాడు టిక్కెట్టు కలెక్టరు – ఖాళీగా ఉన్న మూడవ తరగతి పెట్టెలో కాళ్ళు బారజాచి కూర్చుంటూ.

అప్పారావు కోటు తడవడం మానేసి కిందనున్న పెట్టెను కొంచెం పక్కకి లాగాడు.

"ఏవండీ మీరు అహోరాత్రాలు రైళ్ళలోనే తిరుగుతూ ఉంటారు. టికెట్టు కొనుక్కుని కూడా రైల్లో బల్ల అడుగున దూరి ప్రయాణం చేసిన ఆసామీ కథ విన్నారా?" అన్నాడు.

"ఎవరండీ. గుర్తులేదే" అన్నాడు. టిక్కెట్టు కలెక్టరు సిగరెట్టు ముట్టిస్తూ.

"మహాద్భుతమైన కథలెండి. ఈ లైను లోనే జరిగింది. తెనాలి బెజవాడ స్టేషన్ల మధ్య. ఓ సుబ్బారావూ ఇంకో సింగారం తెనాలినించి బెజవాడ బయలుదేరారు. సుబ్బారావు టిక్కెట్లుకొని, హడావుడిగా ముందునడుస్తూ ఇదిగో టిక్కెట్లు మీ దగ్గరుంచండి అని సింగారానికి అందించాడు. గోచీ సర్దుకుంటూ ఆదరా బాదరా వెనకాల వస్తున్న సింగారం అందుకుని జేబులో పడేసుకున్నాడు" అని ఆగి కోటు జేబులో వెతకడం మొదలు పెట్టాడు. "చిత్రంగా ఉందే ఇక్కడ లేదు సుమండీ" అని ఆశ్చర్యం వెలిబుచ్చాడు.

"సరే కథ చెప్పండి."

"కథకేముంది. సుబ్బారావు అందిచ్చిన రెండు టిక్కెట్లయితే సింగారం అందుకున్నది ఒక్క టిక్కెట్టే. రైలు బైల్దేరాక వాళ్ళీ సంగతి తెలుసుకున్నారు. "రెండూ నీకే ఇచ్చా" నంటాడు సుబ్బారావు. కాదొక్కటే నంటాడు సింగారం. ఇంకోటి కొనడానికి ఇద్దరి దగ్గరా కూడా డబ్బులేదు. "నేనిచ్చిన డబ్బుకి నాకు

టిక్కెట్టిచ్చావు. ఆ పైన నాకేం తెలీదు" అంటూ అనేశాడు సింగారం. "అయితే నన్ను బల్ల కింద దూరమంటావా" అన్నాడు సుబ్బారావు బిక్కమొహం పెట్టి. "నాకేం అభ్యంతరం లేదు" అన్నాడు సింగారం. "అతను మాత్రం ఏం చేస్తాడు చెప్పండి టిక్కెట్టు కలెక్టరుగారూ!" అన్నాడు అప్పారావు."

"మరే మరే. అంతే కదండి. తనకి మాలిన ధర్మం ఏముంది?" అన్నాడు టికెట్ కలెక్టరు.

"సరే, సింగారం బల్ల మీద కూర్చున్నాడు. టిక్కెట్టులేని సుబ్బారావు బల్లకింద దూరాడు. అంతలోకే పక్క పెట్లోంచి మీ వంటి ఆయనే ఒక టిక్కెట్ కలెక్టర్ వచ్చాడు. చాలా మంచివాడులెండి. అయినా ఈ సంగతి బల్లక్రింద పడుకున్న సుబ్బారావుకి తెలీదుగా. అసలే బల్లక్రింద నారింజ తొక్కలు, పిప్పి, చుట్టపీకెలు, బీడీ ముక్కలూ, పులిహోరలో మిరపకాయలు, ఎంగిలాకులు, వల్లకాడు, వశనపురం మొదలైనవి మోకాళ్లోతున ఉన్నాయేమో సుబ్బారావు ఊపిరి సలపక ఉక్కిరి బిక్కిరైపోతున్నాడు."

"పాపం."

"అంతలో 'టికెట్ టికెట్' అనే భయంకరమైన మాటలు వినిపించాయి. టకటక మంటూ బూటుకాళ్ళు కనిపించాయి. సుబ్బారావు గుండె గుభేలుమంది...." అప్పారావు ఆగి, పరీక్షగా చూశాడు.

టికెట్ కలెక్టరు కళ్ళు రెపరెపలాడించి మందహాసం చేశాడు.

"సరే టిక్కెట్ కలెక్టర్ వచ్చి సింగారాన్ని టిక్కెట్ అడిగాడు. సింగారం బల్లకింద సుబ్బారావుని తలచుకొని కొంచెం కంగారుపడుతూ టికెట్ అందించాడు.... అప్పుడేమయింది తెలుసాండి?"

"తెలీదండీ"

"ఆ కంగారులో సింగారం అందివ్వబోయిన టిక్కెట్టు చేతిలోంచి జారిపోయింది.... సింగారం వంగిచూస్తే కనబడలేదు. లేచి నుంచుని పంచె కుచ్చిళ్ళు దులిపాడు" అన్నాడు అప్పారావు.

"అప్పుడేమయింది?"

"ఏమవుతుంది. సింగారం టిక్కెట్టుతోపాటు ఇంకో టిక్కెట్టు కూడా కింద పడింది. ఆ రెండోది కూడా మంచిదే. తెనాలిలో సుబ్బారావు అందిచ్చిన రెండు టిక్కెట్లలో అది రెండవదన్నమాట. జారిపడి సింగారం పంచె కుచ్చెళ్ళలో పాదాలమీద ఉన్న మడతలో తలదాచుకుంది"

"చిత్రంగా ఉందే" అన్నాడు టిక్కెట్ కలెక్టర్.

"ఆవేళ రైల్లో ఎక్కిన టిక్కెట్ కలెక్టర్ కూడా అదే మాట అన్నాడండి. రెండు టిక్కెట్లుచూపి రెండో ఆయన ఏడీ?" అడిగాడు.... "బల్లకింద పడుకున్నాడండి. అదో సరదా, అదో రకం ముచ్చట లెండి" అన్నాడు సింగారం సిగ్గుపడుతూ.

కథ విన్న టికెట్ కలెక్టరు కడుపుబ్బేలా, కణతలు ఎర్రబడేలా కంటనీరు తిరిగేవరకూ నవ్వాడు. నవ్వడం పూర్తి అయిపోయాక "సరే మీ టిక్కెట్ దొరికిందా" అని అడిగాడు గంభీరంగా.

అప్పారావు టికెట్ దొరకలేదు. ముచ్చెమటలు పోశాయి. జేబురుమాలు తీసి మొహం తుడుచుకోబోయేడు. అందులోంచి ఒక టిక్కెట్టు నేలరాలింది. 'అదిగో'

అన్నాడు అప్పారావు వంగి. ఆ వంగినవాడు అర నిమిషం వరకూ లేవలేదు. అర నిమిషం తరువాత నిటారుగా నిలబడి రెండు టిక్కెట్లు చూపించాడు. టిక్కెట్టు కలెక్టరు కళ్ళు విప్పార్చి చూశాడు అప్పారావు వంక.

"రెండోది నా పంచె కుచ్చెళ్ళలో ఉందండి.... మా నేస్తం...."

బల్లకింద పడుకున్న ఆ నేస్తం కిందపడున్న సిగరెట్ పీకతో చురకపెట్టాడు అప్పారావు కాలిమండ దగ్గిర. అప్పారావు కెవ్వుమన్నాడు.

★ ★ ★




"స్వామీ! స్వామీ! వింత చూశాను. వివరించి చెప్పాలి" అన్నాడు గోపకుమారుడు – దశాశ్వమేధ ఘట్టంలో జపం చేస్తున్న మణిసిద్ధుడి వద్దకు పరుగున వచ్చి.

మాట్లాడకపోతే సతాయింపు తప్పదని అనుభవంమీద తెలుసుకొన్న మణిసిద్ధుడు ధ్యానానికి ఉద్వాసన చెప్పి కళ్ళు తెరిచాడు. "వత్సా! గోపా! ప్రాణాంతకా! చెప్ప నీ సందేహం" అన్నాడు.

గోపన్న చెప్పాడు. "స్వామీ! ఇందాక అలా తిరుగుతూ, ఒక సత్రంలోకి వెళ్లాను. పాతికేళ్ళు పైబడని ఒక యువకుడి చుట్టూ చుట్టపక్కాలు చేరి పరిపరి విధాల బతిమాలుతున్నారు. అతగాడు, ఇవాళ, ఇక్కడ బంగాళాదుంప వదిలేస్తానన్నాడట. చివరికి బంగాళాదుంప కూర వేపడం మాత్రం వదిలి వేసేటట్లు ఒప్పిస్తున్నారు. ఈ ధర్మసూక్ష్మం ఏమిటి స్వామీ?"

మణిసిద్ధుడు మందహాసం చేశాడు. "గోపా! కలియుగ మానవులపై కూర ప్రభావం ఎంత ఉందో నీకు తెలియదు. అంత గొప్ప కూర కాబట్టే, దానితోచేసే రెండు రకాల వంట రెండు వేర్వేరు రకాలుగా పరిగణించి వర్జించమంటున్నారు" అన్నాడు.

"అంత మంచి కూరయితే, కందా, చేమ, కాకరకాయ ఉండగా ఈ కూరనే వదిలివేసేటంత విరక్తి ఎందుకు కలిగింది. స్వామీ! పైగా, ఇరవై రెండేళ్ళపడుచు, అతడి ఇల్లాలట – ఆమె కూడా ఆ కూరనే వదిలేస్తోంది. ఏమా కథ స్వామీ?" అన్నాడు గోపన్న కుతూహలంతో.

దివ్యమణి ప్రభావంవల్ల ఆ కథ యావత్తు కరతలామలకం చేసుకొన్నవాడై, సిద్ధుడు గోపకుమారుడికి ఇలా తెలియచెప్పాడు.

"ఓ గోపా! తుమ్మెద రెక్కలవంటి మీసాలుగల ఆ చిన్న వాడికి మొనమొన్ననే ఉద్యోగం అయింది. పేరు నాగభూషణరావు. వలచి వలపించుకొన్న కన్నెను వెంటనే

పెళ్లి చేసుకొని, బొమ్మరిల్లు వంటి చిన్న పెంకుటింట్లో కాపురం పెట్టాడు. ఆమె పేరు సుబ్బులు. ఒకప్రక్క వలపుతో తీయని కలలు కనడం, ఆ కలల గురించి మెలకువగా ఉన్నప్పుడు ఆలోచించుకోవటం, మరీ ఖాళీగా ఉన్నప్పుడు సినిమా పాటలు పాడుకోవడం, అవీ విసుగెత్తినపుడు పారాలు చదువుకోడం, మొదలైన పనులవల్ల, ఆ పడుచు పాకశాస్త్రం ఏమంత బాగా నేర్చుకోవడానికి వీలులేకపోయింది. ఫలానా కూరకి మెంతులు వెయ్యవచ్చునా కూడదా, ఎన్ని మిరపకాయలు వెయ్యాలి – ఇత్యాది విషయాలలో అనుమానం వేస్తే ఎక్కడిదక్కడ వదిలేసి, ప్రక్క వీధిలోనే ఉన్న పుట్టింటికి చెంగున పరుగెత్తికెళ్ళి కనుక్కు వచ్చేసేది. ఇలా వుండగా ఒకనాడు భూషణరావు ఆఫీసుకు వెళ్తూ సాయంత్రం సినిమాకి వెళదామని చెప్పాడు. సుబ్బులు అయిదు గంటలకల్లా నిప్పు రాజెయ్యడం మొదలుపెట్టి, ఐదున్నరకే కుంపటి రాజేసింది. బంగాళాదుంపలు అమ్మొచ్చాయి. బేరమాడి ఏబులం కొంది. వాటి వంక తేరిపార చూచి, అబ్బే చాలవనుకొని మరో ఏబులం కొంది.

వాటిని తరిగేటప్పుడు మాత్రం ఇద్దరికిన్నెందుకా అనుకొని ఏబులమే తరిగి ఉడకేసింది. వాటిని దింపి, బియ్యం పడేద్దామనుకొంటూనే మరోసారి చూచింది. కూర చాలదే అని అంచనా వేస్తూ ఉడికిన ముక్కలు తొక్కులు వొలిచింది. చాలదని అప్పటికి నిర్ధారణ చేసుకొని, చకచకా మిగతా దుంపలు కూడా తరిగేసి ఉడకవేసింది. ఐదు నిముషాలలో భర్త వచ్చాడు. 'వంటయిందా! సినిమా కెళదాం' అంటూ, "అయిపోవచ్చింది. మీరు మొహం రుద్దుకుని పౌడరు వేసుకొని తయారవండి" అంది సుబ్బులు ధీమాగా. అతగాడు ముస్తాబై పోయి, 'జటకా పిలవనా' అంటూ వంటింట్లోకి వచ్చాడు. ఆలస్యం అవుతోందన్న ఆదుర్దాలో ఉడికీ ఉడకని బంగాళాదుంప ముక్కలను దింపేసి, వచ్చినంత వరకు తొక్కులు తీసి ఉడికిన ముక్కలను ఉడకని ముక్కలతో అదరాబాదరాగా గుచ్చెత్తిపోసేసింది.

ఆ బంగాళా దుంపల కూర చూడగానే భూషణం గుండె గుబేల్‌మంది. "ఏయ్, హేయ్, హోయ్ ఏమిటిది హేమిటిది" అనేశాడు హడావుడిగా. ఆ కేకలు విని పామో, తేలో కాబోలనుకొన్న సుబ్బులు తుళ్ళిపడింది.

"ఏమిటండీ? ఏమిటండీ?" అంది భర్తవంక చూస్తూ.

"ఏమిటది? ఏమిటది?" అన్నాడు భూషణం బంగాళాదుంపల కూరవంక చూస్తూ.

"కూర"

"ఇది సత్రమా? సంసారమా? ఇద్దరికోసం రెండు వీశెల దుంపలా?" అన్నాడు.

"రెండు ఏబులాలే! చాలదనుకుని వండాను."

"ఇద్దరికెంత కూరొండాలో తెలియని నువ్వెందుకు పనికొస్తావ్? తెలీకపోతే ఎవరినన్నా అడగరాదా? పుస్తకాలు కొని చదవరాదా? ఇలా చేస్తే ఎలా?" అని భూషణం గదమాయించాడు.

సుబ్బులు బిక్కమొగం వేసింది. భూషణం అంతటితో ఊరుకోక 'హుఁ' అని మరీ అడగటంతో తిక్క తిరిగింది. గబగబా పోపు వేయించి, కూరముక్కలు అందులో పడేసి గిరగిరా తిప్పి దింపి అక్కడ పెట్టి చెంగు బిగించి, అవతల వీధిలో పుట్టింటికి చరచరా వెళ్ళిపోయింది. ముస్తాబైన భూషణం మొహం

ముడుచుకున్నాడు. 'ఎక్కడికి? ఎందుకు వెళ్తావు బేలా? ఈ లీల' అని పల్కరించలేదు. దగ్గరకు తీసుకుని సముదాయించలేదు. సరాసరి ఒక స్నేహితుడింటికి బయల్దేరాడు. ఆయనగారు కూడా ప్రాణేశ్వరిమీద అలిగి, షికారు బయలుదేరాడు. ఇద్దరూ కలిసి సాయంత్రం ఏడున్నర వరకూ తిరిగారు. కరకర ఆకలి వెయ్యడంతో, భూషణం స్నేహితుడు ఇంటి ముఖం పట్టాడు. భూషణం కూడా ఏం పాలుపోక జంకుతూనే అత్తారింటికెళ్ళాడు.

అక్కడంతా పెందరాళే భోజనం చేసి ఆరుబయట వెన్నెట్లో పక్కవేసుకుని పడుకున్నారు. ముందర వాకిట్లో మొగాళ్ళు, వెనక పెరట్లో అత్తగారు, బామ్మగారు, మొదలైనవారు పడుకొని కబుర్లాడుకొంటున్నారు.

వెళ్ళగానే మావగారు పలకరించాడు. "ఏం భూషణం ఇవాళ ఐదింటికే భోజనం చేశావుట, అమ్మాయి చెబుతోంది" అన్నాడు.

భూషణం తెల్లబోయాడు. "సుబ్బులు అలా అని చెప్పింది కాబోలు" అనుకొని, ఆశ్చర్యపడి, తమాయించుకొని "మరేనండి. ముందర సినిమా కెళదామనుకున్నాం. తరువాత పనిమీద అలా వెళ్ళాల్సొచ్చింది" అన్నాడు.

మావగారు అటువేపు తిరిగి వాళ్ళ తోడల్లుడుతో మాట్లాడుతున్నారు. తను వచ్చినట్లు మరదలు పిల్ల ద్వారా పెరట్లోకి కబురు వెళ్ళిందప్పుడే. పావుగంట గడిచినా సుబ్బులు అంతఃపురోద్యానవనం దాటివచ్చే చాయలు కనబడలేదు భూషణానికి. వాలు కుర్చీలో పడుకొని నీలాకాశం వేపు చూశాడు. సుబ్బులు తేట మనసులో మొండి తిక్కలా ఆకాశంలో మబ్బు పింజ ఒకటి చలనం లేకుండా ఉంది. కదలదేం అనుకొన్నాడు. అతడికి ఆ సమయంలో మేఘ సందేశం జ్ఞాపకం వచ్చింది. రివ్వున గాలి వీచి మబ్బు కమ్మితే పెరట్లోంచి సుబ్బులు, వాకిట్లోంచి తనూకూడ చెంగున సావిట్లోకి దూకి తీరవలసిందే! ఒడినట్లవదు.

ప్రాధేయపూర్వకంగా చూశాడు. కాని మబ్బుపిల్ల మనసు కరగలేదు. అందుకని మరదలుపిల్లని పిలిచాడు.

"సరేలే! కాసిని మంచినీళ్ళు తెమ్మను" అన్నాడు.

"అక్కర్లేదులే" అన్న జవాబు, కాసిని మంచినీళ్ళు, పట్టుకొని మరదలుపిల్లే వచ్చింది. భూషణం కోపగించుకొని మళ్ళా షికారెళ్ళిపోయాడు. ఆకలి వేస్తున్నా, తిక్క మూలాన చిరుతిళ్ళు తినబుద్ధి కాలేదు. ఇంటికిచేరి తీసి ఉన్న తలుపు తోసి లోపలికి వెళ్ళాడు. సుబ్బులు నిద్రపోతోంది. భూషణం కూడా మాట్లాడకుండా పడుకున్నాడు. కాని ఆకలివల్ల నిద్దరాలేదు. అలవాటు ప్రకారం అతి నెమ్మదిగా లేచి వంటింట్లో కెళ్ళి గిన్నెలు తడిమాడు. అన్నం గిన్నం లేదు. బంగాళాదుంపల కూర మాత్రం ఉంది. అదే కాస్త తినబోయాడు. కాని కూర ఏమీ ఉడకలేదు. ఆకలి మూలాన, అదే బలవంతాన కాస్త తినేశాడు. మజ్జిగ గిన్నె చూస్తే ఖాళీగా ఉంది. మర్నాటికని తోడువేసిన పాలు కనపడ్డాయి. కళ్ళు మూసుకొని తాగేశాడు. చడీ చప్పుడు లేకుండా వచ్చి పడుకొన్నాడు. "జన్మలో ఇక బంగాళాదుంప కూర తినకూడదు" అని నిద్రపోయే ముందు ఒట్టు పెట్టుకున్నాడు. అంత విరక్తి కలిగింది ఆ కూర తిన్నాక.

తెల్లవారాక ఒకర్నొకరు ఎలా పలకరించుకోవాలో తోచక తిప్పలు పడుతున్న ఆ జంట పాలిట దేవతలల్లే భూషణరావు తల్లిదండ్రులు, అప్పచెల్లెళ్ళు బిలబిలమంటూ బండి దిగారు. "అనుకోకుండా కాశీయాత్ర ముహూర్తం పెట్టుకొన్నా బాబూ. నువ్వు, నీ పెళ్ళాం కూడా బయల్దేరండి" అని ఆజ్ఞాపించాడు భూషణం తండ్రి. ఆ తరువాత గలభాలో భూషణం, సుబ్బులు మాట్లాడుకొన్నారు కాని మనసు విప్పి కాదు. నువ్వు ఇందాక వెళ్ళేసరికి తర్జన భర్జన జరగడానికి కారణం అదే. పెళ్ళానికి బంగాళాదుంప కూర వండటం రాదని, అందువల్ల వదిలేయడం వుత్తమమనీ భూషణం గట్టిగా నిశ్చయించుకున్నాడు. ఆరోజు రాత్రి బలవంతాన ఆ ఉడికీ ఉడకని కూరతో కడుపు నింపుకొనడంవల్ల పూర్తిగా అదంటే వెలపరం, విరక్తి కలిగాయి. ప్రాణేశ్వరుడే వదిలేస్తూ వుంటే తనకు మాత్రం ఎందుకని ఆ పిల్ల కూడా ఆ కూరే వదిలేస్తోంది. ఉడకని కూర తినడమే మొగుడి విరక్తికి కారణమని ఆ ఇల్లాలికి తెలియదు. తెలిస్తే అసలు రహస్యం చెప్పివేసేదే. ఆ రహస్యం తెలియనందువల్లనే ఆ చిన్నవాడు కూడా తన భార్యకి అసలు బంగాళాదుంప వండటం చేతకాదని నిర్ధారణ చేసుకొన్నాడు. చుట్టాల రాకవల్ల కాశీయాత్రవల్ల ఈ రహస్యం మరుగునపడింది."

గోపన్న కథ వినగానే లేచి నుంచున్నాడు. "స్వామీ! వెంటనే ఈ రహస్యం నాకు తెలియజెప్పండి. నేను పరుగునపోయి ఆ ప్రమాదానికి అడ్డుపడతాను" అన్నాడు.

మణిసిద్ధుడు నవ్వి ఇలా అన్నాడు:

"ఆ రాత్రి తొమ్మిది గంటల వేళకి ఇల్లు చేరిన సుబ్బులు ఆకలికొద్దీ ఆ ఉడికీ ఉడకని బంగాళాదుంపల కూరలో ఉడికినదంతా తినేసి, మజ్జిగ తాగి పడుకొంది. గంటన్నర తరువాత ఆవురావురుమంటూ వచ్చి వుడకని కూరముక్కలు తిన్న భూషణం, ఈ రహస్యం తెలియక, భార్య వంట సౌలభ్యమే అంత అని అపోహపడి ఇప్పుడు ఆ కూర వర్జిస్తున్నాడు. అందువల్ల ఓ గోపా..."

గోపకుమారుడు చెంగున గంతువేసి స్నానాల రేవుకు రివ్వున పరుగుతీశాడు.

★ ★ ★



ఈ కథలలో సెక్సపీలు
కమామిషు ఆటే లేదు
ఎదరంతా ఎడారి
అందువల్ల విసుగెత్తినపుడు
ఈ పేజీ చూసి –
ఆపైన కావాలంటే మీదగ్గరున్న
రొమాన్సు కథలు గాని
'డాష్ సెన్సారు –
సూత్రాల'ను గాని
చదివి, మళ్ళీ ఈ పుస్తకం
చదువుట
కొనసాగించ ప్రార్థన.



# ఉపక్రమణిక

సుబ్బరాజు పదిహేనో యేటికే పెద్దమనుషుల్లో జమ అయిపోయాడు. తనకు గంభీరమైన ముఖం పుట్టుకతోనే ఏర్పాటయినట్టు అతను పెందరాళే పసిగట్టి, అందుకు తగ్గచొప్పనే నడుచుకుంటూ వచ్చాడు. అపండితులకు మౌనం భూషణం అన్న మాట ఎక్కడో విని దీనిని తన జీవితానికి పట్టించుకున్నాడు – తాను అనేక విషయాల్లో అపండితుడు కాకపోయినా, అపండితుణ్ణి అనుకోనకపోయినా. అంచేత పలుకే బంగారమైంది. అంచేతే పలికిన ప్రతి పలుకునూ నగదుగా మార్చుకోగలిగాడు. 'విలువైన మాట' అనే మాటకు అర్థం తెలీని జనాభా అంతా అతని మాట విలువ కనీవినీ దాని తాత్పర్యం ఆకళింపు చేసుకున్నారు. ముఠా తగాదాల్లో ఒకటి రెండుసార్లు శత్రువు పక్షం మనుషులు సుబ్బరాజున్నిలీసి "ఏందలా చూస్తారు గుడ్లగూబల్లా? తంతారా?" అని అడిగినప్పుడు సుబ్బరాజు మారు మాటాడకుండా, మాట వరసకేనా ఒక్కమాట అనకుండా కర్రతీసి ఎదుటి వాడి బుర్ర విరిగేలా కొట్టి మళ్ళీ రివాజైన దర్జాతో స్తిమితంగా చూస్తూ నిలబడ్డాడు గుడ్లగూబలా చూస్తూ. అప్పటి నుంచీ అతనికి కార్యవాది అనికూడా పేరు వచ్చింది. తండ్రి చిన్నప్పుడే గతించి తల్లే ఇంటికి పెద్ద దిక్కు కావడంతో నిజంగానే పెద్దమనిషితనం వచ్చేసింది. తరహా అబ్బింది.

మెల్లిగా నాటుపద్ధతి రాజకీయాలు – తను చాటున వుంటూ – నాటు మనుషుల ద్వారా నడపడం నేర్చుకున్నాడు. మా పొలం తడిసేదాకా నువ్వాగు అని అతనంటే అవతలివాడు మళ్ళీ ఇతను చాలు అనేదాకా ఆ నీటి జోలికి పోయేవాడు కాదు.

అధికారులకు స్తుతి వచనాలతో, అవసర నైవేద్యాలతో మంచి మాట చేసుకునే వాడనుకుందుక్కూడా దాఖలాలాట్టే కనపడలేదు. అసలతను కన్నెత్తి చూస్తే, పన్నెత్తి పలికితే అదే మా భాగ్యమన్నట్టు సంతోషపడే వారు ఆ ఛాయలకొచ్చే అధికారులు. వచనాలకే వీల్లేనప్పుడు స్తుతివచనాల కెక్కడ అని సర్దుకునేవారేమో తెలీదు.

సుబ్బరాజు కూడా తాను రోజుకు సగటున పాతిక ముప్పై మాటలకన్న ఎక్కువ మాట్లాడటం లేదని తెలుసుకొని వాటిలో అబద్ధాల సంఖ్య బొత్తిగా తగ్గించి పారేశాడు. ఎక్కువ మాటాడితేనే అబద్ధాలూ అతిశయోక్తులూ అవసరం.

సుబ్బరాజుకు అబద్ధాలంటే గిట్టదనీ, సత్యం కోసం ప్రాణం పెడతాడనీ ఢంకా మీద దెబ్బకొట్టి చెప్పలేం. కాని మొత్తం మీద నిజం చెప్పడం లాభసాటి పని అనీ, నిజాయితీ నిలకడ మీదయినా ఎక్కువ గిట్టుబాటు చేసే బాపతనీ అతనికి లెక్క తేలింది. అందుకు దాఖలాలు చాలా కనపడ్డాయి. నిజం మీద గురి కుదరడానికదే కారణం. అస్తమానం అబద్ధం చెప్పేవాడు ఒకటి రెండుసార్లు నిజం చెప్పినా ఎవరూ అది నిజమని నమ్మరు. వాడు కాకి నల్లగా వుందంటే, వాడి మాటతోపాటు కాకినీ, దాని నలుపునూ, తెలుగు భాషనూ కూడా శంకిస్తారు. అదే తరచుగా నిజం చెప్పేవాడు అడపా దడపా అబద్ధమాడినా నిజం చెప్పినపుడుండే కరుకుదనం, ధీమా వాటికి అబ్బుతుంది. విచ్చు రూపాయల్లా పచ్చి నిజాలలా ఖంగున మోగుతాయి. అలాటబద్ధాలను అబద్ధాలంటే అందరూ నమ్మరు. అంచేత అబద్ధాల్ని చాలా పెద్ద పన్లకు తురుఫాసుల్లా పై కోతలకు దాచుకుని చిల్లర మల్లర పనులన్నిటికీ నిజాలు వాడుకోవడమే లాభసాటి. పైగా అబద్ధం చెప్పడం అనేది నిజం చెప్పడం అంత సులువు కాదు. చాలా సందర్భాల్లో దీనికి నేర్పూ, తెలివితేటలూ ఉండాలి. సుబ్బరాజు తెలివైనవాడు. తను చాలా తెలివైనవాడినని ఎన్నడూ అనుకోలేదు.

ఆ గుట్టుమట్లన్నీ సుబ్బరాజుకు అరటిపండొలిచినట్టు ఎవరూ చెప్పలేదు. అతను ఇంత స్పష్టంగా అనుకోలేదు. కాని లీలగా అతనికి తోచిన ఊహలు ఇంచుమించుగా ఈ పద్ధతిలో అతన్ని నడిపాయి. దానాదీనా ఊళ్ళో వాళ్ళందరికీ అతని మీద గురి కుదిరింది. అతనంటే ఒక రకమైన భయభక్తులు ఏర్పడ్డాయి. చాలామంది ఎలక్షనుకు నిలబడమని సలహా చెప్పారు. నువ్వు మంత్రి కాకపోతే మరెవడవుతాడన్నారు. మద్రాసు ముఖ్యమంత్రికి అన్నీ నీ పోలికలేనుట అన్నారు. సంజీవరెడ్డి ఇట్టే పెద్దవాడయ్యాడన్నారు.

కాని సుబ్బరాజుకు మంత్రి గిరి మీద గాని, పెద్ద రాజకీయాల మీద గాని ఏమంత మోజు లేదు. అతను అపాటిగానయినా రాజకీయాల్లాంటి వాటిలో జొరబడ్డానికి కారణం పదవుల మీద ఆశకాదు. పలుకుబడికి పదవులు అవసరం అంటే అతను ఒప్పుకోడు. పదవికే పలుకుబడి అవసరం. తనక్కావలసింది పలుకుబడి – అదుంటే పగవెందుకురా పెదబాబూ అన్నట్టు. తనది పెద్దకమతం, పొలాలూ, తోటలూ, వెవహారం చాలా వుంది. వాటికి నీటిసరఫరాలు, శిరువలు, శిస్తులు, ఎరువులు, చెక్కింగులు, సరిహద్దులు, కూలిపనివాళ్లకు ఇచ్చే డబ్బులూ, వాళ్లు కట్టుకడితే వచ్చే ఇబ్బందులూ ఇవన్నీ వున్నాయి. వాటికోసం కొంత జాగ్రత్తపడక తప్పదు.

"అసలు నువ్వు పిక్చర్లో హీరో వెయ్యాల్సినవాడివి ఇక్కడ రాటవుతున్నావుగాని, వన్‌లాక్ – అనగా ఒక్క లక్ష వుంటే చూడు. బ్రహ్మాండమైన పిక్చరోటి – నువ్వూ, సావిత్రీ, రంగారావూ, రేలంగిలతో లాగెయ్యొచ్చు" అన్నాడు – ఆ ఊళ్ళో తన ఆఖరి రెండెకరాలూ తెగనమ్ముకుందుకు చెన్నపట్నం నుంచి వచ్చిన ఒక ప్రొడ్యూసరు డైరెక్టరు.

సుబ్బరాజుకు ఇది అర్థం కాలేదు. అర్థంకాక్పో వాటిని 'చూద్దాం' అని ఆపుచెయ్యడం పెద్దపెద్ద మంత్రులందరికన్నా అలా చప్పున పట్టుబడిందతనికి. ఆ డైరెక్టరు వెళ్ళిపోయాక, ఒకరోజున పట్నం బయల్దేరి వెళ్లి, అక్కడ తన స్నేహితుడిని అడిగి సినిమా గురించి అంతా తెలుసుకున్నాడు.

"దాదాపుగా రాజకీయాలే అనుకో – మరీ అంత ఇది కాకపోయినా వాటి తరువాత పెద్దజూదం, గంద్రగోళం సినిమాయే" అన్నాడు మిత్రుడు. వెంటనే సుబ్బరాజు చెన్నపట్నంలో తన డైరెక్టరు స్నేహితుడికి ఉత్తరం రాయించేశాడు. "నువ్వు చెప్పినట్టే సదరు సావిత్రీ, రంగారావుగారు, రేలంగిగారలతో వేసి బ్రహ్మాండమైన పిక్చరు లాగివేయుట నాకు సుతరామూ ఇష్టము లేదు" అని. తిరుగు టపాలో జవాబు వచ్చింది – "పోనీ అంజలీదేవి, గుమ్మడి, రమణారెడ్డిగారలతోగాని, భానుమతి, రామారావు, రేలంగి, రంగారావులతోగాని, జానకి, రంగారావు, రేలంగి, రమణారెడ్డిలతోగాని వేషం వేయుటకు అభ్యంతరం ఉందా?" అని.

సుబ్బరాజు ఆ ఉత్తరం చింపించేశాడు.

తన ఊళ్ళో నలుగురూ తనను సజావుగా పలకరిస్తూ, మర్యాద ఇచ్చి పుచ్చుకుంటూ వుంటే అంతకన్న కావలసిందేమీ లేదు. ఆ మాటకొస్తే పొరుగూళ్ళ నుంచీ, రాజధాని నుంచీ కూడా చిన్నా పెద్దా రాజకీయ నాయకులు ఈ ఊరు మీదుగా వెళ్ళినప్పుడు ఇతనింటనే బసదిగి మర్యాదలూ, పెట్టుబళ్ళూ, అప్పులూ, చందాలూ, సలహాలూ పుచ్చుకెళ్ళేవారు. "వాడిది గట్టిబుర్ర. తెలివైన ఘటం. అద్భుతమైన కామన్సెన్సుంది. చక్కగా అరటిపండు ఒలిచినట్టు ఎనలైజ్ చేస్తాడు. చదువుకొన్నాడోయ్ భగవాన్లూ!" అంటూ చెప్పుకునేవారు. సుబ్బరాజు నిశాని అని కొన్నాళ్ళు కొందరనుకొనేవారు. ఓమాటు హోమోజీనిటీ అనే మాటకు స్పెల్లింగు కుదరక ఓ చిన్ననాయకుడూ, పార్టీలోని అతని ప్రతినాయకుడూ తీవ్రంగా వాదించుకుంటూ వుంటే, సుబ్బరాజు కాసేపు విని, తరువాత ఉభయవాదాలనూ ఖండిస్తూ సరైన స్పెల్లింగు చెప్పేశాడు. అది పూర్తిగా రైటైనా కాకపోయినా, కాదని అనిపించినా, తెలిసినా, సుబ్బరాజు అంతవాడు నోరు విప్పి చెప్పినప్పుడు కాదనడం సబబు కాదని దానిని ఉభయవర్గాల వారు ఏకగ్రీవంగా ఆమోదించారు.

సుబ్బరాజు కొలువుకు రోజూ ఓగెడ్డపాయన వస్తున్నాడు. అతనెవరో ఎవరికీ తెలీలేదు. ఆ ఊరివాడుకాడు.

కొలువులో సుబ్బరాజు పని తల తాటించి సత్యాన్ని ఆమోదించడమే. దానికి గడ్డపాయన పొంగిపోయి అతన్ని మెచ్చుకునేవాడు. రోజూ పండో ఫలమో తెచ్చి అతనికిచ్చేవాడు. మీరెవరని సుబ్బరాజు అడగలేదు. అతని గురించి వాకబు చేయించాడు, చుట్టుపక్కల ఊళ్ళ వెంబడి. తెలియలేదు. వారం పదిరోజులయ్యాక ఓనాడు హోరున వాన కురిసింది. కొలువు కెవరూ రాలేదు. గడ్డపాయన మటుకు వేళ ప్రకారం పళ్ళు పట్టుకు హాజరయ్యాడు. పది నిమిషాలు ఇద్దరూ మౌనంగా కూర్చున్నాక "చెప్పండి" అన్నాడు సుబ్బరాజు.

ఆయన ఇహ నాన్చలేదు. వెంటనే గడ్డం ఊడదీశాడు. ఆయన పేరు నర్సయ్య. వెంకన్న చౌదరిగారి రెండో కుమార్డు. తన అన్నగారు రామదాసుగారు ఎల్లక్షనుకు నిలబడుతున్నాడు. పోటీ తీవ్రంగా ఉండేట్టుంది. ప్రచారానికి భారీగానే ఏర్పాటు సాగుతోంది. ఐనా చాలదు. ఇంకా కొండంత జరగాలి. సుబ్బరాజుగారు ఎలాగ రావాలి. ఆయనతోపాటు రామిరెడ్డిగార్నెలాగేనా కదిలించుకు రావాలి. వారిని పలకరించే సాహసం తమకు చాలదు. చెప్పి ఒప్పించగలవాడు సుబ్బరాజు ఒక్కడే అని అంతా చెప్పారు. ఈయన చెబితే ఆయన ఏ రకమైన పట్టింపులున్నా వదులుకు

వస్తాడు. తమకా నమ్మకం ఉంది. రామిరెడ్డిగారి తండ్రిగారూ, సుబ్బరాజుగారి తాతగారూ మంచి జోస్తీగా ఉండేవారు. ఆ కాలపు ఆపేక్షలే వేరు. ఆ కక్షలే వేరు. అందునా ఇందునా కూడ మగసిరి ఉండేది. ఈ కాలంపజ్జ అర్భకులు. సుబ్బరాజుగారు ఈ తరంలో తప్ప బుట్టారనాలి.

"ఏ పార్టీ?" అన్నాడు సుబ్బరాజు – ఏ పార్టీయో తెలిసినా.

నర్సయ్య చెప్పాడు.

సుబ్బరాజు తలెగరేశాడు – 'ఓహో' అన్నట్టు.

నర్సయ్య వెళ్ళిపోయాడు. సుబ్బరాజు ఆలోచిస్తాడని అతనికి తెలుసు. అందుకే ఆ తరువాత మూడు రోజులపాటు యధాప్రకారం వచ్చి కూర్చున్నా అడగలేదు. మూడోనాడు 'ఖర్చుకు తట్టుకుంటారా?' అన్నాడు సుబ్బరాజు.

"నిక్షేపంలా" అన్నాడు నర్సయ్య.

మర్నాడు, పది మంది మధ్యా కూర్చుని కబుర్లు వింటూ వింటూ నర్సయ్య కేసి చూసి "సరే" అన్నాడు సుబ్బరాజు.

ఎవరికీ బోధపడలేదు.

"చిత్తం. వారంరోజుల్లో దయచేస్తే చాలు" అని సెలవు తీసుకు వెళ్ళిపోయాడు.

☆ ☆ ☆

ఆ రాత్రి భోజనం చేశాక సుబ్బరాజుగారు పాలెం బయల్దేరాడు. చురుగ్గా అడుగేస్తే అరగంట. పాలేరు దీపం పట్టుకు ముందుకు నడిచాడు.

రెడ్డిగారు లోగిలి ముందే వాలుకుర్చీ వేసుక్కూర్చున్నారు పులిలా. ఆయన వయసు మీద ఉన్నప్పుడు గర్జిస్తే పొలాల్లో కూలీలు జడుసుకునేవారంటారు. ఇపుడు వయసే మీద పడింది. అంచేత గర్జన తగ్గించి గురక పెట్టడం మాత్రం దైనందిన వ్యాసంగంగా పెట్టుకున్నాడు. నేటికీ కదిల్తే మనిషి కాదని కదిలించి చూపిన వాళ్ళందరికీ బాగా తెలుసు. అతడనేక యుద్ధముల నారియు తేరిన వృద్ధమూర్తి....

సుబ్బరాజు రాగానే వచ్చి మడేలు ముక్కాలుపీట వేశాడు. రెడ్డిగారు కుర్చీ తెమ్మన్నారు గాని సుబ్బరాజు ఆలోపలే ఆ పీటమీద కూర్చున్నాడు.

వచ్చిన రాచకార్యం చాలా పెద్దదయితే గాని అసలు సుబ్బరాజు కదిలి రాడని రెడ్డిగారికి తెలుసు. అందులోనూ బాగా పొద్దు పోయాకా వస్తే ఇక నాందీ ప్రస్తావన అవసరం లేదు. ముఖ్యమైనపని అని తెలియజేసే పద్ధతుల్లో సుబ్బరాజుకు ఇష్టమైనదిదే.

"కులాసా?" అన్నాడు సుబ్బరాజు లాంఛనానికి మంద్ర మంద్ర స్వరంతో.

ముసలాయన నవ్వాడు.

"చౌదరిగారి ఎలక్షనుకి రావాలి తమరు"

"ఓపికేదయ్యా" అన్నారు రెడ్డిగారు నవ్వి.

"మీరు వచ్చి కూర్చుంటే చాలు గెలుపు ఖాయమని ఆశపడుతున్నారు. తప్పొప్పులు చెబుదురుగాని, దారి తోచనపుడు సలహా చెబుదురుగాని"

రెడ్డిగారు మీసాలచాటున మందహాసం చేసుకున్నారు. "ఎక్కడికిలే కదిలొచ్చాక..."

"కూర్చుంటే చాలు"

"మీ తాతయ్య పోలికే నీది"

సుబ్బరాజు నమ్రంగా నవ్వాడు.

"నువ్వెందుకు నిలబడరాదు" అన్నాడు రెడ్డిగారు.

సుబ్బరాజు నమ్రంగా నవ్వాడు. బస్తీలో తన మామగారికి రేవు దగ్గరా, బజారు వీధినా, శివాలయం వేపూ కొట్లు చాలా ఉన్నాయి కాపలాకద్దె కిచ్చినవి. అపైన రెండు గోదాములున్నాయి. ఆయన పోడంతో అన్నీ తనకు కలిశాయి. రాజుల సత్రవోటి నడుస్తూంది. మావగారి పాత గుమాస్తా తరుచు వచ్చి మూడు పాత లాంచీలు చవగ్గా అమ్మకాని కున్నాయనీ, కాని మరమ్మత్తు చేస్తే బాగా ఆటి వస్తాయనీ, తను దగ్గరుండి చూసుకుంటాననీ పోరు పెడుతున్నాడు. సుబ్బరాజు ఆ సంగతి ఇంకా తేల్చుకోలేదు. బస్తీలో మావగారి పలుకుబడి, ఇక్కడ తన కమతం అంత పెద్దది. ఒడుపు తెలిస్తే దాన్నీ ఏలుకోవచ్చు. ఇవన్నీ తెలిసే రెడ్డిగారు ఎలక్షను సంగతి కదలేస్తున్నాడు.

"నీకా దక్షిణ పొలం వేపు చెక్క కలవకపోతే వచ్చే నష్టవేమిటి?" అన్నారు రెడ్డిగారు..

సుబ్బరాజు క్షణంలో సగంవేపు ఆయనకేసి చూసి తలవంచుకొని ఆశ్చర్యం చీకట్లో దాచేసుకున్నాడు. అసాధ్యుడు, సంగతి పసిగట్టేశాడు.

"వాళ్ళు పాకులాడుతున్నారు" అన్నాడు ఓ క్షణం ఆలోచించి.

"దేనికి? ఆ పొలం నిన్ను కొనమనా?" అంటూ ఫెళ్ళున నవ్వారు రెడ్డిగారు.

ఎదుటి మనిషి చమత్కరించినప్పుడు, అది తనకే గురిచేసినప్పుడు సుబ్బరాజు రివాజైన దానికన్నా ఎక్కువ బిగించుకుపోతాడు. చమత్కారాలూ, నవ్వడాలూ పెద్దవాళ్ళ పద్ధతి కావని అతనికో నమ్మకం.

రెడ్డిగారు అతని వంక పరీక్షగా చూసి తేలిగ్గా నాలిక్కరుచుకుని "నువ్వైతే హుషారుగా వొద్దును" అన్నాడు.

సుబ్బరాజు మందహాసం చేశాడు.

"నేను రావడానికి రెండు షరతులున్నాయి. నా మాటాలకించి సరే అంటే చెబుతా. మొదటిది నువ్వు నిలబడ్డావనుకో..." అని ఆగారు రెడ్డిగారు.

సుబ్బరాజు మాటాడలేదు. ఒక నిమిషం నిశ్శబ్దం ప్రవర్తిల్లింది.

"రెండోది చెప్పండి?"

"సెభాష్. అర్థగ్ది మాట. ఈరాయ్ చుట్టోటందుకో" అంటూ లేచి కండువా సరిచేసుకొని ఉత్సాహంగా నవ్వారు రెడ్డిగారు.

చుట్ట ముట్టించి తృప్తిగా, రెండు పట్లు పీల్చి పొడి దగ్గు దగ్గి ఆరంభించాడు. "నేనో వ్యాసు చెబుతా. నువ్వా కథ విని దాని వయినం చెప్పాలి. సరైన జవాబు తెలిసి కూడా బాగుండదనో, ముసిలాయన ఏవనుకుంటాడనో, ఛఛ ఇలా ఔదవాలోచన్లు బయటికెలా జెప్పటవనో మానకూడదు. మానితే నామీదొట్టే. నువ్వింకా ఎలక్షన్లో దిగలేదు కాబట్టి ఒట్లు, సత్యాల మీద గురుంటుంది. నువ్వు చెప్పే దాంట్లో సబబూ సందర్భం లేక అది నా మనసుకు రాకపోతే సరేసరి.... చెప్పేదేముంది. ఏమంటావ్?" అన్నాడు ఉత్సాహంగా.

"ఊఁ" అన్నాడు సుబ్బరాజు.

★ ★ ★



# 1 అసమర్థుడి కథ

రామిరెడ్డిగారు కథ ఆరంభించారు.

అనగనగా ఓ పెద్ద బస్తీ, పేరడక్కు. చెబితే ఫలానా ఊరును అవమానించామన్నమాట కన్నా – మిగతా ఊళ్ళను వదిలేశామన్న బాధ పీకుతుంది.

మ్యునిసిపాలిటిక్స్‌కు పొరాల పుస్తకాలు రాయదల్చుకున్న వాడు ఆ ఊరెళ్లాలి. ఏ ఊరనకు. జనం కూడా అన్ని రకాలూ చూస్చూసి రాటుదేలారు. నిజాన్నీ అబద్ధాన్నీ కూడా అబద్ధంగా, మంచినీ చెడ్డనీ కూడా చెడ్డగా, కుడినీ ఎడవనీ కూడా 'కుడి'గా ఎంచడం, అన్నిటికీ కుడి ఎడంగా పోవడం, అవసరం ఒకటే అడుగుగా నడవడం, చూచిన దాన్ని చూడనట్టే పోవడం రివాజైపోయింది.

లంచాలు రుసుముల స్థాయికి వచ్చి గౌరవ ప్రతిష్ఠలు గడించేసుకున్నాయి. సిఫార్సులు అధికార్ల ఉత్తర్వుల హోదా గడించేసుకుని పబ్లికున పై మీద కండువా వేసుకు తిరగసాగాయి. ధర్మాసుపత్రి రంగునీళ్లు మందుల స్థాయిలో ఆ యా స్థానాలను అలంకరించాయి. పరువు గలవారి పన్నుల బరువులు కూడా అపన్నులే మిగతా బస్తాలూ గంపలతోపాటు మోసే అవకాశం వచ్చింది.

"నిజమే. పన్నులనేవి ముందెర అచ్చుకునే తాహతున్న వాళ్ళనుంచి కిందికి దిగబాకి, బీదాబిక్కి మీద పడితే, వాళ్ళెలాగా అట్టే కాలం ఇచ్చుకోలేరు. కాబట్టి, క్రమంగా చిక్కి సగమౌతాయి. లోపాయికారీ రుసుముల వల్ల, నిపుణుల ఉపాయాల వల్ల మరింత చిక్కిశల్యమై చివరికి హరించిపోతాయి. పన్నులను పూర్తిగా రద్దుచేసే పద్ధతి అదే" అన్న వాదం శాస్త్రం అయింది.

కాని దాందుంపతెగ ఆ తరం జనాభా మరికొన్నాళ్ళు అలాగే ఉంటే, కొత్త సజ్జు పోగవకుండా ఉంటే ఆ ప్రకారమే జరిగేది. అందుకే సంతానవనిరోధం అవసరమంటారు. మొత్తానికి అక్కడ కథ అడ్డం తిరిగింది. కుర్రాళ్ళు పెద్దాళ్ళై గుసగుస లారంభించారు. న్యాయం, ధర్మం, నీతి, అవినీతి అంటూ పుస్తకాల మాటలూ, కుర్రతనపు వాదాలూ, చర్చలూ ఆరంభించారు. లేనిపోని మాటలనగా అనగా వినగా వినగా ఉన్న పాతవాళ్ళకు కూడా చిన్ననాటి ముచ్చటలు గుర్తుకొచ్చాయి. క్రమంగా పెద్దా చిన్నా కూడా ఏకమై ఈ ఊరి వరుస బాగులేదు అనుకునేదాకా వచ్చారు. నాలుగేళ్ళాయి అక్కడ హయాము నడుపుతున్న జనస్వాములకు ఈ

వరస నచ్చలేదు. ఈ ఊరి వరస ఏమీ బాగులేదని వాళ్ళు అనుకున్నారు. ఎలక్షను దగ్గర పడుతోంది.

పెద్దలంతా సభ జేరారు ఓ పెద్ద ఇంట్లో.

"లాభం లేదు. ఊరు చెడింది –. చెప్పాడు మాటలు విని కట్టు దప్పింది" అన్నాడొకాయన.

"అవును. మనం ముసలి నక్కలంట....మొన్న మీటింగులో ఆ వెధవెవడో వాడు పబ్లిగ్గా అనేశాడు."

"మీరు తరవాత విన్లేదు గావున...సభకొచ్చిన జనాభా కేకలు..."

"అడ ఎవడు వింటాడు ఈ మీటింగు వెధవల మాటలు విన్లేక చస్తూంటే, జనం మాట కూడా ఎక్కడ వింటాం."

"మరే. వాళ్ళు అదే మాట "ఓల్డు బాండికూట్స్" అన్నారు. అంటే ముసలి పందికొక్కులని..."

"అయ్యా ఈ గొడవలకేం గాని, కర్తవ్యం ఆలోచించండి. ఈసారి ఛైర్మనుగిరికి...." అన్నాడొకాయన.

"నావల్ల కాదు" అన్నాడు ఛైర్మనుగారు.

"అదే. అదే. మీరేకాదు. ఈ మాటు మన ఎవరివల్లా కాదు. ఇపుడు మూడో పార్టీ ఒకటి అఘోరించిందా మరి."

"మరే. వీళ్ళెక్కడొచ్చారండీ మధ్య మన ప్రాణానికి"

"ఎడ్రెసు తరవాత కనుక్కుందాంగాని అసలు సంగతి ఆలోచిద్దాం"

ఆలోచించి, వాదించి, తిట్టుకుని, మొత్తుకుని చివరికి రాజీ మార్గానికి వచ్చారు... ఈసారి పెద్దతరం వాళ్ళెవరూ ఛైర్మనుకు నిలబడరాదని, నిల్చినా లాభం లేదనీ, ఎదటివాళ్ళు మాంచి వయసులో వున్న చాకుల్లాంటి కుర్రాళ్ళను నిలబెడుతున్నారు గాబట్టి తాము వాళ్ళకన్నా చిన్నవాణ్ణే నిలబెట్టాలన్నారు. వాళ్ళ భాషే మాట్లాడేవాణ్ణి, దాదాపు వాళ్ళ సజ్జుతో కలిసి తిరుగుతుండేవాణ్ణి తేవాలన్నారు. వాళ్ళు పొడిచేస్తామన్నవన్నీ మనవూ పొడిచేస్తామనీ అవేకాక మరి నాలుగు ఘనకార్యాలూ చేసవతల పారేస్తామనీ ప్రకటించాలన్నారు. ఛైర్మనుగారి బ్రదరు ఇందుకు అన్నివిధాలా తగ్గవాడన్నాడొక సభ్యుడు. "మా వాడు ఒప్పుకోడు" అన్నారు ఛైర్మనుగారు నవ్వి. బంధుత్వాలనుబట్టి ఎన్నుకోవడం ఈసారికి వాయిదా వేద్దామన్నాడాయనే మరో క్షణం ఆగి.

చుట్టమైనా దెయ్యమైనా ఎవడైనా మొత్తం మీద మన చెప్పుచేతల్లో ఉండేవాడు కావాలి కదా అన్నారింకొకరు.

చివరి కందరి దృష్టి సుబ్బారావు అనే కుర్రాడి మీదకు పోయింది అప్రయత్నంగానే. పంచకల్యాణి లాటి వాడన్నాడొకాయన. జనంతో కలివిడిగా ఉంటాడు... అబ్బా అతనంటే ప్రాణం పెడతారు... కొన్ని పేటల్లో – పెట్టరూ మరీ, వాళ్ళంటే అతనూ ప్రాణం పెడతాడు గదా... మరే, వరదా వానా కరువూ కలరా అశుభం ఏవొచ్చినా ఊరంతా సందడిగా తిరిగి చేతనైన సాయం చేస్తాడు... చేయిస్తాడు మరీ. చేయించే దక్షతా సామర్థ్యం ఉన్నాయి... అసలు మనవిపుడు ఎన్నుకోకబోయినా రేపోమాపో వాడే వస్తాడు పవరులోకి...

సెభాష్, ఇటు డబ్బూ, అటు ప్రజ్ఞ పలుకుబడి కలిస్తే గెలుపు గారంటీ అన్నారు ఛైర్మనుగారు... అతగాడిదే కాదు, మిగతా కౌన్సిలర్ల పోటీలో కూడా అతన్ని బట్టి మన అబోరు దక్కుతుంది.

చివరికి అభ్యర్థి సుబ్బారావును ఖరారు చేసుకొని లోపాయికారీ తీర్మానం చేశారు. తరవాత వారంరోజులూ అతన్ని చేరదీసి ఆదరించి మంచీ చెడ్డా అడిగి, సాధక బాధకాలు బోధపరచి ఒప్పించాడు.

"మీవంటి పలుకుబడి గలవా రండదండలుంటే ఏడాది తిరిగే సరికి ఈ ఊరు రూపురేఖలే మారిపోతాయి. స్టేట్ గవర్నమెంటుతో పోట్లాడి కావలసిన స్కీములు శాంక్షన్ చేయించుకోవచ్చు" అన్నాడు సుబ్బారావు.

జోస్యం నిజమైంది. ఎలక్షనులో సుబ్బారావు గెలిచాడు. అతన్ని బలపరచినవారూ గెలిచారు. విందులూ వినోదాలూ భారీ ఎత్తున జరిగాయి. ఛైర్మను ఎక్కడా కనపడ్డేం అన్నాడొకాయన... సుస్తీయేమో... అబ్బే మొహమాటం అయుంటుంది, మరీ చిన్నవాడు కదా, సిగ్గుపడుంటాడు. అయినా కాపోయినా హోదా గలచోట కూర్చోవడం ప్రతి కుర్రవెధవకి నప్పుతుందాండీ. ఎబ్బెట్టుగా ఉండదూ... పోదురూ ఎంత సిగ్గయితే మాత్రం టీపార్టీలకి రాకపోతే ఎలాగయ్యా - ఇలాటివాడింకేం చేస్తాడు ఛైర్మనుగిరి...

ఈమాట మర్నాటి నుంచి మరి కొందరు కూడా అన్నారు. మునిసిపలాఫీసులో వాళ్ళు ఒళ్ళు బలిసి పొగరెక్కుతున్నారు. రాత్రి తెల్లవార్లూ ఆఫీసు గదిలో దీపాలు వెలుగుతున్నాయి. ఇలా దుబారా చేస్తే అయినట్టే అంటూ వీధుల వెంట తిరిగారు కొందరు.

కాని తెల్లవార్లూ ఛైర్మను ఆ గదిలోనే ఉన్నాడనీ, మేలుకొని ఉన్నాడనీ, పనిచేస్తున్నాడనీ వాళ్ళకు తెలిసింది కాదు. తెలిసింతరువాత ముక్కున వేలేసుకున్నారు. "తెల్లవార్లూ ఆఫీసులో పనేవిటీ - కొత్తబిచ్చగాడు పొద్దెరగడన్నట్లుంది" అన్నారు. "నాకర్థం కావడంలేదు" అన్నారు.

ఛైర్మను వరస చాలామందికి అర్థం అయేసరికి కథ చాలా దూరం వెళ్ళిపోయింది.

ధర్మాసుపత్రి తనిఖీ, డాక్టరుకు బదిలీ రెండు రోజుల తేడాలో జరిపించాడు. కేసు సంగతి ఆలోచించి విరమించుకున్నాడు. కాంపౌండరును సస్పెండ్ చేయించాడు. కొత్త డాక్టరూ, కొత్త మందులూ, కొత్త పద్ధతులూ చూస్తుండగా వచ్చేశాయి. కమీషనర్ సంగతి పూర్వాశ్రమంలోనే కొంత తెలిసి ఉన్నందువల్ల, మిగతాది తెల్సుకుని ఆయన చేత మూడు నెలల సెలవు పెట్టించేశాడు. పన్నుల శాఖల వారిని అందులోనే అట్నించిటో, ఇట్నించటో జరిపించి ఒకరి కింక్రిమెంటూ, ఒకరికి వార్నింగూ వంతున పంచిపెట్టాడు. పాత బకాయి పురాణాలు పైకి తీయించాడు. అక్కౌంట్ల మహాకవులకు సన్మానాలు చేయించాడు. నాలుగేళ్ళనాటి ఎలక్షనుకు చేసిన వాగ్దానాలు తీయించి గత మూడేళ్ళవి పరిశీలించి ఒక్కొక్కటీ పనులు ఆరంభం చేశాడు. రాజవీధిలో, చౌకు దగ్గర, బజారులో లేచిన ఎన్‌క్రోచ్‌మెంట్ దుకాణాలను తీయించి వారికి వసతులు చూపించాడు. పాలూ, వాటిలో పాపాలూ బేరీజు వేయించాడు. ఇన్‌కంటాక్సు వాళ్ళకి మాట సాయం చేశాడు. ఇళ్ళూ వాకిళ్ళూ చూసి పన్నులు తిరగతోడించాడు.

మునిసిపల్ మార్కెట్‌లోని "మిగతా ఇరవై దుకాణాల మీద" రశీదుగల అద్దెలు ఏర్పాటు చేయించాడు.

ఈ యజ్ఞం జరుగుతుండగానే, ఆరంభించిన కొత్తలోనే ఊళ్ళో పెద్దల్లో తన పెద్దలకు ముళ్ళూ, సూదులూ గుచ్చుకోవడం వారు సుతారంగా అయ్యో అమ్మో అనడం గమనించాడు. పాత ఛైర్మనుగారినీ, మరిద్దరి పెద్దల్నీ పెద్దరోడ్డు సంగతీ వంతెన సంగతీ కనుక్కుందుకని రాజధానికి పంపించి అది అయేదాకా రావద్దని మంచి మాటల్తోనే కట్టడి చేశాడు.

అయినా వాళ్ళు నెల్లాళ్ల తిరిగేసరికి ఎక్కడ పన్లక్కడ వదిలి తిరిగి చక్కా వచ్చారు.

అక్కడి ఉదంతం నివేదించే నిమిత్తం ఒక ఎమర్జెన్సీ మీటింగు వెయ్యమన్నారు.

మూడోనాడు సాయంత్రం మీటింగయింది.

మాజీ ఛైర్మనుగారు లేచి తమ నివేదిక తరువాత అందజేస్తామనీ, ముందర ఈ పురపాలక సంఘ పరిపాలన సంబంధంగా ఏర్పడ్డ విపరీత పరిస్థితుల దృష్ట్యా, వీటి గురించి రాజధానిలో రాష్ట్ర ప్రభుత్వం వారికి అందిన ఫిర్యాదుల మహజర్ల దృష్ట్యా తమ నివేదికపై చర్చ వాయిదా వెయ్యాలని కోరారు.

అడ్జర్నమెంట్ మోషన్ ఆమోదం పొందింది.

ఉత్తర క్షణంలో ఆయనే, కొత్త ఛైర్మనుగారు పరిపాలనలో అనుభవం చాలని వారైనందువల్ల పనులన్నీ గంద్రగోళం అయిపోయాయని చెప్పి, కొన్ని కారణాలు టూకీగా వివరించి, ఛైర్మను సుబ్బారావుపై అవిశ్వాస తీర్మానం ప్రతిపాదించారు. అట్టే చర్చ లేకుండానే తీర్మానం నెగ్గిపోయింది...సుబ్బారావు మళ్ళీ ప్రజల్లో పడ్డాడు.

☆ ☆ ☆

"సుబ్బరాజా, ఇదీ కథ. మరి అంత ధాటిగా, సూటిగా పనులు చక్కబెట్టి ప్రజోపయోగ కార్యాలు అన్నీ చేసి, పురపాలక సంఘం రాబడి పెంచి, బకాయిలు తగ్గించి, ఆస్పత్రి బాగుచేసి ప్రజల్ని సంతోషపెట్టినవాడూ – అదిన్నీ కొద్దినెలలలోనే – అసమర్థుడనిపించుకుందుకు కారణం ఏమిటి? అతని మీద అవిశ్వాస తీర్మానం తెచ్చి ఎందుకు పడదోశారు? చెప్పు" అన్నారు రెడ్డిగారు.

"అందుకే – అన్న పన్లన్నీ చేసినందుకు. ఎలక్షనులో లక్ష చెప్తారు కాని చెప్పినవన్నీ చెయ్యడం తెలివితక్కువ తనమే. ఏ పనీ చెయ్యకుండా పదవిలో ఉండడమే సమర్థుడి లక్షణం. సుబ్బారావు అసమర్థుడు కాబట్టి చెప్పిన పన్లన్నీ చేసి అయిన వాళ్ళకు హాని చేశాడు" అన్నాడు సుబ్బరాజు.

రామిరెడ్డిగారు లేచివచ్చి సుబ్బరాజు భుజం తట్టి "సెభాష్ వృద్ధిలో వస్తావు" అన్నారు.

సుబ్బరాజు లేచి నిలబడ్డాడు.

"రేపు రా" అన్నాడు రెడ్డిగారు.

★ ★ ★



# 2 వేట కథ

మర్నాడు సుబ్బరాజు వచ్చి కూర్చోబోతుండగానే రామిరెడ్డిగారు కథ ఆరంభించారు. అనగనగా ఒహా రాజ్యంలో ఒహా తిరుపతయ్య ఉండేవాడు. కొంచెం పొగరు మోతుబరి. ఒహా మారాయన ఆ ఊరి ఇస్కూలు మీదికి షైరెళ్ళాడు. అక్కడ వీర్రాజుని ఒక మేష్టరు పిల్లలకు ఆటల్జెబుతూ ఒకణ్ణో దెబ్బ వేశాడు. తిరపతయ్య అది చూసి అదేవిటని మేష్టర్ని గద్దించాడు. మజ్జెన్నీ కేవిటన్నాడా మేష్టరు. తిరపతయ్య మండిపడ్డాడు. వయసు మీదున్నాడేమో ఆ మేష్టరూ గయ్యిమని లేచాడు. తిరపతయ్య జబర్దస్తీగా ముందుకురికి వీర్రాజు దవడ మీద సాచి కొట్టాడు. దిమ్మ తిరిగిపోయింది. మాటకు మాట ఎదురాడాడు గాని దెబ్బకు దెబ్బ కొట్టే జెబ్బపుష్టి లేదు వీర్రాజుకు. గుడ్లనీరు గక్కుకుని జెమా జెట్టీలా ఉన్న తిరపతయ్యకేసి చూస్తూ నిలబడిపోయాడు. ఇదంతా ఆయన్ను వలసిన ఓ పంతులమ్మ కంటబడింది. ఆవిడ లబోదిబోమని నలుగుర్నీ పిలిచింది. రసాభాసయింది.

ఏదో పాడుకూాత గూసుంటాడు. లేకపోతే తిరుపతయ్య వంటి పెద్దమనిషి ఉత్త పున్యానికి చెయి చేసుకుంటాడా అన్నాడొక పెద్ద. తిరపతయ్య ఆ ముక్క దొరకబుచ్చుకుని మర్నాలుగు కల్పించి గొడవ చేశాడు.

నాలుగు రోజులు చర్చలు జరిపాక ఇంత పొగరుమోతు మేష్టరుంటే పిల్లల్చెడిపోతారని చెప్పి అతన్ని తీసేశారు పనిలోనుంచి.

ఆరోజున వీర్రాజు పగబట్టాడు – తిరపతయ్య మీద. ఓరోజున నీకూ ఉద్యోగం పోగొడతా జూడు అని పట్నం వెళ్లి అష్టకష్టాలూ పడి ప్రైవేట్లు చెప్పాకుంటూ పైకి చదివాడు. నాలుగేళ్ళ తరవాత ఉద్యోగం సంపాయించాడు. రెవిన్యూ ఆఫీసులో చేరి తిరపతయ్య పొలాల మీద చెక్కింగుకొచ్చి నానా అల్లరీ పెట్టాడు. ఇతనూ వీర్రాజు ఊహ తెలిసి, నీ పన్జెబుతానుండని ఫిర్యాదులు రాశాడు. పని జరగలేదు. ఇలాక్కాదెవారమని ఊళ్ళో నిర్వాకం తండ్రి నెత్తినబడేసి పట్నం వెళ్ళి లంచాలు పెట్టి ఆ ఆఫీసులోనే ఉద్యోగం సంపాయించాడు. వీర్రాజు జాగ్రత్తపడి డిపార్టుమెంటు పరీక్షలు పాసై పై అధికారిగా వచ్చి తిరుపతయ్యను మన్యం బదిలీ చేయించాడు. ఇంకో రెణ్ణెల్లకు అక్కడ తనిఖీకి వెళ్ళి అతన్ని డిస్మిసు చేయించడానికి సన్నాహాలు

చేసుకున్నాడు. తిరపతయ్య భయపడి సెలవు పెట్టి, సెలవు తీరేసరికి మరో ఆఫీసుకు వేయించుకున్నాడు. వీర్రాజు కొద్దికాలంలోనే అక్కడ ఆఫీసరుగా వెళ్ళాడు.

ఇది పనిగాదని తిరపతయ్య ఉద్యోగం వదులుకుని చిన్న వ్యాపారం పెట్టాడు. వీర్రాజు టాక్సు ఆఫీసరుగా తయారయ్యాడు. తిరపతయ్యకి విసుగేసి ఇంటికెళ్ళాడు. ఈడనే ఉంటే సరిగదా వాడెక్కడొస్తాడని అన్నదమ్ములన్నా వినక, వాణ్ణే నిభాయించి నిలబెడతానని పంతంబట్టి తన వాటా భూములు తెగనమ్మి అంకినంత అప్పుజేసి పట్నం వెళ్ళి పెద్ద పరిశ్రమ పెట్టాడు. బాగా డబ్బు గడించి, పలుకుబడి సంపాయించాడు. వీర్రాజు ఉద్యోగం వదులుకుని, ఆ ఫ్యాక్టరీలో వర్కర్ల చేత యూనియన్ కట్టించి నాయకుడయ్యాడు. అతను ఏ అఘాయిత్యం చెయ్యకపోయినా తిరపతయ్య భయపడి మునిసిపల్ ఎలక్షనుకు నిలబడి ఛైర్మనుగా ఎన్నికయ్యాడు. అతన్తో పోటీగా వీర్రాజు నిలబడి ప్రతిపక్షంలో కౌన్సిలర్ అయ్యాడు.

అతని బాధలు పడలేక దినదిన గండాల్లాంటి ఛార్జీలూ, తీర్మానాలూ తట్టుకోలేక తిరపతయ్య పైకి జరిగాడు. ఎమ్మెల్యే అయ్యాడు.

నాలుగేళ్ళ తరవాత వీర్రాజు అంత పని సాధించేసరికి తిరపతయ్య మినిష్టరై కూర్చున్నాడు...

సుబ్బరాజా, ఇప్పుడు చెప్పు ఓ యేడాది తిరిగేసరికి మొత్తం మీద వీర్రాజు పగ సాధించాడు. తిరపతయ్య పరువుదీసి, పరపతి తిరపతి కంపించి మినిష్టరు గిరీకి రూకలు చెల్లేలా చేశాడు. ఎలా చేశాడంటావు?

"ప్రతిపక్షంలో చేరి దర్యాప్తులు చేసి దుమ్మెత్తి పోశాడా? ఆరోపణలు తెచ్చి నిరూపించాడా? పత్రిక పెట్టి ఏకి వదిలిపెట్టి పరువు తీశాడా? ఎమ్మెల్యే లందరినీ మాయజేసి అవిశ్వాస తీర్మానం తెప్పించాడా? చెప్పు చూద్దాం" అన్నాడు రామిరెడ్డిగారు.

"ఇవేవీ కాదు. ఈ విద్యకి ప్రతి విద్యలు తిరుపతయ్యకూ తెలిసుంటాయి. వీర్రాజు తిరుపతయ్య పార్టీలోనే చేరి, అతనితోనే నేస్తం కట్టి, అన్నిటికీ వంతపాడి నీ అంతవాడు లేడని మెరమెచ్చులు పలికి, పొగడ్తతో నమ్మించి ఉచ్చులో పడేస్తుంటాడు. పొగడ్తలకు పడని వాడుండడు కదా" అన్నాడు సుబ్బరాజు.

రామిరెడ్డిగారు తృప్తిగా నవ్వి "రేపురా" అన్నాడు.

* * *



మర్నాడు సుబ్బరాజు వచ్చి కూర్చుని ఏదో చెప్పబోయేవరకు, రెడ్డిగారతన్ని చేసైగతో వారించి "ఈ కథ విప్పు ముందు" అన్నారు హుందాగా.

రెడ్నాయుడు కొడుకు రావిసెట్టి కూతురు మీద మనసు పడి, మనువాడతానని ప్రతిజ్ఞ పట్టి, తలగట్టుకు పడుకున్నాడు. తండ్రి ఎంత జెప్పినా వినలేదు. గత్యంతరం లేక నాయుడోనాడు సెట్టి బవంతి కెళ్ళి మెల్లిగా విషయం కదలేశాడు. సెట్టి విరగబడి నవ్వాడు.

"ఒర్ణ సంకరమ్మాటటుంచి, అసలు నా అంతస్తేటి, నియ్యంతరవేటి. ఆడేదో కుర్రకుంకడిగాడే అనుకో – నివ్వేట్టా ఒచ్చి నన్నడిగావు. ఇదేం జరిగేదనేనా నీ ఊహ" అవటాని దులిపేశాడు. మాటా మాటా వచ్చింది.

"నీ కత నాకు తెల్దా. నువ్వు మినిష్ట్రుగారి మేనల్లుడి కోసం యగబట్టంలేదా, అది నీకు పయ్యంతస్తుగాదా. నేనే మినీష్ట్రునైతే నివ్విట్టా మాట తూలేవోడివా, ఇష్టం లేదనక ఇయ్యన్నీ ఎందుకెత్తుతావూ?" అని ఎదురు దిరిగాడు రెడ్నాయుడు.

శెట్టి పగలబడి నవ్వి, "నువు మంత్రివైతే నే రాజు నౌతా దానికేటిలే" అన్నాడు.

"అవుతా వవుతా వెందుకవ్వూ. ఈ ఊరు పంచాయితీగా ఏడిసి నన్నాళ్ళు రాజువి నువుగాకింకెవరూ. అదీ చూద్దారెన్నాళ్ళో" అన్నాడు నాయుడు ఉక్రోషంగా.

సెట్టి జవాబు కూడా చెప్పలేదు. పద్దులు చూసుకుంటూ కూర్చున్నాడు. రెడ్నాయుడు ఈ పరాభవం తట్టుకోలేక పోయాడు. కుర్రతన పౌరుషం కమ్ముకొచ్చేసింది.

లేచి గుమ్మందాకా వెళ్ళి వెనక్కి తిరిగి, "నీ కళ్ళెదుట నేను మినీష్ట్రవపోతే ఈ వూరు మునిసిపాల్టీ అయినంతొట్టు" అన్నాడు.

"నా కంటంలో పాణవుండగా అంత పన్జరగ"దన్నాడు సెట్టి.

"చూడవుతానో కానో" అన్నాడు నాయుడు.

"నీసంగతి నాకేటి మద్దన, మున్సిపాల్టీ మాట జెబుతున్నా, కావలిస్తే ఊరు చుట్టూ కందకం తవ్వించి కోట గోడలు కట్టేసి పెరక్కుండా చేస్తాగానీ మున్సిపాల్టీ జేయనివ్వను" అన్నాడు సెట్టి.

మాట సాంతం వినకుండానే వెళ్ళిపోయాడు నాయుడు. విశ్వామిత్రుడిలా తానూ ఓ ప్రతిజ్ఞ పట్టాడు మినిస్టరనిపించుకోవాలని.